# భాగవత సుధాలహరి

## తృతీయ సంపుటము

వ్యాఖ్యాత :

సరస్వతీపుత్ర

డా. పుట్టపర్తి నారాయణాచార్యులు




ప్రచురణ :

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1989

# BHAGAVATA SUDHALAHARI Vol. III

*Commentary*

Saraswathiputra Dr. Puttaparthi Narayana Charyulu



Edited by:
Mudivarthi Kondamacharyulu

T. T. D. Religious Series No. 342

Copies - 5,000.



Published by:
Sri CH. VENKATAPATI RAJU, I. A. S.,
Executive Officer,
T. T. Devasthanams

# ముందుమాట

వేదములు, పురాణములు, ఇతిహాసములు భారతీయసంస్కృతికి మూలాధారములు. లోకహితకాంక్షతో వేదరాశిని విభజించియు, వేదార్థములను భారతమునందు ప్రపంచించియు తృప్తిలేక సరస్వతీ నదీతటమున దుఃఖితుడై ఉన్న శ్రీవేదవ్యాసమహర్షి నారదప్రేరితుడై భగవద్గుణకర్మ నామములను కీర్తించు శ్రీమద్భాగవతపురాణమును రచించి సంతుష్టుడై తన కుమారుడగు శుకయోగిచే చదివించెను.

అష్టాదశపురాణములలో శ్రీమద్భాగవతమున కున్న వ్యాప్తి మరే పురాణమునకు లేదు. ఇందు శాస్త్ర వేదాంతాది విషయములు, మోక్షమున కనువైన భక్త్యాదియోగములు, భాగవతుల కథలు, భగవల్లీలలు, భగవానుని భక్తరక్షణ పరాయణత్వము ఇట్టివెన్నో వర్ణితములైనవి.

శృంగి శాపముచే మృత్యుముఖమున పడనున్న పరీక్షిన్మహారాజు దగ్గరకు శుకయోగీంద్రుడు వచ్చి భాగవతపురాణమును వినిపించెను. పరీక్షిత్తు భాగవత కథాసుధను ఆస్వాదించి అమృతత్త్వ మందెను. ఒక్క పరీక్షిత్తునకే కాక జనన మరణరూప సంసారసాగరమున కూలి దరిగానక పరితపించు మానవులకెల్ల శ్రీమద్భాగవత పురాణము సంతరణనౌక అయినది.

భాగవతము మోక్షశాస్త్రము. కర్మ భక్తి జ్ఞానమార్గములు మోక్షప్రాప్తికి హేతువులు. ఈ మూడింటిలో భక్తిమార్గము అంతక్లేశావహము కాదు. అట్టి భక్తితత్త్వమును భాగవతము చక్కగా ప్రబోధించుచున్నది. ప్రహ్లాదాంబరీషాదుల చరిత్రలు భక్తిప్రాశస్త్యమునకు దృష్టాంతములు. భాగవతము విన్నను, చదివినను ముక్తి సమకూడును.

క్రీ. శ. పదునైదవ శతాబ్దిలో పరమభక్తుడు, సహజపాండిత్యుడు, కారణజన్ముడైన బమ్మెర పోతనామాత్యులు శ్రీమద్భాగవత పురాణమును తెనిగించిరి.

BHAGAVATA SUDHALAHARI Vol. III

*Commentary*

Saraswathiputra Dr. Puttaparthi Narayana Charyulu



Edited by:

Mudivarthi Kondamacharyulu

T. T. D. Religious Series No. 342

Copies - 5,000.



Published by:

Sri CH. VENKATAPATI RAJU, I. A. S.,

Executive Officer,

T. T. Devasthanams,

Tirupati



Printed at:

Tirumala Tirupati Devasthanams Press

Tirupati-517507.

# ముందుమాట

వేదములు, పురాణములు, ఇతిహాసములు భారతీయసంస్కృతికి మూలాధారములు. లోకహితకాంక్షతో వేదరాశిని విభజించియు, వేదార్థములను భారతమునందు ప్రపంచించియు తృప్తిలేక సరస్వతీ నదీతటమున దుఃఖితుడై ఉన్న శ్రీవేదవ్యాసమహర్షి నారదప్రేరితుడై భగవద్గుణకర్మ నామములను కీర్తించు శ్రీమద్భాగవతపురాణమును రచించి సంతుష్టుడై తన కుమారుడగు శుకయోగిచే చదివించెను.

అష్టాదశపురాణములలో శ్రీమద్భాగవతమున కున్న వ్యాప్తి మరే పురాణమునకు లేదు. ఇందు శాస్త్ర వేదాంతాది విషయములు, మోక్షమున కనువైన భక్త్యాదియోగములు, భాగవతుల కథలు, భగవల్లీలలు, భగవానుని భక్తరక్షణ పరాయణత్వము ఇట్టివెన్నో వర్ణితములైనవి.

శృంగి శాపముచే మృత్యుముఖమున పడనున్న పరీక్షిన్మహారాజు దగ్గరకు శుకయోగీంద్రుడు వచ్చి భాగవతపురాణమును వినిపించెను. పరీక్షిత్తు భాగవత కథాసుధను ఆస్వాదించి అమృతత్త్వ మందెను. ఒక్క పరీక్షిత్తునకే కాక జనన మరణరూప సంసారసాగరమున కూలి దరిగానక పరితపించు మానవులకెల్ల శ్రీమద్భాగవత పురాణము సంతరణనౌక అయినది.

భాగవతము మోక్షశాస్త్రము. కర్మ భక్తి జ్ఞానమార్గములు మోక్షప్రాప్తికి హేతువులు. ఈ మూడింటిలో భక్తిమార్గము అంతక్లేశావహము కాదు. అట్టి భక్తితత్త్వమును భాగవతము చక్కగా ప్రబోధించుచున్నది. ప్రహ్లాదాంబరీషాదుల చరిత్రలు భక్తిప్రాశస్త్యమునకు దృష్టాంతములు. భాగవతము విన్నను, చదివినను ముక్తి సమకూడును.

క్రీ. శ. పదునైదవ శతాబ్దిలో పరమభక్తుడు, సహజపాండిత్యుడు, కారణజన్ముడైన బమ్మెర పోతనామాత్యులు శ్రీమద్భాగవత పురాణమును తెనిగించిరి.

లలితసంస్కృత సమాసములతో, తేటతెనుగు నుడికారముతో, శబ్దార్థాల శోభితమైన పోతనగారి భాగవతము ఆంధ్రపాఠక లోకమున బహుళ వ్యా నున్నది.

మహాభాగవత పురాణములోని శ్లోకములకు ప్రతిపదార్థ తాత్పర్య వివరణములతో పోతనగారి పద్యగద్యములను కూడ జతపరచి డా॥ పు నారాయణాచార్యులవారు 'సుధాలహరి' అను పేరుతో సురుచిర వ్యాఖ్యాన టములను సిద్ధపఱచియున్నారు. ఇది 'సుధాలహరి' లోని మూడవ తరం ఈ తృతీయసంపుటములో భాగవత ప్రథమస్కంధములోని తృతీయాధ్యా నుండి షష్ఠాధ్యాయమువరకు విపులమగు వ్యాఖ్యాన మున్నది.

డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులవారు పండితప్రకాండులు. మహాక వారు శ్రీధరీయాదులైన శ్రీమద్భాగవత వ్యాఖ్యానముల నెన్నింటినో పరి భాషాంతరములలోని భాగవతవిషయములను గూడ ఇందు క్రోడీకరించియున వారికి మా కృతజ్ఞతలు.

తిరుమల తిరుపతి దేవస్థానమువారు ధర్మప్రచార సాధనముగా గ్రంథప్రకటనము సముత్సాహముతో చేపట్టి ఇప్పటి కెన్నో ఉత్తమ గ్రంథ వెలువరించి యున్నారు. ఈ గ్రంథము రసజ్ఞులైన ఆంధ్రపాఠకులకు ఆమో గూర్పగలదని మా విశ్వాసము.

తిరుపతి

28-5-89

సి. హెచ్. వేంకటపతిరాజు
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిర

# భాగవత సుధాలహరి

## ప్రథమ స్కంధము

## తృతీయాధ్యాయము

* * *

సూత ఉవాచ:

జగృహే పౌరుషం రూపం భగవాన్మహదాదిభిః,
సంభూతం షోడశకలమాదౌ లోకసిసృక్షయా. 1

సూతుఁ డనుచున్నాఁడు :

భగవాన్ — పరమాత్మ, మహదాదిభిః — మహత్తత్త్వము మొదలైన వాని చేత, సంభూతం — సునిష్పన్నమైనట్టియు, షోడశకలం — పదునాఱు కళలతోఁ గూడి యున్నట్టియు, రూపం — పురుషావతారమును, లోకసిసృక్షయా — లోకములయొక్క సృష్టియందలి ఇచ్ఛచేత, ఆదౌ — మొదట, జగృహే — స్వీకరించెను.

అవతారిక : అవతారకథలను జెప్పవలెనని శౌనకాదు లడిగిరి. దాని కుత్తరము మూఁడవ యధ్యాయమందుఁ జెప్పుచున్నాఁడు—

తాత్పర్యము : ప్రథమమైన పురుషావతారమును జెప్పుచు న్నాఁడు. లోకములను సృష్టింపవలె నను నిచ్ఛతో భగవంతుఁడు మహత్తత్త్వము, అహంకారతత్త్వము, పంచతన్మాత్రలు వీనితోఁ జేరి యున్న కర్మేంద్రియము లైదు, జ్ఞానేంద్రియము లైదు, మనస్సు మహాభూతము లైదు — ఇట్లా పదునా అంశములతోఁ గూడిన పురుష రూపమును స్వీకరించెను. విరాట్పురుషునిగా నుపాసించుపద్ధతి కను కూలముగా బ్రహ్మస్వరూప మిట్లు వర్ణించు నైనది. వివిధ రూపము

లతోఁ గనిపించుచున్న ఈ లోకము ఈశ్వరుని శరీరమనియు, అందలి యాత్మ ఈశ్వరుఁ డనియుఁ జెప్పఁబడినది.

శ్రీధరుఁడు :

మహదాదిభిః—మహదహంకార పంచతన్మాత్రలచేత, సంభూతం—సునిష్పన్న మైనట్టియు, 'షోడశకలం — షోడశకళలు దేనియందున్నవో అది', రూపం అనుదానికి విశేషణము. ఏకాదశేంద్రియములు పంచతన్మాత్రలు వెఱసి పదునాఱు కళలు. యథార్థముగా భగవద్రూప మిట్టిది గాదు. ఐనను విరాడ్దేహమం దంతర్యామిగా నున్న భగవంతుని విరాడ్రూపముగా నుపాసించుట కిట్లు చెప్పఁబడినదని తెలియవలెను.

వంశీధరుని భావార్థదీపిక :

కలాశ్చ పంచభూతాని జ్ఞానకర్మేంద్రియాణి చ,
పంచ పంచ మనశ్చేతి షోడశోక్తా మహర్షిభిః.

అని తీర్థులు. 'యస్మిన్నేతాః షోడశకలాః ప్రవిశంతి' అని శ్రుతి వాక్యము. 'బ్రహ్మేతి పరమాత్మేతి' అనుచోటనే భగవంతుఁడు చెప్పఁబడెను. 'స ఏ వేదం ససర్జ' అనుదానిచేత నతఁడే ఈ జగత్తును సృష్టించెననియుఁ బూర్వోక్తము. ఆ భగవంతుని యావిర్భావము స్రష్ట మొదలుకొని విష్ణుపర్యంతము ఇతఃపూర్వమే చెప్పఁబడినది. అట్టి భగవంతుఁడు శ్రీకృష్ణుఁడే యనియుఁ బూర్వనిర్దిష్టమే. ప్రశ్న వేసిన శౌనకాదుల మనోగతాభిప్రాయ మదే. సూతుని యూహాయు నదే. అట్టి యా భగవంతుని విశేషముగా ననువాదమొనర్చి చూపుటకును, నా ప్రసంగముతో నితరావతారములను జెప్పుటకును ఆ కృష్ణునియందే బ్రహ్మస్వరూపము నిర్ధరించుటకును 'జగృహే' యని యారంభించుచున్నాఁడు. యః—ఏ కృష్ణస్వరూపుఁడైన భగవంతుఁడు గలఁడో, అతఁడు షడైశ్వర్య సంపన్నుఁడు. అతఁడే, పౌరుషంరూపం —పురుషరూపముతోఁ జెప్పఁబడుచున్నాఁడు. యద్రూపం—ఏ రూప

మును సర్గారంభమునందు గ్రహించెనోయని సంబంధము. ప్రాకృత ప్రళయమందుఁ దనయందే లీనమైన రూపమును వ్యక్తమగు నట్లొ నర్చెనని భావము. ఎందుకు? లోకసిసృక్షయా=తనయందే లీనమైన లోకములకు సంబంధించిన సమష్టి వ్యష్ట్యుపాధి జీవుల యుత్పత్తి కొఱకు. తనయందు లీనమైయున్న రూప మెట్టిది? మహదాదిభి స్సంభూతం=సంభూత మనఁగా మిళితమ్మని యర్థము. మహదాది తత్త్వము లంతర్భూతములై యుండెనన్నమాట. 'సంభూయాంభోధి మభ్యేతి మహోపద్యా మహోపగాః' ఇత్యాదులందు 'సం'పూర్వకమైన ధాతువు మిళనార్థకము. భగవంతునందే మహదాదులు లీనములై యుండెను. నారదీయ తంత్రమం దీ శ్లోక మున్నది-

విష్ణోస్తు త్రీణి రూపాణి పురుషాఖ్యా న్యథోవిదుః,
ఏకం తు మహత స్స్రష్టృ ద్వితయం త్వండకం స్మృతమ్.
తృతీయం సర్వభూతస్థం తాని జ్ఞాత్వా విముచ్యతే,

పై శ్లోకమునుబట్టి మహత్స్రష్టృత్వము మొదటి పురుషార్థమైన రూపము. దానినుండియే మహావిష్ణువుయొక్క యుత్పత్తి. 'తస్మి న్నావిరభూల్లింగే మహావిష్ణు ర్జగత్పతిః' అని యందే గలదు.

నారాయణస్స భగవా నాపస్త స్మాత్సనాతనాత్,
ఆవిరాసీత్కారణార్ణోనిధి స్సంకర్షణాత్మకః.
యోగనిద్రాం గతస్తస్మిన్ సహస్రాంశ స్స్వయం మహాన్.

(బ్రహ్మసంహిత)

కారణార్ణవశాయి యతఁడు. సంకర్షణ స్వరూపుఁడు. ఇక్కడి 'జగృహే' యనుటతో నాకారణార్ణవశాయి స్వరూపమును గ్రహించె నని భావము. అదియే షోడశకలము. ఈ కారణార్ణవశాయియే భగవంతుఁడు. తనచే సృజ్యమానములైన జీవుల కాశ్రయుఁడగుటచేఁ బరమాత్ముఁడనియు భావము. జగృహే = గ్రహించెను అనుటచేత నా రూపము పూర్వమందు లేదని గదా! అప్పు డనిత్యత్వము ప్రాప్తిం

చునే? జగృహే యనుదానికిఁ గ్రొత్తగా గ్రహించుట యని యర్థము గాదు. సమ్యగ్భూతమై పరమసత్యమై పూర్వపూర్వము సద్రూపముగా నున్నదై స్వరూపేణ స్థితమైన దానినే గ్రహించెనని యర్థము. విద్యమానవస్తువును స్వీకరించుటయందే గ్రహణమని వాడుదురు. ఘటమవిద్యమాన మైనప్పుడు ఘటం జగ్రాహ అను ప్రయోగము సిద్ధింపదు గదా! పైన 'స ఏవ ప్రథమం దేవః' ఇత్యాదులుగాఁ జెప్పఁబడు శ్లోకములందును సంభూత మను పదము వర్తించును. మహదాదిభిః — మహత్తత్త్వ అహంకారములచేత, సంభూతం అని యన్వయము. లోకము లనఁగా సమష్టివ్యష్టి రూపములతో నున్న భువనములు. ఇక్కడ భగవంతుఁడు పరమ వ్యోమనాథుఁడు. అతఁడు గ్రహించిన షోడశకలాత్మకమైన రూపము మహావిష్ణువు. 'తదైక్షత' అతఁడే ప్రకృతిని జూచినవాఁడు; సంకర్షణాంశమైనవాఁడు; కారణార్ణవశాయి. షోడశకళలు వైష్ణవగ్రంథములైన 'భక్తివివేకాది' గ్రంథములందు వేఱుగాఁ జెప్పఁబడినవి.

> శ్రీర్భూః కీర్తిరిళా కాంతిర్లీలా విద్యేతి సప్తకమ్,
> విమలాద్యాసవేత్యేతా ముఖ్యా షోడశశక్తయః.
> విమలోత్కర్షిణీ జ్ఞానాక్రియాయోగా తథైవచ,
> ప్రహ్వీసత్యా తథేశానానుగ్రహేతి నవస్మృతాః.

విజయధ్వజులు :

అథా ఖ్యాహి హరేర్ధీమన్—అని శౌనకాదు లవతారప్రశ్న మొనర్చిరి. దాని కుత్తరము చెప్పఁబూనిన సూతుఁడు 'భావయ న్నేష సత్త్వేన' అని రెండవ యధ్యాయము కొనలో లీలావతార సూచన మొనర్చెను. వానినే వివరముగాఁ జెప్పఁబోవుచున్నాఁడు. మొదలు బ్రహ్మాండములో నున్న విరాజనామకుఁడును పరమపురుషుఁడని పిలువఁబడు భగవదవతారముయొక్క యభివ్యక్తిస్వరూపమును జెప్పుచున్నాఁడు—

ఆదౌ = సృష్టియొక్క మొదటు, లోకసిసృక్షయా = ప్రపంచమును సృష్టించవలెనను నిచ్ఛతో, మహదాదిభిస్సంభూతం=ప్రళయకాలమునఁ దన యుదరమం దుంచుకొనియున్న మహత్తు, అహంకారము మొదలైన యేడు ప్రకృతి వికృతులచేఁ గూడుకొనియున్న, షోడశకలం=పంచభూతములు, పంచకర్మేంద్రియములు, జ్ఞానేంద్రియము లైదు, మన స్సనెడు పదునాఱు కళలచేఁ జేరికొనియున్న, పౌరుషం రూపం = పరమపురుషుఁ డని తలఁపఁబడు తన రూపమును, జగృహే=త న్నావరించికొనియున్న ప్రళయకాలమునకు సంబంధించినతమస్సును నాశన మొనర్చుటద్వారా వ్యక్తముగా నొనర్చికొనెను. ఏ పరమాత్మ మొదలు జగత్సంహార మొనర్చి, సూక్ష్మరూపముతోఁ దన యుదరమునం దుంచుకొని, ప్రళయజలమందు లక్ష్మి యను పర్యంకమందు దద్బాహువులతోఁ జేరికొని, ప్రకృతిమయమైన తమస్సునం దడఁగియుండెనో ఆ పరమపురుషుఁడు మఱల సృష్టికాలమందు త న్నావరించియున్న తమస్సును ద్రావి, తన స్వరూపమును బ్రకాశ మొనర్చెనని తెలియవలెను. రామకృష్ణాది రూపములవలె జనుల దర్శనమునకు యోగ్యమైనదిగాఁ జేసెనని యభిప్రాయము. జగృహే యనుటచేత నింతకుముందు లేనిదానిని స్వీకరించెననిగాదు. ఉన్న దానినే వ్యక్త మొనర్చెనని యర్థము. ఈ క్రింది తంత్రభాగవత వాక్యమే ప్రమాణము.

అహేయ మనుపాదేయం యద్రూపం నిత్యమవ్యయమ్,
స ఏవాపేక్షరూపాణాం వ్యక్తిమేవ జనార్దనః.
అగృహ్ణాద్వ్య సృజచ్చేతి రామకృష్ణాదికాం తనుమ్,
పఠ్యతే భగవా నీశో మూఢబుద్ధి వ్యపేక్షయా.
తమసాహ్యుపగూఢస్స యస్తమః పానమాశితుః,
ఏ తత్పురుష రూపస్యగ్రహణం సముదీర్యతే.
కృష్ణరామాది రూపాణాం లోకవ్యక్తి మపేక్షయా,

పరమాత్ముని శరీర మెన్నఁడును విడువరానిది. ఏకదేశముగ నైనను నాశము దానికి లేదు. ఇట్టి దేహమును ధరించిన శ్రీహరి యభివ్యక్తుఁ డయ్యెనను నర్థమందే రామకృష్ణాది దేహములను ధరించెనని చెప్పఁబడెను. మూఢజనుల బుధ్యనుసారము ఆ శరీరము త్యాగ మొనర్చెనని చెప్పెదరు. అవ్యక్తుఁ డగుటయే త్యాగము. పురుషరూపగ్రహణ మనఁగా బ్రహ్మాంతర్గతమైన తమస్సు అనెడు తన రూపమును వ్యక్త మొనర్చుట. రామకృష్ణాదిరూప గ్రహణ మనఁగా నా రూపమును జనులు దర్శించునట్లు వ్యక్త మొనర్చుట. మహదాదిభి స్సంభూతం అనుటకు మహదాదులతోఁ బుట్టినదని యర్థ మొనర్ప రాదు. ఇక్కడి సంభూతశబ్దమునకు యుక్త మని యర్థము. ఆ యోగము అనఁగా సంబంధము ఉదరమందే గాని బయటఁ గాదు. అనఁగా మహదాది సూక్ష్మాంశములను ఉదరమం దుంచికొని పురుష నామకుఁడైన హరి వ్యక్త మయ్యెనని తాత్పర్యము, షోడశకళల కాశ్రయుఁడై యని భావము, మహత్తత్త్వాదులు పరమాత్ముని శరీ రము గావనుటకు ఆచార్యు లీ ప్రమాణములు చూపిరి.

యత్కించి దిహలోకే వై దేహబద్ధం విశాంపతే,
సర్వం పంచభిరావిష్టం భూతైరీశ్వర బుద్ధిజైః.
ఈశ్వరోహి మహద్భూతం ప్రభు ర్నారాయణో విరాట్,
భూతాంతరాత్మా విజ్ఞేయ స్సగుణో నిర్గుణోఽపి చ.
భూతప్రళయ మవ్యక్తం శుశ్రూషు ర్నృపసత్తమ. (మోక్షధర్మము)

తాత్పర్యము: ఈ లోకమందు దేహ మని పిలువఁబడు ప్రతి యొక్కటియుఁ బంచభూతాత్మకమైనదే. పరమాత్ముఁడైన నారాయ ణునకుఁ బ్రాకృతదేహము లేదు. అతఁడు భూతములం దంతర్యామిగా నుండును. జ్ఞానానందాది గుణపూర్ణుఁడైనను సత్త్వము మొదలైన ప్రాకృతగుణములు లేనివాఁడు. అట్టి పరమాత్మను సేవించియుండు జడప్రకృత్యభిమానియైన చేతనప్రకృతి లక్ష్మియొక్క స్వభా

వము. ఈ ప్రమాణముతో ప్రాకృతదేహము పరమాత్మకు లేదని స్థిరమైనది.

నాఽసీదహో న రాత్రి రాసీత్ నా సదాఽసీత్ తన్మహద్వపు,
స్తదా భవ ద్విశ్వరూపం సా నిత్యరూపస్య రజనీ. (భాల్లవేయశ్రుతి)

ఈ శ్రుతిగూడ ప్రళయకాలమందును బరమాత్ముని దేహముండెననియే చెప్పుచున్నది. కనుక వాని దేహము ప్రకృతిజన్యము గాదు. మఱియొక ప్రమాణముగూడ నున్నది.

న తస్య ప్రాకృతా మూర్తిః మాంసమేదోస్థిసంభవా,
న యోగిత్వా దీశ్వరత్వా త్సత్యరూపో ఽచ్యుతో విభుః.

(వరాహపురాణము)

పరమాత్ముని మూర్తి మాంసమేదోస్థి సంభవమైన ప్రాకృతము గాదు. యోగసామర్థ్యముతో నిట్లున్నాఁడనుటకును వీలులేదు. ఈశ్వరుఁడగుటచేఁ బరిపూర్ణానందానుభవ స్వరూపుఁడు. అందుచేతనే చ్యుతిరహితుఁడు. సర్వత్ర వ్యాప్తుఁడు.

సర్వేనిత్యా శ్శాశ్వతాశ్చ దేహాస్తస్య పరాత్మనః,
హానోపాదానరహితా నైవ ప్రకృతిజాః క్వచిత్.
పరమానందసందోహా జ్ఞానమాత్రాశ్చ సర్వశః,
సర్వే సర్వగుణైః పూర్ణాః సర్వే భేదవివర్జితాః.
అన్యూనా ఽనధికాశ్చైవ గుణైస్సర్వైశ్చ సర్వతః,
దేహి దేహభిదాచైవ నేశ్వరే విద్యతే క్వచిత్.
తచ్ఛ్వీకారాది శబ్దస్తు హంత స్వీకారవత్స్మృతః,
వైలక్షణ్యాన్నవా తత్ర జ్ఞానమాత్రార్థ మీరితమ్.
కేవలైశ్వర్య సంయోగా దీశ్వరః ప్రకృతేః పరః,
జాతోఽగ్రగత స్త్వదం రూపం తదిత్యాది వ్యవస్థ్యతే.

(మహావరాహపురాణము)

పరమాత్ముని దేహములన్నియు నిత్యములు, ఎప్పటికి నొక్క రీతిగనే యుండును. వానికి త్యాగము గాని స్వీకారము గాని లేదు. ఎన్నఁడును ప్రకృతి జన్యములు గావు. పరమానంత సమూహాత్మక ములు. కేవల జ్ఞానాత్మకములు. సర్వగుణపరిపూర్ణములు. వానిలో నొక్క యవయవమునకును, మఱియొక యవయవమునకును భేదము దులే. ఆ దేహములకుఁ బరస్పరభేదము శూన్యము. అట్లే భగవత్కృత మైన భేదమునులేదు. అనఁగా రామశరీరమునకునుఁ గృష్ణ శరీరమున కును భేదము లేదన్నమాట. దేహభేదము గూడ వానియందు లేదు.

'చేయి తీసికొన్నది' అను ప్రయోగ మున్నది. ఈ ప్రయోగ మందు చేయి కర్త, అదియే కర్మగూడ. ఎట్లు? దేహమునకు దేహావ యవములకు నభేదము. తార్కికులు 'అవయవ అవయవినో స్సమ వాయః' అందురు. అనఁగా నవయవమునకును అవయవముగల దానికిని సమవాయసంబంధము. దానిని ద్వైతులు ఖండింతురు. వీరి దృష్టిలో రెంటికి నభేదము. కనుక దేహమునకును జేతికిని అభేదము. అందుచేఁ జేతిని దీసికొనుటయందు చేయియే కర్తయుఁ గర్మయునగు చున్నది. హస్తమునకును దేహమునకును నున్న సంబంధము భేదా భేదము. అనఁగాఁ జేతిని గోసివేసినను దేహమున్నట్లె. ఇది భేదము. చేతితోఁగూడఁ జేరియే దేహము. ఇది యభేదము. మామిడిపండున్నది. అది పక్వము గానప్పుడు దాని పై భాగమందు హరితత్త్వముండును. పక్వావస్థయందదే పసుపుపచ్చగా మారును. పండునుండి హరితత్త్వ మును బ్రక్కకుఁ దీయలేము. పక్వమైనప్పుడు దాని గుణము మారి నది. ఇదే భేదాభేదసంబంధము. అభేదమెక్కడ? 'తెల్లగుడ్డ'. గుడ్డకును తెలుపు రంగునకును నభేదము. అనఁగా గుడ్డ యున్నంతవఱకును తెలుపుండును. యావద్ద్రవ్యావస్థానము అనుగతమగు గుణమునభేద మందురు. ఇక్కడ పరమాత్మకు నతనిదేహమునకునున్న సంబంధము భేదాభేదము గాదు. అత్యంతాభేదము. ఈ సందర్భమున యాదుపత్య కారు లిట్లన్నారు.

దేవదత్తదేహస్య హస్తరూప అవయవేన అభేదేఽపి, దేవదత్తదేహః స్వహస్తం స్వీచక్రే జగృహే. ఇత్యాది కర్తృకర్మభావేన శబ్దః ప్రయుజ్యతే. తద్వత్ భగవతస్తస్య దేహానాం చ అభేదేఽపి స్వీకారాది శబ్ద ఉపపద్యతే, ఇత్యర్థః నను దృష్టాంతే హస్తదేహయో ర్భేదాభేదౌస్తః. అత స్తథాత్ర స్వీకారాదిశబ్దః ఉపపద్యతే. న ప్రకృతే అత్యంతాభేదేన తద్వైలక్షణ్యాత్, ఇతి శంకాయాం తత్ర భగవతి న వా అయం దృష్టాంత ఇత్యాహ.

అనన్యసాధారణైశ్వర్యమున్న శ్రీహరి పుట్టెను. ఈ రూపమును బొందెను. ఆ రూపమును బొందెను ఇత్యాది విషయములు కేవల భేదవ్యవహారము మాత్రమే. పై దృష్టాంతమును గూడ నిట్లే యన్వయించుకొనవలెను. 'ఏకమేవా ద్వితీయం' అనెడు శ్రుతివాక్యమందు 'ఏకం' అనుటచేత, పరమాత్మయందు స్వగతభేదము నిషేధింపఁ బడినది. 'నేహ నానాస్తి కించన' యనెడు శ్రుతిగూడ బ్రహ్మయందు స్వగతభేదము సాక్షాత్తుగా నిషేధించుచున్నది. భగవంతునకు భగవద్ధర్మములకును భేదమును జూడఁగూడదని, 'ఏవం ధర్మాన్ పృథక్పశ్యన్' అనెడు శ్రుతియు నిందాపూర్వకముగాఁ జెప్పుచున్నది. ప్రాకృతదేహరహితుఁ డగుటచే శ్రీహరి స్థూలుఁడు గాఁడు, అణువును గాదు. రెండును నౌను. ఇత్యాది విరుద్ధధర్మము లొకతేకాలమందు ఒక్కఁడేయైన పరమాత్మకుఁ జెప్పఁబడుచున్నవి. ఐశ్వర్యవంతుఁడైన శ్రీహరియందు ఇవన్నియు నుండుట సంభావితము గాదు. అట్లైనచో నైశ్వర్యముతో శ్రీహరియందు దోషములు గూడ నుండునని చెప్పవచ్చును గదా! అట్లు గాదు. దోషములున్నప్పు డైశ్వర్యము గుదురదు. అందువలనఁ బరమాత్మయందు దోషము లుండవు. విష్ణుధర్మోత్తర పురాణమునందలి శ్లోకము లీ విషయమునే స్పష్టపఱచుచున్నవి.

గుణాస్సర్వేపి యుజ్యంతే హ్యైశ్వర్యా త్పురుషోత్తమే,
దోషాః కథంచిన్నైవాత్ర యుజ్యంతే పరమోహి సః.
గుణదోషౌ మాయయైవ కేచిదాహు ర పండితాః,
న తత్ర మాయా మాయావీ తదీయౌ తౌ కుతోహ్యతః.

తస్మాన్న మాయయాసర్వం సర్వమైశ్వర్య సంభవమ్,
అమాయోహీశ్వరో యస్మాత్ తస్మాత్తం పరమం విదుః.

పైఁ జెప్పిన ప్రమాణముచేత, విరుద్ధావిరుద్ధగుణములు ఐశ్వర్య బలముతో నీశ్వరునందు సంభవించినను దోషము లెప్పుడును రా నేరవనుట స్పష్టము. మాయచేత గుణదోషములను ఈశ్వరునందుఁ జెప్పెడి మత మజ్ఞాని మతము. మాయ, మాయావంతుఁడు ఈ రెండును బరమాత్మకు లోఁబడినవే. అందుచేత పరమాత్మయం దెప్పుడును భ్రాంతి కారకములు గానేరవు. అతనికి మాయాకృతమైన భ్రాంతి ఏనాఁడును గల్గనేరదు. అందుకే యాతఁడు పరమాత్ముఁడు.

తాత్పర్యము: శ్రీహరి యవతార లీలలను జెప్పవలెనని శౌనకుఁడు సూతుని బ్రశ్నించెను. దానిని సంక్షేపముగా రెండవయధ్యాయము కొనలో సూచించినాఁడు. ఇప్పు డా విషయమునే విస్తారముగఁ జెప్పుచున్నాఁడు. పరమాత్ముని రూపములన్నియు సదాకాలముండునవే. ఎప్పుడును, ఏ విధమైన వ్యత్యాసము నవి పొందుట లేదు. అతని సమస్తరూపములును బ్రాకృతదేహము లేనివే. ప్రకృతి నియామకురాలైన లక్ష్మి యెప్పుడును శ్రీహరినే సేవించెడు స్వభావము గలది అన్నపుడు అతఁ డెప్పుడైనను ప్రకృతి బద్ధుఁ డగునా! అతని యన్ని రూపములును నప్రాకృతములే. అవి పుట్టుననియు, నన్నమించుననియుఁ దెలియరాదు. పుట్టుచున్న వనఁగా వ్యక్తము లగుచున్నవని యర్థము. వానికిఁ బోవుట యనఁగా నవ్యక్తమగుట. అతని సమస్త రూపములును జ్ఞానసుఖాత్మకములు. అన్నియును పరిపూర్ణానంద సమూహములుగనే యుండును. వానికిని బరమాత్మకును భేద మెన్నఁడును లేదు. అట్లే ఒక రూపమునకును మఱియొక రూపమునకును భేదములేదు. ఆ రూపములందున్న ప్రత్యవయవమును బరిపూర్ణమైనదే. పరమాత్ముని ధర్మములకును, అతనికిని భేదములేదు. ఇట్లు శ్రీహరి స్వగతభేదరహితుఁడు. దీనికి శ్రుతులు, పురాణములు

ప్రమాణములుగా నున్నవి. ఏ తద్విరుద్ధముగా నర్థము చేసికొనుట విజ్ఞుల మార్గముగాదు. సర్వైశ్వర్యయుక్తుఁడైన శ్రీహరియందు స్థూలత్వము, అణుత్వము, అవర్ణత్వము, సవర్ణత్వము మొదలైన విరుద్ధధర్మము లుండు టాశ్చర్య మేమియును గాదు. కాని యతనియం దే దోషమును గాని సంభావించు టసాధ్యము. దోష మున్నచో నతని యైశ్వర్యమునకే లోటు. కనుక దోషము లా పరమాత్మ యైశ్వర్యమును సమీపింపలేవు. ఇట్లు దోషరహితుఁడు గుణపూర్ణుఁడైన వాఁడే శ్రీహరి. ఇట్టి పరిపూర్ణుఁడైన శ్రీహరి ప్రళయకాలమందు సమస్తజగత్తు నుపసంహరించి, తన గర్భమం దుంచికొనును. శ్రీపర్యంకమందు రమాభుజాలింగితుండై శయనించి యుండును. వాని ఇచ్ఛ ననుసరించియే ప్రకృతిసంబంధమైన ప్రళయ తమస్సు వాని నావరించి, యతఁడు గన్పడకుండు నట్లొనర్చును. మఱల సృష్టి యొనర్పవలె నను నిచ్ఛ భగవంతునకుఁ గలుగును. అప్పు డతఁడు ద న్నావరించి యున్న చీఁకటిని నాశ మొనర్చును. వ్యక్తస్వరూపుఁ డగును. ఇదే వాని రూపస్వీకారము. ఈ రూపమునకే పరమపురుష రూపమని పేరు. దీనియందు శ్రీహరి తన కడుపునందు మహత్తత్త్వము మొదలైన తత్త్వముల సూక్ష్మాంశములఁ గల్గియుండును. కాని యతని దేహము మహత్తత్త్వాదులతో నైనదిగాదు. ఆ దేహమందు పంచభూతములు, పంచజ్ఞానేంద్రియములు, మనస్సనెడు పదునాఱుకళలుండును. సృష్ట్యాదియం దీ రూపముతో శ్రీహరి వ్యక్తుఁ డయ్యెను. ఈతఁడే మహదాదితత్త్వములను సృజించి, వానిచేత బ్రహ్మాండములు సృష్టి చేసినాఁడు. తాను సృష్టించిన బ్రహ్మాండమందుఁ దానే ప్రవేశించెను.

యస్యాంభసి శయానస్య యోగనిద్రాం వితన్వతః,
నాభిహ్రదాంబుజాదాసీ ద్బ్రహ్మవిశ్వసృజాం పతిః. 2

**అంభసి=నీటియందు, శయానస్య=శయనించియున్నట్టియు, యోగనిద్రాం=సమాధిరూపమైన నిద్రను, వితన్వతః=విస్తరింపఁ జేయుచున్నవాఁడైన, యస్య**

—ఎవనియొక్క, నాభిహ్రదాంబుజాత్—నాభి యను హ్రదమందున్న తామరనుండి, విశ్వసృజాం పతిః = లోకమును సృష్టించువాని కధినాథుఁడైన, బ్రహ్మా=బ్రహ్మ దేవుఁడు, ఆసీత్—కలిగెను.

అవ: పురుషావతారమును స్వీకరించిన భగవంతుని యవతారమును, స్వరూపమును వివరించుచున్నాఁడు—

ప్రళయమందు సమస్త ప్రపంచమును జల మావరించినది. ఆ కారణజలమందు సమాధిరూపమైన నిద్ర నంగీకరించి శయనించి యున్న భగవంతుని నాభిహ్రదమునుండి యొక తామరయు, దాని నుండి లోకమును సృష్టించెడు మరీచ్యాది ప్రజాపతుల కధిపతియు నైన బ్రహ్మయు పాద్మకల్పమం దేర్పడిరి.

**వంశీధరుఁడు :**

ఏకార్ణవమైన పాద్మకల్పమందలి పరమపురుషుఁడు నీటియందుఁ బవ్వళించియుండెను. వాని యొక్కొక్క రోమకూపమం దొక్కొక్క బ్రహ్మాండము. ఒక్కొక్కదాని యందొక్కొక్క ప్రకాశము. వాని యందుఁ బ్రవేశించి గర్భోదమునందు యోగనిద్రాయుతుఁడై ఉండెను. అతని యవయవ సంస్థానములచేతనే లోకవిస్తరము. పాతాలాది సత్యాంతమైన భువన విన్యాసము జరగెనని తాత్పర్యము. పద్మనాభుఁ డనిరుద్ధాంశము, గర్భోదశాయి. ఇది తృతీయ వ్యూహము. రెండవ యధ్యాయమందు 'హరివిరించి హరేతి సంజ్ఞాః' అనుచోటఁ జెప్పిన హరి క్షీరోదశాయి. తృతీయపురుషుఁ డనిరుద్ధాంశుఁడు పద్మనాభుఁడు. క్షీరోదశాయి, కారణోదశాయి, గర్భోదశాయి—యని పురుషత్రయము. ప్రథముఁడైన క్షీరోదశాయి ప్రకృత్యంతర్యామి. రెండవవాఁడు కారణోదశాయి సమష్టి విరాజపురుషుఁడు. మూఁడవ పురుషుఁడు వ్యష్టి అంతర్యామి. ఈ విషయమే 'ఏకం తు మహతస్స్రష్టు' అను దానివలన జెప్పఁబడినది. క్షీరోదశాయికి మరల శయనేచ్ఛ జనించినపుడు కార

ణార్ణవమందు మరలఁ బండినవాఁడై స్వనిశ్వాస నిష్క్రమణ ప్రథమ క్షణమందే తనశక్తియైన మాయ నవలోకించెను. అతని యింగితమును దెలిసికొన్న యామె వాని యిచ్ఛాబలము వలననే సామర్థ్యమును బొందినదై మహత్తత్త్వాది తత్త్వములను తననుండియే వెలువరించి వానిచేత బ్రహ్మాండమును సృష్టించి తన ప్రభువుతో నిట్లనెను: 'స్వామిన్' శయనమునకు రావలెను'. అప్పు డతఁడు దానియందుఁ బ్రవేశించి, నిమేషమాత్రము శయనించెను. అతఁడు బహిర్గతుఁడై అప్పుఁడే బ్రహ్మాండశయన మందిరమును నిర్మాల్యమును వలెఁ దన మాయచేతనే దూర మొనర్చెను. మరలఁ గ్రొత్తచోటు నాతని శయ నింపఁ జేయుటకు బ్రహ్మకు పరార్ధద్వయము గడచిపోవుచుండెను. ఈ విషయమే తృతీయస్కంధమందు నిమేష 'ఉపచర్యతే' అనుచోట విస్తృతముగాఁ జెప్పఁబడినది. ఆ రీతిగా నచ్చటఁ బవ్వళించియుండు స్వామియొక్క శ్రీచరణాది సన్నివేశములచేత లోకముయొక్క విస్తారము విరాడాకారమైన ప్రపంచము గల్పింపఁబడినది. ఆ విధానమే 'పాతాళమేతస్య తు పాదమూలమ్' నుదానితోఁ జెప్పఁబోవుచున్నది. ఈ వర్ణన ఉపాసకుల మనస్థైర్యమునకుఁ జెప్పఁబడినదే. అదే యాతని రూపము గాదు. లేక 'చంద్రమా మనసోజాతః' అని యారంభించి, 'పద్భ్యాంభూమిర్దిశశ్శ్రోత్రాత్ తథా లోకా న కల్పయత్' అనెడు శ్రుతి చేత, హేతుభూతములైన నా యా యవలోకనములతో లోకవిస్తార మేర్పడె ననియుఁ జెప్పవచ్చును. మోక్షధర్మమందు నారాయణీయ ములో గర్భోదకమందుఁ బవ్వళించినవాని రూపాంతరమైన శ్వేతద్వీప పతి వాక్యము లిట్లున్నవి.

అస్మన్మూర్తి శ్చతుర్థీయా, సాఽసృజచ్ఛేష మవ్యయమ్,
స హి సంకర్షణః ప్రోక్తః ప్రద్యుమ్నం సోఽప్యజీజనత్.
ప్రద్యుమ్నా దనిరుద్ధోఽహం సర్గో మమ పునః పునః,
అనిరుద్ధా త్తథా బ్రహ్మ తత్రాది కమలోద్భవః.
బ్రహ్మణ స్సర్వభూతాని స్థావరాణి చరాని చ,

ఆ సందర్భమందే వేదవ్యాసు లిట్లన్నారు.

పరమాత్మేతి యం ప్రాహుః సాంఖ్యయోగవిదో జనాః,
మహాపురుష సంజ్ఞాం చ లభతే స్వేనకర్మణా.

తస్మాత్ప్రసూత మవ్యక్తం ప్రధానం యద్విదుర్బుధాః,
అవ్యక్తాద్వ్యక్త ముత్పన్నం లోకసృష్ట్యర్థ మీశ్వరాత్.

అనిరుద్ధో హి లోకేషు మహానాత్మేతి కథ్యతే,
యో సౌ వ్యక్తత్వమాపన్నో నిర్మమే చ పితామహమ్.

ఇదంతయు సంకర్షణుని వైభవము. ప్రత్యేక బ్రహ్మాండముల యందుఁ బరమాత్మవ్యక్తిత్వము ప్రద్యుమ్నస్వరూపమే. అభేదవివక్షతో సూతుఁ డిక్కడ ప్రద్యుమ్నుని వేఱుగాఁ జెప్పలేదు. 'విష్ణోస్తు త్రీణి రూపాణి' అన్నాఁడు. పైఁ జెప్పిన ప్రక్రియ యంతయు ద్వితీయ స్కంధములోని షష్ఠాధ్యాయమునందు వచ్చును. 'స ఏవ ఆద్యః పురుషః' అనుశ్లోకమందు 'స ఏవ ఆద్యో భగవాన్' యః పురుషావతార స్సన్ సృష్ట్యాదికం కరోతి' అనుదాని యారంభము. ఈ ప్రథమావ తారము 'సహస్రశీర్షా పురుషః' అని చెప్పఁబడిన లీలావిగ్రహము. ఇదే ఆద్యావతారము. కనుక విరాట్పురుషునిగా నితనిని వ్యాఖ్యా నింపరాదు.

వీరరాఘవీయము :

అవ: ప్రథమాధ్యాయమందు శౌనకాదులు ప్రశ్న వేసిరి. ద్వితీయములో సర్వప్రవర్తకమైన భగవద్భక్తియే యాచరణీయము. మోక్షప్రదమైన భగవదీయ ప్రబంధమే శ్రోతవ్య మనుటతో స్థాపిత మైన యవతార ప్రయోజనము ప్రదర్శింపఁబడినది. తరువాత భగవదవతార విశేషము తచ్చరిత్రములు విస్తరముగాఁ జెప్పు నాసతో మొదట భగవంతున కనేకవతారము లున్నవని చెప్పఁబోవు

అవతారములు రెండు రీతులు. అనుప్రవేశావతారములు, స్వ స్వరూపావతారములు. రెంటికిని గర్మకారణముగాదు గనుక అవతార శబ్దము సామాన్యము. వివిధములైన యవతారములను జెప్పుటకు దాని కుపకరించుట వలన ప్రథమముగాఁ జేతన మిశ్రమమైన ప్రకృతి ప్రాకృతజాతమైన యవతార మొకటి. శుద్ధసత్త్వము రెండవది. ఈ రెండును భగవంతున కున్నవని చెప్పఁబోవుచు, ప్రకృతి ప్రకృతాత్మ రూప పరిగ్రహమును జెప్పుచున్నాఁడు.

పౌరుషం=పురుషుఁ డనఁగా క్షేత్రజ్ఞుఁడు. దానికి సంబంధించినది పౌరుషము. దానిచేత మిశ్రమైనదని యర్థము. ఏకాదశేంద్రియ పంచభూతాత్మకములైన షోడశకళలతోఁ గూడినదియు, మహదాది సంభూతమునైన రూపము బ్రహ్మాండకారణము. ఇచ్చట రూప శబ్దముచేత సమష్టి తత్త్వజాతము వివక్షితము. ఆ సముదాయమును దెల్పుటకే 'మహదాదిభి స్సంభూతం' అని చెప్పఁబడెను. జగృహే= స్వీకరించెను. ఎందుకు? బ్రహ్మాండ తదంత ర్వర్తికార్యజాతములు సృష్టించు నిచ్ఛచేత. అతని యసాధారణరూపమును 'యస్యాంభసి' అనుదానితో నారంభించుచున్నాఁడు. 'విశ్వసృజాం' మరీచ్యాదులకు పతిః=అధినాథుఁడు, యస్య అనఁగా ననిరుద్ధాత్మయొక్క నాభీసరస్సు నుండి చతుర్ముఖుఁడు జన్మించెను. ఈ యనిరుద్ధాఖ్య స్వరూపము జ్ఞానసిద్ధము, అపరిచ్ఛేద్యము, సర్వావతారనిదానము. ఈ యనిరుద్ధుని యవయవ సంస్థానములచేతనే లోకములు సృష్టింపఁబడినవి. అట్టి యా భగవంతుని రూపము శుద్ధసత్త్వమయమైనది. ఉత్కృష్టమైనది.

యస్యావయవ సంస్థానైః కల్పితోలోక విస్తరః,
తద్వై భగవతో రూపం విశుద్ధం సత్త్వమూర్జితమ్. 3

**యస్య**=ఎవనియొక్క, **అవయవ సంస్థానైః**=అవయవ విభాగములతో, **లోకవిస్తరః**=లోకముల విస్తారము, **కల్పితః**=చేయఁబడినదో, **భగవతః**=భగ

వంతునియొక్క, తద్రూపం=ఆ రూపమును, విశుద్ధం=పరిశుద్ధమైనది, వై=ఈ విషయము ప్రసిద్ధము.

పురుషావయవములతోఁ బదునాల్గులోకములు గల్పింపఁబడినవి. ఆ స్వరూపము రజస్తమస్సుల సంబంధములేనిది, శుద్ధసత్త్వము.

**శ్రీధరీయము :**

అతనిరూపము విశుద్ధం=రజ ఆద్యసంభిన్నం. అందుచే ఊర్జితం= నిరతిశయమైనది. సత్త్వం=సత్త్వగుణముతోఁ గూడినది.

**విజయధ్వజము :**

ఆ పరమాత్ముఁడే బ్రహ్మాండములకును అంతరిక్షాది లోకములకును నాధారములైన యవయవములుగల విరాట్పురుషుఁ డని యర్థము. అతని మఱియొక మహిమను జెప్పుచున్నాఁడు. లోక విస్తరః=చతుర్దశభువనము లనెడు విస్తారమైన ప్రపంచము, యస్య= ఏ పురుషనాథుకుఁడైన శ్రీహరియొక్క, అవయవ విన్యాసములచేత, కల్పితః=ఆ యవయవముల యాధారముపైననే యున్నదని విద్వాంసుల చేత నిరూపింపఁబడినదో, తద్భగవతః=ఆ భగవంతునియొక్క, రూపం=పురుషుఁడు మున్నగు మూఁడు రూపములును, విశుద్ధం= దోషరహితమైనవి. ఊర్జితం సర్వోత్కృష్టం సత్త్వం=సంపూర్ణమైన బలజ్ఞానాది సమూహము, వై=ఇది ప్రమాణసిద్ధము, ఏతద్విరుద్ధం= ప్రమాణ విరుద్ధం.

విశేషార్థము: ఇక్కడ నే యవయవము నుండి యేది సృష్టమైన దను విషయము 'నాభ్యా ఆసీ దంతరిక్షం' ఇత్యాది శ్రుతులచేఁ —గియఁదగినది. సత్త్వం=అనుటకర్థము, సత్త్వగుణార్థకమని గాదు. సుగుణాత్మకమని, జ్ఞానబలరూపములైన దనియే తెలియవలెను. ...ంటి 'కల్పితః' అను శబ్దముచేతఁ బరమాత్ముఁడే లోకములుగా ...ెనని చెప్పరాదు. కొందఱు సచ్చిదానందము లే రసముగానున్న

బ్రహ్మచైతన్యము అవిద్య యనెడు నద్ధమందు ప్రతిబింబితమై జీవుఁడనిపించికొన్నది. ఆ బ్రహ్మయే మాయనువశీకరించికొని యీశ్వరుఁడనిపించికొన్నది. ఆ యీశ్వరరూపమే పురుషసంబంధియైన విరాడ్రూపమునందెను. అ రూపము మాయానిర్మితమైన మహదహంకారాది తత్త్వములచేఁ బుట్టినది. అందుకే పంచభూతములు మొదలైన పదునాఱు కళలు గలది. లోకమును సృష్టించుటచే నీ రూప మేర్పడినది. తన మాయాపరిణతములైన భూతసూక్ష్మములందు తత్త్వరూపములుగా వ్యాపించియు జగత్కారణమునునైన మాయాశక్తిని విస్తృత మొనర్చి సృష్టికై పరమాత్మ ప్రేరేచెను. ఏ రూపముయొక్క ఐదుగానైన భూతములనుండి పుట్టిన లోకపద్మమునందు బ్రహ్మ సృష్టింపఁబడెనో ఆ బ్రహ్మోత్పాదకమైన జగత్కార్యమున కవయవము లనిపించికొన్న దళములనుండి ఈ విస్తృతమైన లోకము గల్పితమో-అనఁగా వాస్తవముగా గాదు - అట్టి భగవంతుని త్రిలోకస్వరూపము మొదటి రూపమందురు. ఇది ప్రమాణవిరుద్ధము. 'నిరనిష్టో నిరవద్యః' అనెడు శ్రుతి పరబ్రహ్మ యెప్పుడును నవిద్యావిలాసమునకు లోఁబడినవాఁడు గాఁడని చెప్పుచున్నది. కనుక అవిద్య యనెడు నద్దమందుఁ బ్రతిబింబించి జీవుఁడగుట అసంభావ్యము. ఎప్పుడును దలనొప్పి లేనివాఁడు ప్రగిడార్థమునకైనను తలనొప్పి గలవాఁడ నగుదునని యోచింపఁడు గదా! పంచీకరణముగూడ ప్రమాణవిరుద్ధమే. అందుచే నీ శ్లోకముల కట్టి యర్థమును జెప్పరాదు.

తాత్పర్యము: జలరాశియందు శేషశాయియై పండినాఁడు. అతఁడు నాభినుండి లోకాత్మకమైన పద్మమును సృష్టించెను. దీనికి పద్మకల్పమని పేరు. అందుకే శ్రీహరి పద్మనాభుఁ డైనాఁడు. శ్రీహరి పండె ననఁగా నాయాసముతో ననిగాదు. తన ఇచ్ఛచేతనే శేషశాయియైనాఁడు. అతఁ డనుభవించుచుండినది యోగనిద్ర. తన సామర్థ్యమును బ్రకటింపకుండునదే యాతని నిద్ర. అదే స్వాపము. ఇట్టి

పరమాత్మ నాభికమలమునుండి చతుర్ముఖుఁడు జన్మించెను. ఇతఁడు ప్రజేశ్వరులనిపించికొన్న దక్షాదుల కధినాథుఁడు. శ్రీహరి సృష్టికార్యమందు జీవులయందుఁ బ్రధానుఁడుగా బ్రహ్మదేవుఁడు సృష్టింపఁబడెను. ఆ పరమాత్ముఁడే తన మూర్తియొక్క మహిమను బ్రకటీకరించినాఁడు. అతఁడు బ్రహ్మాండమందు విరాట్పురుషుఁడై యవతరించెను. అతని శ్రీపాద తలమునుండి శిరస్సువఱకున్న యవయవములలోఁ బదునాలుగు లోకములను సృష్టించినాఁడు. సృష్టించుట మాత్రమే గాదు. ఆ యా యంగములే వాని కాధారములై యున్నవి. అంతే గాని అతని యంగములే లోకములుగా లేవు. ఇదే జ్ఞానుల మతము. బ్రహ్మాండమునకు బయటనున్న పురుషరూపము బ్రహ్మాండములోనున్న పద్మనాభరూపము విరాడ్రూపుఁ డనిపించికొనెడు పురుషరూపము ఈ మూఁడును విశుద్ధములే. దోషరహితములే. కేవల సాధుగుణాత్మకములైన జ్ఞాన బల సమూహరూపములు. అందుచే సర్వోత్కృష్టుఁడు. "ఇవి యవిద్యా కల్పితములు. జగత్తునకును వీనికిని భేదము లేదు, అవే జగత్తుగా నైనవి' అను వాదము ప్రమాణ విరుద్ధము. 'నిరనిష్టో నిరవద్యః' అనెడు శ్రుతి ఈ మూఁడు రూపములం దే దోషమును లేదని స్పష్టముగా సారించుచున్నది. ఇవి యవిద్యాగ్రస్తము లనుటయు దోష భూయిష్ఠమైన జగత్తుగా మారెననుటయుఁ బ్రమాణసిద్ధము గాదు.

పశ్యం త్యదోరూప మదభ్రచక్షుషా
సహస్ర పాదోరు భుజాన నాద్భుతమ్,
సహస్రమూర్ధ శ్రవణాక్షి నాసికం
సహస్ర మౌళ్యంబర కుంతలోల్లసత్. 4

సహస్ర పాదోరుభుజాననాద్భుతమ్=అనేక పాదములు, ఊరువులు, భుజములు, ముఖములు వీనిచే నాశ్చర్యకరమైనదియు, సహస్రమూర్ధ శ్రవణాక్షి నాసికం=సహస్రశిరస్సులు, చెవులు, కన్నులు, ముక్కులు మున్నగువానితోఁ గూడినదియు, సహస్రమౌళ్యంబర కుండలోల్లసత్=అనేకకిరీటములు వస్త్రములు

కుండలములు వీనితో శోభించునదైన, అదోరూపం=ఈ రూపమును, అదభ్ర చక్షుషా= సార్థకమైన నేత్రముతో, పశ్యంతి=మహాయోగులు చూతురు.

అనేకపాదములు, తొడలు, చేతులు, ముఖములు పరమాశ్చర్య కరమైన దా రూపము. సహస్రశీర్షములు, సహస్రశ్రోత్రములు, అక్షి నాసికములు, అసంఖ్యాక కిరీటములు, వస్త్రములు, కుండలములు, ఇవి గల్పించెడు నపూర్వశోభ ఈ పురుషస్వరూపమును పరమయోగులు ధ్యాననేత్రముతో దర్శింతురు. ఆ స్వరూపమును స్థూలదృష్టితోఁ జూచుటకు సాధ్యము గాదు.

శ్రీధరవ్యాఖ్య:

అవతారిక: ఈ స్వరూపము యోగులకే ప్రత్యక్షమని చెప్పుచున్నాఁడు.

అదభ్ర మనఁగా ననల్పము. జ్ఞానాత్మకములైన చక్షుస్సులు. ఈ పురుషరూపము కూటస్థము, అన్యావతారములవలె నావిర్భావ తిరోభావములు గలది గాదు.

వంశీధరుఁడు:

అదభ్ర చక్షుషా=భక్తి యను పేరుగల కన్నుచేత 'పురుషస్స పరః పార్థ భక్త్యాలభ్య స్త్వనన్యయా' అని గీతావాక్యము. 'భక్తిరే వైనం దర్శయతి' అని శ్రుతివాక్యము.

వీరరాఘవీయము:

పశ్యంతి=చూతురు. ఈ యనిరుద్ధాఖ్యమైన రూపమును, అదభ్ర చక్షుషా=అనల్పజ్ఞానముగల మనస్సుచేత దర్శింతు రనుచున్నాఁడు.

మనసా తు విశుద్ధేన దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మ దర్శిభిః

అనునట్లు యోగపరిశుద్ధ మనస్కులే చూతురని యర్థము.

విజయధ్వజము :

ఇట్టి శ్రీహరిరూపము యోగి ప్రత్యక్షము. అదభ్ర చక్షుషః = పూర్ణజ్ఞానులైన బ్రహ్మాది చేతనులు, అదోరూపం=ఈ మూఁడు రూపములను, సహస్రపా .... .... ద్భుతం=అనంత పాదములు, తొడలు, భుజములు, ఆననములుగల యత్యాశ్చర్యకరములైన, సహస్ర .... .... నాసికం=వేవేల శిరోక్షిశ్రవణ నాసికములు, సహస్ర మౌళ్యంబర కుండలోల్లసత్ =అనేక కిరీటవస్త్ర కుండలాదులచేఁ బ్రకాశించువానిని, అపరోక్షజ్ఞానముతోఁ జూచుచున్నారు; అజ్ఞానశూన్యులు. అందుచేతనే యుత్తమాధికారులైన బ్రహ్మాదులు అపరోక్షముగాఁ జూచు నీ మూఁడును మాయాకల్పితము లెప్పటికిని గావు.

తాత్పర్యము : బ్రహ్మాది చేతనులు బహుజ్ఞానులు, అజ్ఞానరహితులు. అందుచే నుత్తమాధికారులు. వీ రీ పరమాత్మరూపమును అపరోక్షముగాఁ జూతురు. అతని రూపములు ప్రతియొకటియు నాశ్చర్యకరములే. అనంతములైన పాదములు; సహస్రమూర్ధములు. సహస్ర మౌళ్యాదులు. బ్రహ్మాదులు చూచిన యీ రూపము లెప్పుడును మాయాకల్పితములు గానేరవు. 'అదభ్ర చక్షుషా' అని శ్రీధరుని పాఠము. అదభ్ర చక్షుషః అని వీరి పాఠము.

ఏతన్నానావతారాణాం నిదానం బీజమవ్యయమ్,
యస్యాం శాంశేన సృజ్యంతే దేవతిర్యఙ్నరాదయః. 5

ఏ తత్=ఇది, నానావతారాణాం=అనేకావతారములకు, నిధానం=ప్రవేశస్థానము, అవ్యయం=వినాశరహితము, బీజం=ఉత్పత్తిస్థానము, యస్య=దేని యొక్క, అంశాంశేన=అంశాంశములతో, దేవతిర్యఙ్నరాదయః=దేవతలు,తిర్యక్కులు, మనుష్యులు మొదలగువారు, సృజ్యంతే=సృష్టింపఁబడుచున్నారో.

ఈ యాదినారాయణరూపమే అనేకావతారములకుఁ బ్రవేశస్థానము. ఉద్భవస్థానమును. ఇది ఏ కాలమందును నశింపదు. ఈ

భగవంతునియొక్క అంశభూతుఁడైన బ్రహ్మనుండి ఏర్పడిన మరీచి మొదలగు ప్రజాపతులనుండి దేవతలు, మనుష్యులు, తిర్యక్కులు మున్నగు ప్రాణివర్గములు సృష్టములు.

శ్రీధరుఁడు :

నిధానం నిధీయతే అస్మిన్నితి నిధానం=కార్యావసానమందు సకలావతారములును బ్రవేశించు చోటన్నమాట. బీజం=ఉద్గమ స్థానముగూడ నదే. బీజమైనను ఇతరముల వంటిది గాదు. అవ్యయ మైనది. కేవల మవతారములకే బీజము గాదు. సర్వప్రాణులకును, యస్య అంశో బ్రహ్మ తస్యాంశో మరీచ్యాదిః. భగవంతుని యంశ భూతుఁడు బ్రహ్మ. అతని యంశములు మరీచ్యాదులు.

విజయధ్వజము :

మూఁడు రూపములలో పద్మనాభరూపమే అవతార కారణమని చెప్పుచున్నాఁడు-

ఏ తత్=క్షీరసముద్రశాయియైన పద్మనాభుఁ డనెడు రూపమే నానావతారాణాం=మత్స్యాద్యవతారములయొక్క, బీజం=ఉత్పత్తి కారణము, నిదానం=కార్యానంతరము అవతారములన్నియు నేకీ భావము నందుచోటు. అవ్యయం యస్య=ఏ పద్మనాభ రూపము యొక్క, అంశాంశేన-సామర్థ్యము యొక్క ఏకదేశముతో, దేవతిర్య జ్నరాదయః=దేవతిర్యఙ్నరాదులు, సృజ్యంతే=సృష్టింపఁబడుదురో, ఆ వాసుదేవరూపమే సర్వావతార బీజము.

విశేషార్థము: శ్వేతద్వీపాది స్థానములందు నారాయణ వాసు దేవ వైకుంఠాది రూపములయొక్క యభివ్యక్తికి, [illegible] యొక్క యేకీభావమునకుఁ గారణమైనది. [illegible]కృష్ణాది రూపము లకు శ్వేతద్వీపమందున్న నీ స్వరూపాంశము[illegible]



మఱల నేకీభావము 'అంశాంశసంభూతం' అనుచోట మొదటి యంశ శబ్దమునకు సామర్థ్యమని పేరు. రెండవ యంశశబ్దమున కేకదేశమని యర్థము. ఈ యర్థమునే బ్రహ్మపురాణమందు 'యచ్ఛక్త్యేకాంశ సంభూతం జగదేత చ్చరాచరం' అని యున్నది.

తాత్పర్యము: ఈ మూఁడు రూపములలో క్షీరసముద్రశాయి యైన పద్మనాభరూపమే మత్స్యకూర్మాద్యనేకావతారములకుఁ గారణము. దీనినుండియే సమస్తావతార ప్రాకట్యము మఱల లీనము. ఈ రూప మవ్యయము. శ్వేతద్వీపము, అనంతాశనము, వైకుంఠము ఈ స్థలములందున్న నారాయణ వాసుదేవ వైకుంఠాది రూపములు సాక్షాత్తుగా దీనినుండి వ్యక్తమై దీనియందే యైక్యమగును. రామ కృష్ణాదిరూపములు శ్వేతద్వీపమందున్న నారాయణుని స్వరూపాంశముతో వ్యక్తములై మఱల యందే లయించును. ఈ పద్మనాభుని రూపమున సామర్థ్యైకదేశముతో నీ జగత్తు సృష్టింపఁబడినది. చరాచరములు, దేవ మనుష్య తిర్యక్కులు మున్నగు సమస్త పదార్థములు, ప్రాణులు ఈ రూపముయొక్క స్వల్పమైన సామర్థ్యముతో సృష్టింపఁబడినవే,

స ఏవ ప్రథమం దేవః కౌమారం సర్గమాస్థితః,
చచార దుశ్చరం బ్రహ్మ బ్రహ్మచర్య మఖండితమ్. 6

ద్వితీయం తు భవాయాఽస్య రసాతల గతాం మహీమ్,
ఉద్ధరిష్యన్నుపాదత్త యజ్ఞేశ స్సౌకరం వపుః. 7

తృతీయ మృషిసర్గం వై దేవర్షిత్వ ముపేత్య సః
తంత్రం సాత్వత మాచష్ట నైష్కర్మ్యం కర్మణాం యతః. 8

తుర్యే ధర్మకలాసర్గే నరనారాయణా వృషీ,
భూత్వాఽఽత్మోపశమోపేత మకరోద్దుశ్చరం తపః. 9

పంచమః కపిలోనామ సిద్ధేశః కాలవిప్లుతమ్,
ప్రోవాచాసురయే సాంఖ్యం తత్త్వగ్రామ వినిర్ణయమ్. 10

సః దేవః ఏవ = ఆ దేవుఁడే, ప్రథమం = మొదటిదైన, కౌమారసర్గం = కుమారసంబంధమైన సృష్టిని, అస్థితః = స్వీకరించినవాఁడై, బ్రహ్మ = బ్రాహ్మణుఁడై అఖండిత = విఘ్నప్రతిహతము గాని, దుశ్చరం = ఎవ్వరికిని అనుసరించి అనుష్ఠించుటకు సాధ్యముగాని, బ్రహ్మచర్యం = బ్రహ్మచర్యమును, చచార = చరించెను.

పురుషావతారము నంగీకరించి యాదినారాయణుఁడు కౌమారమను పేరు గలిగిన సర్గమును స్వీకరించి, బ్రాహ్మణుఁడై పుట్టి అఖండమైన బ్రహ్మచర్యము ననుష్ఠించెను. బ్రహ్మచర్యము బ్రాహ్మణుఁ డనుష్ఠింప వలసిన వ్రతమని బ్రాహ్మణుల నుద్బోధించుటకై సనత్కుమారావతారమును భగవంతుఁడు స్వీకరించెనని తాత్పర్యము. కౌమారము, అర్షము, ప్రాజాపత్యము, మానవము మొదలైనవి ఒక్కొక్క విధమైన సృష్టివర్గములకుఁ బేర్లు. 6

ద్వితీయం తు = రెండవ స్వరూపము, అస్య = ఈ జగత్తుయొక్క, భవాయ = ఉద్భవముకొఱకై, రసాతలగతం = రసాతలమును ప్రవేశించియున్న, మహీం = భూమిని, ఉద్ధరిష్యన్ = పైకెత్తెచ్చు సంకల్పమున్నవాఁడై, యజ్ఞేశం = యజ్ఞేశ్వరుఁడైన భగవంతుఁడు, సౌకరం = సూకరమునకు సంబంధించిన, వపుః = శరీరమును, ఉపాదత్త = స్వీకరించెను.

భూలోకమును నిల్పుటకొఱకు రసాతలమందున్న భూమిని పైకిఁ గొనితెచ్చు కార్యమునకై పుణ్యకర్మలకు సత్ఫలమిచ్చు దైవమైన ఆదినారాయణమూర్తి ద్వితీయావతారముగా వరాహరూపము నంగీకరించెను. 7

తృతీయం = మూఁడవది, ఋషిసర్గం = ఋషిసర్గము. అందులో, దేవర్షిత్వం = దేవర్షి భావమును, ఉపేత్య = పొంది, సః = ఆ భగవంతుఁడు. సాత్వతం తంత్రం = వైష్ణవతంత్రమును, ఆచష్టే = చెప్పెను. యతః = దేనినుండి, కర్మణాం

=కర్మలకు, నైష్కర్మ్యం=బంధహేతుత్వము లేనిస్థితిని తెలుపునో (అట్టివైష్ణవ తంత్రము నని సంబంధము).

మూఁడవ సర్గము ఋషిసర్గము. దానియందు భగవంతుఁడు దేవర్షియైన నారదుఁడై జన్మించెను. నారదపంచరాత్ర మని ప్రసిద్ధి చెందిన వైష్ణవతంత్రమును వెల్వరించెను. దానినుండి కర్మలకు, సుఖ దుఃఖ రూపములైన ఫలములును పునర్జన్మమును గల్గించు శక్తి యెట్లు నశించు ననెడు పద్ధతి దెలియును. కర్మములే కర్మనిర్మూలనమార్గము లయ్యెడు పద్ధతి నది దెలుపును. 8

తుర్యే = నాల్గవదియైన, ధర్మకలాసర్గే = ధర్ముని పత్నియైన మూర్తిదేవి యందున్న సృష్టిలో, నరనారాయణౌ=నర నారాయణు లనెడు, ఋషీ=ఇర్వురు ఋషులుగా, భూత్వా=జన్మించి, ఆత్మోపశమోపేతం=మనస్సుయొక్క యుపశమముతోఁ గూడిన, దుశ్చరం తపః = ఇతరులకుఁ జేయ శక్యముగాని తపస్సును, అకరోత్=చేసెను.

నాల్గవసర్గమందు ధర్మపత్నియైన మూర్తిదేవియందు నర నారాయణులుగా భగవంతుఁడు జన్మించెను. అతఁడు చిత్తశాంతితోఁ గూడిన దుశ్చరమైన తపస్సును చరించెను. నర నారాయణు లిద్దరు నొకటే యవతారముగాఁ జెప్పినారు. 9

పంచమః=ఐదవసారి, కపిలోనామ=కపిలుఁడను పేరుగల, సిద్ధేశః= సిద్ధులకీశ్వరుఁడై, కాలవిప్లుతం=కాలమంను నశించిన, తత్త్వగ్రామ వినిర్ణయం =తత్త్వసమూహములను నిశ్చయించెడు నట్టి, సాంఖ్యం=సాంఖ్యమను పేరు గల శాస్త్రమును, ఆసురయే=ఆసురియనెడు బ్రాహ్మణునకు, ప్రోవాచ=ఉపదేశించెను.

ఐదవది కపిలావతారము. అతఁడే సిద్ధేశుఁడు. కపిలుఁడు సాంఖ్యశాస్త్రమును ఆసురి యనెడు బ్రాహ్మణున కుపదేశించినాఁడు. సాంఖ్య మనఁగా నిరువది నాలుగు తత్త్వముల వివరించెడు శాస్త్రము. 10

**శ్రీధరీయము :**

ఆద్యావతారమైన సనత్కుమారుని చరిత్రమును జెప్పుచున్నాఁడు.

ఏ పరమాత్ముఁడు పౌరుషమైన రూపమును ధరించెనో అతఁడే సనత్కుమారుఁ డయ్యెనని భావము. ఈ శ్లోకములలో ప్రథమ ద్వితీయాది శబ్దములు కేవల నిర్దేశమునకే ప్రయుక్తములు. అవతారము లిట్లే జరిగినవని వరుసకుఁ గాదు.

మహీ ముద్ధరిష్యన్ అనుట, ఆ యవతారకర్మను జెప్పుట. ఇట్లే ప్రతిశ్లోకమందును అవతారము తత్కర్మ చెప్పఁబడెను.

సాత్వతం తంత్రం=పాంచరాత్రాగమము. కర్మత్వ మనఁగా బంధహేతువు. అది తొలఁగిపోవు మార్గమును జెప్పినాఁడన్న మాట.

తుర్యే = నాల్గవది యని యర్థము. అనఁగాఁ జతుర్థావతారమందు ధర్ముఁ డనఁగా యముఁడు. అతని కల యనఁగా భార్య అర్థశరీర మనుట. 'అర్ధోవా ఏష ఆత్మనో యత్పత్నీ' అని శ్రుతి.

తత్త్వగ్రామముల వినిర్ణయ మనఁగా నిశ్చయము.

**వంశీధరకృత భావార్థదీపిక :**

అవతారములను బ్రచురముగా వర్ణింపఁబోవుచు వాని యొక్క వివక్షతో నంశావతారముల యావిర్భావమునుగూడఁ జెప్పుచున్నాఁడు.

స ఏవ=అతఁడే, ఎవ్వఁడు? ఎవఁడు సముద్రశాయియై యుండెనో, సహస్రపాదాది పురుషుఁ డెవఁడో అతఁడే. 'ఏతే చాంశకలాస్సర్వే కృష్ణస్తు భగవాన్ స్వయం' అని యుపసంహరింపఁ బోవుట చేతఁ గృష్ణుఁడే యా పరమపురుషుఁడని సిద్ధాంతము.

సూకరస్య ఇదం సౌకరం. సూకరమునకు సంబంధించినది.

దేవర్షిత్వం=దేవత్వము, ఋషిత్వము. బ్రహ్మపుత్త్రుఁ డగుటచే దేవత్వము. 'ఏ జాతాః బ్రహ్మణో దేహాత్తే దేవర్షయ ఈరితాః,

సృష్ట్యాదౌ కర్దమాద్యా వై దేవతా ఇతి తే స్మృతాః. నైష్కర్మ్యం= నిష్కర్మశబ్దమందుఁ గర్మశబ్దము భావప్రధానము. దేనినుండి కర్మత్వము నిర్గతమైనదో అది నిష్కర్మత్వము.

వీరరాఘవీయ వ్యాఖ్య:

స దేవః = ఆ పరమపురుషుఁడై చతుర్ముఖశరీరుఁడై కౌమార సర్గమందు సనత్కుమారాదులుగా నవతరించెను. అఖండితం=నిర్విఘ్నము ఊర్ధ్వరేతస్కత్వముతోఁ గూడినది. అట్టి బ్రహ్మచర్యముతో భగవదుపాసన మొనర్చెనని తాత్పర్యము. ఈ ప్రథమావతారాదులైన సనత్కుమారాదులు అనుప్రవేశావతారులు. అట్లే చతుర్ముఖుఁడు గూడ బ్రహ్మరూపధరుఁడు. 'బ్రహ్మ నారాయణాత్మకః' - ఇత్యాదులచే సృష్ట్యాదికాలమందుఁ గూడ నీ విషయ మిట్లున్నది.

ఆ బ్రహ్మస్తంబ పర్యంతా జగదంతర్వ్యవస్థితాః,
ప్రాణినః కర్మజనితా సంసారవశవర్తినః.

యత స్తతో న తే ధ్యానే ధ్యానినా ముపకారకాః,
అవిద్యాంతర్గతా స్సర్వే తేహి సంసారగోచరాః.

పశ్చాదుద్భూత బోధాస్తే ధ్యానే నైవోపకారకాః,
నైసర్గికో న వై బోధః తేషా మప్యన్యతో యతః.

పై వాక్యములతోఁ జతుర్ముఖ సనకాదులు జగదంతర్వర్తు లగుటచే నవిద్యావేష్టితులు. శుభాశ్రయత్వానర్హులు; వారు ముందు బద్ధులే. తరువాత యోగముతో నుద్భూతబోధులైరి. స్వస్వరూపము నందిరి. అందుచే వారికి స్వతశ్శుద్ధి లేదు. కనుక ముముక్షువుల యుపాసనకుఁ బనికిరారు.

సృష్టిం తతః కరిష్యామి, త్వాం ప్రవిశ్య ప్రజాపతే!

అను జన్మరహస్య రచనముగూడ నిట్లే యనుచున్నది. చతు

ర్ముఖ సనకాదులు భగవదను ప్రవేశావతారులు. ఇదియే ప్రథమావ
తారము.

వరాహావతారము స్వస్వరూపావతారము. యజ్ఞేశః=అతఁడే
యజ్ఞారాధ్యుఁడు. యజ్ఞఫలము నొసఁగు వాఁడును. అట్టివాఁ డా
శరీరము నెందుకు స్వీకరించెను? కేవల శరీరగ్రహణము వలనే,
ఆ యవతార తాత్పర్యము. అంతమాత్రమైన నెందుకు స్వీకరించెను?
అన్యథవాయ=కేవల సాధుపరిత్రాణము కొఱకు.

దేవర్షిత్వముపేత్య=నారదాఖ్యమైన జీవనము నను ప్రవేశించి
అని యర్థము.

వల్లభాచార్యుల సుబోధినీవ్యాఖ్య:

అవ: పురుషావతారమును నిర్దేశించి, తత్ప్రకృతి రూపము
లును తదంశములునైన యవతారముల నిరువదియొక్క శ్లోకములతోఁ
జెప్పుచున్నాఁడు. అవతారశబ్దము-అవతరణ సామాన్యార్థమందుఁ జెప్పఁ
బడినది. అవతరణములో నాదేశమునకును అవతారమునకును భేదము
లేదు గదా! ఈ యావేశ మెవ్వరియం దేర్పడు చున్నది? శుద్ధ
శరీరులందు.

సత్త్వరూపశరీరేషు బ్రహ్మణస్సంక్రమ స్స్మృతః,
అశుద్ధశుద్ధభేదేన శరీరాణా మతోద్విధా.
కార్యకాలమందు సంక్రమణమే యావేశము.

క్రియాశక్త్యా జ్ఞాన శక్త్యా చావతారం కరోత్యజః,
వారాహాది స్వరూపేషు బలకార్యం జనార్దనః.
దత్తవ్యాసాది రూపేషు జ్ఞాన కార్యం తథా ప్రభుః,
మత్స్యకూర్మవరాహాశ్చ, సింహవామన భార్గవాః.
రాఘవః కృష్ణ బుద్ధౌచ, కృష్ణ ద్వైపాయన స్తథా,
కపిలో దత్త ఋషభః, శింశుమారోరుచేస్సు తః.

నారాయణో హరిః కృష్ణః, తాపసో మనురేవచ,
మహిదాస స్తథా హంసః, స్త్రీరూపో హయశీర్షవాన్.

తథైవ బడబా వక్త్రః కత్క-ధన్వంతరిః ప్రభుః,
ఇత్యాద్యాః కేవలో విష్ణుర్న విశేషోఽత్ర కశ్చన.

శ్రీబ్రహ్మరుద్రశేషాశ్చ, కపీంద్రః కామ ఏవ చ,
కామపుత్రో ఽనిరుద్ధశ్చ, సూర్యశ్చంద్రో బృహస్పతిః.

ధర్మ ఏషాం తథా భార్యా, దక్షాద్యామనవ స్తథా,
మనుపుత్రాశ్చ ఋషయో, నారదో పర్వత స్తథా.

కశ్యప స్సనకాద్యాశ్చ, బ్రహ్మాద్యాశ్చైవ దేవతాః,
భరతః కార్తవీర్యశ్చ, వైనాద్యా శ్చక్రవర్తినః.

గయశ్చ లక్ష్మణాద్యాశ్చ, త్రయోరోహిణి నందనాః,
ప్రద్యుమ్నో రౌక్మిణేయశ్చ, తత్పుత్రశ్చానిరుద్ధకః.

నరః ఫల్గున ఇత్యాద్యాః, విశేషావశినో హరేః,
ఇహోక్తిరవి శేషేణ, సామాన్యత ఇతిస్మృతమ్.

(వైష్ణవతంత్రము)

ఇది పురుషావతారము గాదు. యజ్ఞాధిష్ఠాతృ ధర్మరూపమైన భగవదవతారము.

నారదునియందు భగవదావేశము. ఋషులు మంత్రద్రష్టలు. నారదుఁడు మంత్రద్రష్ట గాదు,

గోస్వామి పురుషోత్తమచరణుల సుబోధినీ ప్రకాశము :

నారాయణుఁడు ధర్మపుత్రుఁడు. కృష్ణుఁడు తాపసుఁడెట్లయ్యెను? సాంబజననార్థమాతఁడు తపస్సుచరించెను. కూర్మపురాణములో నీకథ వచ్చును. మను వనఁగా స్వాయంభువమనువు. కామ కామపుత్రులు, ప్రద్యుమ్న అనిరుద్ధులైన వ్యూహస్వరూపములు.

విజయధ్వజము:

'ఏతన్నానావతారాణాం బీజం' అని సూక్ష్మముగాఁ జెప్పిన విషయమును వివరించుచున్నాఁడు. స ఏవ=ఆ పద్మనాభరూపియైన, దేవః = శ్రీహరియే, ప్రథమః = తననుండి తానే మొదటివాఁడైన, కౌమారం=కుమారావస్థ యందుండు సనత్కుమారుఁడనెడు, సర్గం= అవతారమును, ఆస్థితః=సన్=పొందినవాఁడై, బ్రహ్మ=పరిపూర్ణుఁడైనను యోగ్యులైన యధికారులను శిక్షించుటకొఱకు, దుశ్చరం=ఇతరులకు సాధింపరాని, అఖండితం=అప్రతిహతమైన, బ్రహ్మచర్యం చచార.

విశేషార్థము: ఇది సనకాదులందున్న సనత్కుమార రూప మనరాదు. దీనికి బ్రహ్మపురాణములోని యీ క్రింది వాక్యము ప్రమాణము.

కుమారో నామ భగవాన్ స్వయం స్వస్మా దజాయత,
దిదేశ బ్రహ్మణే బ్రహ్మ బ్రహ్మచర్యస్థితో విభుః.
యస్మాత్సనత్కుమారశ్చ బ్రహ్మచర్య మపాలయత్,
యు స్థాణోః స్థాణుతాం ప్రాదాద్భగవా నవ్యయో హరిః.

కుమారుఁ డనెడు పేరుతో శ్రీహరి తననుండి తానే వ్యక్తుఁ డయ్యెను. బ్రహ్మచర్యమును బాలించుచు బ్రహ్మకు వేదోపదేశ మొనర్చెను. సనత్కుమారాదులును నితనిచే శిక్షితులే. బ్రహ్మచర్యమును గాపాడుకొనుచు వచ్చిరి. నాశరహితుఁడైన శ్రీహరియే రుద్రునకు రుద్రత్వ మిచ్చినది.

తాత్పర్యము: పద్మనాభుని నుండి వ్యక్తమైన యవతారము కుమారావతారము. ఎప్పుడును గుమారావస్థయందే యుండుటచే నీ యవతారమున కీ పేరు. బ్రహ్మచర్యమందే యుండి యితఁడు బ్రహ్మకు వేదము లుపదేశించెను. సనకాదులయం దొక్కఁడైన సనత్కుమారుఁడు బ్రహ్మమానసపుత్త్రుఁడు, అతఁడు శ్రీహరి నుండియే

యోగవిద్యను నేర్చి బ్రహ్మచారి యయ్యెను. రుద్రుడు రుద్రపదవికి వచ్చుట కితని నుండియే యోగవిద్యను నేర్చెను. పరిపూర్ణుడైన శ్రీహరి యీ రూపముతో లోక శిక్షార్థమైన యప్రతిహత బ్రహ్మచర్యమును బాలించెను.

వరాహావతారము తదవతార కార్యములు చెప్పుచున్నాడు.

అస్య=ఈ జగత్తుయొక్క, భవాయ వై=స్థితికొఱకు, రసాతల గతాం మహీం=పాతాళగతయైన భూమిని, ఉద్ధరిష్యన్=ఉద్ధరింపదలచినవాడై, యజ్ఞేశః=యజ్ఞప్రవర్తకుడైన పురుషనామక నారాయణుడు, సౌకరం=వరాహరూపమునకు సదృశమైన, వపుః ఉపాదత్త=శరీరమును స్వీకరించెను. ద్వితీయం=ఇది రెండవ యవతారము. వరాహరూపిదేహమునుండి యజ్ఞమునకు గావలసిన సామగ్రి యుత్పన్నమగుటచే యజ్ఞేశుడని పేరు.

తాత్పర్యము: ఈ పద్మనాభరూపము నుండియే, వరాహావతారము వ్యక్తమైనది. వరాహరూపియైన శ్రీహరి యవయవముల నుండి యజ్ఞసామగ్రి సృజింపబడుటచేత నీతనికి యజ్ఞేశుడని పేరు. ఈ యాకారము పందివలెనున్నను అప్రాకృతదేహము. రసాతలగతయైన భూమి నుద్ధరించుట జగత్క్షేమమునకే

అవ: మహిదాసావతారమును తత్కార్యమును జెప్పుచున్నాడు.

ఋషిసర్గః=1. ఋషులయందు వ్యక్తమగునట్టి, 2. ఋషుల స్వభావమును బొందిన, తృతీయం=మహిదాసుడనెడు మూడవ యవతారము. చ=ఇంకను, దేవర్షిత్వం=దేవఋషి యగుటను, ఉపేత్య, సః, సాత్వతం తంత్రం అచష్టే=నారదుడు మొదలైన వారికి వ్యాఖ్యానించెను. యతః=ఏ పంచరాత్రగ్రంథమునందు చెప్పినట్లుగా ననుష్ఠాన మొనర్చుటచేత, కర్మణాం=చేయునట్టిపనులకు, నైష్కర్మ్యం=మోక్షసాధనమగుట (ఏర్పడునో), వై=ప్రమాణసిద్ధము.

విశేషార్థము: మహిదాసుఁడు పంచరాత్రమును నారదున కెఱిఁగించెను. ఆ ఋషిసర్గమే మూఁడవ యవతారము. వై అను దానితో దేవర్షిత్వ ముపేత్య అనుటకు నారదుని యర్థమును నిషేధించుచున్నాఁడు. బ్రాహ్మపురాణములోని ఈ వాక్యమే యాధారము.

అవతార స్తృతీయోస్య దేవర్షిః ప్రథితో దివి. మహిదాస స్త్వైతరేయః యస్తంత్రః నారదేఽవదత్.

మహిదాసు ఇతరాదేవి పుత్త్రుఁడు.

తాత్పర్యము: మూఁడవ యవతారము ఋషులలో వ్యక్తమైనది. ఇతరాదేవినుండి వ్యక్తుఁడైన యేతద్రూప శ్రీహరికి మహిదాసుఁడని పేరు. ఈ రూపమునే దేవలోకమునందు దేవర్షి యని పిలుతురు. ఇతఁడే నారదునకుఁ బంచరాత్ర ముపదేశించెను. దీనియందుఁ జెప్పినట్లుఁ గర్మ లొనర్చినచో నవి మోక్షసాధనము లగును. దేవర్షియైన నారదుఁడు హరి యవతారము గాదు.

నరనారాయణావతారము-దత్కార్యము చెప్పుచున్నాఁడు-

తుర్యం=నాల్గవ యవతారము. ధర్మకలాసర్గే=యమధర్మ రాజునందుఁ దనయంశముతో వ్యక్తమైన యవతారమందు, నరనారాయణౌ ఋషీభూత్వా=ఆత్మోపశమోపేతం=అంతఃకరణముయొక్క యతిశయమైన, భగవన్నిష్ఠతోఁగూడిన యంతఃకరణయొక్క యధిక శాంతముతోఁ గూడిన, దుశ్చరం తపః అకరోత్=కష్టసాధ్యమైన తపమాచరించెను.

విశేషార్థము: కలాసర్గే=అనుటతో నారాయణావతారము స్వరూపావతారము. నరావతార మావేశావతారము. శేషుఁడే నరుఁడై పుట్టెను. అందు భగవత్స్వరూపాంశము ఆవిష్టమై యుండును. ఇదే శాస్త్ర ప్రక్రియ.

తాత్పర్యము : నాల్గవయవతారము నరనారాయణావతారము యమధర్మరాజునందు శ్రీహరి ఈ యవతారముతో వ్యక్తుఁడయ్యెను. నరుఁ డావేశావతారము. శేషుఁడే యతఁడు. దానిలో శ్రీహరి దన స్వరూపముతో నావిష్టుఁ డయ్యెను. కనుకనే యవతారమని చెప్పఁబడినది. నారాయణుఁడు స్వరూపావతారము. ఈ రెండు రూపములలో శ్రీహరి ఋషివలెనే గర్మ లొనర్చెను. ఈ యవతారమం దొనర్చిన తపస్సు ఆలోచనాత్మకమైనది. ఇది దుశ్చరము. అజ్ఞులు శ్రీహరి ఈ రూపముతో తన యంతఃకరణమును భగవద్విషయకముగా నొనర్చికొనెననియు, మనఃప్రసన్నత నందెననియు వచింతురు. పరమాత్మ మన స్సెప్పుడును పరమాత్మ విషయకమైయే యుండును. క్రొత్తగా భగవన్నిష్ఠను సంపాదించికొన వలసినది లేదు.

కపిలావతారము. తత్కథనము.

పంచమః కపిలోనామ సిద్ధేశః=సిద్ధులైన బ్రహ్మాదులకు నియామకుఁడైన కపిలనామ శ్రీహరి, కాలవిప్లుతం, తత్త్వగ్రామవినిర్ణయం =ఇరువదినాల్గు తత్త్వములును, భగవత్పరత్వ రూపములే యను నిర్ణయమున్న వేదానుసారియైన సాంఖ్య మనెడు, భగవత్ జ్ఞానపరమైన వేదార్థపూర్ణమైన శాస్త్రమును, అసురయే = అసురి యనెడు సచ్ఛిష్యునకు, ప్రోవాచ=చెప్పెను.

విశేషార్థములు : సిద్ధేశః =ఈ విశేషణముతోఁ జామరులలోఁ బ్రసిద్ధమైన సాంఖ్యకర్త కపిలుఁడు, అతని శిష్యుఁడైన యాసురిభిన్నులని సూచించుచున్నాఁడు. పద్మపురాణవాక్యము—

కపిలో వాసుదేవాఖ్యః తంత్రం సాంఖ్యం జగాదహ,
బ్రహ్మాదిభ్యశ్చ దేవేభ్యో భృగ్వాదిభ్య స్తథైవచ.
తథైవాసురయే సర్వవేదార్థ పరిబృంహితమ్,
సర్వవేద విరుద్ధం చ కపిలోఽన్యో జగాదహ.
సాంఖ్య మాసురయే ఽన్యస్మై కుతర్క పరిబృంహితమ్.

కపిలావతారమైనది. ఈ యవతారమునకు వాసుదేవుఁడనియు పేరు. సిద్ధపురుషులైన బ్రహ్మాదులకు నియామకుఁడైన కపిలరూప శ్రీహరి—ఆసురి యనెడు సచ్ఛిష్యునకు, బ్రహ్మాదిదేవతలకు భృగువు మొదలైన ఋషులకు సాంఖ్య మనెడు వేదార్థపూర్ణమైన శాస్త్రము నుపదేశించెను. దీనికి సాంఖ్యతంత్రమని పేరు. దీనిలోఁ బ్రధానము మొదలైన ఇరువదినాలుగు తత్త్వములను జక్కగా నిర్ణయించి అవి భగవత్పరము లెట్లో వివరింపఁబడినది. కాలతిరోహితమైన ఈ శాస్త్రము నుద్ధరించుటయే ఈ యవతారకార్యము. సాంఖ్యదర్శన మను పేరుతో మఱియొక కపిలుఁడు దన శిష్యుఁడైన యాసురి కుపదేశించెను. అది వేదవిరుద్ధదర్శనము. ఆ యాసురి వేఱు. ఆ కపిలుఁడు వేఱు, నామ సామ్యముతో మోసపోరాదు.

షష్ఠ మత్రేరపత్యత్వం వృతః ప్రాప్తోఽనసూయయా,
ఆన్వీక్షికీ మలర్కాయ ప్రహ్లాదాదిభ్య ఊచివాన్. 11

తత స్సప్తమ ఆకూత్యాం రుచేర్యజ్ఞోఽభ్య జాయత,
స యామాద్యై స్సురగణై రపాత్స్వాయంభువాంతరమ్. 12

అష్టమే మేరు దేవ్యాం తు నాభేర్జాత ఉరుక్రమః,
దర్శయన్ వర్త్మధీరాణాం సర్వాశ్రమ నమస్కృతమ్. 13

ఋషిభిర్యాచితో భేజే నవమం పార్థివం వపుః,
దుగ్ధే మామౌషధీ ర్విప్రా స్తేనాయం స ఉశత్తమః. 14

రూపం స జగృహే మాత్స్యం చాక్షుషోదధిసంప్లవే,
నావ్యారోప్య మహీమయ్యామపాద్వైవస్వతం మనుమ్. 15

షష్ఠం—ఆరవ యవతారము, అనసూయయా—అనసూయాదేవిచేత, వృతః=కోరఁబడినవాఁడై, అత్రేః—అత్రియొక్క, అపత్యత్వం=సంతానభావమును,

ప్రాప్తః=పొందినవాఁ డయ్యెను, అలర్కాయ=అలర్కునకును, ప్రహ్లాదాదిభ్యః ప్రహ్లాదుఁడు మొదలైన వారికిని, ఆన్వీక్షికీం=ఆత్మవిద్యను, ఊచివాన్=చెప్పినవాఁడయ్యెను.

ఆరవది దత్తాత్రేయావతారము. అనసూయాదేవి భగవానుని దన కుమారుఁడుగాఁ బుట్టవలెనని ప్రార్థించెను. స్వామి యామె యభ్యర్థనను మన్నించి అత్రికుమారుఁడై పుట్టినాఁడు. ఆత్మవిద్యను అలర్కుఁడు, ప్రహ్లాదుఁడు, యదువు, హైహయుఁడు మొదలగు వారి కుపదేశించెను. 11

తతః=అనంతరము, సప్తమే=ఏడవ యవతారమందు, రుచేః=రుచి యొక్క భార్యయైన, ఆకూత్యాః=ఆకూతిదేవియందు, యజ్ఞః=యజ్ఞావతారుఁడై, అభ్యజాయత=కలిగెను, సః=అతఁడు, యామాద్యైః=యముఁడు మొదలైన, సురగణైః=దేవతాసమూహముతోఁ బాటు, స్వాయంభువాంతరం=స్వాయంభువ మన్వంతరమును, అపాత్=పాలించెను.

ఏడవది యజ్ఞావతారము. స్వామి రుచి యను ప్రజాపతిభార్య ఆకూతిదేవియందు జనించెను. తన పుత్రులైన యామాది దేవగణములలోఁ జేరి తా నింద్రపదవిని స్వీకరించినవాఁడై స్వాయంభువమన్వంతరమును పాలించెను. 12

అష్టమే=ఎనిమిదవసారి, నాభేః=నాభియనెడు వానియొక్క, మేరుదేవ్యాం=భార్యయగు మేరుదేవియందు, జాతః=పుట్టినవాఁడై, ఉరుక్రమః=భగవంతుఁడు, సర్వాశ్రమ నమస్కృతం=సర్వాశ్రమములచేతను నమస్కరింపఁబడిన, వర్త్మ=మార్గమును, ధీరాణాం=పండితులకు, దర్శయన్=చూపించినవాఁ డయ్యెను.

ఎనిమిదవది ఋషభావతారము. ఆగ్నీధ్రుని కొడుకు నాభుఁడు. అతనిభార్య మేరుదేవి. ఆ దంపతులకుఁ బుత్రుఁడై భగవంతుఁడు జన్మించెను. జన్మించి, సకలాశ్రమములందున్న వారు నమస్కరింపఁదగినదియు, కట్టకడపటిదియునైన పరమహంసల ధర్మము తానే దృష్టాంతముగా పండితులకుఁ జూపించినవాఁడైనాఁడు. 13

ఋషిభిః = ఋషులచేత, యాచితః = ప్రార్థింపఁబడినవాఁడై, నవమం = తొమ్మిదవదియైన, పార్థివం = పృథుమహారాజనెడు పేరుతోఁ గూడిన, వపుః = శరీరమును, భేజే = ఆశ్రయించెను, విప్రాః = ఓమహర్షులారా; ఇమాం = ఈ భూమిని, (గోరూపముగా మారిన యీ భూమినుండి యని యర్థము) ఓషధీః = సమస్తములైన ఓషధులను, దుగ్ధ = పిదికెను, తేన = ఆ కార్యము నొనర్చుటచేత, అయంసః = ఈ పృథుమహారాజు, ఉశత్తమః = కమనీయ తరుఁడుగా నయ్యెను.

ఓ బ్రాహ్మణులారా! ఋషులప్రార్థనను మన్నించి, భగవంతుఁడు తొమ్మిదవసారి యవతరించెను. అది పృథుచక్రవర్తి యవతారము. ఉత్తమ పరాక్రమమును బ్రకటించిన యా చక్రవర్తి యీ భూమినుండి, జనక్షేమమున కావశ్యకమైన సమస్త పదార్థములను బిదికెను. అందుచే, నాయవతారమెంతో మనోహరమైన దయ్యెను. 14

చాక్షుషోదధిసంప్లవే = చాక్షుషమను పేరుగల మన్వంతరమందు సంప్రాప్తించిన ప్రళయములో, సః = ఆ భగవంతుఁడు, మాత్స్యం రూపం = మత్స్య రూపమైన యవతారమును, జగృహే = అంగీకరించెను. మహీమయ్యాం = భూరూపమైన, నావి = నావయందు, ఆరోప్య = ఎక్కించి, వైవస్వతం మనుం = వైవస్వత మనువును, అపాత్ = పాలించెను.

చాక్షుష మను పేరుగల మన్వంతరపుఁ గడపటు సముద్రము లన్నియు నొక్కటిగాఁ జేరెను. ప్రళయము ప్రాప్తించినది. అప్పుడు భగవంతుఁడు, మత్స్యావతారమును స్వీకరించినాఁడు. ఈ భూమినే నావగామార్చి, సత్యవ్రతుఁడను మహారాజును, దానియందెక్కించుకొని రక్షించినాఁడు. ఆ సత్యవ్రతుఁడు వైవస్వతమనువు గావలసిన వాఁడు. అందుకే యాతని రక్షించెను. 15

**శ్రీధరీయము :**

దత్తాత్రేయావతారమును జెప్పుచున్నాఁడు.

అత్రేరపత్యత్వం అత్రియొక్క పుత్రత్వమును అత్రియే భగవంతుని బ్రార్థించెను, 'అత్రేరపత్యమభికాంక్షత ఆహతుష్టః' అని పైని

జెప్పఁబోవుచున్నాఁడు. ఏ భావముతో జన్మించెను? అనసూయయా=అనసూయచేత, నేనే కుమారుఁడుగా జన్మింపవలెనను భావమును మనసునఁ బెట్టికొని, నాతో సమానుఁడైన కుమారుని వరమడిగెనుగదా అను దోషదృష్టిని మనసున నుంచికొనక, అన్వీక్షికీం=జీవాత్మపరమాత్మ తత్త్వవిచారముగల తర్కవిద్యను.

యామాద్యైః=యామాదులనెడు దేవతలు యజ్ఞునికుమారులే. వారినిఁ గూడినవాఁడై యింద్రత్వమును స్వీకరించి స్వాయంభువ మన్వంతరమును బాలించెను.

విశేషార్థము లేదు.

పార్థివం వపుః=రాజదేహమైన పృథురూపమును, ఓషధులనుట ఉపలక్షణము. జనులకుఁ గావలసిన సమస్త పదార్థములను బితికినాఁడనుట. అదుగ్ధ—అనియుండవలసినది. 'దుగ్ధ' అనియున్నది. అడాగమము రాలేదు. ఆర్షప్రయోగమగుటచే బాధలేదు. ఉశత్తమః=కమనీయకాంతిఁ గలవాఁడు. 'వశకాంతౌ' అనుధాతువునుండి యుత్పన్నమైన దీ శబ్దము.

చాక్షుషో దధిసంప్లవే=చాక్షుషమన్వంతర మందలి సంప్లవమనఁగా సంశ్లేషము. సముద్రములన్నియు, నొక్కటగుట యని యర్థము. సృష్టిక్రమము ననుసరించి, మన్వంతరావసానమునందు ప్రళయములేదు. కాని, యేదో కౌతుకముచేత, సత్యవ్రతునకు మాయ ప్రదర్శింపఁబడినది. మార్కండేయునకుఁ గూడ నిట్టి కైతవ ప్రళయ ప్రదర్శనము. వైవస్వత మనుట భావి సంజ్ఞ. వైవస్వత మన్వంతరమందు మనువుగావలసినవాఁడు సత్యవ్రతుఁడు.

**వంశీధరుఁడు :**

అనసూయయావృతః=అనసూయాదేవిచేతఁ గోరఁబడినవాఁడై. బ్రహ్మాండపురాణమందు పతివ్రతోపాఖ్యానమున నిక్రింది శ్లోకమున్నది.

అనసూయాఽబ్రవీన్నత్వా దేవాన్ బ్రహ్మేశకేశవాన్,
యూయం యది ప్రసన్నా మే వరార్హా యది చాప్యహమ్.
ప్రసాదాభి ముఖాస్సర్వే మమపుత్ర త్వమేష్యథ.

ఇది స్వరూపావతారమే. శ్రుతిఁగూడ నిట్లున్నది.

యం వై సూర్యం స్వర్భానుస్తమసా ఽవిధ్యాదాసురః
అత్రయస్త మన్వవిందన్నహ్యన్యే ఽశక్నువన్.

సూర్యం=ఆత్మస్వరూపమును, స్వర్భానుః=మాయ, తమసా=విపర్యయభావముతో, అవిధ్యత్=జీవత్వమును బొందించెను. అత్రి పుత్త్రుఁడు ఆత్రేయుఁడు, అనఁగా దత్తాత్రేయుఁడు. ఇచ్చటి బహుత్వము పూజ్యభావముతో వాడఁబడినది. తం=ఆ సాక్షాదీశ్వర స్వరూపమును, దత్తాత్రేయుఁడు భగవంతుని యవతారమైన దానివలన మాయావశుఁడు గాలేదన్నమాట. 'నహ్యన్యేఽశక్నువన్' తక్కినవారు తెలిసికొనలేరు.

యజ్ఞావతార మాకూతి దేవియందు జరగినది. ఈమె స్వాయంభువునిపుత్త్రి. రుచి ప్రజాపతి

'తస్మాద్యజ్ఞాత్సర్వహుతః ఋచస్సామాని జజ్ఞిరే' అని శ్రుతి వాక్యము. ఆ కాలమం దితరులకు దేవపాలనా సామర్థ్యము లేనందున స్వయముగనే యింద్రుఁ డయ్యెనని భావము.

మేరుదేవి నాభియను నృపాలుని భార్య. ధీరాణాం బ్రహ్మవిద్యారతులకని యర్థము.

విశేషములు లేవు.

విష్ణుధర్మోత్తరమం దిట్లున్నది—

'మన్వంతరే పరిక్షీణే. కీదృశీ ద్విజ జాయతే'.

ఇది వజ్రుఁ డనెడువాఁడు మార్కండేయునకు వేసిన ప్రశ్న. ఉత్తర మీ క్రిందిది.

ఊర్మిమాలీ మహావేగ స్సర్వమావృత్య తిష్ఠతి,
భూర్లోక మాశ్రితం సర్వం తదా నశ్యతి యాదవ ।
న వినశ్యంతి రాజేంద్ర ! విస్తృతాః కులపర్వతాః,
నౌ ర్భూత్వా తు మహీదేవీ....

ఇత్యాది. అట్లే 'మన్వంతరే తు సంహారః' అని యున్నది.

భాగవతామృతమందు ప్రతి మన్వంతరమందును ప్రళయము చెప్పఁబడినది. సత్యవ్రతుఁ డుత్తమభక్తుఁడు. అతని భక్త్యతిశయము వలననే భగవంతుని యవతారము. 'భక్తేభ్యోపాత్త దేహాయ' అని భాగవతము.

వల్లభాచార్య కృతమైన సుబోధిని:

బ్రాహ్మణులయం దా రవతారములు చెప్పఁబడినవి. షట్కర్మలు వారికిఁ బ్రసిద్ధములు గదా! మూఁ డవతారములు క్షత్ర జాతివి. యజ్ఞ వృషభ పృథురాజుల రూపములు. ఈ మూఁటియందును శత్రుజయము, ధర్మనిష్ఠ, ప్రజాపాలనము లుక్తములు. ఆకూతి మనువు బిడ్డ. యజ్ఞేశ్వరుఁడు రుచియొక్క గృహమందు జన్మించెను. మాతామహుఁడైన స్వాయంభువమనువు తన ఇంటికిఁ గొనిపోయి పెంచెను. ఆ యజ్ఞుఁడే స్వయముగా నింద్రుఁడైనాఁడు.

వీరరాఘవ వ్యాఖ్య:

పృథుమహారాజునందుఁ బరమాత్ముఁ డంశరూపముతో నను ప్రవేశించినాఁడు. అది సాక్షాదవతారము గాదు.

విజయధ్వజము:

దత్తాత్రేయావతారము—తత్కార్యమును జెప్పుచున్నాఁడు.

పద్మనాభాభిన్నుఁడైన శ్రీహరి, అనసూయయా = అనసూయ చేత, వృతః = నీతో సమానుఁడైన పుత్త్రుఁడు గావలెనని వరము గోరఁబడినవాఁడై, అత్రేః = అత్రిమహర్షి వలన, అపత్యత్వం = కుమారత్వమును, ప్రాప్తః అత్రేః వృతః = అత్రివలన కోరఁబడినవాఁడై, అనసూయయా = అసూయ లేక, ప్రహ్లాదాదిభ్యశ్చ = ప్రహ్లాదుఁడు మొదలగు నుత్తమాధికారులకు, 'ప్రహ్లాదాదిభ్యః' అని ఉత్తమాధికారులను చెప్పినందువలన ఇక్కడనున్న 'యాన్వీక్షికీ' తర్కవిద్యయే గాని, కుతర్కము గాదు. కుతర్కపూరితమైన ఆన్వీక్షికి వేఱుగా నున్నది. 'ఆన్వీక్షికీ కుతర్కాఖ్యా తథైవాన్వీక్షికీ పరా' అని మత్స్యపురాణము.

తాత్పర్యము: శ్రీహరిని అత్రియు, అతనిభార్య అనసూయయు సేవించిరి. 'నీతో సదృశుఁడైన కుమారుఁడు గావలె'నని ఇరువురును గోరినారు. శ్రీహరితో సమానుఁ డాతఁడే. సదృశుఁ డనుటచేత నీవే కుమారుఁడు గావలెనని కోరినట్లైనది. తన్ను కుమారుఁడుగా గోరికొన్నాఁడని శ్రీహరి యసూయపడలేదు. వారియందు దత్తుఁడుగా వ్యక్తుఁ డయ్యెను. అతఁ డలర్కునకు ఆన్వీక్షికి యనెడు తత్త్వవిద్య నుపదేశించినాఁడు. ఆ విద్యలోఁ బరతత్త్వ మేది? అపరతత్త్వ మేది? అనుట స్పష్టముగా వివరించినాఁడు. లౌకికమైన తర్కశాస్త్రమును ఆన్వీక్షికి యనుట గద్దు. కాని యది కుతర్కము.

ప్రతి మన్వంతరమందును, దేవతలకు వేరువేరు పేరులున్నవి. అందుచే వారిని యామాదులన్నారు. స్వాయంభువ మన్వంతరమందు యజ్ఞనామక పరమాత్ముఁడే యింద్రుఁ డయ్యెను. యజ్ఞనామక శ్రీహరి పాలించినది దేవలోకమును.

వృషభావతారము-తత్కార్యము చెప్పుచున్నాఁడు.

ఉరుక్రమః = గొప్పపరాక్రమము గల పురుషనామకుఁడైన పద్మనాభుఁడు. సర్వాశ్రమ నమస్కృతం వర్త్మ = చతుర్థాశ్రమ సంబంధియైన మార్గమును, ధీరాణాం = పరమాత్మయం దాసక్తబుద్ధిఁ గల,

తృప్తులగు యోగ్యజీవులకు, ఈ వృషభరూపియైన పరమాత్ముఁడు, శుక్లశోణిత మిశ్రణముతోఁ బుట్టినవాఁడు గాదు. మేరుదేవియందు వ్యక్తమైన వాఁడు.

పృథుచక్రవర్తి శరీరావిష్టమైన యవతారము. తత్తాత్పర్యమును జెప్పుచున్నాఁడు-

పార్థివం వపుః అని పాఠము గాదు. పార్థవం వపుః అని పాఠము. పార్థవం అనుటకు పృథురాజు శరీరమని యర్థము చెప్ప రాదు. పృథురాజ శరీరమం దావిష్టమైన రూపమని యర్థము. పద్మ పురాణమందలి-

ఆవివేశ పృథుం దేవః శంఖీచక్రీ చతుర్భుజః

అను ప్రమాణము ననుసరించి పృథురాజ శరీరమందు శ్రీహరి యావిష్టుఁ డయ్యెను. అంతే గాని, శ్రీహరియే పృథురాజుగా నవత రింప లేదు. ఉశత్తమః అనుచోట దానికిఁ గారణముగా దేహమును జెప్పినందుచే 'ఉశ' ధాతువునే గ్రహింపవలెను గాని, 'వశ' ధాతు వును గ్రహింపరాదు. 'ఉశ' ధాతువును గ్రహించినచో నర్థమేమి? అతిశయమైన ఇచ్ఛగలవాఁడు. ఇచ్ఛయం దతిశయ మనఁగా కోర్కి వ్యర్థము గాకుండుట. దీనిచే హరిని 'సత్యకామః' అందురు.

తాత్పర్యము: పృథుచక్రవర్తి దేహమునం దావిష్టుఁడైన శ్రీహరి తొమ్మిదవ యవతారము. హరియొక్క యావేశముతో పృథు వతిమానుషములైన కార్యము లొనర్చుటకు సమర్థుఁ డయ్యెను. వేన రాజుచేత బహుధా జ్ఞానము నష్టమయ్యెను. మహర్షులు శ్రీహరిని గూర్చి తపించి, తమ్ము రక్షింపవలెనని వేఁడికొన్నారు. అప్పుడు భగ వంతుఁడు వేనుని శరీరమునుండి యుత్పన్నుఁడైన పృథురాజు దేహ మందు ఏకాంశతో నావిష్టుఁ డయ్యెను. గోరూపయైన భూమినుండి సమస్త సారపదార్థములను దుగ్ధరూపముతోఁ బిదికి యా జీవరాసుల

కొనఁగెను. జగత్తు సకల సారవస్తువులతో మఱల సంపన్నమైనది. ఇంతటి యతిమానుషకార్యమును జేయుటచే శ్రీహరిని జ్ఞానులు 'సత్యకాముఁ' డని పొగడిరి. స్వతంత్రుఁడైన శ్రీహరి యిచ్ఛ ఈడేరకుండునా? అట్టి పరమాత్ముని సన్నిధానముతో పృథుచక్రవర్తికిఁ గూడ నీ కీర్తి లభించెను.

మత్స్యావతారమును చెప్పుచున్నాఁడు—

సః=వాసుదేవ రూపియైన నారాయణుఁడు, చాక్షుషాంతర సంప్లవే=చాక్షుష మన్వంతరముయొక్క ప్రళయకాలమందు, చాక్షుషోదధి సంప్లవే అని శ్రీధరుల పాఠము. వైవస్వతం మను='వివస్వాన్' అను పేరుగల సూర్యునిపుత్త్రుఁడగుటచే నీతఁడు వైవస్వతుఁడు. ఈ మన్వంతరాధిపతి యయ్యెను. సత్యవ్రతరాజును రక్షించినాఁడు.

తాత్పర్యము: ఈ పురుషనామకుఁడైన పరమాత్ముఁడు మత్స్యావతారమెత్తెను. వైవస్వత మన్వంతరపు ముందటిదే చాక్షుషమన్వంతరము. అప్పుడు రాఁబోవు మన్వంతరాధిపతియైన సత్యవ్రతుని భగవంతుఁడు రక్షించెను. ఇతనికే వైవస్వత మనువనిపేరు.

**సురాసురాణా ముదధిం మథ్నతాం మందరాచలమ్,**
**దధ్రే కమఠరూపేణ పృష్ఠ ఏకాదశే విభుః. 16**

**ధాన్వంతరం ద్వాదశమం త్రయోదశమ మేవచ,**
**అపాయయత్సురా నన్యా న్మోహిన్యామోహయన్ స్త్రియా. 17**

**చతుర్దశం నారసింహం బిభ్రద్దైత్యేంద్రమూర్జితమ్,**
**దదారకరజైర్వక్ష స్యేరకాన్ కటకృద్యథా. 18**

**పంచదశం వామనకం కృత్వా గాదధ్వరం బలేః,**
**పదత్రయం యాచమానః ప్రత్యాదిత్సు స్త్రివిష్టపమ్. 19**

అవతారే షోడశమే పశ్యన్ ధర్మద్రుహో నృపాన్,
త్రిస్సప్తకృత్వః కుపితో నిఃక్షత్రా మకరో న్మహీమ్. 20

ఉదధిం—సముద్రమును, మథ్నతాం—మథించుచున్నట్టి, సురాసురాణాం—దేవాసురులయొక్క, మందరాచలం—మందరపర్వతమును, ఏకాదశే—పదునొకండవదియైన, అవతారమందు, విభుః—భగవంతుఁడు, కమఠరూపేణ—తాఁబేలు రూపముచేత, పృష్ఠే—వీపుపై, దధ్రే—ధరించెను.

సురాసురులు అమృతమునకై సముద్రమును మథించుచుండిరి. మందరాచలమే వారి కవ్వము. అది సముద్రములోనికి మునిఁగి పోవుచుండెను. అప్పుడు భగవంతుఁడు, కమఠరూపమును ధరించి, మందరమును వీపుపై ధరించెను. ఇది పదునొకండవ యవతారము. 16

ద్వాదశమం—పండ్రెండవ యవతారము, ధాన్వంతరం—ధన్వంతరికి సంబంధించినది, మోహిన్యాస్త్రియా = మోహిని యను పేరుగల స్త్రీరూపముచేత, అన్యాన్—ఇతరులను, అనఁగా రాక్షసులను, మోహయన్—మోహముగొల్పుచున్న వాఁడై, సురాన్—దేవతలను, అపాయయత్—అమృతపాన మొనర్చునట్లు చేసెను, త్రయోదశ మమేవచ—ఇది పదుమూఁడవ యవతారము.

పండ్రెండవసారి స్వామి ధన్వంతరియై యవతరించినాఁడు. అతఁడు సముద్రాంతము నుండి యమృతపాత్రతో నావిర్భవించెను. ఆ యమృతము నసురులు బలవంతముగా లాగికొనిరి. స్వామి మోహినీ రూపమును ధరించెను. ఆ రూపముతో నాతఁడు రాక్షసులను తనువులు మఱచున ట్లొనర్చినాఁడు. అమృతమును వారినుండి గైకొని సురలకుఁ ద్రావించెను. ఇది పదుమూఁడవ యవతారము 17

చతుర్దశం—పదునాల్గవది, నారసింహ—నరసింహావతారమును, బిభ్రత్ = ...ఁడై, ఊర్జితం—మహాబలవంతుఁడైన, దైత్యేంద్రం—హిరణ్యకశిపుని, కరజైః — గోళ్లచేత, కటకృత్ — చాపలల్లువాఁడు, ...ఁ జీల్చెను.

పదునాల్గవ యవతారము నారసింహము. హిరణ్యకశిపుఁ డతిశక్తిమంతుఁడు. అతనిని నరసింహుఁడు వధించెను. తొడలపై వానినిఁ బండఁబెట్టికొని, చాపల్లువాఁడు జంబును రెండుగాఁ జీల్చునట్లు, వాని వక్షమును రెండుగాఁ జీల్చెను. 18

పంచదశం—పదునైదవది, వామనకం—వామన రూపమునకు సంబంధించినది, కృత్వా—ఆ యవతారమును ధరించినవాఁడై, త్రివిష్టపం—స్వర్గలోకమును, ప్రత్యాదిత్సుః—వెనుకకుఁ దీసికొని-దేవతలకు మరల నిచ్చెడికోర్కి గలవాఁడై, పదత్రయం—మూఁడడుగులు, యాచమానః—యాచించుచున్నవాఁడై, బలేః—బలిచక్రవర్తియొక్క, అధ్వరం—యాగశాలను గుఱించి, అగాత్—వెళ్లెను.

పదునైదవ యవతారముగా భగవంతుఁడు వామన రూపమును ధరించెను. బలిచక్రవర్తి దేవతలనుండి, త్రివిష్టపమును లాగికొన్నాఁడు. దానిని మరల దేవతల కిచ్చు నుద్దేశముతో నీ యవతారము. ఈ యభిప్రాయమును మనసులో నుంచికొన్న శ్రీహరి, బలిచక్రవర్తి యధ్వరమును సమీపించి, పదత్రయమును యాచించెను. 19

షోడశమే యవతారే—పదుమూఁడవదియైన యవతారమునందు, నృపాన్—రాజులను, బ్రహ్మద్రుహః—బ్రాహ్మణులను ద్వేషించుచున్న వారినిగా, పశ్యన్—చూచి, కుపితః—కోపముగొన్నవాఁడై, త్రిస్సప్తకృత్వః—మూఁడేడుసారులు అనఁగా నిరువదియొక్క మారులు, మహీం—భూమిని, నిః క్షత్రాం—క్షత్రియ వంశములులేని దానినిగా, అకరోత్—చేసెను.

పదునాఱవది పరశురామావతారము. నాఁడు రాజులు విప్రులను ద్వేషించుచుండిరి. దీనిని గమనించిన పరశురామునకుఁ గోపము వచ్చినది. అతఁ డిరువదియొక్క మారులు క్షత్రియవంశములను నాశనమొనర్చెను. 20

విశేషము లేదు.

**వంశీధరుఁడు :**

త్రయోవారాః ఇతిత్రిః. స్విచ్ ప్రత్యయము. సప్తవారాన్ ఇతి సప్తకృత్వః. మూఁడేడులని యర్థము.

**విజయధ్వజము;**

కూర్మావతారమును దత్త్వార్థమును జెప్పుచున్నాఁడు–

మందరాచలం = పాతాళమునకుఁ బోవుచున్న మందరాచలమును, వాసుదేవరూపియైన నారాయణుఁడు.

ధన్వంతరి మోహిని యనెడు నవతారమును జెప్పుచున్నాఁడు–

వాసుదేవరూపియైన భగవంతునియొక్క, ధాన్వంతరం = ధన్వంతరి యను పేరుగల రూపమును, ద్వాదశమం = పన్నెండవదిగా విదుః = తెలియుదురు. ఆ యవతారమందు శ్రీహరి, మోహిన్యా = మోహక శక్తిగల, స్త్రియా = స్త్రీశక్తిచేత, అన్యాన్ = తనవారుగాని రాక్షసులను, మోహయన్ = మోహింపఁజేయుచు, (తనవారైన దేవతలను మోహింపఁజేయక) సుధాం అపాయయత్ = అమృతమును త్రావించెను. త్రయోదశమమేవచ = దీనిని త్రయోదశమందురు, చ = ఇది మాయామయము గాదు.

తాత్పర్యము : పన్నెండవది ధన్వంతరి యవతారము. అందు శ్రీహరి యమృత కలశముతో సముద్రమునుండి వ్యక్తుఁడయ్యెను. అప్పుడు దైత్యులు తామే యమృతపాన మొనర్పవలెనని యాసుధాపాత్రమును బెటికికొని పోయిరి. స్వామి వారిని సత్యభ్రష్టులను జేయుటకై తన చేతనున్న యమృతకలశము నిచ్చెను. మోహినియై స్త్రీరూపముతో భక్తులు గాని దైత్యులను మోహింపఁజేసినాఁడు. భక్తులైన దేవతలను మోహితుల నొనర్పక యమృతమును వారి కందించెను. ఈ మోహినీరూపము పరమాత్ముని నిజమైనయవతారమే గాని మాయ గాదు.

విశేషము లేదు.

తాత్పర్యము: ఇంద్రుని గెల్చి బలిచక్రవర్తి త్రైలోక్యాధిపతిత్వము నపహరించెను. మరల నా యధికారము నింద్రున కిచ్చుటకై పద్మనాభుఁడు వామనుఁడైనాఁడు. తనయడుగుతో మూఁడడుగుల భూమిని యాచించుటకై యధ్వరమందున్న బలిచక్రవర్తిని సమీపించెను. ఇది పదునైదవ యవతారము.

పరశురామావతారమును తత్తాత్పర్యమును దెల్పుచున్నాఁడు-

షోడశమే అవతారే= పదునాఱవ యవతారమందు పద్మనాభరూపియైన హరి జమదగ్నికుమారుఁడై యవతరించెను. కుపితస్సన్= 1. కోపముగొన్న వానివలెఁ గన్పడుచు, 2. ప్రతీపబుద్ధి గలవాఁడై, యచ్ఛన=వారిని జంపుచు, త్రిస్సప్తకృత్వః=ఇరువదియొక్కసారులు, మహీం=భూమిని, నిఃక్షత్రాం=క్షత్రియజాతియే లేనిదానినిగా, అకరోత్ =చేసెను.

తాత్పర్యము: ప్రసిద్ధమైన కోపము పరమాత్మయందు లేదు. కోపము తమోగుణము. అంతమాత్రమే గాదు. అశక్తుఁడైన వానికే కోపము వచ్చును. శక్తుఁడైన వానికి రాదు. శ్రీహరి సర్వశక్తుఁడు. అతనికిఁ గోప మెక్కడిది? 'కామ క్రోధ లోభములు మూఁడును వదలవలెను' అని శ్రుతివాక్య ముండగా హేయమైన కోపము పరమాత్మయందు సంభావితము గాదు.

**శ్రీధరీయము:**

ధాన్వంతరం=ధన్వంతరి రూపమునకు సంబంధించినది. ద్వాదశమం అనుచోట 'మట్' ప్రయోగ మార్షము. త్రయోదశమం అనుచోటఁ గూడ నంతే. త్రయోదశావతారము యొక్క చరిత్రను గూడ చెప్పినాఁడు. అపాయయత్=త్రావఁజేసెను. (అమృతమునని

య ధ్యాహరించికొనవలెను) మోహిన్యాస్త్రియా—మోహిని యను స్త్రీ పేరుగల స్త్రీరూపముచేత. ధన్వంతరి రూపముతో నమృతమునుదెచ్చి మోహినీరూపముతో నమృతమును బంచెను.

వామనకం—దుష్టుల మదమును వామన మొనర్చువాడు గనుక వామనుఁడు.

తత స్సప్తదశే జాతః సత్యవత్యాం పరాశరాత్,
చక్రే వేదతరోశ్శాఖా దృష్ట్వా పుంసోఽల్ప మేధసః. 21
నరదేవత్వ మాపన్నః సురకార్య చికీర్షయా,
సముద్రనిగ్రహాదీని చక్రే వీర్యాణ్యతః పరమ్. 22
ఏకోనవింశే వింశ తిమే వృష్ణిషు ప్రాప్య జన్మనీ,
రామకృష్ణా వితి భువో భగవానహరద్భరమ్. 23
తతః కలౌ సంప్రవృత్తే సమ్మోహాయ సురద్విషామ్,
బుద్ధోనామ్నా జినసుతః కీకటేషు భవిష్యతి. 24
అథాసౌ యుగసంధ్యాయాం దస్యు ప్రాయేషు రాజసు,
జనితా విష్ణు యశసో నామ్నా కల్కిః జగద్గురుః. 25

తతః—అనంతరము, సప్తదశే—పదునేడవ యవతారమందు, పరాశరాత్—పరాశరుని నుండి, సత్యవత్యాం—సత్యవతియందు, జాతః—పుట్టెను, పుంసః—పురుషులను, అల్పమేధసః—అల్పమైన బుద్ధి శక్తిగల వారినిగా, దృష్ట్వా—చూచి వేదతరోః—వేద మను వృక్షమునుండి, శాఖాః—శాఖలను, చక్రే—నిర్మించెను,

పదునేడవది వ్యాసావతారము. పరాశరమహర్షినుండి సత్యవతి గొందు జననము. జనులకు వేదములను దెలిసికొను బుద్ధిశక్తి తగ్గి తెలిసి, వ్యాసభగవానుఁడు వేదవృక్షమునకు శాఖ

**అతః పరం — అటు తరువాత, సురకార్య చికీర్షయా — దేవకార్యమును గావించు నిచ్ఛతో, నరదేవత్వం — రాజనెడు స్థితిని, ఆపన్నః — పొందినవాఁడై, సముద్రనిగ్రహాదీని — సముద్రబంధనము మొదలైన, వీర్యాణి — పరాక్రమములను, చక్రే — చేసెను.**

పదునెనిమిదవది రామావతారము. దేవతలకు రాక్షసుల బాధ దొలఁగించి దేవ భూలోకముల రక్షించు నిచ్ఛతో నరదేవుఁడై జన్మించెను. జన్మించి, సముద్రనిగ్రహాది వీర్యములఁ బ్రదర్శించెను.

**ఏకోనవింశే — పందొమ్మిది, వింశతిమే — ఇరువదవ యవతారములందు, రామకృష్ణౌ — బలరామ కృష్ణులను పేరులతో, వృష్ణిషు — వృష్ణివంశస్థులైన యాదవులయందు. జన్మనీ — రెండు మూర్తులను, ప్రాప్య — పొంది. భగవాన్ భువః భారం — భూ భారమును, అహరత్ — హరించెను.**

పందొమ్మిదవది బలరామావతారము. ఇరువదవది కృష్ణావతారము. ఈ రెండు నొకే కాలమందున్న యవతారములు. వీరిర్వురును వృష్ణివంశమందు జన్మించిరి. రెండు తెఱఁగులైన దొక్క భగవంతుఁడే. అతఁడు భూ భారమును హరించెను. 23

**తతః — అనంతరము, కలౌ — కలియుగము, సంప్రవృత్తే — బాగుగావ్యాపించినపుడు, సురద్విషాం — దేవశత్రువులైన రాక్షసులయొక్క, సమ్మోహాయ — సమ్మోహనముకొఱకు, బుద్ధః నామ్నా — బుద్ధుఁడనెడు పేరుతో, జనసుతః — జనపుత్త్రుఁడై కీకటేషు కీకట రాజ్యమందు, భవిష్యతి — కలుగఁబోవుచున్నాఁడు.**

ఇరువది యొకటవది బుద్ధావతారము. ఇకమీఁదఁ గలుగు నవతారము. కలియుగధర్మములు దేశమందు నెలకొన్నవి. కీకట రాజ్యమందు కపిలవస్తు వనుచోట జనసుతుఁడై బుద్ధుఁడు జన్మించును. దేవశత్రువులను దన యుపదేశములతో మోహింపఁజేయును. 24

**అథ — అనంతరము, అసౌ జగత్పతిః — ఈ లోకనాథుఁడైన జగత్పతి, యుగసంధ్యాం — యుగావసానమందు, రాజసు — రాజులు, దస్యుప్రాయేషు — దొంగ**

**లతో సమానమైనవారు కాగా, విష్ణుయశసః=విష్ణుయశుఁ డను వానినుండి, నామ్నా కల్కిః=కల్కియను నామముతో, జనితా=జన్మింపఁబోవును.**

ఇరువది రెండవది కల్క్యవతారము, ఇదియును భవిష్యదవతారమే. కలియుగావసాన కాలమున రాజులు జనుల సంపత్తు నపహరించుటకు మాత్రమే సంసిద్ధులై యుందురు. దొంగలకు, దొరలకు భేదము లేదు. వారిని సంహరించి ధర్మమునకును విష్ణుయశుఁ డను బ్రాహ్మణునకు కల్కి యనుపేరుతో లోకనాథుఁ డవతరించును.

**విజయధ్వజము :**

వేదవ్యాసావతారమును-తత్కార్యమును జెప్పుచున్నాఁడు-

వేదతరోః = వేద మనెడు కల్పవృక్షముయొక్క, శాఖాః = కొమ్మలవలె నుండునట్టి, వేదశాఖలను, చక్రే=చేసెను.

విశేషములు : ద్వాపరయుగమందు మాత్రమే వేదవ్యాసావతారమని తెలియరాదు. రాములకు ముందుఁగూడ వ్యాసావతారమై యుండినది. 'తృతీయం యుగమారాభ్య వ్యాసో బహుషుజజ్ఞివాన్' అనెడు కౌర్మపురాణవాక్యమే ప్రమాణము. మూఁడవయుగము నుండి వ్యాసావతార మయ్యెనని తాత్పర్యము.

**తృతీయే సప్తమే చైవ షోడశే పంచవింశకే,**
**అష్టావింశే యుగే కృష్ణః సత్యవత్యాం పరాశరాత్.**

అను ప్రమాణము ననుసరించి వైవస్వత మన్వంతరముయొక్క 3, 7, 16, 25, 28 మహాయుగములందు వ్యాసావతారమైనది. అందుచేత, నిరువది యెనిమిదవ మహాయుగమునకుఁ జెందిన త్రేతాయుగమందు రామావతారమై యుండినను దానికన్న వెనుకనే వ్యాసుఁడు జన్మించియుండెనని తెలియవలెను.

తాత్పర్యము : వాసుదేవ రూపియైన శ్రీహరియొక్క పదునేడవదియే వేదవ్యాసావతారము. వైవస్వతమన్వంతరమునకుఁ జెందిన

ముప్పదియొక్క మహాయుగములలో మూఁడవ మహాయుగమందు పరాశరునినుండి సత్యవతీదేవియందు శ్రీహరి వ్యాసుఁడుగా వ్యక్త మయ్యెను. ఏడవ మహాయుగమందు నట్లే. పదునాఱవ మహాయుగ మందును వ్యాసావతార మున్నది. ఇరువది యొకమిదవ మహాయుగ మందుఁగూడ వ్యాసావతారము సంభవించెను. మనుష్యులు మంద ప్రజ్ఞులు. కనుక వారి సౌకర్యమునకై వ్యాసమహర్షి వేదములను శాఖలుగా వింగడించినాఁడు. అందువలన నిచట రామావతారమున కంటెను ముందు వ్యాసావతారమును జెప్పుట శాస్త్రసమ్మతమే.

బలరాముని యందు వాసుదేవుని యావేశము. కృష్ణావ తారము సాక్షాత్తుగా వాసుదేవుఁడే.

వృష్ణిషు = వృష్ణివంశమునకుఁ జెందిన యాదవులయందు, రామకృష్ణావితి=రామకృష్ణులను పేరుగల, జన్మనీ=ఆవేశావతారము, స్వస్వరూపము నను రెండవతారములను యథాక్రమముగా, ప్రాప్య= పొంది, భువః=భూమియొక్క, భరం=దైత్యసేనారూపమైన భారమును అహరత్=పరిహరించెను.

విశేషము : జన్మనీ అనెడు ద్వివచనప్రయోగముతో బలరాముల యందు విశేషావేశమని తెలియవలెను. బలరాముఁడు సాక్షాదవ తారముగాదు. మహాభారతమందీ శ్లోకమున్నది.

శంఖచక్రభృదీశే తు శ్వేతవర్ణో మహాభుజః,
ఆవిష్టః శ్వేతకేశాత్మా శేషాంశం రోహిణీ సుతమ్.

లక్ష్మీబ్రహ్మాదులకు నియామకుఁడైన శ్వేతవర్ణుఁడును, మహా భుజుఁడును నైన శ్రీహరి, శ్వేతకేశముయొక్క రూపముతో శేషావ తారమై బలరాము నావేశించెను. బలరాముఁడు రోహిణీకుమారుఁడు కనుక, బలరాముఁడు, శ్రీహరియొక్క శ్వేతకేశరూపముయొక్క యావేశావతారమని తెలియవలెను.

అవ: బుద్ధావతారము తత్కార్య కథనము.

తతః = కృష్ణావతారము తరువాత, కలౌ సంప్రవృత్తే = కలియుగము ప్రవృత్తమగుచుండగా, సురద్విషాం=అయోగ్యులయ్యును, వేదమార్గ ప్రవృత్తులైన త్రిపుర నివాసులైన దైత్యులయొక్క, సమ్మోహాయ=సమ్మోహనముకొఱకై, బుద్ధః =బుద్ధుఁ డనెడు, నామ్నా= పేరుచేత, కీకటేషు=కీకటములని పిలువఁబడెడు మగధ రాజ్యమందలి గయా ప్రదేశమందు, జినసుతః=జినునిచే పుత్త్రునిగా స్వీకరింపఁబడిన వాఁడుగా, భవిష్యతి=కాఁబోవును.

విశేషార్థములు: జినసుతః అనుటతో జినునికుమారునిగ జన్మించెనని యర్థము సేయ రాదు. బ్రహ్మాండపురాణములో-

మోహనార్థం దానవానాం బాలరూపీ పథిస్థితః,
పుత్త్రం తం కల్పయామాస మూఢబుద్ధిః జిన స్స్వయమ్.

తత స్సంమోహయామాస జినాద్యా నసురాంశకాన్,
భగవాన్ వాగ్భిరుగ్రాభిః అహింసావాదిభి ర్హరిః.

అని యున్నది. జినుఁడు అసురాంశ. కనుక హరి యతని కుమారుఁడై వ్యక్తుఁడు గాలేదు. దానవులను మోహింపఁజేయుటకై శిశురూపుఁడుగా దారియందు దొరకెను. జినుఁడా కుమారుని దన కుమారునిగా వరించెను. తరువాత శ్రీహరి బాలరూపముతోనే యహింసయే పరమ ధర్మమని తెలుపు వేద విరుద్ధ వాక్యములచే జినుఁడు మొదలైన వారిని మోహింపఁ జేసెను.

అసౌ=ఈ పురుషనామకుఁడైన, జగత్పతిః=జగత్స్వామియైన నారాయణుఁడు, యుగసంధ్యాయాం=కలి కృతయుగముల సంధి కాలము ప్రాప్తింపగా, రాజసు = భూమి నేలెడి రాజులు, దస్యు ప్రాయేషు=అన్నిరీతుల స్వార్థపరులై, దొంగలేయై యుండఁగా వారి సంహారముకొఱకై, విష్ణుయశసః=విష్ణుయశుఁడను పేరుగల బ్రాహ్మణునకు, కల్కిః=కల్కి యను పేరుతో, జనితా=పుట్టఁబోవును.

పోతన్నగారు:

మహదహంకార తన్మాత్ర సంయుక్తుఁడై
చారుషోడశ కళాసహితుఁ డగుచుఁ
బంచ మహాభూత భాసితుండై శుద్ధ
సత్త్వుఁడై సర్వాతిశాయి యగుచుఁ
జరణోరు భుజముఖ శ్రవణాక్షి నాసా శి
రములు నానాసహస్రములు వెలుఁగ
నంబర కేయూర హారకుండల కిరీ
టాదులు పెక్కువే లమరుచుండఁ

బురుషరూపంబు ధరియించి పరుఁ డనంతుఁ
డఖిల భువనైక వర్తనయత్న మమర
మానితోదార జలరాశి మధ్యమునను
యోగనిద్రా విలాసియై యొప్పుచుండు.

వ. అది సకలావతారంబులకు మొదలిగనియైన శ్రీమన్నారాయణ దేవుని విరాజమానంబైన దివ్యరూపంబు. దానిం బరమయోగీంద్రులు దర్శింతురు. అప్పరమేశ్వరు నాభికమలంబువలన సృష్టికర్తలలోన శ్రేష్ఠుండైన బ్రహ్మ యుదయించె. అతని యవయవస్థానంబులయందు లోకవిస్తారంబుఁ గల్పింపంబడియె. మొదల నద్దేవుండు, కౌమారాఖ్య సర్గంబు నాశ్రయించి బ్రహ్మణ్యుండై, దుశ్చరంబైన బ్రహ్మచర్యంబు చరియించె. రెండవమారు జగజ్జననంబు కొఱకు రసాతలగతయైన భూమి నెత్తుచు, యజ్ఞేశుండయి వరాహదేహంబు దాల్చె. మూఁడవ తోయంబున నారదుం డను దేవర్షియై, కర్మనిర్మోచకంబైన వైష్ణవ తంత్రంబుఁ జెప్పె. నాల్గవసారి ధర్మభార్యా సర్గంబునందు నరనారాయణాభిధానుండై దుష్కర బైన తపంబు సేసె. పంచమావతారంబునం గపిలుండను సిద్ధేశుండయి [illegible]బునకుఁ దత్త్వగ్రామ నిర్ణయంబుగల సాం[illegible] శరీరంబున ననసూయాదేవియందు న[illegible]



యలర్కునికిఁ బ్రహ్లాద ముఖ్యులకు నాత్మవిద్యఁదెలిపె. ఏడవ విగ్రహం బున నాకూతియందు రుచికి జన్మించి యజ్ఞుండనఁ బ్రకాశమానుండై యామాది దేవతలతోడం గూడి స్వాయంభువ మన్వంతరంబును రక్షించె. అష్టమమూర్తిని మేరుదేవియందు నాభికి జన్మించి యురుక్ర ముండనం బ్రసిద్ధుఁడై విద్వజ్జనులకుఁ బరమహంస మార్గంబుం బ్రక టించె. ఋషులచేతఁ గోరంబడి తొమ్మిదవ జన్మంబునఁ బృథుచక్ర వర్తియై భూమిని ధేనువుం జేసి సమస్త వస్తువులం బిదికె. చాక్షుష మన్వంతర సంప్లవంబున దశమంబయిన మీనావతారంబు నొంది మహీరూపంబగు నావనెక్కించి వైవస్వతమనువు నుద్ధరించె. సముద్ర మథన కాలంబునం బదునొకండవ మాఱు కమఠాకృతిని మందరాచ లంబుఁ దన పృష్ఠకర్పరంబున నేర్పరియై నిలిపె. ధన్వంతరి యనఁ బండ్రెండవ తనువున సురాసుర మథ్యమాన క్షీరపాథోధి మధ్యభాగం బున నమృతకలశహస్తుండై వెడలె. పదుమూఁడవదియయిన మోహినీ వేషంబున నసురుల మోహితులం జేసి సురల నమృతాహారులం గావించె. పదునాలుగవదియైన నరసింహరూపంబునం గనక కశిపుని సంహరించె. పదునేనవదియైన కపట వామనావతారంబున బలిని బదత్రయంబు యాచించి మూఁడులోకంబుల నాక్రమించె. పదు నాఱవదియైన భార్గవరామాకృతినిఁ గుపితభావంబుఁ దాల్చి బ్రాహ్మణ ద్రోహులయిన రాజుల నిరువదియొక్కమాఱు వధియించి భూమి నిఃక్షత్రంబుఁ గావించె. పదునేడవదియైన వ్యాసగాత్రంబున నల్ప మతులయిన పురుషులం గరుణించి, వేదవృక్షంబునకు శాఖలేర్పఱిచె. పదునెనిమిదవదైన రామాభిదానంబున దేవకార్యార్థంబు రాజత్వంబు నొంది సముద్రనిగ్రహాది పరాక్రమంబు లాచరించె. ఏకోనవింశతి వింశతితమంబులైన రామకృష్ణావతారంబులచే యదువంశంబునందు సంభవించి విశ్వంభరాభారంబు నివారించె; నేకవింశతితమంబైన బుద్ధనామధేయంబునం గలియుగాద్యవసరంబున రాక్షస సమ్మోహ

నంబు కొఱకు మధ్యగయా ప్రదేశంబున జినసుతుండయి తేజరిల్లు. యుగసంధియందు వసుంధరాధీశులు చోరప్రాయులై సంచరింప విష్ణుయశుండను విప్రునికిఁ గల్కి యను పేర నుద్భవింపంగలండని యిట్లనియె–

మహాదహంకార తన్మాత్రసంయుక్తుఁడై = మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు, శబ్ద స్పర్శ రస రూప గంధములు–వీనితోఁ గూడుకొన్నవాఁడై, ఇచ్చటఁ గూడుకొనుట యనఁగా 'మిళితము'లై లోపల నంతఃస్థితములుగా నుండుట యని యర్థము. 'మహదాదిభి స్సంభూతం' అని మూలము. సంభూతం సునిష్పన్నం అని శ్రీధరుల వ్యాఖ్య. 'మిళితం' అని వంశీధరుఁడు. చారు షోడశకలా సహితుఁడగుచు, చారు=అందమైన, షోడశకలా=పదునాఱు కళలచేత, సహితుఁడు = కూడుకొన్నవాఁడు, పంచమహాభూత భాసితుఁడు = పంచమహాభూతములచేత ప్రకాశించుచున్నవాఁడై, వాక్పాణిపాదపాయూపస్థములు కర్మేంద్రియములు. త్వక్ చక్షు శ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములు జ్ఞానేంద్రియములు, మనస్సు - పంచభూతములు అన్నియు వెరసి షోడశకళలు. శుద్ధసత్త్వుఁడై కేవల సత్త్వగుణమే స్వరూపముగాఁగల వాఁడై, రజ స్తమస్సులచేతఁ గూడుకొనని సత్త్వగుణ మన్నమాట. విశుద్ధం అనుట కది తెన్గు. సర్వాతిశాయి యగుచున్=అన్నిఁటిని మించినవాఁడై. ఊర్జితః అనుటకు పోతన్న సేఁత; చరణో.........శిరములు, చరణ=పాదములు, ఊరు=తొడలు, భుజ=భుజములు, ముఖ=ముఖములు, శ్రవణ = చెవులు, అక్షి = కన్నులు, నాసా = నాసికలు. శిరము=తలలు, ఇదంతయు ద్వంద్వసమాసము.

'సహస్రమూర్ధ శ్రవణాక్షినాసికం' సంస్కృతమునకు పోతన రచన. నానాసహస్రములు=పెక్కువేలు, వెలుఁగన్=ప్రకాశించుచుండఁగా, అంబర కేయూరహారకుండల కిరీటాదులు, అంబర=వస్త్రములు కేయూర = బాహుపురులు, హార = హారములు, కుండల = కర్ణాభర

ణములు, కిరీటాదులు = కిరీటములు మొదలైనవి, పెక్కువేలు నానాస్త్రములు. అమరుచుండన్ = ఒప్పియుండగా, పరుఁడు = కూటస్థుఁడును, అనంతుఁడు = అవ్యయుఁడును నైన పరమాత్మ, పురుషరూపంబు ధరియించి, పురుషావతారమును ధరించి, అలఘుగతిని = గొప్పగా, అఖిల భువనైకకర్తయై = సమస్త భువనములకును ఏకనిర్మాతయై, మానితాపార జలరాశి మధ్యమునను = గొప్పగా గౌరవింపఁదగిన అంతములేని సముద్రమధ్యమందు, యోగనిద్రా విలాసియై = యోగనిద్రయనెడు విలాసముతోఁ గూడుకొన్నవాఁడై, ఒప్పుచుండున్ = ప్రకాశించుచుండును.

తాత్పర్యము: పరమాత్మ మొదటి యవతారమైన పురుషరూపమును జెప్పుచున్నాఁడు.

మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలతోఁ గూడుకొన్నవాఁ డీ పురుషుఁడు అతనికి పదునారు కళలు. కర్మేంద్రియ జ్ఞానేంద్రియములు, మనస్సు, పంచమహాభూతములు. రజస్తమస్సులతో నసంభిన్నమైన శుద్ధసత్త్వముతోఁ గూడుకొన్న రూప మాతనిది. అన్ని గుణములయందును, నన్ని పదార్థముల నతిశయించినవాఁడు, సహస్రపాదుఁడు. ఊరు భుజ ముఖ శ్రవణముల కంతము లేదు. సహస్రాక్షుఁడు = నాసాశిరములు పెక్కులు. అంబర కేయూరహార కుండల కిరీటాదుల గూడ ననంతములే. ఆదిశబ్దముచే నాయుధాదులు గ్రహింపవలెను; ఈ రీతిగా ననంతుఁడైన పరమాత్మ పురుషరూపమును ధరించినవాఁడై, సకల జగత్కర్తయై జలరాశిమధ్యమందు యోగనిద్రతోఁ గూడినవాఁడై ప్రకాశించుచుండును.

విశేషార్థములు: 'సహస్రపాదోరు భుజాననాద్భుతం = సహస్రమౌళ్యంబర కుండలోల్లసత్' అనుదానిని మూలకారుఁడు 'అదోరూపం' అనుదానిలో నున్న రూపమునకు విశేషణము లొనర్చెను. పోతన్నగా రా విశేషణములను ప్రత్యేకముగా విస్తృతీకరించినారు. 'పురుష

రూపంబు' 'జగృహే పౌరుషం రూపం' అని మూలము. 'అఖిలభువనైక కర్తయై' 'యస్యావయవ సంస్థానైః కల్పితో లోకవిస్తరః' అను శ్లోకపాదమునకు సంకుచీకరణము. అనంతుఁడు ఐదవశ్లోకములోని 'అవ్యయం' అనునదే. 'యోగనిద్రా విలాసియై' యోగనిద్ర కూడ ఆయనయాజ్ఞతోనే యాక్రమించినది. తనకుఁ దానైకళియు స్వాతంత్ర్యము దానికి లేదు. అందుకే మూలమున 'యోగనిద్రాం వితన్వతః' అని యున్నది. 'యోగః సమాధిః తద్రూపాం నిద్రాం విస్తారయతః' అని శ్రీధరులు. ఈ పురుషావతారము కూటస్థము. అన్యావతారములవలె నావిర్భావ తిరోభావములు గలది కాదు.

అది సకలావతారంబులకు .... ... గల్పింపఁబడియె. సకలావతారంబులకున్=సమస్తావతారములకు, మొదలిగని=కూటస్థమైనది. విరాజమానంబైన=ప్రకాశించుచున్న, దివ్యరూపంబు=అప్రాకృత రూపము. పరమయోగీంద్రులు=మహాయోగులు, దర్శింతురు=జ్ఞానాత్మకదృష్టితోఁ జూతురని యర్థము. ఆ+పరమేశ్వరుఁడు త్రికసంధి. నాభీకమలంబు వలనన్=నాభియం దుద్భవించిన కమలమునుండి, సృష్టికర్తలలోన శ్రేష్ఠుఁడు=ప్రజాపతులైన మరీచ్యాదుల కధినాథుఁడైన బ్రహ్మ, ఉదయించెన్=జన్మించెను. అతని యవయవస్థానంబుల యందున్=ఆ పురుషావతారుని అవయవములయందు, లోకవిస్తారములు=భువనములయొక్క విస్తృతులు.

తాత్పర్యము: ఈ పురుషరూపము సమస్తావతారములకును మొదటిది. అనఁగా కూటస్థము. ఇది యన్నిఁటికిని నిధానము. మొదలుగని. సకలావతారములును దీనినుండియే బహిర్గతము లగుచున్నవి. కార్యానంతర మీ రూపమందే ప్రవేశించుచున్నవి. ఇతర వ్యాఖ్యాత లందఱును పురుషరూపము ననిరుద్ధుఁ డన్నారు. క్షీరోదశాయి, కారణోదశాయి, గర్భోదశాయి యను ప్రత్యేకమైన ప్రక్రియ చైతన్యసంప్రదాయమున నున్నది. విశిష్టాద్వైతులును ఈ పురుష

రూపము ననిరుద్ధావతార మనిరి. శ్రీధరులు 'ఏతదాది నారాయణ రూపం' అనియె వ్యాఖ్యానించెను. పోతన్నగా రా మార్గమునే త్రొక్కిరి. పరమయోగీంద్రులు 'అదభ్ర చక్షుషా' అని మూలము. జ్ఞాననేత్రముతో యోగీంద్రులు దర్శింతురని భావము. పోతన్న పరమయోగీంద్రులని యన్నారు. మూలకారుఁడు 'నాభిహ్రదాంబుజాత్ = నాభియనెడు హ్రదములు, రూపకము. పోతన్న ఈ రూపకమును దీసివేసినాఁడు. 'విశ్వసృజాం పతిః' అని సంస్కృతము. సృష్టికర్తలలోన శ్రేష్ఠుఁ డని తెలుఁగు.

మొదల నద్దేవుండు... ....పరమహంస మార్గంబు ప్రకటించె. కౌమారాఖ్య సర్గంబునన్=కౌమార, ఆర్ష, ప్రాజాపత్య, మానవాదులు సర్గవిశేష నామములు. ఆ కౌమారాఖ్య సర్గమందు పౌరుషరూపమును దొలుత ధరించినది భగవంతుఁడే. బ్రాహ్మణుఁడై బ్రహ్మచర్యము జరించెను. ఇది యాతని ప్రథమావతారము. దుశ్చరంబు=ఇతరులకుఁ జరింప సాధ్యము గానిది. ఈ పదము మూలములోనిదే. రెండవసారి జగత్తుయొక్క యుద్భవముకొఱకు పాతాళమును బొందిన భూమి నెత్తి యజ్ఞేశుఁడై వరాహదేహము ధరించినాఁడు. యజ్ఞేశః అను పదము మూలములోనిదే. యజ్ఞాధిష్ఠాతృధర్మరూప భగవదవతారము. యజ్ఞప్రవర్తకుఁడైన పురుషుఁడని విజయధ్వజుఁడు. ఈ వరాహదేహము గూడ నప్రాకృతమే. మూఁడవ తోయంబునన్=మూఁడవ పర్యాయము. దేవ+ఋషి-దేవర్షి-దేవఋషి అని రెండు రూపములు. సంధివైకల్పికము. కర్మనిర్మోచకంబైన వైష్ణవతంత్రంబు = కర్మలచే నేర్పడు సుఖదుఃఖములకుఁ గారణము గాని వైష్ణవశాస్త్రము. అనఁగా భగవదర్పితముగాఁ గర్మలొనర్చినపుడు వాని సుఖదుఃఖానుభవములు జీవున కేర్పడవు. 'నైష్కర్మ్యం కర్మణాం యతః' అని మూలము.

...గ్యా సంసర్గమునందున్=ధర్ముఁడనఁగా
...ంధించిన యవతార మన్నమాట.

అనఁగా నామెకుఁ గుమారుఁడుగా నభివ్యక్తుఁ డనుట. దీనికి మూలము 'ధర్మకలా సర్గే' అనునది. ఈ కలాశబ్దమునకు అంశ మని యర్థము. దానిని భార్యాపరముగా నన్వయించుటకు 'అర్ధోవా ఏష ఆత్మనో యత్పత్నీ' అను శ్రుతిని శ్రీధరుఁ డాశ్రయించెను. ఈ ధర్మకలా శబ్దము వీరరాఘవ, విశ్వనాథ చక్రవర్తి, వల్లభ, గిరిధర, విజయధ్వ జాదులు భిన్నభిన్నములుగా నన్వయించిరి. పోతన్నగారు శ్రీధరుని మార్గము ననుసరించి కలాశబ్దమునకు భార్య యను నర్థము స్పష్టీక రించి రగడలేకుండఁ జేసికొన్నారు. 'దుశ్చరం తపః' అని మూలము. 'దుష్కరమైన' అని పోతన్న. పంచమావతారము=ఐదవ యవతారము సిద్ధేశః=సమస్త సిద్ధులకును అధినాథుఁడు, తత్త్వసంఘ నిర్ణయము= ఇరువదినాలుగు తత్త్వములను నిర్ణయించి చెప్పునది. కపిలుఁడు ఆసురియను బ్రాహ్మణునకు సాంఖ్యము నుపదేశించినాఁడు. ఆఱవ శరీరంబునన్=ఆఱవ యవతారమునందు, అనసూయాదేవియందున్= అనసూయాదేవి 'నీకు సమానుఁడైన కుమారుఁడు గావలె' నని పర మాత్మ నర్థించెను. అందుచే నాతఁ డత్రిమహామునికి పుత్త్రుఁడుగా వ్యక్తుఁడైనాఁడు. అలర్కునికి ప్రహ్లాదముఖ్యులకును 'ఆన్వీక్షికి' యను నాత్మవిద్యను బోధించెను. ఏడవ విగ్రహంబునన్=ఏడవ యవతార మందు, రుచి ఆకూతులను దంపతులకు యజ్ఞుఁడను పేరుతో స్వామి యవతరించెను. యామాదులైన దేవతలతోఁ గూడి తానే యింద్రుఁడై స్వాయంభువ మన్వంతరమును రక్షించినాఁడు. అష్టమమూర్తి అనఁగా నెనిమిదవ యవతారము. ఆగ్నీధ్ర పుత్త్రుఁడైన నాభికిని, మేరుదేవికిని గుమారుఁడై భగవంతుఁడు వ్యక్తుఁ డయ్యెను. ఇది ఋషభావతారము. పోతన్నగారు ఉరుక్రముఁ డని ముగించినాఁడు. ఋషభుఁడని పేరెం దుకు చెప్పలేదో! ఉరుక్రముఁ డనఁగా నితరుల కనుసరింప సాధ్యము గాని ప్రవర్తనము గలవాఁడని యర్థము. విద్వజ్జనులకున్ 'ధీరాణాం' అని మూలము. పరమహంస మార్గంబున్=పరమహంస లనుసరించెడు మార్గము. అవధూతస్థితి యని తాత్పర్యము. 'సర్వాశ్రమ నమస్కృ

తం వర్ష్మ' అని మూలము. 'పారమహంస్యం' అని శ్రీధరునివ్యాఖ్య ఋషులచేతం గోరంబడి .... శాఖ లేర్పఱిచె=ఋషులచేతఁ గోరంబడి వేనమహారాజు ధర్మభ్రష్టుఁ డయ్యెను. అతనిని ఋషులు హుంకారముతోఁ జంపిరి. ఋషులు వాని దక్షిణబాహువును మథింపఁగా నారాయణాంశజుఁడైన పురుషుఁడు, లక్ష్మీకలాకలితయైన స్త్రీయును జన్మించినారు. అతఁడే పృథుచక్రవర్తి. అతనిభార్య అర్చి. పృథుచక్రవర్తి ఋషులు గోరఁగా జన్మించినవాఁడు. అతఁడు భూమినే ధేనువుగా నొనర్చి, సమస్త పదార్థములను బిదికెను. చాక్షుషమన్వంతరముయొక్క సంప్లవంబునన్=ప్రళయమందు భూరూపమైన నావ నెక్కించి వైవస్వతమనువును రక్షించినాఁడు. సత్యవ్రతుఁ డను మహారాజు పరమభక్తుఁడు, ఇతఁడు తరువాత వైవస్వతమనువు గావలసినవాఁడు, అందుచే వానిని శ్రీహరి రక్షించెను. కమఠాకృతిన్=తాఁబేటి యాకారముచేత నేర్పరియై మందరాచలము తననుండి జారి పోకుండ కర్పరము అనఁగా చిప్పవంటి తనవీపుపైన, నిలిపెన్=సముద్రమథనమందు, సురాసురులు మందరాచలమును కవ్వముగా నొనర్చి చిలుకుచుండిరి, అది నీట మునుఁగుచుండగా స్వామి కమఠాకృతియై తనవీపుపై నిలిపికొన్నాఁడు. సముద్రమథన కాలంబునన్=సముద్రమును చిలికెడు సమయమందు, పంద్రెండవ తనువునన్=పంద్రెండవ యవతారమందు, సురాసుర=దేవదానవులచేత, మథ్యమాన=మథింపఁబడుచున్న, క్షీరపాథోధి మధ్యభాగంబునన్. పాథస్ అనఁగా నీరు. ధి అనఁగా ధరించునది, పాథోధి=సముద్రము. క్షీరపాథోధి=క్షీరమే నీరుగాఁ గలిగినది=క్షీరసముద్రము. అమృతకలశహస్తుండై=అమృతకలశమును చేతఁబట్టుకొన్నవాఁడై. అమృతకలశం హస్తే యస్యసః అని వ్యధికరణ బహువ్రీహి. పదుమూఁడవదియైన మోహినీవేషంబునన్=పదుమూఁడవసారి మోహినీవేషమును ధరించి అనఁగా మోహిని యను స్త్రీరూపముతో నని తాత్పర్యము. అసురులు=రాక్షసులు, అమృతాహారులు=అమృతము నాస్వాదించువారు. పంద్రెండవయవ

తారమందు స్వామి ధన్వంతరియై వచ్చెను. చేతనున్న అమృతకలశ మును రాక్షసులు లాగికొనిరి. శ్రీహరి మోహినియై వారిని వంచించి సురల కమృతపాన మొసఁగెను. కనక కశిపుఁ డనఁగా హిరణ్యకశి పుఁడు. మూలమందు 'ఏరకాన్ కటకృత్ యథా' అని యుపమా నము. అది యసుందరమని పోతన్న వదలెను. కపట వామనావ తారమందు, పదత్రయంబునన్=మూఁడడుగులు. పదునాఱవ యవ తారము భార్గవరామావతారము. అనఁగా భృగువంశమందు పుట్టిన జమదగ్నికిఁ బుత్త్రుఁడు రాముఁ డని పేరు. తరువాత నాశ్రయించిన పరశువుతో నాతఁడు పరశురాముఁడయ్యెను. కుపితభావంబుఁదాల్చి= కోపముగొన్నవాఁడై, వ్యాసగాత్రంబునన్=వ్యాసశరీరమందు, అల్ప మతులు=అల్పమైన బుద్ధిగలవారు; బహుశ్రీహి, రామాభిధానంబు నన్=రాముఁ డను పేరుతో. ఇతఁడు దశరథరాముఁడు. సముద్రనిగ్ర హము, నిగ్రహమనఁగా నియమించుట. ఏకోనవింశతితమములు= పందొమ్మిది యిరువదియవ అవతారములు. విశ్వంభరాభరంబున్= భూమి బరువును, కలియుగాద్యవసరంబునన్=కలియుగారంభమందు, రాక్షస సమ్మోహనంబుకొఱకున=రాక్షసులకు మతిభ్రమణము గల్పిం చుటకొఱకు, కీకటదేశంబునన్=మధ్యగయా ప్రదేశమందు, ఏకవిం శతితమము=ఇరువది యొకటవది, తేజరిల్లున్=ప్రకాశించును. ఇది బౌద్ధావతారము. యుగసంధియందున్=కలి, కృతయుగముల సంధి కాలమున, వసుంధరాధీశులు=రాజులు, ఉద్భవింపఁ గలఁడు=జనింపఁ బోవును. యుగాదియం దంశము, యుగాంతమందు సంధ్య యని వ్యవహారము.

అవతారా హ్యసంఖ్యేయా హరే స్సత్త్వనిధేర్ద్విజాః,
యథా ఽవిదాసినః కుల్యాః సరసస్స్యుః సహస్రశః. 26

ఋషయో మనయో దేవా మనుపుత్త్రా మహౌజసః,
కలాస్సర్వే హరేరేవ సప్రజాపతయ స్స్మృతాః. 27

ఏతేచాంశ కలాః పుంసః కృష్ణస్తు భగవాన్ స్వయమ్,
ఇంద్రారి వ్యాకులం లోకం మృడయంతి యుగేయుగే. 28

జన్మగుహ్యం భగవతో య ఏతత్ప్రయతో నరః,
సాయంప్రాతః గృణన్ భక్త్యా దుఃఖగ్రామా ద్విముచ్యతే. 29

ఏతద్రూపం భగవతో హ్యరూపస్య చిదాత్మనః,
మాయాగుణై ర్విరచితం మహదాదిభిరాత్మని. 30

ద్విజాః—ఓ బ్రాహ్మణులారా !, సత్త్వనిధేః—సత్త్వగుణమున కాధారమైన హరేః—హరియొక్క, అవతారాః—అవతారములు, అవిదాసినః— క్షయింపనట్టి, సరసః—తటాకమునుండి, కుల్యాః—అల్పప్రవాహములు, సహస్రశః—అనేకములుగా, యథాస్యుః—ఎట్లేర్పడుచున్నవో, (తథా—అట్లు, అసంఖ్యేయాః హి—అనంతములు గదాః)

అవ: సమస్తావ తారములును నారాయణుని నుండియే యేర్పడుచున్నవని చెప్పుచున్నాఁడు—

బ్రాహ్మణులారా! సత్త్వగుణమునకు నిధివంటివాఁడైన శ్రీహరి యవతారము లనేకములు. ఎన్నఁడును సిరింకిపోని సరస్సునుండి యనేకములు కాల్వలు బయలుదేఱినట్లు. 26

ప్రజాపతయః—ప్రజాపతులతోఁ గూడ, ఋషయః—ఋషులు, మనవః—మనువులు, దేవాః—దేవతలు, మహౌజసః—మహాపరాక్రమవంతులైన, మనుపుత్రాః—మనువుల పుత్త్రులును, సర్వే—అందఱును, హరేః—హరియొక్క, కలా ఏవ—అంశములే.

మరీచి మొదలగు ప్రజాపతులును, నారదాది మహర్షులును, వైవస్వతుఁడు మొదలగు మనువులు, మహాపరాక్రమవంతులైన మనుపుత్త్రులును వీరందఱును శ్రీహరి యంశావతారములే. 27

ఏతేచ—వీరందఱును, పుంసః—పరమపురుషునియొక్క, అంశకలాః—అంశాంశములు, కృష్ణస్తు—కృష్ణుఁడు, స్వయం భగవాన్—స్వయముగా పరమపురు

షుఁడే, యుగేయుగే=ప్రతియుగమందును, ఇన్ద్రారి వ్యాకులం=ఇంద్రునకుశత్రువు లైన యసురులచే బాధపడుచున్న, లోకం=లోకమును, మృడయంతి=రక్షింతురు.

ఇప్పుడు చెప్పిన యవతారములన్నియు పరమపురుషుని యవతారములు. కొన్ని యంశాంశములు. శ్రీకృష్ణపరమాత్మ సాక్షాత్తు భగవంతుఁడు. ఈయన యవతారము లన్నియు దేవేంద్రునకు శత్రువులైన రాక్షసులును—వారి యంశములతోఁ గూడిన దుష్టరాజులును, లోకక్షేమమును నశింపఁజేయునపుడు దుఃఖముతో వ్యాకులీకృతమైన ప్రపంచమును రక్షించుటకు యుగయుగములందు నేర్పడుచున్నవి. 28

ప్రయతః=శుచియై, యః నరః=ఏ మనుష్యుఁడు, భగవతః=భగవంతునియొక్క, గుహ్యం=రహస్యమైన, ఏతత్ జన్మ=ఈ యవతార విశేషమును, సాయంప్రాతః=ఉదయాస్తమయములందు, భక్త్యా=భక్తితో, గృణన్=కీర్తించునో, సః=వాఁడు, దుఃఖగ్రామాత్=దుఃఖసమూహముల నుండి, విముచ్యతే=విడుదల నొందును.

అవ: ఈ యవతారఫలమును జెప్పుచున్నాఁడు—

ఏ మనుష్యుఁ డుభయసంధ్యలందును శుచియై, భక్తితో అతి రహస్యమైన భగవదవతార విశేషములను గీర్తించునో, వాఁడు దుఃఖ సమూహమునుండి విముక్తుఁ డగును. 29

అరూపస్య=రూపరహితుఁడును, చిదాత్మనః=చిన్మయమైన స్వరూపముచేతఁ గూడినవాఁడైన, భగవతః=భగవంతునియొక్క, మాయాగుణైః=మాయాగుణములైన, మహదాదిభిః=మహత్తత్త్వము మొదలైన వానిచేత, ఆత్మని=ఆత్మయందు, ఏతద్రూపం=ఈ రూపమును, విరచితం=కల్పింపఁబడినది.

అవ: అవతార కీర్తనము నొనర్చువాఁడు సంసారబంధమునుంచి విముక్తుఁ డగునని చెప్పఁబడినది. ఈ విషయమునే శంకాసమాధాన పూర్వకముగా సాధించుచున్నాఁడు—

స్థూల సూక్ష్మములని శరీరములు రెండు. అవతారకీర్తనముతో నీ రెండు శరీరము లెక్కడికి పోవును? వాఁడెట్లు విముక్తుఁ డగునని శంక. 30

ఈ విధమైన దేహములు భగవంతుని యవిద్యామూలమైన మాయావిలాసముచే నేర్పడినవి. అవతారకథా కీర్తన, శ్రవణ వైభవముతో శ్రోత లేక పఠితయొక్క హృదయమందు అవిద్యను నశింపఁజేయునట్టి విద్యాశక్తి యుదయమగును. దీనిచే నవిద్య నశించి స్వరూపజ్ఞాన మేర్పడును. అదియే ముక్తి. ఈ యభిప్రాయమునే యీ యైదు శ్లోకములలోఁ బ్రతిపాదించినాఁడు. మనుష్యునికున్న స్థూలము సూక్ష్మ మని పేరు గలిగిన రెండు విధములైన శరీరములు గూడ భగవంతు నియామగుణములైన మహదాదితత్త్వములతో నాత్మయందుఁ గల్పింపఁబడినవిగా నున్నవి. పరమార్థముగా భగవంతుఁడు రూపరహితుఁడు, చిదేకరస స్వరూపుఁడు. ఈ దృశ్యములైన స్థూలసూక్ష్మములైన దేహముల కాధారము ఆత్మస్వరూపుఁడైన భగవంతుఁడే. ఆత్మస్థానమందు స్థూలసూక్ష్మములు గల్పించి యాత్మను మఱపింపఁజేయు నవిద్యాస్వరూపిణియైన మాయాశక్తితో నేర్పడిన మహత్తత్త్వము, అహంకారతత్త్వము మొదలైనవే రెండు దేహములను నిర్మించుటలో సాధనములు.

---

శ్రీధరీయము :

అవ: అనుక్త సర్వసంగ్రహార్థము చెప్పుచున్నాఁడు.

యథా ఽవిదాసినః = అనున దసంఖ్యేయత్వమందు దృష్టాంతము. అవిదాసినః = అపక్షయము లేనట్టి, 'దసు అపక్షయే' అను ధాతువునుండి పుట్టిన శబ్దము.

విశేషము లేదు.

అవ: విశేషములను జెప్పుచున్నాఁడు.

పుంసః = పరమేశ్వరునకు కొన్ని యంశములు కొన్ని కళలు కొన్ని విభూతులు మత్స్యాద్యవతారములకు సర్వజ్ఞత్వ-సర్వశక్తిత్వములున్నను, ఆ యవతారములందెంతమాత్రము చేయఁదగునో అంతమాత్రమే జ్ఞానక్రియా శక్త్యావిష్కారము. అధికారికులైన, కుమారనారదాదులందు యథోపయోగముగా నంశకలావేశము. కుమారాదులందు జ్ఞానావేశము. పృథురాజు మొదలైనవారియందు శక్త్యావేశము. కృష్ణుఁడు సాక్షాత్తుగా, శ్రీమన్నారాయణ మూర్తియే. అతఁడు సర్వశక్తుల నావిష్కృతముల నొనర్చెను. ఈ సర్వావతారములకును, ప్రయోజనమేమి? దైత్యబాధితమైన లోకము నుద్ధరించుట.

అవ : ఏతత్కీర్తన ఫలమును వివరించుచున్నాఁడు-

గుహ్యం = అతిరహస్యమైన జన్మమును, ప్రయతః = శుచియై దుఃఖగ్రామాత్ = సంసారమునుండి.

అవతారిక : దేహద్వయ సంబంధము జీవున కున్నది గదా! వానినుండి విడుమరయెట్లు? అని యాశంకించికొని దేహసంబంధము భగవన్మాయచేత నేర్పడిన యవిద్యా విలసితము. అందుచేత, ఏత చ్ఛ్రవణాది జనితమైన విద్యతో తన్నివృత్తి యేర్పడునని, ఐదుశ్లోకములతోఁ బ్రతిపాదించుచున్నాఁడు-

ఆత్మనః = జీవునకు, ఏతత్ = ఈ స్థూలరూపమైన శరీరము, భగవంతుని యే మాయగలదో దానిగుణములైన మహదాది రూపములచే విలసితమైనది. ఎక్కడ? ఆత్మని = ఆత్మస్థానమందు. శరీరము కృతమైన దని యర్థము.

వంశీధరవ్యాఖ్య :

సత్త్వనిధేః = తన ప్రాదుర్భావశక్తి, నిధివంటివాఁడైన కుమారాదులందు, పృథ్వ్యాదుల యజ్ఞానక్రియా శక్త్యావేశము కొందరియందు తానే యావేశించును. మత్స్యాదులం దంశత్వము, విశ్వ

నాథుఁడు, సత్వనిధేః = శుద్ధ సత్త్వ చిదంశములకు నిధియైన వాని యందు అని యర్థముఁ జెప్పెను.

**వీరరాఘవ వ్యాఖ్య :**

సత్వనిధేః = శుద్ధసత్త్వమూర్తియైన యనిరుద్ధునినుండి యీ యవతార ప్రాదుర్భావము.

వీరరాఘవీయకారుఁడు 'ఋషయో మనవో దేవాః' అనుటకు బదులు 'మునయో దేవాః' అని గ్రహించెను. ఋషులు మంత్రద్రష్టలైన వసిష్ఠాదులు. మును లనఁగా కేవలము స్వాత్మ పరమాత్మలయొక్క యాథాత్మ్యమును గూర్చి మనన చేయువారు; శుకాదులు. దేవాః=ఇంద్రాదులు, మహౌజసః మనుపుత్త్రాః సప్రజాపతయః-దక్షునిచేఁ గూడికొన్న ప్రజాపతులు. వీరందరును శ్రీహరి కళలు. భగవదంశచేతనే పుట్టినవారు.

యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జి తమేవ వా,
త త్తదేవావగచ్ఛ త్వం మమతేజోఽంశ సంభవమ్.

ఈ ఋషిప్రభృతు లనిరుద్ధుని యంశకళలు కొందరు, కొందరంశాంశసంభూతులు. కృష్ణుఁడు పూర్ణావతారము. అనఁగా షడ్గుణముల పరిపూర్ణ విలాసముగల వాఁడనుట.

**విజయధ్వజము :**

అవతారిక : శ్రీహరి యవతారము లనంతములు. వానిని లెక్కించుటకు మన యాయువే చాలదు. ఈ విషయమునే తెలుపుచున్నాఁడు.

సత్త్వనిధేః-బలము జ్ఞానము మొదలైన మహాగుణముల కాశ్ర[illegible] శ్రీహరియొక్క [illegible]వతారాః=అవతారములు, అసంఖ్యేయాః

[illegible], హి-అ కారణముచేతనే, ముఖ్య

ముగా నిందు వివరింపఁబోయెడి గొన్నిటిని మాత్రమే లెక్కించితిని. అతని యవతారములను బూర్ణముగాఁ జెప్పుట కెవ్వరికిని సాధ్యము గాదు. యథా విదాసినః= 1. ఉన్నతస్థలమైన, 2 వేఱు వేఱుగా చీలిపోవునట్టి, సరసః = కొలనినుండి, సహస్రశః కుల్యాః = సన్నని నదులు, స్యుః=అగునో అట్లే, మూలరూపము నుండి, యనంతానంత ములైన యవతారరూపములు వ్యక్తములగును. ఈ యుదాహరణము మందుల కర్థమగుటకు మాత్రమే చెప్పఁబడినది. ఒక సరస్సునుండి బయలుదేఱు క్షుద్రకుల్య లనంతములు గావు. మఱియు నవి తద భావముతో సన్నని వగును. హరియవతారము లట్లపూర్ణములుగావు. కనుక నీ యుదాహరణము కేవల మజ్ఞులకే. అవిదాసినః అని శ్రీధ రుల పాఠము. విదాసినః అని వీరిపాఠము.

ఇప్పుడు ప్రతిబింబాంశములను జెప్పుచున్నాఁడు—

ఋష్యాదులు శ్రీహరి భిన్నాంశములే. అనఁగా ప్రతిబింబాంశ ములు, స్మృతాః=స్మృతులయం దిట్లు చెప్పఁబడినది.

తాత్పర్యము: నారదాదులు శ్రీహరి ప్రతిబింబాంశములు. అనఁగా కొన్ని యంశములలోఁ బరమాత్మునితోఁ బోలికయున్నను, సంపూర్ణముగాఁ బరమాత్మునికంటెను వీరు భిన్నులే. ఇట్లే శ్రుతి స్మృతులు చెప్పినవి.

శ్రీహరియొక్క స్వరూపాంశములేవి యని చెప్పుచున్నాఁడు. ఏతే 'స ఏవ ప్రథమం' అని యారంభించి 'అథా உసౌయుగసంధ్యా యాం' అనువఱకున్న సమస్తావతారములును, పుంసః = శేషశాయి యైన శ్రీహరియొక్క, అంశకలాః=స్వరూపావతారములే. వీరియందు ప్రతిబింబాంశములందున్నట్లు అంశలకును అంశికిని భేదము లేదు. కృష్ణః=మేఘశ్యాముఁడును, శేషశాయియు, మూలరూపియైన పద్మ నాభుఁడు. భగవాన్ స్వయంతు=స్వయముగా భగవంతుఁడే. చెట్టు

నకును గోమ్ములకును నున్నట్లు భేదాభేద మిక్కడ లేదని భావము. ఋష్యాదులు ప్రతిబింబాంశులు. వరాహాదులు స్వరూపాంశములు. వీనికి ప్రమాణము–

జీవాస్త్రత్ప్రతిబింబాంశాః వరాహాద్యాస్స్వయం హరిః,
దృశ్యతే బహుధా విష్ణురైశ్వర్యాదేక ఏవ తు.

జీవులు పరమాత్ముని ప్రతిబింబాంశములు. వరాహాదులు సాక్షాత్తుగాఁ బరమాత్ముఁడే, వాని స్వరూపాంశములే. ఒకఁడే విష్ణువు తన యైశ్వర్యబలముతో బహురూపుఁడై యోగులకుఁ గన్పించును. పరమాత్ముని యవతారములలోఁ గృష్ణావతారమునకు విశేషమేమియు లేదు. కనుక కృష్ణుఁ డన్నఁగా మూలరూపియైన వాసుదేవుఁ డని యర్థము. 'కృష్ణోముక్తై రిజ్యతే వీతమోహైః' అని ప్రమాణము. దీనితోఁ గృష్ణుఁ డను పేరు మూలరూపమున కున్నదని తెలియవలెను. కృష్ణావతారము సంపూర్ణావతార మనుట శాస్త్రసమ్మతము గాదు. ఈ కృష్ణశబ్దమునకు మూలరూపియైన వాసుదేవుఁడే యని యర్థము.

గుహ్యం జన్మ–అని శ్రీధరు లన్వయింపఁగా జన్మగుహ్యం అని విజయధ్వజులు. అవతార రహస్యములని యర్థము.

అవ: పైఁ జెప్పినట్లుగా శ్రీహరియొక్క స్వరూపాంశములైన కౌమారాది రూపములను ప్రతిబింబాంశములైన ఋష్యాదిరూపములను జెప్పి ఇప్పుడు జడాత్మకమైన ప్రతిరూపమును జెప్పుచున్నాఁడు–

అరూపస్య–స్వయముగాఁ బ్రకృతివికారమైన జడరూప రహితుఁడైన, చిదాత్మనః–జ్ఞానాత్మకమైన దేహముగల, భాగవతః–సమస్తైశ్వర్యసంపన్నుఁడైన శ్రీహరికి, మాయాగుణైః=ప్రకృతికార్యములైన మహదహంకారాది తత్త్వములచేత, విరచితం=శ్రీహరిచే నిర్మితమైన, ఆత్మని (ఆశ్రితం)=సర్వత్ర వ్యాప్తమైన శ్రీహరి స్వరూపదేహమందు ఆశ్రయమును బొందియుండిన, ఏ తత్ =మనకుఁ గనపడు

చున్న బ్రహ్మాండ మనెడు జడాత్మక ప్రపంచము, రూపం = ప్రతి రూపము సాక్షాత్స్వరూపము గాదు. ఇది ప్రమాణసిద్ధము.

తాత్పర్యము: ఈ కన్పించునట్టి బ్రహ్మాండ మను జడజగత్తు మహత్తు, అహంకారము, తత్త్వము మొదలైన ప్రాకృతపదార్థములతో శ్రీహరిచే నిర్మితమైనది. ఈ జడజగత్తునకు శ్రీహరి స్వరూప దేహమే యాశ్రయము. అతఁడు సర్వత్ర వ్యాప్తుఁడై దాని కాధారమై నిలిచియున్నాఁడు. శ్రీహరి జ్ఞానస్వరూపుఁడు అప్రాకృతరూపుఁ డగుటచే నీ బ్రహ్మాండ మాతని ప్రతిరూపమే గాని స్వరూపము గానేరదు. జడజగత్తును పరమాత్ముని స్వరూపమని చెప్పుట భ్రాంతి.

యథా నభసి మేఘౌఘో రేణుర్వా పార్థివోఽనిలే,
ఏవం ద్రష్టరి దృశ్యత్వ మారోపిత మబుద్ధిభిః. 31

అతః పరం యదవ్యక్త మవ్యూఢ గుణబృంహితమ్,
అదృష్టాశ్రుతవస్తుత్వా త్సజీవో యత్పునర్భవః. 32

యత్రేమే సదసద్రూపే ప్రతిషిద్ధే స్వసంవిదా,
అవిద్యయాఽత్మని కృతే ఇతి తద్బ్రహ్మదర్శనమ్. 33

యద్యేషో పరతాదేవీ మాయా వైశారదీ మతిః,
సంపన్న ఏవేతి విదు ర్మహిమ్ని స్వే మహీయతే. 34

మేఘౌఘః = మేఘసమూహము, నభసి = ఆకాశమందును, పార్థివః = పృథివీ సంబంధమైన, రేణుః = ధూళి, అనిలే = వాయువునందు, యథా = ఎట్లు, ఆరోపితం = ఆరోపింపఁ బడినవో, ఏవం = ఇట్లు, ద్రష్టరి = చూచెడివానియందు, దృశ్యత్వం = చూడఁబడునది యన్న భావము, అబుద్ధిభిః = జ్ఞానములేని వారిచేత, ఆరోపితం = మోపఁబడినది.

అవ: ఆత్మస్థానమందు శరీరద్వయము కల్పింపఁబడిన దెట్లు? ఈ విషయమును దృష్టాంతపూర్వకముగా స్పష్టపఱచుచున్నాఁడు—

యథార్థవస్తువును మఱపింపఁజేసి దానిస్థానమందు వేఱొక్క దానిని గల్పింపఁజేయు సామర్థ్యవిశేష మవిద్య కున్నది. దానినే 'అధ్యాసశక్తి'యని వేదాంతశాస్త్రమం దందురు. ఈ శక్తియే ఆత్మస్థానమందు దేహద్వయమును గల్పించినది. దీనిని జెప్పుట కుదాహరణముగా వాయువు నాశ్రయించి చలించెడు మేఘసమూహమునుజూచి జ్ఞానహీనులైన జనులు ఆకాశ మని పిలుతురు. భూమినుండి లేచిన భూరేణువుల కారణముగా నేర్పడిన ధూసరత్వము వాయుగుణముగాఁ గందురు. ఇట్లే దృశ్యములైన శరీరాదుల ధర్మములను, జనన మరణాదులను ద్రష్టయైన యాత్మయం దారోపించుట అజ్ఞానలక్షణము. ద్రష్టయైనవాఁడు దృశ్యపదార్థము గాఁడన్నది స్పష్టమైన విషయమే గదా! నా దేహము స్థూలమైనది, కృశించినది-ఇత్యాది శరీరధర్మములైన స్థౌల్యకార్శ్యాదులను జూచుచున్న యాత్మ శరీరము గాదు. దాని నుండి భిన్నుఁడని స్పష్టమైన వాస్తవమిట్లుండఁగా 'నేను జన్మించితిని నేను మరణింతును'. ఈ విధమైన భావములు అజ్ఞానమాత్రముచేత నేర్పడునని భావము. 31

అతః=ఈ స్థూలదేహమునకంటె, పరం=అన్యమైనదియు, అవ్యక్తం=వ్యక్తము గానిదియు, అదృష్టశ్రుతవస్తుత్వాత్=కనఁబడనిదియు, వినఁబడనిదియునైన వస్తువుయొక్క భావము నిమిత్తముగా, అవ్యూఢ గుణబృంహితం=వ్యూహముగ (కరచరణాద్యవయవములై) ఏర్పడని గుణములచేత నుండుచున్నట్టి, రూపం=స్వరూపము గూడ, ఆరోపితం=ఆరోపింపఁబడినది, యత్=దేనిని హేతువుగాఁ జేసికొని, పునర్భవః=రెండవదియైన జన్మము, సః జీవః=ఉపాధిగాఅగునో,

ఆత్మయం దారోపింపఁబడుచున్నది. స్థూలశరీరము మాత్రమే గాదు. దానికంటె భిన్నమైనదియు, చూచుటకు వినుటకు సాధ్యము గానిది యగుటచే నవ్యక్తమైనదియు, కరచరణాదులగు నవయవములలోఁ బరిణమించని మాయాగుణములచేత నిర్మితమైన సూక్ష్మశరీరము గూడ నజ్ఞాను లాత్మయం దారోపింతురు. దానిని లింగదేహమని గూడఁ బిల్తురు. ఇది యవ్యక్తము అదృష్టము అశ్రావ్యము. ఈ

సూక్ష్మశరీరము లేదని యొప్పుకొన్నచో గల్గు లోపమేమి? దానినే వివరించుచున్నాఁడు. జీవులు స్థూలదేహమును విడిచిపోవునదియు, పునర్జన్మము నవలంబించునదియు నీ లింగదేహము నాశ్రయించియే. దాని ద్వారానే జీవుని గతాగతములు. కనుక నీ లింగదేహమే జీవున కుపాధి. దీనిని లేదనుటకు వీలులేదు. 32

యత్ర=ఏ సమయమందు, అవిద్యయా=అవిద్యాశక్తిచేత, ఆత్మని=ఆత్మ యందు, కృతే=కల్పింపఁబడిన, ఇమే సదసద్రూపే=ఈ స్థూలసూక్ష్మములైన రూపములు, స్వసంవిదా=ఆత్మజ్ఞానముచేత, ప్రతిషిద్ధే=నిషేధింపఁబడినవిగా, భవతః=అగుచున్నవో, ఇతి=ఆ కారణముగా, తత్=అది, దర్శనం=జ్ఞానరూప మైన, బ్రహ్మ=బ్రహ్మము.

అవ: స్థూలము, సూక్ష్మము ననెడు నీ రెం డుపాధులను స్పష్టముగాఁ జెప్పిన పిదప నా రెండు రూపములును బ్రతిషేధింపఁబడి నప్పుడు జీవుడు బ్రహ్మస్వరూపుఁడుగా నగునని స్పష్టపఱచుచున్నాఁడు.

అజ్ఞానముతో నాత్మయందు స్థూలసూక్ష్మశరీరము లారోపింపఁ బడునంటిమి. భగవత్కథాశ్రవణము, మననము మొదలైన వానితో జనించెడు భక్తిచేత నాత్మస్వరూప మనుభవమునకు వచ్చునపుడు స్వరూపానందము హృదయమం దుదయమైనప్పుడు పై యారోపము ప్రతిషేధింపఁ బడుచున్నది. అధిష్ఠానము ప్రకాశించునపుడు ఆరో పము లేకపోవుట స్వానుభవములో నున్న విషయమే. రజ్జువునందు సర్పమనెడు భ్రాంతి వెలుతురులో రజ్జువని తెలిసినప్పుడు పా మనెడు బుద్ధి తనంతనే నశించును. అట్లే స్థూలసూక్ష్మములైన యుపాధులు నశించును. అప్పుడు జీవుఁడు జ్ఞానస్వరూపమైన బ్రహ్మముగనే యగును. 33

వైశారదీ=విశారదుఁడు. అనఁగా సర్వజ్ఞుఁడైన బ్రహ్మకు సంబంధించినట్టి, దేవీ=క్రీడాత్మికయైన, ఏషామాయా=ఈ మాయ అనఁగా నవిద్య, మతిః=విద్యా రూపిణిగా. ఉపరతా యది=తన క్రీడ నెప్పుడు చాలించుకొనునో, తదా=అప్పుడు,

సంపన్నః=బ్రహ్మీభూతుఁడైనాఁడు, ఇతి=అని, విదుః=తెలియుదురు, స్వేమహిమ్ని=తన మహిమయందే, మహీయతే=శోభించును.

అవ: సంసారకారణభూతమైన భగవన్మాయ నశింపనప్పుడు జీవునకు బ్రహ్మత్వ మెట్లు సిద్ధించును? ఈ సంశయమును బరిహరించుచున్నాఁడు-

సర్వజ్ఞుఁడైన భగవంతునకు సంబంధించినది మాయ. ఆమెయే సృష్ట్యాదిక్రీడ లొనర్చును. అవిద్యారూపముతో జీవోపాధిగాఁ బరిణమించినది. ఆ మాయాదేవి భక్తిమహిమతో విద్యారూపముగా మారును. అప్పు డవిద్య నశించినది. అవిద్యాగుణములైన యావరణ విక్షేపములు గూడ నశించును. వెంటనే జీవుఁడు బ్రహ్మస్వరూపుఁ డగును. తన మహిమయైన స్వస్వరూపమునందు శోభించును. సచ్చిదానంద స్వరూపుఁడైన జీవునిస్వరూపమును మఱపించుట యావరణము. దాని స్థానమందు దేహమును బ్రకాశింపఁ జేయునది విక్షేపము. ఈ రెండు నవిద్యావిలాసములే. దీనిని నశింపఁ జేయునదియు మాయయే. ఆ యంశమునకే విద్యయని పేరు. ఆ విద్యారూపిణియొక్క యుదయమునకు గారణము భగవద్భక్తియే.

శ్రీధరీయము:

అవ: ఆత్మస్థానమందు శరీర మారోపింపఁబడినదని ముందుఁ జెప్పినాఁడు. ఎట్లు? ఈ ప్రశ్నకే సమాధానముఁ జెప్పుచున్నాఁడు-

స్వరూపావరణముచేత తదధ్యాసము. దీనిని దృష్టాంతీకరించుచున్నాఁడు. వాయ్వాశ్రితమైన మేఘసమూహము ఆకాశమందు బుద్ధిహీనులతో నారోపింపఁబడుచున్నది. అట్లే పార్థివమైన రేణువును తద్గతమైన ధూసరత్వాదులును వాయువునందారోపితములగుచున్నవి. అట్లే ద్రష్టయైనయాత్మయందు దృశ్యమైన రూప మారోపింపఁబడినది.

అవ: స్థూలరూపము కంటెను భిన్నమైన వేఱురూపముగూడ నారోపింపఁబడినదని యనుషంగము. ఆరోపితమైన యా లింగదేహ

మెట్టిది? అవ్యక్తము సూక్ష్మమైనది. ఎట్లు? వ్యూహమనఁగాఁ గరచరణాది పరిణామము.

అవ్యూఢాః = అపరిణతాః, గుణాః = కరచరణాదయః తైర్గుణైః బృంహితం = రచితం. ఆకారవిశేషరహిత మగుటచేత నవ్యక్తమైనదని భావము. ఇది మఱియు నెట్టిది? అదృష్టాఽశ్రుత వస్తుత్వాత్ = ఆకార విశేషముగల వస్తువు అస్మదాదులవలె దృశ్యమాన మగుచున్నది. ఇది యట్లు లేదు. అట్లైనచో దాని యునికిలోఁ బ్రమాణ మేమి? సఃజీవః = ఆ జీవున కుపాధిభూతమైనది లింగశరీరము. 'జీవేన జీవో నిర్ముక్తో జీవో జీవం విహాయచ' ఇత్యాదులను జీవున కుపాధియైన లింగశరీర మందు జీవశబ్దప్రయోగము గన్పడుచున్నది. ఇది యౌపచారిక ప్రయోగము. భోగాయతనమైన స్థూలదేహమే జీవోపాధి యని యంగీకరింతము. వేఱుగా లింగశరీరకల్పన మెందుకు? దానికి సమాధానముగా 'యత్పునర్భవః' అనుచున్నాఁడు. యత్ = ఏ కారణముతో, పునర్భవః = పునర్జన్మ యేర్పడుచున్నదో - జీవుని యుత్క్రాంతి గతాగతములు లింగశరీరము లేక యేర్పడవని భావము.

అవ: ఈ రీతిగా నుపాధిద్వయమును జెప్పి, తదపవాదముతో జీవునకు బ్రహ్మత్వమును వివరించుచున్నాఁడు-

యత్ర = ఎప్పుడు, ఇమే సద సతీ = కార్యకారణ రూపములును స్థూలసూక్ష్మములును నైన ఈ రెండు శరీరములును, స్వ సంవిదా = శ్రవణ మననాది శక్తిచే నేర్పడిన స్వరూప సమ్యక్ జ్ఞానముచేత, ప్రతిషిద్ధే = నిషేధింపఁబడిన వగుచున్నవో, ఎట్లు? అవిద్యయా ఆత్మనికృతే = అవిద్యచే నాత్మయందుఁ గల్పింపఁబడినవని, తద్బ్రహ్మ = అప్పుడు తానే, బ్రహ్మదర్శనం = అనుభవముచేత, అనుభవము జ్ఞానైకస్వరూపము.

అవ: సంస్కృతికిఁ గారణభూతమైన భగవన్మాయ యుండనే యున్నదిగదా! అది యుండఁగనే బ్రహ్మస్వరూప మెట్లగును? దానికే సమాధానము-

యది=అనునది అసందేహమందు సందేహ వచనము. 'యది వేదాః ప్రమాణం స్యుః' అనుటవలె, వైశారదీ=విశారదుఁడు అనఁగా సర్వజ్ఞుఁడైన ఈశ్వరుఁడు, తదీయ వైశారది=సంసార చక్రముతోఁ గ్రీడించుచున్నది మాయ. ఆమె యెప్పుడు క్రీడ చాలించుకొనునో, అప్పు డే మగును? మతిః=విద్య. ఇది భావము.

ఎంతవఱకు భగవంతునిమాయ యవిద్యగా నుండి యావరణ విక్షేపము లొనర్చుచున్నదో యంతవఱకు యామెక్రీడ ముగియదు. ఆమె విద్యారూపముగా నెప్పుడు పరిణమించునో యపుడు జీవోపాధి యైన సదసద్రూపము నిరంధనాగ్నివలె తానే యుపరమించుచున్నది. అప్పుడు సంపన్నః=బ్రహ్మస్వరూపమును బ్రాపించినవాఁడు అని, విదుః=తత్త్వజ్ఞులు తెలిసికొందురు. తర్వాత నే మగును? స్వే మహిమ్ని=పరమానందరూపమైన తన మహిమయందు, మహీయతే= పూజింపఁబడును. విరాజిల్లు నని యర్థము.

విజయధ్వజము:

అవ: జడరూపము పరమాత్ముని ప్రతిమ అనుటకంటెను, సాక్షాత్స్వరూపమనియే యెందుకు చెప్పరాదు? అని యాశంకించి, అది భ్రాంతియని యుదాహరణపూర్వకముగాఁ జెప్పుచున్నాఁడు. జడ మారోపితమైనను, మిథ్య కాదని యు ఉదాహరణములతో స్పష్ట పఱచుచున్నాఁడు.

నభసి, మేఘౌఘాః, మేఘసమూహములు సత్యములైనను ఆరోపితము లని యెట్లు చెప్పఁబడుచున్నవో అట్లే మేఘముల చలనములనుజూచి ఆకాశము చలించుచున్నదని బుద్ధిహీను లారోపింతురు. యథా, అనిలే, పార్థివః రేణురివ=పృథివీ సంబంధమైన రేణుకణము, ఆరోపితః=గాలిచే పైకెగురఁ గొట్టఁబడుచు, ఎగిరి పోవుచున్న ధూళి కణమే గాలిగా వివేకశూన్యులచే నారోపింపఁబడినట్లు-

ఆకాశము వాయువు, యీ రెండును కంటికగుపడని పదార్థములు. అందుచే మేఘములనే యాకాశ మనుటయు, ధూళినే గాలి యనుటయు-భ్రాంతిజ్ఞానము సత్యమైనది గాదు.

విశేషార్థము : పరమాత్మకు స్వరూప, ప్రతిబింబ, ఆరోపిత (ప్రతిమా) రూపములనెడు మూఁడురూపములున్నవి. పద్మపురాణము ప్రమాణము.

నారాయణ వరాహాద్యాః పరమం రూపమీశితుః,
జైవంతు ప్రతిబింబాఖ్యం జడ మారోపితం హరేః.
ఏవం హి త్రివిధం తస్యరూపం విష్ణోర్మహాత్మనః.

నారాయణ వరాహాది రూపములు పరమాత్ముని యప్రాకృత రూపములు. అనఁగా స్వరూపరూపములు. జీవుఁడు ప్రతిబింబరూపము. జడము ఆరోపితమనిపించికొన్న ప్రతిమారూపము. ఇట్లు మహామహిముఁడైన విష్ణువునకు మూఁడురూపములున్నవి. అజ్ఞానులు జ్ఞానాత్మక దేహముగల శ్రీహరియందు జడదేహమును, దానిధర్మములైన జనన మరణములను ఆరోపింతురు. స్కాందమునం దిట్లున్నది.

అవిజ్ఞాయ పరం దేహమానందాత్మాన మవ్యయమ్.
ఆరోపయంతి జనిమత్వంచ భూతాత్మకం జడమ్.

అప్రాకృతము జ్ఞానాత్మకమునైన పరమాత్మరూపమును దెలియని యవివేకులు పంచభూతాత్మకమై, జననమరణ యుక్తమైన జడము శ్రీహరి దేహమం దారోపింతురు.

పై ప్రమాణములతో నీ భాగవతశ్లోకములకు చిత్స్వరూపియైన భగవంతునియందు మాయాగుణ కల్పితములైన మహత్తత్త్వాది రూపములుగాఁ బరిణామమందిన సత్త్వాదిగుణములతో నీ కన్పించెడు విరాడ్రూపము కల్పితమైనది. కనుకనే యిది మిథ్యాభూతము.

అని కొందఱుచేయు వ్యాఖ్యానము సరికాదు. దీనినే భాగవతాచార్యుఁడు. హి=అనుపదముచే సూచించిరి.

తాత్పర్యము : ఆకాశమందు మేఘములు గుంపులై పోఁబాడును. వానినే యాకాశమనుట భ్రాంతి. అట్లే మేఘచలనముతో నాకాశము చలించు ననునదియు భ్రాంతియే. వాయువునందు ధూళికణములను జూచి వానినే వాయువనుట భ్రాంతి. ఆ ధూళికణముల రూపమును జూచి వాయువునకు రూప మున్నదనుకొనుటయు భ్రాంతి. ఈ యుదాహరణములందుఁ జెప్పఁబడిన మేఘములు ధూళి ఈ రెండును సత్యపదార్థములే. మిథ్యగాదు. వానిని ఆకాశవాయువులందు అజ్ఞులారోపింతురు. అట్లే సత్యమైన ఈ జగత్తును శ్రీహరి స్వరూపదేహము లని యజ్ఞు లందురు. అట్లే జడధర్మములైన జనన మరణములను శ్రీహరి స్వరూపదేహములం దారోపింతురు, ఇది శాస్త్రవిరుద్ధము. కనుక ఆరోపితరూప మనఁగా ప్రతిమారూప మనియే యర్థము. పరమాత్మ త్రివిధరూపములను పద్మపురాణము చెప్పినది. జీవుఁడు ప్రతిబింబరూపము. జడము ప్రతిమారూపము.

అవ: పైని చెప్పినట్లు శ్రీహరి వాసుదేవాది స్వరూపములను బ్రహ్మాండమనెడు ప్రతిమారూపమును జెప్పి యిప్పుడు ప్రతిబింబ రూపములైన జీవులస్వరూపమును జెప్పుచున్నాఁడు—

అతః = పరమాత్ముని స్వరూపరూపము ప్రతిమారూపము ఈ రెంటికంటె, పరం=భిన్నమైన, యత్ =ఏ, అవ్యక్తం=సూక్ష్మమైన (నిజస్వరూపము వ్యక్తము గాని), అవ్యూఢగుణ బృంహితం = అనాది కాలమునుండి యెప్పుడును, సంబంధమును వదలకుండు, సత్త్వ రజ స్తమో గుణములచే పూర్ణమైన, అందుచేతనే అదృష్టాశ్రుత వస్తుత్వాత్ = తర్వాత పరమాత్మ నుపాసింపకుండుటచేత, యః = ఏ చేతనము,పునర్భవః=మాటికి జననమరణముల నందునో, సః=ఆరూపమే,

జీవః=జీవుఁ డనిపించుకొనును. కనుక జీవుఁ డనిపించుకొను ప్రతిబింబరూపము ఈశ్వరుని యధీనమని యభిప్రాయము.

తాత్పర్యము: శ్రీహరి స్వరూపరూపము ప్రతిమారూపముల కంటె భిన్నమైన ప్రతిబింబరూపములే జీవులు. వీరు అతిసూక్ష్మస్వరూపులు. ప్రకృతికార్యములు గాదు. వీరి నిజస్వరూపము సంసారావస్థయందు వ్యక్తముగాదు. త్రిగుణములనెడు ప్రాప్తగుణము లనాదికాలము నుండియు వీరి నావరించియున్నవి. ఈ యవస్థలో వా రినెప్పుడును వదలిపోవు. ఈ యావరణముండుటచే వీరు పరమాత్మ నుపాసింతురు. అపరోక్షీకరించికొనరు. అందుచే మాటికిని జనన మరణము లందుచుందురు. ఈ జీవులే పరమాత్ముని ప్రతిబింబరూపములు. ఇట్లు వీ రెప్పుడును శ్రీహరి కధీనులు. వానికంటె భిన్నులు.

అవ: అనాదియైన ఇట్టి జీవబంధమును వదలించునది బ్రహ్మజ్ఞానమే గాని కేవల కర్మానుష్ఠానము గాదనుచున్నాఁడు—

యత్ర = ఏ పరమేశ్వరునియందు, ఇమే సదసద్రూపే = ఈ ప్రకృతి-ప్రాకృత రూపములు, స్వసంవిదా=ఎప్పుడును, తనకు సంబంధించిన సాక్షాత్కారముతో, ప్రతిషిద్ధే = అనాదికాలము నుండి నివృత్తములైనవో, ఈశ్వరసాక్షాత్కారము స్థూలసూక్ష్మశరీర విరోధి. అందుచే సర్వదా జ్ఞానస్వరూపుఁడైన ఈశ్వరునియందిపి రెండును సంభవింపనేరవు. అవిద్యయా=ఈశ్వరునికి సంబంధించిన యజ్ఞానముచేత, ఆత్మని=జీవునియందు, కృతే=ఉండుచున్నది, ఇతి=ఈవిధమైన యత్ దర్శనం=ఏ జ్ఞానముగలదో, తత్ బ్రహ్మదర్శనం=అదే బ్రహ్మజ్ఞానము, అదే సంసారనివర్తకము. ఈశ్వరుఁడు నిత్యముక్తుఁడు. జీవునికి ప్రకృతికి సంబంధమును గల్పించినవాఁడు. ఈ జ్ఞానమే బ్రహ్మజ్ఞానము. అహం అనునది కాదు. ఇట్లు చెప్పుటచేత జీవభిన్నుఁడైన బ్రహ్మ లేఁడు. జీవుఁడు అహం అనుజ్ఞానమునకు విషయమగుటచే నదృష్టవస్తువు అని వ్యాఖ్యానించుట భ్రాంతి.

తాత్పర్యము: అనాదికాలము నుండి యున్న యీ జీవుని
సంబంధించిన బంధమును బ్రహ్మజ్ఞానముతోఁ బోఁగొట్టుకొనవలెను
బ్రహ్మజ్ఞానము లేని కేవల కర్మాదు లీ బంధమును వదలింపలేవు
శ్రీహరి సర్వదా స్వస్వరూపజ్ఞానము గలవాఁడు గనుక నాతనియందు
స్థూలశరీరము గాని ఆవరణ మనిపించుకొనెడి సూక్ష్మశరీరము గాని
యుండవు. అతఁడు నిత్యముక్తుఁడు. లింగశరీరాదులు ప్రాకృతశరీర
రహితులు. ఇట్లుగా భగవంతుని తెలియని యవిద్యచేతనే జీవుని
బంధకములైన శరీరములు ప్రాప్తించినవి. ఇవే యీశ్వరసాక్షాత్కార
మునకు ప్రతిబంధకములు. వీనిని జీవసంబంధము గలవిగా నీశ్వరుఁ
డొనర్చెను. ఈ విషయమును దెలియుటయే బ్రహ్మజ్ఞానము. ఇవే
సంసార నివర్తకములు. 'అహం' అని తెలియు జ్ఞానము బ్రహ్మ
జ్ఞానము గాదు. జీవబ్రహ్మ లొకటి గాదు. ఇట్టి బ్రహ్మవస్తువును
సాక్షాత్కరించికొనకుండుటచే జీవుఁ డదృష్టవస్తువు.

అవ: పైని చెప్పిన విషయమునే యింకను స్పష్టీకరించు
చున్నారు-

యది=సమీచీనమైన యపరోక్షజ్ఞాన మేర్పడినప్పుడు సంభ
వించెడి యుత్తమప్రసాదరూపమైన, ఏషా=ఈ, వైశారదీ=విశారదుఁ
డనిపించికొన్న శ్రీహరికి సంబంధించిన, దేవీ=ప్రకాశమానమైన,
మతిః=జ్ఞానాత్మకమైన మాయ, 'నైనం శోచయామి'='ఈ జీవుని
సంసారమందుంచి దుఃఖింపఁజేయను' అనెడు శ్రీహరి ఇచ్ఛ, ఉప
రతా=జీవునికి సంసారమును గల్పించు కార్యమునుండి నివృత్తమగునో
(పరమాత్ముని ఈ ఇచ్ఛయే సంసారనివర్తకమని యర్థము), తదా=
అప్పుడు, జీవం=జీవుని, సంపన్న ఏవేతి=పరబ్రహ్మను పొందినవాఁ
డని, విదుః=జ్ఞానులు దెలియుదురు. మఱియు నట్టి జీవుఁడు, స్వే=
తన స్వరూపభూతములైన జ్ఞానానందము లనెడు, మహిమ్ని=మహిమ

యందున్న వాఁడై (జ్ఞానానందముల ననుభవించు చున్నవాఁడై), మహీయతే-తారతమ్యమునందుఁ దనకంటెఁ దక్కువవారైన ముక్త జీవులతోఁ బూజింపఁబడును.

విశేషార్థములు: 'ఉపరతా' అనుటచే ప్రారబ్ధకర్మము, జీవునకు లేశమాత్రముండునని సూచించుచున్నాఁడు. అందుకే 'సంపన్న ఏవేతి విదుః' సంపన్నుఁడే యయ్యెనని చెప్పుట. అనఁగా కర్మక్షయరూప ముక్తియయ్యెనని యర్థము. ఇది పరమముక్తికి సమీపమున నున్నది. కనుకనే బ్రహ్మజ్ఞానులైనను శుకాదులకింకను ముక్తి దొరకలేదు. ప్రారబ్ధము పూర్తిగా నశించినప్పుడే పరమముక్తి లభించును.

తాత్పర్యము: ఇట్లు జీవుఁడు బ్రహ్మజ్ఞానమును సంపాదించి శ్రీహరి నపరోక్షీకరించికొన్నప్పుడు భగవంతుఁ డుత్తమప్రసాదము నొనర్చెనని పెద్ద లందురు. ఇఁకమీఁద వీనిని సంసారమున నుంపను అని శ్రీహరి యిచ్చు యేర్పడుటచే నా జీవుఁడు సాంసారికదుఃఖముల ననుభవింపఁడు. కాని ప్రారబ్ధకర్మము ముగియువఱకును పరమముక్తి నందఁడు. ఇట్లున్నను పెద్ద లా యవస్థయందలి జీవుని బ్రహ్మము నందినవాఁడే యందురు. ప్రారబ్ధకర్మ నశించిన తర్వాతఁ దన స్వస్వరూపానందము ననుభవించు పరమముక్తిని జీవుఁడు పొందును. అప్పుడు తారతమ్యమున వీరికన్న క్రిందివారు వీరిని సేవింతురు. ఈ రెండు విధములైన మోక్షములలో మొదటిదానికి 'గర్మక్షయముక్తి' యని పేరు. శుకాదులైన బ్రహ్మజ్ఞాను లీ కోవలోనివారు. ప్రారబ్ధకర్మ పూర్తిగాఁ దొలఁగనందున పరమముక్తి వారికింకను లభింపలేదని యర్థము. ఈ బంధకప్రకృతికిని మోచకజ్ఞానమునకును దుర్గాదేవి యభిమానిదేవత యని తెలియవలెను. ఆమె యనుగ్రహమే మోక్షతారకము.

**పోతన్నగారు:**

మ. సరసింబాసినఁ బాయు కాలువల యోజన్ విష్ణుసంద్భైన శ్రీ
కర నానాప్రకటావతారము లసంఖ్యాతంబు లుర్వీశులున్
సురలున్ బ్రాహ్మణసంయమీంద్రులు మహర్షుల్ విష్ణునంశాంశజుల్
హరి కృష్ణుండు బలానుజన్ముఁ డెడలే దా విష్ణుఁడౌ నేర్పడన్.

భగవంతుండగు విష్ణుఁడు
జగముల కెవ్వేల రాక్షసవ్యధ గలుగున్
దగ నవ్వేళల దడయక
యుగయుగమునఁ బుట్టి కాచు నుద్యల్లీలన్.

అతిరహస్యమైన హరిజన్మకథనంబు
మనుజుఁ డెవ్వఁడేని మాపురేపుఁ
జాలభక్తితోడఁ జదివిన సంసార
దుఃఖరాశిఁ బాసి తొలఁగిపోవు.

వ. వినుం డరూపుండయి చిదాత్మకుం డయి పరగు జీవునికిఁ బరమేశ్వరు మాయాగుణంబులైన మహదాదిరూపంబులచేత నాత్మ స్థానంబుగా విరచితంబైన స్థూలశరీరంబు, గగనంబునందుఁ బవనాశ్రిత మేఘసమూహంబును గాలియందుఁ బార్థివధూళిధూసరత్వంబును నే రీతి నారీతి ద్రష్టయగు నాత్మయందు దృశ్యత్వం(బై)బు బుద్ధిమంతులుగాని వారిచేత నారోపింపఁబడు. ఈ స్థూలరూపంబుకంటె నదృష్టగుణంబయి యశ్రుతం బయిన వస్తువగుటం జేసి వ్యక్తంబుగాక సూక్ష్మంబై యుండు. సూక్ష్మండయిన జీవునివలన నుత్క్రాంతి గమనాగమనంబులం బునర్జన్మంబు దోఁచును. ఎప్పు డీ స్థూలసూక్ష్మరూపంబులు రెండు విద్యంజేసి యాత్మకుఁ గల్పింపంబడె ననియెడి హేతువువలన స్వరూప సమ్యగ్జ్ఞానంబునం బ్రతిషేధింపఁ బడుననియును నవిద్యం జేసి, యాత్మను గల్పింపఁబడుననియును దెలియు నప్పుడు జీవుండు బ్రహ్మదర్శనంబున కధికారియగు; దర్శనం బన

జ్ఞానైకస్వరూపంబు. విశారదుండైన ఈశ్వరునిదై క్రీడించుచు నవిద్య యనంబడుచున్న మాయ యుపరతయై యెప్పుడు దా (న) విద్యారూపంబునం బరిణతయగు జీవోపాధియయిన స్థూల సూక్ష్మరూపంబు దహించి జీవుండు గాష్ఠంబు లేక తేజరిల్లు వహ్నిచందంబునం దాన యుపరతుండయి బ్రహ్మస్వరూపంబునం బొంది పరమానందంబున విరాజమానుండగు; ఇట్లు తత్త్వజ్ఞులు సెప్పుదురని సూతుం డిట్లనియె.

అర్థము: సరసిన్ పాయుచున్=సరస్సునుండి విడివడి, పాఱు కాలువల యోజన్=పాఱెడి కాలువలవలె, విష్ణునందునన=మూలరూపమైన విష్ణువునుండి బయలుదేఱెడి, శ్రీకర=లోక క్షేమమును గలిగించెడి, నానా=అనేకరూపములైన, ప్రకటు=ప్రత్యక్షములైన అవతారములు, అసంఖ్యాతంబులు=లెక్కకుమీఱినవి, ఉర్వీశులున్=రాజులు, సురలన్=దేవతలు, బ్రాహ్మణ సంయమీంద్రులు=బ్రాహ్మణులు, మునులు, మహర్షుల్=మహాఋషులును, విష్ణునంశాంశజుల్=విష్ణువు యొక్క యంశములు కొందఱు, అంశాంశజులు మఱికొందఱు, బలానుజన్ముఁడు=బలరాముని తమ్ముఁడైన, కృష్ణుఁడు=హరి యను పేరుగల మూలరూపము వీర్పడన్, ఆ విష్ణుఁడౌ=ఆ మూలరూపమైన విష్ణువే, ఎడలేదు=సందేహము లేదు.

తాత్పర్యము: ఎప్పుడు నెండిపోని ఒకసరస్సునుండి బయలుదేఱు ననేక కుల్యలవలె శ్రీమహావిష్ణువు నుండి యసంఖ్యాకములైన యవతారములు బయలుదేఱును. గొప్పరాజులు, మునులు, మహర్షులు వీరంద రాతని యంశావతారములు. కొన్ని యంశాంశములు. కృష్ణుఁడు పరిపూర్ణావతారము; ఇందు సందేహము లేదు.

విశేషార్థములు: అవిదాసినః అను మూలపదము తెలుఁగులో రాలేదు. శ్రీకరము=సమస్తావతారములును లోకమునకు క్షేమమును గలిగించునవే, నానా=అనేకరూపములు, 'దేవతిర్యఙ్నరాదిషు' అని

మూలమందుఁ జెప్పఁబడినట్లు అనేకజాతులయం దవతారము, ప్రకృతు =స్పష్టములైన అనఁగా మానవులకంటె కగుపించునవని యర్థము. అసంఖ్యాతములు 'అసంఖ్యేయాః' అని మూలము. బ్రాహ్మణసంయ మీంద్రులు, బ్రాహ్మణులు, మునులు. మునులకన్న మహర్షులు గొప్పవారని భావము. విష్ణునంశాంశజుల్=అవతారములలోఁ గొన్ని యంశములు, కొన్ని కళలు గొన్ని విభూతులు. మత్స్యాద్యవతార ములకు సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్త్వము లున్నను గావలసినంతవఱకే వాని ప్రాకట్యము. కుమార నారదాదులందు యథాయోగముగా, నంశకలావేశము. కుమారాదులందు జ్ఞానావేశము, పృథురాజాదు లందు శక్త్యావేశము. కృష్ణుఁడు సాక్షాన్నారాయణుఁడే.

భగవంతుండగు విష్ణుఁడు షడ్గుణైశ్వర్య సంపన్నుఁడైన నారా యణుఁడు, ఎవ్వేళన్ = ఎప్పుడును, జగములకున్ = లోకములకు, రాక్షసవ్యథ=రాక్షసులనుండి దుఃఖము, కలుగున్=కలుగునో, తగన్= ఆ యా యుగముల కనురూపముగా, యుగయుగమునన్ = ప్రతి యుగమునందును, పుట్టి=అవతారమెత్తి, ఉద్వృత్తిలీలం గాచున్=రమ ణీయములైన లీల లొనర్చుచు రక్షించును.

తాత్పర్యము: రాక్షసులు జగముల నెప్పుడెప్పుడు బాధింతురో అప్పుడు శ్రీహరి యవతార మెత్తి లోకమును రక్షించును.

హరిజన్మ కథనంబున్ = హరి యవతారమెత్తిన చరిత్రను, మనుజుఁ డెవ్వఁడేని = ఎటువంటి మనుష్యుఁడైనను, మాపురేపు = సాయం ప్రాతస్సులందు, చాలభక్తితోడన్=గొప్పభక్తితో, చదివినన్ = పఠించినయెడల, సంసారదుఃఖరాశిన్=సంసారదుఃఖముల గుంపును, పాసి=విముక్తుఁడై, తొలఁగిపోవున్=మోక్షము నందును.

విశేషములు: భక్త్యా = అనుటకుఁ దెనుఁగు 'చాల భక్తితోడన్' అనునది. దుఃఖగ్రామాత్ 'అనుటకు' సంసారదుఃఖరాశిన్ అని

యూంధ్రము. సంసారమునకన్న మించిన దుఃఖము లేదుగదా! చిదాత్మకుడు=జ్ఞానస్వరూపుడు. పరమేశ్వరుని మాయాగుణంబులైన= భగవంతుని మాయయొక్క గుణములైన మహదాదిరూపములచేత నాత్మస్వరూపుడైన జీవునకు, స్థూలశరీరము విరచింపబడినది. ఎక్కడ? 'ఆత్మస్థానంబుగాన్' ఆత్మస్వరూపముగానని యర్థము. అనగా జీవుడు భగవంతుని మాయాగుణములైన మహదాదులచే నిర్మితమైన స్థూలరూపమునే యాత్మయని తలచుచున్నాడు. తన నిజస్వరూపముగా భావించుచున్నాడని తాత్పర్యము. ఎట్లు? దీనికే యుత్తరము జెప్పుచున్నాడు.

స్వరూపావరణముచేత తదధ్యాసమని భావము. దానినే యుదాహరణపూర్వకముగా జెప్పుచున్నాడు. ఆకాశము శూన్యము. దానికి రూపములేదు. కాని పవనాశ్రితమైన మేఘరూపము దానియందున్న ధూసరత్వము వాయువునందారోపిత మగుచున్నది. ఈ రీతిగా ద్రష్టయైన యాత్మయందు దృశ్యత్వాది ధర్మకమైన శరీరమారోపింపబడును. అనగా నాత్మస్వరూపు డగుటచే ద్రష్టయైన జీవుడు, దృశ్యత్వము నారోపించికొనుచున్నాడు. ఇంతే కాదు. ఈ స్థూలరూపమునకంటెను భిన్నమైన మఱియొక్క రూపముగూడ, నారోపింపబడుచున్నది. దానికే లింగశరీరమని పేరు. ఇది చాలసూక్ష్మమైనది. ఎందువలన? కరచరణాది పరిణామములేని దాని వలన. ఆకార విశేషరహిత మగుటచే నిది యవ్యక్తము. దానిని జూచిన వారు లేరు. విన్నవారును లేరు. ఆకార మున్నచో నస్మదాదులవలె నగుపించెడిది. లేక యింద్రాదులవలె శ్రూయమాణ మయ్యెడిది. మఱి అట్టి సూక్ష్మశరీరము నెందు కంగీకరింపవలెను? అదిలేదని యొప్పుకొన్నచో, జీవుడు దేహమునుండి నిష్క్రమించుట, పరలోకమునకుఁ బోవుట, అక్కడ సుఖదుఃఖాదుల ననుభవించి, మఱలనొకదేహమునకు వచ్చుట మొదలగునవి సంఘటించుటకు మార్గములేదు.

అందుకే లింగశరీరము నంగీకరింపవలెను. ఈ రెండు విధములైన శరీరములును, మాయారచితములే. ఈ భ్రాంతి- 'నేనాత్మను' అనెడు తన స్వరూపము నెఱుఁగు ఉత్తమ జ్ఞానముచేఁ దొలఁగి పోవును. అవిద్యచేత నిది యాత్మస్వరూపుఁడైన తనయందుఁ గల్పింపఁబడినవని స్పష్టముగా ప్రతిభాసించును. అప్పుడు జీవుఁడు బ్రహ్మదర్శనమున కధికారి యగును. 'బ్రహ్మదర్శనం' అను మూలపదము 'దర్శనంబన జ్ఞానైకస్వరూపంబు' అను దానిచేత వివరింపఁబడినది. విశారదుఁడు సర్వశక్తిమంతుఁడు. అతనిమాయ క్రీడాపరమైనది. అప్పుడు దాని కవిద్యయని పేరు. బ్రహ్మజ్ఞానముచే తన విద్య యుపరత యగును. అనఁగా తన క్రీడను జాలించుకొనును. దానికే 'విద్య' యని పేరు. క్రమముగా శ్రవణ మననాదుల వలన, నవిద్యవిద్యగాఁ బరిణమించును. అప్పుడు జీవునియం దారోపింపఁబడిన. స్థూలసూక్ష్మరూపములకు సంబంధించిన యజ్ఞానము తొలఁగిపోవును. కాష్ఠములులేని వహ్ని చల్లారిపోవునట్లు జీవుఁడు భిన్నుఁడుగాఁ దోఁపక బ్రహ్మస్వరూపము నందును. అదే పరమానందస్థితి, ఇట్లని తత్త్వజ్ఞులు చెప్పెదరు.

ఏవం జన్మాని కర్మాణి హ్యకర్తురజనస్యచ,
వర్ణయంతిస్మ కవయో వేదగుహ్యాని హృత్పతేః. 35

ఏవం=ఈరీతి, హృత్పతేః=అంతర్యామియైన, అజనస్య=జన్మహీనుఁడైనవానికి, వేదగుహ్యాని=వేదరహస్యములైయున్న, జన్మాని=జన్మములను, అకర్తుః=కర్త కానటువంటి వానికి, కర్మాణి=కర్మములను, కవయః=జ్ఞానులైన వారు, వర్ణయంతిస్మ=వర్ణించియున్నారు.

జీవునకు, జన్మకారణము మాయ. ఈశ్వరునకును జన్మకారణము మాయయే. మఱి జీవేశ్వరులకు భేదమేమి? మాయ జీవుని తన స్వాధీన మొనర్చికొని, వాని స్వస్వరూపమును మఱచునట్లు చేయును, ఈశ్వరునట్లు చేయలేదు. ఈ మాత్రమే యిర్వురకును వ్యత్యాసము. అందుచే నీశ్వరుఁడు నిత్యముక్తుఁడు; సర్వజ్ఞుఁడు.

జీవుఁడు బద్ధుఁడు; కించిత్ జ్ఞుఁడు. నిత్యముక్తుఁడు, సర్వజ్ఞుఁడునైన యీశ్వరుని సర్వరీతుల నాశ్రయించి యుండుటయే జీవునిబంధము నశించుటకు మార్గము. ముక్తుఁ డగుటకును మార్గ మిదియే. ఈ విషయమే యీ ప్రకరణసారము. సమస్తభూతములందును అంతర్యామియై పరమాత్ముఁ డుండును. వానికి జన్మాది వికారములు లేవు. వాఁడకర్త. కాని తన యిచ్ఛ ననుసరించి వాఁడు మాయ నంగీకరించును. అట్లగుటచే నానావతారములును, నానాకర్మములును నేర్పడుచున్నవి. తత్త్వజ్ఞులైన ఋషుల్ప్రకారమే చెప్పుదురు. ఇదియే వేదములం దీశ్వరుని గుఱించి ప్రతిపాదింపఁబడిన రహస్యము.

సవా ఇదం విశ్వమమోఘలీలః,
సృజత్యవత్యత్తి న సజ్జతేఽస్మిన్,
భూతేషు చాంతర్హిత ఆత్మతంత్రః
షాడ్వర్గికం జిఘ్రతి షడ్గుణేశః. 36

అమోఘలీలః=నిష్ఫలముగాని లీలతోఁగూడియున్న, సవై=వాఁడే, ఇదం విశ్వం=ఈ సమస్తప్రపంచమును, సృజతి=సృష్టించును, అవతి=రక్షించును, అత్తి=సంహరించును, అస్మిన్=దీనియందు, నసజ్జతే=బంధితుఁడుగాఁడు. ఆత్మతంత్రః=వాఁడు స్వతంత్రుఁడు. షడ్గుణేశః=అతీంద్రియములను నియమించువాఁడై, భూతేషు=సమస్తభూతములందును, అంతర్హితః=కన్నుల కగుపించక లోపల నున్నవాఁడై, షాడ్వర్గికం=అతీంద్రియములకు సంబంధించిన విషయములను, జిఘ్రతి=వాసనచూచును.

జీవునకును ఈశ్వరునకును జన్మకారణము మాయయే. మఱి యీ యిర్వురిలో విశేషమేమి? దానినే వివరించుచున్నాఁడు. ఈశ్వరుని సృష్ట్యాదిలీలలు నిష్ఫలములుగావు. జీవుని సంకల్పముల కాశక్తి లేదు. ఈశ్వరుని కిచ్ఛ కలిగినంతనే సమస్తమును నాతని యిచ్ఛాను రూపముగ రూపొందును. ఆ విధమైన యాత్మశక్తితో నాతఁడు సృష్ట్యాది క్రీడ లొనర్చును. ఐనను వాఁడు నిరంతర మాత్మారాముఁడు

గనే యుండును. వికారము నెన్నఁడును బొందఁడు. సృష్ట్యాది కర్మములతో వానికి సంబంధముగూడ నుండదు. జీవుఁడొనర్చెడి కర్మములు జీవుని బంధించును. జీవుని కర్మలతో దేవునికి పోలిక లేదు. దేవుడు స్వతంత్రుఁడై తాను దానుగా నుండును. అట్లుండి పంచేంద్రియములు వాని కధిపతియైన మనస్సు- వీనిని నియమించును. సర్వభూతాంతర్గతుఁడై వానిని నియమించును. ఈశ్వరునకుఁ గర్మలతో సమైక్యత లేకుండుటచేఁ దత్కృతములైన సుఖదుఃఖములు వాని కంటవు. దూరమునుండి వ్యాపించు గంధము నాఘ్రాణించినట్లు సర్వేంద్రియ విషయములను వాఁడు దెలిసికొనుచు సంతవలకేయుండును. దేనితోడి సంబంధమును లేక సర్వమునకును సంబంధించిన జ్ఞానమును గల్గియుండుట ఈశ్వరుని స్వభావము. జీవుని స్వభావమేమనఁగా విషయములయందు లీనుఁడై తత్సుఖదుఃఖముల ననుభవించుట.

న చాస్య కశ్చిన్నిపుణేన ధాతు
ర వైతిజంతుః కుమనీష ఊతీః,
నామాని రూపాణి మనోవచోభిః
సంతన్వతో నటచర్యామి వాజ్ఞః. 37

అజ్ఞః=జ్ఞానము లేనివాఁడు, నటచర్యాం ఇవ=నటునివృత్తిఁ బోలి,మనోవచోభిః=మనస్సుతోను, వాక్కుతోను, నామాని=నామములను, రూపాణి=రూపములను. సంతన్వతః=ఎక్కువగా విస్తరింపఁ జేయుచున్న, ధాతుః=సమస్తమును సృష్టించునట్టి, అస్య=ఇతనియొక్క, ఊతీః=లీలలను. కుమనీషః=కుత్సిత బుద్ధిగల, కశ్చిత్ జంతుః=ఒక్క ప్రాణియు, నిపుణేన=తర్క సామర్థ్యముతో, న అవైతి=తెలిసికొనలేఁడు.

అవ: ఈశ్వరుఁడు సృష్ట్యాది కర్మము లెందుకొనర్చును? జీవరూపుఁడై విషయభోగములను గ్రహింపవలసిన యావశ్యక మేమి?

ఈ ప్రశ్నల కుత్తరము నెవ్వడును జెప్పలేఁడు. ఎందుకు? ఈశ్వరుని యభిప్రాయము మానవుఁ డెట్లెఱుఁగఁ గలఁడు? ఎఱుఁగఁ గలిగినచో జీవేశ్వరులకు భేదమేమి? అందుకే యిట్టి ప్రశ్న లడుగరాదు. దానిని దృష్టాంతముతో నిరూపించుచున్నాఁడు. ఒకానొకఁడు తన సామర్థ్యముతో నితరులకు సాధ్యముగాని విధముగా నానా వేషములను ధరించి నటించును. వాని నజ్ఞుఁడు దెలియలేఁడు గదా! అట్లే సత్యసంకల్పుఁడును, సర్వజ్ఞుఁడునైన పరమేశ్వరుఁడును మనస్సుతో నానా రూపములను వాక్కుతో నానావిధనామములను విస్తరింపఁజేయును. ఇట్లు నానా రూపాత్మకములైన లోకములయొక్క సృష్ట్యాదిక్రియలోనర్చు నీ లీలల నర్థము చేసికొనుటకుఁ దర్కాదియుక్తు లెన్నియున్నను జాలవు. కనుక నొక్కఁడును దెలియఁ లేడని తాత్పర్యము.

శ్రీధరీయము:

అర్థము: అకర్తుః=కర్మాణి=కర్త గా నట్టివాని కర్మలు, అజనస్య జన్మాని=జన్మములు లేనివానికి జన్మలును, హృత్పతేః=అంతర్యామికి.

అవ: అప్పుడు జీవునకన్నను ఈశ్వరునకు విశేషమేమి? స్వాతంత్ర్యమే విశేష మనుచున్నాఁడు—

అర్థము: షాడ్వర్గికం=ఇంద్రియ షడ్వర్గవిషయమును, జిఘ్రతి=వాసన చూచును. దూరమునుండి గంధమునువలె గ్రహించుచున్నాడని పిండితార్థము. దానియందు లీనుఁడు గాఁడు. ఎందుకు? షడ్గుణేశః=షడింద్రియములకును వాఁడు నియంత గనుక.

అవ: ఈశ్వరునకు సృష్ట్యాది కర్మలచేతఁగాని, విషయభోగములచేతఁ గాని నిమిత్తమేమి? దానిని వివరించుచున్నాఁడు—

అర్థము: జగత్తుయొక్క సృష్టికర్తయైన ఈశ్వరునియొక్క, ఊతీః=లీలలు, కుమనీషః=కుబుద్ధియైనవాఁడు, నిపుణేన=తర్కాది కౌశలముచేత, నా౽వైతి=తెలిసికొనలేఁడు, మనోవచోభిః=మనస్సుచే

రూపములను, వచస్సుచే నామములను, సంతన్వతః=చక్కఁగా విస్త రింపఁ జేయుచున్న వానియొక్క (లీలలని యన్వయము), వచోభిః అనుచోట నున్న బహుత్వము, నానాపద్ధతులలోనున్న నామములను సూచించుచున్నది.

విజయధ్వజము:

అవ: ఈ విధములగు నవతారకార్యములతో శ్రీహరి కే ప్రయోజనము లేదు. వాఁడు పరిపూర్ణుఁడు. కాని వాని యవతార కార్యములచేత జీవులకుఁ బ్రయోజనమున్నది. కనుక నీ యవతారములు గాని వీని కార్యములు గాని కేవల భ్రాంతికల్పితములు గావని చెప్పుచున్నాఁడు—

అర్థము: అకర్తుః = 1. ఇతరుల కధీనుఁడు గాని కర్తయైన, 2. ఫలోద్దేశము లేనిదాని వలనఁ గర్త యని చెప్పుటకుసాధ్యముగాని, అజనస్య = 1. జనవిలక్షణుఁడైన, 2. జననరహితుఁడైన, హృత్పతేః= సర్వుల మనస్సులను బ్రేరేఁచునట్టి విష్ణువుయొక్క, ఏవం=పైఁ జెప్పఁబడిన అఘటిత ఘటనైశ్వర్యమున్న, వేదగుహ్యాని = ఉపనిషత్తులందు రహస్యముగాఁ బ్రతిపాదింపఁబడిన, జన్మాని కర్మాణి చ = జననము లేని శ్రీహరి యవతారములను, అకర్తయైన శ్రీహరి యవతారకార్యములను, కవయః చ=చక్కఁగా భగవత్తత్త్వము నెఱిఁగిన జ్ఞానులే, వర్ణయంతి=సంసారమునుండి ముక్తులగుటకు వర్ణింతురు, హి=ఇది ప్రమాణసిద్ధము. పరమాత్మయందుఁ గ్రియయే లేదని చెప్పినచోఁ దీనికిఁ బై శ్లోకమందే వాని క్రియలను వర్ణింపఁబోవుచున్నాఁడు. కనుక జీవునకు సంసారవిముక్తిని సంపాదించుటే పరమేశ్వరుని అవతారముల ప్రయోజనము. భగవంతుని యవతారములు, వాని క్రియలు జ్ఞానులే వర్ణింతురు అని చెప్పుటచేత నవి భ్రాంతికల్పితములు గానేరవని స్పష్టమైనది. వేదగుహ్యాని=వేదముల యందును ఈ విషయములు స్పష్టముగాఁ జెప్పఁబడలేదు. గుహ్యముగాఁ బ్రతిపాదితములు. అందుకే వేదసంప్రదాయములు దెలియనిది ఈ విష

యము తెలుఁగుట సాధ్యము గాదు. అందఱకును వేదసంప్రదాయ మేల తెలియరాదు? హృత్పతేః = భగవంతుఁడు హృదయస్థితుఁడై వారి వారి యోగ్యతకుఁ దగినట్లు మనస్సును నియమించి ప్రేరేఁచు చున్నాఁడు. అందుచే నంద ఱెఱుఁగరని భావము.

తాత్పర్యము: శ్రీహరి మఱియొకరి కధీనుఁడు గాఁడు. ఫలాపేక్షతోఁ గార్య మొనర్పఁడు. అందుచే శాస్త్రములలో వాని నకర్త యందురు. వాఁడు సర్వచేతనవిలక్షణుఁడు; అజన్ముఁడు. అందరి హృదయములందును నియామకుఁడై నిలచియుండును. ఇట్లు సర్వ సమర్థుఁడైన శ్రీహరి తన సామర్థ్యబలముతో ననేకావతారములనెత్తెను. అసంభావితములైన కార్యము లొనర్చెను.

తదవతారములు, కార్యములు కేవల సత్యములు. భ్రాంతి కల్పితములు గావు. ఈ విషయమును, శ్రుతులు మున్నగు శాస్త్రములు రహస్యముగాఁ దెలిపెను. సంప్రదాయము దెలియనివారి కవి యర్థము గావు. శ్రీహరి హృదయస్థితుఁడై ఆ యా జీవుని యోగ్యతాను సారము వానిబుద్ధిని బ్రేరేఁచును. అతని యవతార క్రియాకలాపము లకు జీవులను ముక్తుల నొనర్చుటయే ప్రయోజనము. వానిని గుర్తించి జీవులు తరింతురు.

అవ: ఫలోద్దేశము లేకుండుటచే భగవంతుఁ డకర్త. కాని కార్యములే యొనర్పఁడని యర్థము గాదు. ఈ పైఁ జెప్పిన విషయ మునే స్పష్టపఱచుచున్నాఁడు–

అమోఘలీలః = వ్యర్థముగాని, సత్యకాముఁ డనిపించికొనెడి క్రీడ గల, సవై=ఆ పద్మనాభరూపుఁడైన పరమపురుషుఁడే, ఇదంవిశ్వం =చేతనాచేతనాత్మకమైన యీసమస్త ప్రపంచమును, సృజతి, అవతి, అత్తి= (తథాపి=అయినను) అస్మిన్= 1. ఈ జగత్తునందు, 2. తన క్రియతో నేర్పడెడి ఫలమందు, నసజ్జతే=అసక్తుఁడు గాఁడు. అందుచే

నాతఁ డకర్త యనిపించికొనును. అట్లే అభోక్త యనుచోటఁ గూడ భగవంతునకు దుఃఖభోగము లేదని మాత్రమే యర్థము. భోగమే లేదని కాదు. భూతేషు=పంచభూతములచే సృష్టింపఁబడిన, ప్రాణి దేహములందు, అంతర్హితః=నిగూఢుఁడై యుండి, ఆత్మతంత్రః= స్వతంత్రుఁడైన, షడ్గుణేశః=అతీంద్రియ విషయములకు నియామకుఁ డైన శ్రీహరి, షాడ్వర్గికం=షడ్గుణ సమూహమునుండి గ్రాహ్యమైన శబ్దాదివిషయములను (వాని సారమును), జిఘ్రతి=భోగించును (అనుభవించును). అసారములైన దుఃఖాదుల ననుభవింపఁడని తాత్పర్యము.

విశేషార్థములు: అకర్తయనఁగా ఫలోద్దేశములేక కార్యమొనర్చు వాఁడని యర్థము. పద్మపురాణము ప్రమాణము.

అప్రయత్నా దస్వతంత్రాత్ ఫలానాం చ వివర్జనాత్,
క్రియాయాశ్చ స్వరూపత్వాత్ అకర్తేతి చ తం విదుః.
కర్తృత్వం భ్రాంతిజం ప్రాహురతత్త్వ విదోజనాః,
ఐశ్వర్యజంతు కర్తృత్వం సమ్యక్ తత్త్వవేదినః.

అనాయాసముగాఁ గార్యము నొనర్చుట వలనను స్వతంత్రుఁ డగుట వలనను ఫలము మొదలైన నిమిత్తరహితముగాఁ గార్యము నొనర్చుట చేతను, క్రియాస్వరూపుఁడగుట చేతను, శ్రీహరి నకర్త యందురు. వానిని సరిగాఁదెలియని జనులు గర్తృత్వము భ్రాంతి కల్పిత మనుకొందురు. కాని జ్ఞానులు కర్తృత్వ మైశ్వర్యముతో నేర్పడిన దందురు. 'ఆత్మతంత్రః' అనుటచే ఈశ్వరుఁడే దేహప్రవిష్టుఁడై జీవుఁ డగునని చెప్పరాదు. స్వతంత్రుఁడై దుఃఖలేశమును లేక సుఖము నిచ్చు సామర్థ్యముగల పరమాత్ముఁడని యర్థము చెప్పవలెను.

'భూతేషు చాంతర్హితః' అనుట కశుభభోగములు లేనివాఁ డని మాత్రమే యర్థము.

తాత్పర్యము: మోక్షకారణ మగుటచే శ్రీహరియొక్క యే క్రీడయు వ్యర్థముగాదు. వానికి సత్యకాముఁడని పేరు. సృష్ట్యాదిక్రియ లొనర్చువాఁడైనను తత్క్రియాఫలములందు వాని కాసక్తిలేదు. అందు చేతనే వాఁ డకర్త. షడింద్రియ నియామకుఁడు. వాఁడు దేహాంతర్గతుఁడై, తత్తత్పదార్థసారమైన శుభరూపములనే యనుభవించును. అసారముల యనుభోక్త కాఁడు. ఎందుకు? స్వతంత్రుఁ డగుటవలన.

అవ: పరమాత్ముఁడే జీవుఁడగునని చెప్పెడివాఁడు భగవత్స్వరూపమును సరిగాఁదెలిసిన వాఁడుగాడు అని యనుచున్నాఁడు-

కుమనీషః = మిథ్యాజ్ఞానియైన వాఁడును, జంతుః = క్రిమిసదృశుఁడై పలుమారు పుట్టిచచ్చు సంసారి చేతనుఁడు, కశ్చిత్ = ఎవ్వఁడును, నిపుణం = 1. సామర్థ్యముతోఁగూడియున్న, 2. సత్పురుషులకు మంగళము లొసఁగెడు, విధాతుః = 1. జగత్తును నిర్మించెడు 2. కల్గించెడునట్టి, మనోవచోభిః = మనస్సు, మాటలు-వీనిచే, నామరూపాణి = నామములను, రూపములను, అనఁగా మాటతోసంకీర్తన మొనర్చుట కర్హమైన నామములను, మనస్సుతో స్మరించుట కర్హములైన రూపములను, సంతన్వతః = చక్కగా విస్తరింపఁజేయు, అస్య = ఈ హరియొక్క, చ = విషయభోక్తయైన వానియొక్క, ఊతిం = అభిప్రాయమును, న అవైతి = తెలియఁలేడు. అజ్ఞః = భరతశాస్త్రమును దెలియనివాఁడు, నటచర్యామివ = నటుని యభినయ విశేషమునువలె 'నిపుణేనధాతుః' అని శ్రీధరునిపాఠము. ఊతీః = అను బహువచన పాఠముగూడ సాయనపాఠమే. నిపుణం విధాతుః = అని వీరిపాఠము. ఊతిం అను ద్వితీయైక వచనమును వీరి పాఠము.

తాత్పర్యము: పరమాత్ముఁడు జగత్తును బహునిపుణముగ సృష్టించును. మంగళకరమైన మోక్షమును సత్పురుషుల కొసఁగును. మనస్సుతో స్మరించుట కనేకరూపములను, వాక్కుతోఁ బొగడుట కనేక నామములను, వారి వారి యోగ్యతకుఁ దగినట్లు విస్తరింపఁ

జేయును. ఈ తత్త్వము నల్పజ్ఞులు దెలియలేరు. అట్టివారు క్రిముల వలె, పలుమారు జననమరణము లందెదరు. భరతశాస్త్రమందుఁ జెప్పిన యభినయ విశేషములను దెలియనివాఁడు నటుని యభినయము నర్థము చేసికొనలేనట్లు వేదసంప్రదాయమును దెలియని మూర్ఖుఁడు పరమాత్ముని కార్యముల యభిప్రాయమునుగాని ఫలమునుగాని తెలియలేఁడు. స్వప్రయోజనము లేకయే కార్యముల నొనర్చెడి- పూర్ణానందుఁడైనను, శుభఫలములను మాత్రమే యనుభవించెడి శ్రీహరి కార్యములను, సరిగా నర్థమొనర్చికొనుటకు ముక్తజీవులు మాత్రమే శక్తులు. అప్పుడుగూడ వారివారి యోగ్యతకుఁ దగినంతయే యర్థమగును. అనఁగా కరుణాపూర్ణుఁడైన శ్రీహరి తన చరిత్రను వారి వారి యోగ్యతానుసారము భక్తుల కర్థమగునట్లుగాఁ దానే యనుగ్రహించును.

స వేద ధాతుః పదవీం పరస్య
దురంత వీరస్య రథాంగపాణేః,
యోఽమాయయా సంతతయాఽనువృత్త్యా
భజేత తత్పాదసరోజగంధమ్. 38

యః—ఎవఁడు, అమాయయా = కాపట్యరహితమైన భావముతోఁగూడిన, సంతతయా — నిరంతరము సాగుచుండెడి, అనువృత్త్యా — అనువర్తనముచేత, తత్పాదసరోజగంధం — ఆ భగవంతుని పాదపద్మముల గంధమును, భజేత— సేవించునో, సః—అట్టివాఁడు. పరస్య—మాయాతీతుఁడును, ధాతుః—సమస్తమును సృష్టించు వాఁడును, దురంత వీర్యస్య — అనంతమైన శక్తిగలవాఁడును నైన, రథాంగపాణేః—చక్రపాణియొక్క, పదవీం—మార్గమును, వేద—తెలియును.

తాత్పర్యము: పరమేశ్వరుని మార్గ మెవ్వరికిని తెలియదు. కాని ఒక్క భక్తుఁడుమాత్రమే యనన్యసామాన్య ప్రయాసమున నెఱుఁగఁ గలఁడు. ఎవఁడు లేశమును, ఫలకాంక్ష లేనట్టి ధారావాహికమైన సేవతో నా పరమేశ్వరుని పాదసరోజగంధమును సేవించుచుండునో

అట్టి యా భక్తుఁడు అనంతశక్తిగలవాఁడును, మాయాతీతుఁడును, లోక స్రష్టయునైన శ్రీహరిస్వరూపమును దెలియఁగలఁడు. ఆ తెలియుటయే ముక్తి కనుక భక్తిచే ముక్తి కర్తుఁ డగును.

అథే ఽహ ధన్యా భగవంత ఇత్థం
యద్వాసుదేవేఽఖిలలోకనాథే,
కుర్వంతి సర్వాత్మక మాత్మభావం
న యత్ర భూయః పరివర్త ఉగ్రః. 39

అథ=అందుచే, ఇహ=ఇక్కడఁ జేరినట్టి, భగవంతః=గొప్పవారైనమీరు, ధన్యాః=ధన్యులు, యత్=ఏ కారణముచేత, అఖిలలోకనాథే=సర్వలోకనాథుఁడైన, వాసుదేవే=వాసుదేవునియందు, సర్వాత్మకం=ఐకాంతికమైన, ఆత్మభావం=మనోవృత్తిని, ఇత్థం=ఈ ప్రకారము, కుర్వంతి=చేయుచున్నారో, యత్ర=ఏ విషయమందు భూయః=మఱల, ఉగ్రః=ఘోరమైన, పరివర్తః=వెనుకకు ముందుకు దిరుగుటలు, నభవతి=సంభవించుటలేదు.

అవ. భక్తిమార్గమందుఁ బరిశ్రమించుచున్న శౌనకాదులను సూతుఁ డభినందించు చున్నాఁడు—

భక్తుఁడొకఁడే భగవంతుని తత్త్వమును జక్కఁగాఁ దెలిసికొనఁ గలఁడు. అందుచే సర్వజ్ఞులైన మీరు పరమభాగ్యశాలులు. సకలలోక నాథుఁడైన శ్రీవాసుదేవుని యందు ఐకాంతికమైన మనోభావమును దాల్చుచున్నారు. ఆ భక్తిభావముచేతనే యీ రీతిగా నన్నుఁ బ్రశ్నింపఁ గల్గితిరి. ఇట్టి భక్తి యేర్పడినవారికి ఘోరమైన గర్భవాసక్లేశము మరణము ఇత్యాది పరివర్తనము ననుభవింపవలసిన పనిలేదు. సర్వ సంతాపములను భక్తి యొక్కటియే నాశ మొనర్చును. దానికిఁ బ్రధాన రూపమైన హరికథాశ్రవణేచ్ఛ మీకు జనించినది. మీరు పరమ ధన్యులు.

ఇదం భాగవతం నామ పురాణం బ్రహ్మసమ్మితమ్,
ఉత్తమశ్లోక చరితం చకార భగవాన్ ఋషిః. 40

బ్రహ్మసమ్మితం=వేదముతో సమానమైన, ఉత్తమశ్లోకచరితం=ఉత్తమ కీర్తిగల భగవంతుని చరిత్రతోఁ గూడిన, భాగవతం నామ=భాగవతమను పేరు గల్గిన, ఇదం పురాణం=ఈ పురాణమును, భగవాన్=సర్వజ్ఞుఁడైన, ఋషిః=వ్యాసమహర్షి, చకార=చేసెను.

ఈ భాగవతపురాణము పరమపవిత్రమగు హరి చరిత్రతోఁ గూడినది. వేదసదృశమైనది. దీనిని సర్వజ్ఞుఁడైన వ్యాసమహర్షి రచించెను.

నిఃశ్రేయసాయ లోకస్య ధన్యం స్వస్త్యయనం మహత్,
తదిదం గ్రాహయామాస సుత మాత్మవతాం వరమ్. 41

ధన్యం=శ్రేష్ఠమైనదియు, మహత్=గొప్పమాహాత్మ్యముతోఁ గూడినదియు, స్వస్త్యయనం=సమస్తమంగళములకు స్థానమైన, తదిదం=ఆ దీనిని, లోకస్య=లోకముయొక్క, నిశ్శ్రేయసాయ=మోక్షసంపత్తికొఱకు, ఆత్మవతాం=ఆత్మస్వరూపము నెఱిఁగిన వారియందు, వరం=శ్రేష్ఠుఁడైన, సుతం=పుత్త్రుఁడైన శుకబ్రహ్మను, గ్రాహయామాస=గ్రహించునట్లు చేసెను.

ఇది సకలభాగ్యములను జనింపఁజేయునది. గొప్ప మాహాత్మ్యముతోఁ గూడినది. సకలమంగళములకు నాకరము. వ్యాసభగవానుఁడీపురాణమును లోకమందలి ముముక్షువుల ననుగ్రహించుటకై రచించెను. శుకుఁడాత్మవంతులలో శ్రేష్ఠుఁడు. భగవంతుఁడైన వ్యాసుఁడు శుకబ్రహ్మ కీపురాణము నుపదేశించెను.

సర్వవేదేతిహాసానాం సారం సారం సముద్ధృతమ్,
స తు సంశ్రావయామాస మహారాజం పరీక్షితమ్. 42

సర్వవేదేతిహాసానాం=సమస్తములైన వేదములు ఇతిహాసములయొక్క సారంసారం=సారములలో సారమైన దానిని, సముద్ధృతం=ఎత్తికొని రచింపఁ

బడిన దీనిని, సతు=ఆ శుకబ్రహ్మ, మహారాజం=జనాధిపుఁడైన, పరీక్షితం=పరీక్షిత్తునుగూర్చి, సంశ్రావయామాస=చక్కఁగా వినిపించెను.

ఈ భాగవతము, సమస్త వేదములు, ఇతిహాసములు- వీని యన్నిటి సారము. అ సారముల నన్నిటిని వ్యాసమహాముని యీ భాగవతమునఁ జేర్చినాఁడు. శుకమహర్షి దీనిని మహారాజైన పరీక్షిత్తునకు వినిపించెను.

ప్రాయోపవిష్టం గంగాయాం పరీతం పరమర్షిభిః,
తత్ర కీర్తయతో విప్రాః విప్రర్షేర్భూరితేజసః. 43

అహం చాధ్యగమం తత్ర నివిష్ట స్తదనుగ్రహాత్,
సోఽహం వః శ్రావయిష్యామి యథాధీతం యథామతి. 44

పరమర్షిభిః=పరమోత్కృష్టులైన మహర్షులతో, పరీతం=కూడియున్నట్టియు, గంగాయాం=గంగాతీరమందు, ప్రాయోపవిష్టం=ప్రాయోపవేశము చేయుచున్న పరీక్షిత్తునుద్దేశించి, విప్రాః=ఓ బ్రాహ్మణులారా!, తత్ర=అ ప్రదేశమందు, కీర్తయతః=హరిచరిత్రను గీర్తించుచున్నట్టియు, భూరితేజసః=గొప్పతేజస్సుతోఁ గూడినవాఁడునైన, విప్రర్షేః=శుకబ్రహ్మయొక్క, తదనుగ్రహాత్=అనుగ్రహము వలన, తత్ర=అక్కడ, నివిష్టః=ప్రవేశించిన వాఁడైన, అహం చ=నేనుగూడ, అధ్యగమం=అ భాగవతపురాణము నభ్యసించితిని. సః అహం=అ నేను, యథాఽధీతం=నాయభ్యసించిన దానిని బట్టియు, యథామతి=నా బుద్ధిసంపద ననుసరించియు, వః=మిమ్ముగూర్చి, శ్రావయిష్యామి=విన్పింతును.

అవ: పరీక్షిన్మహారాజునకు భాగవత మెక్కడ యుపదేశింపఁబడెను? ఎప్పు డుపదేశింపఁబడెను? ఈ విషయమును జెప్పుచుఁ దన గురుపరంపరను బ్రస్తావించుచున్నాఁడు-

పరీక్షిత్తు గంగాతీరమందుఁ బ్రాయోపవేశ మొనర్చుచుండెను. ఆతనినిఁ బరమర్షులు పరివేష్టించియుండిరి. అచ్చటికి శుకబ్రహ్మ వేంచేసెను. ఆ పరమర్షులమధ్యలో శుకుఁడు పరీక్షిత్తునకు భాగవతము

నుపదేశించినాఁడు. ఆ బాదరాయణి యనుగ్రహమునకై, నేనును నందులోఁగాచి యుంటిని. ఆ శుకబ్రహ్మ భాగవత మనెడు నమృత ధారను స్రవించుచుండెను. బ్రహ్మతేజస్సున నాతనిశరీరము జ్వలించు చుండినది. ఆ పరమర్షి యనుగ్రహముతో నేనును భాగవత మభ్యసించితిని. ఎట్లుగా నా యధ్యయనము సాఁగినదో ఆ పద్ధతినే నేను మీకుఁ జెప్పెదను. భాగవతము సంపూర్తిగా నెవ్వరికి నర్థముగాదు; ఒక్క శుకునకుఁ దప్ప. నా బుద్ధిగ్రహించి నంతవఱకును నేను మీకు వివరింతును.

కృష్ణే స్వధామోపగతే ధర్మజ్ఞానాదిభి స్సహ,
కలౌ నష్టదృశామేష పురాణార్కో ఽధునోదితః. 45

ధర్మజ్ఞానాదిభిస్సహ=ధర్మము, జ్ఞానము మొదలగువానితోఁబాటు, కృష్ణే=కృష్ణపరమాత్మ, స్వధామోపగతే=తనదివ్యధామమగు వైకుంఠమును జేరఁగా, కలౌ=కలియుగమందు, నష్టదృశాం=రెండుకన్నులును పోయినట్లున్నవారికి, అధునా=ఇప్పుడు, ఏషః పురాణార్కః=ఈ పురాణమను సూర్యుఁడు, ఉదితం=ఉదయించెను.

శ్రీకృష్ణపరమాత్మ స్వధామమగు వైకుంఠమును జేరఁబోయి నప్పుడు, అతనితోఁబాటు ధర్మజ్ఞానాది సమస్తకల్యాణ గుణములును ఈ లోకమును విడిచి పోయినట్లైనది. కలియుగమందలి జనులు గ్రుడ్డివారివలె, ధర్మజ్ఞానరూపములను గనుఁగొనలేక తపించుచుండిరి. అప్పుడు వారికి దృష్టి నొసఁగి యుద్ధరించుటకై యీ భాగవతపురాణ సూర్యుఁ డుదయించినాఁడు. అతని కిరణములు లోకమున వ్యాపించెను. పదార్థములను గనుపింపఁజేయని చీఁకటివలె, జనుల హృదయములందుఁ గామాదు లావరించి యుండినవి. వాని నీ పురాణ సూర్యుఁడు పారఁదోలెను. భగవత్స్వరూపమును గన్గొనుటకు చక్కని వెలుఁగు నొసఁగుటకై భాగవత సూర్యోదయ మైనది.

ఇతి శ్రీ మద్భాగవతే మహాపురాణే
అష్టాదశ సహస్రికాయాం, సంహితాయాం
పారమహంస్యాం, శ్రీవైయాసిక్యాం, శ్రీహయగ్రీవ
బ్రహ్మవిద్యాయాం ప్రథమస్కంధే తృతీయోధ్యాయః

శ్రీధరీయము :

అమాయయా=కుటిలభావము లేనట్టియు, సంతతయా=నిరంతరమైనట్టియు, అనువృత్యా=అనుకూల్యముతోఁ గూడినట్టియు, భగవంతునందు మన మనుష్ఠించెడి భక్తి యకుటిలమైనదిగా నుండవలెను. అనఁగా త్రికరణశుద్ధి గలది ఫలాభిసంధిరహితమైనది. ఆ భక్తి గూడ ధారావాహికముగా నుండవలెను. మనము రాగద్వేషములకు వశులము. తదనుగుణముగా భగవంతుఁడు వర్తింపవలెనని కోరినచో నది సాత్త్వికభక్తి గాదు. అట్టివానికి ఫలము లేదు. రజోగుణపూరితమైన భక్తితో సాధకునికి వాని యహంకారము తృప్తిపడవచ్చునే గాని, భగవంతునకుఁ దృప్తి గల్గదు. తత్పాదసరోజగంధం=ఆ భగవంతుని పాదపద్మముల యందలి సుగంధమును, అనఁగా నిజమైన భక్తుఁడు భగవంతుని పాదసమీపముననే యుండి పుష్పగంధమును ఆస్వాదించు భృంగమువలె సదా తదానందము ననుభవించుచుండవలెనని తాత్పర్యము.

అవ: భక్తిమార్గప్రవృత్తులైన ఋషులను సూతుఁ డభినందించుచున్నాఁడు-

యత్=ఏ కారణమువలన, అనఁగా భక్తుఁడే భగవత్తత్త్వము నర్థము చేసికొనఁగల్గునో, అతః=అందువలన, భగవంతం=ఇక్కడ నిది యౌపచారిక ప్రచారము. గొప్పవారైన మీరని భావము. సర్వజ్ఞులైన మీరు, ధన్యాః=కృతార్థులు, ఎందువలన? యత్=ఏ కారణము వలన నిట్టి ప్రశ్నలచేత, వాసుదేవే=సర్వోత్తముఁడైన పుండరీ

కాక్షనియందు, ఆత్మభావం = మనోవృత్తిని, కుర్వంతి = చేయుచు న్నారో, సర్వాత్మకం = ఐకాంతికమైనది అనఁగా వానియందుఁ దప్ప నితరులపై యాధారపడనిదని భావము. యత్ర = ఆ భావ మేర్పడు చున్నదో, అప్పుడు మఱల, ఉగ్ర = గర్భవాసాది దుఃఖస్వరూపమైన, పరివర్తః = జన్మమరణాద్యావర్తము- సుడిగొన్నట్లు జనన మరణాదు లలోఁ దిరుగుట, న భవతి=ఏర్పడదు.

అవ: 'సూతుఁడా! ఈ శాస్త్రమును నీవే కల్పించి చెప్పుచు న్నావా?' అను దాని కుత్తరము వచించుచున్నాఁడు-

బ్రహ్మసమ్మితం = సర్వవేదములతోను సమానమైనది; ఉత్తమ శ్లోక చరితం-ఉత్తమ శ్లోకస్య చరితం యస్మిన్ తత్ అని సమాసము.

అవ: దాని సంప్రదాయప్రవృత్తిని జెప్పుచున్నాఁడు-

నిశ్శ్రేయసాయ=లోకముయొక్క పరమమంగళము కొఱకు, స్వస్త్యయనం = సమస్త మంగళములను గల్గించునది. భాగవతమును గ్రహించుటకు శుకబ్రహ్మయే యధికారి. ఎందుకనఁగా ఆత్మవతాం =ఆత్మజ్ఞులైన బ్రహ్మవాదులలో శ్రేష్ఠుఁడు.

విశేషము లేదు.

ప్రాయేణ=మృత్యుపర్యంతము అనశనవ్రతముతో, ఉపవిష్టం =కూర్చున్నవాఁడు. ఈ విశేషణముతో నాతని చిత్తవృత్తిని పరమ వైరాగ్య మాక్రమించినదని భావము.

అధ్యగమం = తెలిసికొన్నవాఁడ నైతిని. ఈ శ్లోకమునందు 'తత్ర' శబ్దము రెండుసారులు వచ్చినది. రచనలో నరుచికరమని యాక్షేపము. కాని యన్వయభేద మున్నది. తత్ర కీర్తయతః= ఆ మహర్షుల గుంపునందు భాగవతమును గీర్తించునట్టి; ఈ తత్ర శబ్దమునకు శుకమహర్షితో సంబంధము. తత్ర నివిష్టం = ఆ గుంప

నందుఁ జేరినవాఁడనై. ఇక్కడ తత్ర శబ్దము సూతున కన్వయము. కనుక నన్వయభేదముతో పదావృత్తి యనెడు నరుచి తొలఁగినది.

యథాతథం = నే నభ్యసించినట్లుగా; ఈ భాగవతకథ నా స్వమతివిలసితము గాదు. శుకబ్రహ్మ చెప్పినట్లు చెప్పుటకును నా నాచేత కాదు. శుకునిదయతో నే నభ్యసించినట్లు నా బుద్ధికోపినంత చెప్పెదనని భావము.

విజయధ్వజము :

అవ: అట్లైనచోఁ బరమాత్మ నెవ్వరు దెలిసికొనువారు? దాని కుత్తరముఁ జెప్పుచున్నాఁడు—

యః = వేదములే ప్రమాణములని నమ్ము ఏ భక్తుఁడు, అమాయయా—నిర్వ్యాజమైన సేవచేత, తత్పాదసరోజగంధం = 1. హృత్కమలమధ్య వాసియైన శ్రీహరి పాదకమలముల సువాసనను, 2. హృత్కమలవ్యక్తుఁడైన శ్రీహరి రూపమును, భజేత — ఆస్వాదించి యచ్చటనే మగ్నమైన మనస్సుగలవాఁ డగునో, సః = అతఁడు, దురంతవీర్యస్య — అనంత పరాక్రమముగల, పరస్య — పరిపూర్ణుఁడైన, ధాతుః = జగత్పోషణమొదలైన కార్యము లొనర్చు, రథాంగపాణేః = చక్రధారియైన శ్రీమన్నారాయణునియొక్క, పదవీం = స్వరూపస్థితిని, వేద = తెలియును.

విశేషార్థములు: హృదివ్యక్తం తు యద్రూపం హరేర్గంధస్స ఉచ్యతే అని పైని చెప్పఁబోవునట్లు, గంధ మనఁగా వారి వారి భక్తి కనుగుణముగా హృదయమందు వ్యక్తుఁడైన శ్రీహరి రూపమని యర్థము.

తాత్పర్యము: వాసుదేవభక్తుఁడు వేదములే ప్రమాణములని తెలియవలెను. తత్ప్రతిపాద్యుఁడైన శ్రీహరియందు నిర్వ్యాజభక్తి కలుగవలెను. నిరంతరమై నిత్యానుకూలమైన సేవతో పరమాత్ముఁడు

హృదయకమలమందు వ్యక్తమగును. అప్పుడు భక్తుఁడు తత్పాదకమలముల నాస్వాదించి యందే మగ్నమై వానిని విడువలేని మనస్థాయిని బొందును. ఇట్లు భగవంతు నపరోక్షీకరించికొన్న భక్తుఁడు మాత్రమే చక్రధారియైన నారాయణుని స్వరూపస్థితిని వానినిబొందు మార్గమును దెలిసికొన్నవాఁడగును. శ్రీహరి పరాక్రమము లనంతములు. అతఁడు నిత్యపరిపూర్ణుఁడు. జగత్సృష్టి మొదలగు కార్యములందు ప్రవృత్తుఁడు. ఇట్టి యీ నారాయణుని సంపూర్ణముగ నెవ్వరును దెలియనేరరు. పైఁ జెప్పినట్టి భక్తుఁడు మాత్రమే వాని వాని యోగ్యతకుఁ దగినట్లు స్వల్పముగఁ దెలిసికొనుచున్నాఁడు.

అవ: మీవంటివారే భాగవతు లనెడు నభిప్రాయముతోఁ జెప్పుచున్నాఁడు_

భగవంతః_భాగ్యశాలులారా! యత్ర = ఏ పరమాత్మయందు, ఆత్మభావం=(కుర్వతిసతి) అతఁడు స్వామి, నేను దాసుఁడను అనెడు భావమును సాధించుచుండఁగా, భూయః_మరల, ఉగ్రః_1. రుద్రుని గూడ మ్రింగెడు 1. క్రూరమైన, పరివర్తః_జననమరణ వ్యాప్తమనెడు సంసారము, న స్యాత్ = ఏర్పడదో అట్టి, అఖిలలోకనాథే - సమస్త ప్రపంచములకును స్వామియైన, సర్వాత్మకే=సకలాంతర్యామియైన, వాసుదేవే_శ్రీహరియందు, ఇత్థం=పైఁజెప్పినట్లు స్వామి భృత్యభావముతో, ఆత్మభావం=(కుర్వంతి ఇతి యత్) స్వామియను భావనను జేయుచున్నారను టేదిగలదో, అతః=ఆ కారణమువలన, ఇహ=ఈ చేతన సమూహమందు, ధన్యాః = మీరు నిరపేక్షమైన గుణములతో నిండినవారు-కృతకృత్యులు. యత్ర=శ్రీహరియే స్వామి యనెడి యే భావము నూనినచో క్రూరమైన సంసారము మరలఁ బ్రాప్తింపదో అట్టి, ఆత్మభావం = మా స్వామియనెడి భావమును, అనియు నన్వయించి కొనవచ్చును. ఈ శ్లోకమందు భక్తిమార్గప్రవృత్తులైన ఋషులను నూతుఁ డభినందించుచున్నాఁడు. ఎందుకు? వారు సావధాన

ముగాఁ దనమాటను వినవలెననెడు నభిప్రాయమును మనసునం దుంచికొన్నాఁడు.

తాత్పర్యము: పరమాత్ముఁడు మా స్వామి, నే నతని భృత్యుఁడ నని తెలిసి యుపాసించుటకే యాత్మభావమని పేరు. ఇట్టి భావనతో హరి నుపాసించినచోఁ గ్రూరమైనసంసారము మఱల సంప్రాప్తింపఁదు. రుద్రాది దేవతలు గూడ సంసారమునకుఁ జిక్కినవారే యన్నచోఁ దక్కినవారి మాటేమి? పరమాత్ముఁడే సర్వజగత్తునకును నాయకుఁడు. అందరియందు నంతర్యామియై యుండి నియామకుఁడై యున్నాఁడు. ఇట్టివాసుదేవునందు స్వామిభావము, మీయందు భృత్యభావమును వహించితిరి. ఋషులారా! మీరు ధన్యులు: కృతకృత్యులు. అందు చేతనే శ్రీహరికథలను వినవలెనను భక్తిమార్గమందుఁ బ్రవృత్తులైనారు. నా మాటలను మీరు సావధానముగా వినవలెను.

ఇక్కడినుండి యధ్యాయము పూర్తివఱకును, ధర్మ మెవరిని శరణుఁ జొచ్చినది? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాఁడు- మొదట 'సూతా! నీవే క్రొత్త పురాణమును రచించి మాకుఁ జెప్పఁ బోవుచున్నావా?' అను సంశయమును నివారించుచున్నాఁడు-

ఋషిః=సర్వజ్ఞుఁడైన వేదవ్యాసుఁడనెడు, భగవాన్=శ్రీహరి, బ్రహ్మసమ్మితం = వేదసమానమైన, ఉత్తమశ్లోకచరితం = నిర్దోషము, నిరతిశయమునునైన కీర్తిగల్గిన శ్రీహరి చరిత్రతోఁగూడిన, ఇదం= నేను పైనిఁ జెప్పవలెనను భావమున మనస్సునం దుంచికొన్న, భాగ వతంనామ=భాగవతమను పేరుగల, పురాణం=పురాతనుఁడైన శ్రీ హరిని సూచించెడి గ్రంథమును, చకార=చేసెను.

తాత్పర్యము: నేను తమకుఁజెప్పఁబోవు కథాభాగము భాగ వతపురాణము. ఇదినేను గల్పించి చెప్పెడి క్రొత్త కథగాదు. పురాతన కాలమందు శ్రీహరిని బ్రతిపాదించుటచే దీనికిఁ బురాణమని పేరు.

వేదప్రతిపాదితుఁడైన వాసుదేవునిఁ జెప్పుటతో నిది వేదతుల్యము. దీనియందు వచ్చు చరిత్రయంతయు శ్రీహరిదే. వాని చరిత్రము ఉత్తమమైన యశస్సుతో నిండినది. అక్కడ దోషలేశమున కవకాశము లేదు. ఇట్టి భాగవతపురాణమును ముముక్షువులైన యధికారి చేతనుల యొక్క మోక్షరూపఫలమునకై సర్వజ్ఞుఁడైన శ్రీహరియే వేదవ్యాస రూపమున రచించెను. ఈ పురాణప్రవచనముతో జ్ఞానభక్తి వైరాగ్యము లనెడు మోక్షార్థసామగ్రి యంతయు నాత్మయందుఁ బరిపుష్టమగును. సమస్తమంగళముల నిది గల్గించును. దీని యందలి శబ్దము లన్నియు మహామహిమోపేతములు. అంతమాత్రమే గాదు. గంభీరమైన యర్థ ముతోఁ గూడినవి.

లోకస్య = ముక్తి యోగ్యులగు చేతనులయొక్క, నిశ్రేయ సాయ=మోక్షమునకై (చకార), పుణ్యం=జ్ఞాన భక్తి వైరాగ్యములతోఁ గూడిన, స్వస్త్యయనం = సమస్తమంగళాకారము, మహత్ =శబ్దము తోను, అర్థముతోను మహత్తయినది, సర్వవేదేతిహాసానాం=సారం సారం సముద్ధృతం, సః=వ్యాసుఁడు, ఆత్మవతాం=మనోనిగ్రహము వడసిన, సుతం, గ్రాహయామాస.

తాత్పర్యము: సమస్త వేదములందు ఇతిహాసములందుఁ బ్రతి పాదింపఁబడిన సర్వోత్తమములైన ప్రమేయములను దీసి ఇందు సంగ్ర హించినారు. కనుకనే ఈ పురాణము సర్వోత్తమము. దీనిని వ్యాసుఁడు శుకబ్రహ్మకు బోధించెను. శుకుఁడు మనస్సును జయించి పరమా త్మను బొందిన వారిలో శ్రేష్ఠుఁడు; ఉత్తమాధికారి. అందుచే నేతత్పు రాణ గ్రహణమున కర్హుఁడు.

విశేషార్థములు: ప్రాయోపవిష్టం=పరీక్షిత్తు పరమవైరాగ్యశాలి యని చెప్పినట్లే, పరమర్షిభిః పరితం అనుటచే నక్కడ మోసమున కవకాశము లేదనియుఁ జెప్పిన ట్లైనది.

తాత్పర్యము: పరీక్షిచ్చక్రవర్తి శాపగ్రస్తుఁడైనాఁడు, అందుచే నతఁడు మరణపర్యంత మాహారమును గ్రహింపని యనశనవ్రతముఁ బూనెను. గంగానది మధ్యభాగమం దాతఁ డుపవిష్టుఁడైనాఁడు. ఇట్టి వైరాగ్యశాలియైన యాతఁడు పరమజ్ఞానులైన ఋషులను బిలచి వారిమధ్యమునఁదాను తత్త్వమునుగూర్చి విచారించుచుండెను. అప్పు డచ్చటికి వచ్చిన శుకాచార్యుఁడు రాజునకు భాగవతము నుపదేశించి నాఁడు. అప్పు డా శుకునియొక్కయు బ్రాహ్మణులయొక్కయు యనుగ్రహమున నే నందుఁజేరి భాగవతము నధ్యయన మొనర్చితిని. ఇట్లు గురుముఖమున నేర్చికొన్న భాగవతమును నా నేర్చినంత మేరకు వ్యత్యాసములేనట్లు నాప్రజ్ఞకుఁ దోఁచినట్లు వ్యాఖ్యానింతును. శ్రద్ధగా వినవలెను.

అవ: ఇట్లు శౌనకాదుల సంశయమును బరిహరించి, 'ధర్మః కం శరణం గతః' అను ప్రశ్నకు సమాధానముఁ జెప్పుచున్నాఁడు—

ధర్మజ్ఞానాదిభిస్సహ కృష్ణే, స్వధామోపగతే, కలౌ—కలియుగ మందు, నష్టదృశాం—జ్ఞానచక్షువును బోఁగొట్టుకొన్న, పుంసాం—అధి కారి చేతనులకు, ధర్మజ్ఞాన ప్రదర్శనార్థము, పురాణార్కః = సమస్త భగవద్ధర్మములను భాగవత ధర్మములను బ్రకాశింపఁజేయు శ్రీమద్భా గవత మనెడు సూర్యుఁడు, 'అమునా' అని వీరి పాఠము. సకల ధర్మ ప్రవర్తకుఁడైన శ్రీకృష్ణునియొక్క యవతారాంతరమైన వేదవ్యాసు లనే ధర్మము శరణుఁ జొచ్చినదని భావము.

తాత్పర్యము: కృష్ణపరమాత్మ తన ధామమగు వైకుంఠమును జేరెను. భూమియం దదృశ్యుఁ డయ్యెను. అప్పుడు ధర్మ మెవరిని శరణుఁ జొచ్చినది? ఇది ప్రశ్న. అదే కృష్ణుని యవతారాంతరమైన వేదవ్యాసులనే యాశ్రయించినది. వ్యాసుఁడు కలిమహిమతో జ్ఞాన మును బోఁగొట్టుకొన్న సజ్జనుల యుద్ధారమునకై యీ మహాపురాణ

సూర్యోదయమగున ట్లొనర్చెను. సచ్ఛాస్త్రరచనామూలమున నతఁడే ధర్మము నుద్ధరించెను.

పోతన్నగారు :

జననములేక కర్మముల జాడలఁ బోక సమస్తచిత్త వ
ర్తనుఁడగు చక్రికిన్ గవు లుదారపదంబుల జన్మకర్మముల్
వినుతులు సేయుచుందురు; వేదరహస్యములందు నెందుఁ జూ
చిన మఱి లేవు జీవునికిఁ జెప్పినకైవడి జన్మకర్మముల్.

అవ: ఇంతకుముందు 'సరసిన్ బాసినఁ బాఱు కాలువల యోజన్' అను పద్యములోఁ బరమాత్ముని యవతారము లసంఖ్యాకములని చెప్పెను. అట్లే 'జగముల కెవ్వేళ రాక్షసవ్యథ గలుగున్', 'యుగయుగములఁ బుట్టి కాచు నుద్యల్లీలన్' అనుపద్యముతో యుగావతారములను వివరించినాఁడు. 'అతిరహస్యమైన హరిజన్మ కథనంబు' అనుదానితో స్వామి జన్మకర్మములు రహస్యమైన వన్నాఁడు. మఱి ఈ పద్యములో 'జననము లేక' అని యెత్తికొన్నాఁడు. ఇది పూర్వాపరవిరోధము గదా! దీనికి మూలశ్లోకమున శ్రీధరుఁ డవతారిక నిచ్చుచు, జీవుని జన్మలకును మాయయే కారణ మనెను. అట్లే ఈశ్వరుని జన్మకర్మలుగూడ మాయయే. మఱి జీవునకన్నను నీశ్వరునకు విశేష మేమి? దీని కుత్తరమే యీ శ్లోకము. ఈ పద్యమందలి 'జీవునకుఁ జెప్పిన కైవడిన్' అనునది చాల ముఖ్యమైనది. పరమాత్మునకు జన్మకర్మలు జీవునివంటివి గావు. జీవునిజన్మ కర్మాయత్తమైనది. వాని కర్మలును పుణ్యపాపాత్మకములే. పరమేశ్వరుని జన్మ యిట్టిది గాకుండుటచేతనే 'జన్మకర్మచ మే దివ్యం' అని గీత యన్నది. శ్రుతి మాతయు 'అజాయమానో బహుధా విజాయతే' 'తస్య ధీరాః పరిజానంతి యోనిం' అనెను. అజాయమానః జన్మలేనివాఁడు. ఈ మాటచేత జీవునకువలె కర్మాయత్తమైన యుత్పత్తి ఈశ్వరునియందు నిషేధింపఁ బడుచున్నది. 'బహుధా విజాయతే' అనేక రీతుల

జన్మించుచున్నాఁడు. దీనితో నకర్మాయత్తమై స్వసంకల్పమూలమైన ఉత్పత్తి విధింపఁబడుచున్నది. 'న హింస్యాద్భూతాని, పశుమాలభేత' ఇత్యాది వాక్యములందు విధినిషేధములు భిన్నవిషయకములైనదాని వలన బాధలేకపోయినది. అట్లే యిక్కడను పూర్వోత్తరవ్యాఘాతము లేదని తెలియవలెను. "తస్య ధీరాః పరిజానంతి' ధీరాః=పరిపూర్ణులైన జ్ఞానులు, తస్య యోనిం=ఆ భగవంతుని యధిష్ఠేయమైన శరీరమును పరిజానంతి=అకర్మాయత్తముగను దెలిసికొనుచున్నారని భావము. కనుక నిక్కడ జననములేక అనఁగా జీవునకువలెఁ గర్మాయత్తమైన జననములేక అని భావము. కర్మముల జాడనుబోవక=పరమాత్ముని కార్యము లన్నియు వానితో భగవంతునకు మమతాభిరూపము లేనివి అగుటచే వాని సుఖదుఃఖములతో నాతనికి సంబంధము లేదు. కర్మ లొనర్చియు నొనర్పనివాఁడే యగుచున్నాఁడు. సమస్తజీవుల చిత్తముల యందున్నవాఁడై అంతర్యామి యగుచున్నాఁడు. ఇవన్నియు వేదరహస్యములు. ఇట్టి వానిని గవులైన వారే తెలిసికొనలేరు. కవు లనఁగా జ్ఞానాధికులు. 'న ముహ్యేచ్చింతయన్ కవిః' అని ప్రయోగము. వేదములలోఁ గొన్నిచోట్ల విధివాక్యములును, గొన్నియెడల ప్రతిషేధవాక్యములును వచ్చును. ఈ రెండింటికి విరోధ మున్నట్టు లాపాతతః భాసించును. అట్టియెడల సమస్తప్రమేయ సంప్రదాయముల నెఱిఁగి యన్వయించుకొనవలసి యుండును. ఈ విషయమే వాత్స్యాయన తిలకుఁడైన వరదాచార్యులు వివరించియున్నారు—

యద్బ్రహ్మణో గుణశరీర వికారభేద
కర్మాది గోచరధియః ప్రతిషేధ వాచః,
అన్యోన్య భిన్నవిషయా న విరోధగంధ
మర్హంతి సన్నవిధయః ప్రతిషేధ బాధ్యాః.

వేదములందుఁ గొన్నియెడల పరమాత్ముఁడు నిర్గుణుండని చెప్పు వాక్యములు వచ్చును. మఱికొన్ని సగుణపరములు. కొన్ని శరీరమును

నిషేధించును. కొన్ని యున్నదనును. ఇట్లే యనేక విషయములనుగూర్చి. వీనినెట్లు సమన్వయించుకొనవలెను? ఇవి యన్యోన్య భిన్నవిషయకము లగుటచే వానిలో విరోధగంధమును లేదు. కనుక భగవంతుని కర్మములు జగద్వ్యాపారరూపములు, జీవచేష్టిత సజాతీయములుగావు. తద్విజాతీయములు. కవులు ఉదారపదములతో వాని జన్మకర్మలను వినుతిసేయునర్హరు. వారికి భగవంతుని జన్మములయుఁ, గర్మములయు యథార్థస్థితి దెలియును గనుక వారే వానిని వర్ణింప నర్హులు. ఇతరుల కా శక్తి యుండదు.

తాత్పర్యము: జననము లేక, 'అజనస్య' అనుటకుఁ దెనుఁగు పరమాత్ముని జన్మ దివ్యమైనది. జీవునివలెఁ గర్మాధీనము గాదు. కర్మముల జాడలఁ బోక 'అకర్తుః' అనుటకుఁ దెనుఁగు, పరమాత్ముని కర్మములు అహంకార రహితము లైనవి. అందుకే వాని ఫలములు వాని కంటుకొనవు. సమస్తచిత్తవర్తనుఁడు 'హృత్పతేః' అనుటకుఁ దెనుఁగు, చక్రికిన్—'రథాంగపాణేః' అనుటకు సుందరమైన సంకుచీకరణము. వేదరహస్యములలో జీవునకుఁ జెప్పినట్లుగా జన్మకర్మలు పరమేశ్వరునకుఁ జెప్పలేదని భావము.

**భువనశ్రేణి నమోఘలీలఁ దగుచున్ బుట్టించు రక్షించు నం**
**తవిధిం జేయు; మునుంగఁడందు బహుభూతవ్రాతమం దాత్మతం**
**త్రవిహారస్థితుఁడై షడింద్రియ సమస్త ప్రీతియుం దప్పులం**
**దివి భంగింగొనుఁ జిక్కఁ డింద్రియములం ద్రిప్పు న్నిబంధించుచున్.**

అవ. జీవుని కార్యములకంటెను. బరమాత్మ కార్యములకుఁ గల వైజాత్యమును జూపించుచున్నాఁడు—

అర్థములు: భువనశ్రేణిన్—సమస్త ప్రపంచములను, అమోఘలీలఁదగుచున్—వ్యర్థముగాని లీలలుగలవాఁడై, బహుప్రవిహీనవమానము, పుట్టించున్ రక్షించున్, అంతవిధిన్ చేయున్—సంహారము నొనర్చును.

అందు మునుంగఁడు=ఆకార్యములలో మగ్నుఁడుగాఁడు, బహుభూత వ్రాతమందున్ = సమస్తప్రాణి సమూహమందును, ఆత్మతంత్ర = తన ఇచ్ఛానుసారముగా, విహారస్థితుఁడై=విహరించుచున్నవాఁడై, షడింద్రియ సమస్తప్రీతియున్=మనస్సుతోఁగూడిన యింద్రియములచే నేర్పడెడు సమస్తానుభవములను, దవ్వులన్=దూరమునుండి, దివి భంగిన్ కొనున్=ఆకాశమువలె గ్రహించును, చిక్కఁడు=వాని యను భవములతో నైక్యముగాఁడు. ఇంద్రియములన్ నిబంధించున్=సమస్త ఇంద్రియములను నియమించును. త్రిప్పున్=వానివాని వ్యాపారము లందు బ్రవర్తింపఁ జేయును.

తాత్పర్యము: ఈ సమస్త భువనములను వ్యర్థముగాని లీలలు గల పరమాత్ముఁడు సృష్టించి రక్షించి సంహరించును. తత్ఫలము లకు లోఁబడఁడు. సమస్త భూతములయం దంతర్యామిగా నుండి యాఘ్రాణించును ఆకాశమునువలె. ఇంద్రియములకు వాఁడు లోఁ బడఁడు. వానిని నియమించుచు తత్తద్వ్యాపారములందు బ్రవర్తింపఁ జేయును. 'అమోఘలీలః' అను మూలమునకు 'అమోఘలీలుఁ డగు చున్' అనునది విగ్రహ వాక్యమువలె నున్నది. వ్యర్థముగాని లీలలు గలవాఁడు. ఇచ్చట లీలాశబ్దము ముఖ్యమైనది. జగద్వ్యాపార మం తయుఁ బరమాత్మకు లీలామాత్రమేయని యర్థము. జీవుని కార్యములు ప్రాచీన కర్మవాసనలకు లోఁబడినవి. వాని ననుసరించియే వానిబుద్ధి ప్రవృత్తమగును. తత్కర్మలతోను సుఖదుఃఖప్రాప్తి. ఈ వికారము లన్నియు భగవత్కర్మలకు లేవు. అమోఘ మనఁగా వ్యర్థము గానిది. నిర్విఘ్నముగా సమాప్తిఁ జెందునది. జీవుని కర్మ లట్లుగాదు. వాని కనేకాంతరాయములు. పరమాత్మ కర్మలు విశ్వసమష్టి కర్మములు. జీవునివట్లు గాదు. వాఁ డల్పుఁడు. కనుక వాని కర్మలును సంకుచిత ములే. 'మునుంగఁ డందున' 'నసజ్జతేఽస్మిన్' అనుటకుఁ దెనుఁగు. సంగమును నిషేధించుటచేతఁ దత్కర్మలు రాగద్వేషాదిరహితములని

యర్థము. వైషమ్య నైర్ఘృణ్యములు లేవు. బహుభూతవ్రాతములందు వాఁడంతరాత్మగా నుండును. భూతములచేతఁ దెలియఁబడఁడు. ఆత్మ తంత్ర విహారస్థితుఁడై=తన ఇచ్ఛకు లోఁబడిన విహారములుగలవాఁడు. జీవులు కాలకర్మదైవాది పరతంత్రులు. ఇంద్రియములన్ ద్రిప్పున్, నిబంధించున్ 'షడ్గుణేశః' అనుట కిది వ్యాఖ్యానము. షడింద్రియ నియంతా అని శ్రీధరులు.

జగదధినాథుఁడైన హరి సంతతలీలల నామరూపముల్
దగిలి మనోవచోగతులఁ దార్కికచాతురి యెంతగల్గినన్
మిగిలి కుతర్కవాది దగ మేరలు సేసి యెఱుంగనేర్చునే!
యగణిత నర్తనక్రమము నజ్ఞుఁ డెఱింగి నుతింపనోపునే!

అర్థము: జగదధినాథుఁడు = జగదీశ్వరుఁడైన హరియొక్క సంతతలీలలకుఁజెందిన, నామములును రూపములును, తార్కిక చాతురి యెంతగల్గినన్=హేతువాదములం దెంత చాతుర్యమున్నను, మనోవచోగతులన్ = మనస్సుచే, వాక్కుచేతను, మిగిలి = మెఱసి, కుతర్కవాది=కుత్సితతర్కములు సేయువాఁడు. మేరలుసేసియెఱుంగ నేర్చునే=హద్దు లేర్పఱచి, యర్థము చేసికొనుటకు శక్తుఁడగునా? అగణితనర్తనక్రమము=గొప్పనాట్యవిశేషమును, అజ్ఞుఁడు=ఆ శాస్త్రము దెలియనివాఁడు, ఎఱింగి నుతింపనోపునే=తెలిసిపొగడుటకు సమర్థుఁ డగునా?

తాత్పర్యము: పరమేశ్వరుని సంతతలీల లెప్పుడును సాఁగు చునేయుండును. వాని కనేకరూపములు. నామము లసంఖ్యాకములు. హేతువాదమం దెంత గట్టివాఁడైనను, మనోవచోగతులతో వానితీరు తెన్నుల కెవ్వఁడును హద్దులేర్పఱుపనేరఁడు. అర్థము చేసికొనలేఁడు. విశిష్టమైన నాట్యక్రమమును అజ్ఞుఁడైన వాఁ డెట్లెఱిఁగి నుతింప నోపును? కుమనీషః=అనుటకుఁ గుతర్కవాది యని పోతన్న.

ఇంచుక మాయలేక మదినెప్పుడు వాయని భక్తితోడ వ
ర్తించుచు నెవ్వఁడేని హరి దివ్యపదాంబుజ గంధరాశి సే
వించు నతం డెఱుంగు నరవిందభవాదులకైన దుర్లభో
దంచితమైన యా హరి యుదార మహాద్భుత కర్మమార్గముల్.

అర్థము: ఇంచుక మాయలేక=అల్పాల్పమైనను మాయతోడి సంబంధము లేక, మదిన్ ఎప్పుడున్ పాయని భక్తితోడన్=ఒక్క క్షణకాల మేనియు విడుమరలేని భక్తితో, వర్తించుచు=జీవించుచు, ఎవ్వఁడేని=ఏపురుషుఁడైనను, హరియొక్క దివ్యములైన పదాంబుజ=పాదములనెడి కమలములయొక్క, గంధరాశిన్=గంధసమూహమును సేవించున్=అనుభవించునో, అతఁడు=అట్టివాఁడు, అరవిందభవాదుల కైనన్=బ్రహ్మాదులకైనను, దుర్లభ=పొందరాని (తెలిసికొనుటకు సాధ్యముగాని) ఉదంచిత=ప్రకాశించునట్టి ఆ హరియొక్క, ఉదార=గొప్పదైన, మహాద్భుత=ఆశ్చర్యకరములైన, కర్మమార్గముల్=కార్యముల పద్ధతులను, ఎఱుంగున్=ఎఱుఁగును.

అమాయయా అని మూలము. అకుటిల భావముతోనని శ్రీధరుల వ్యాఖ్య. కనుక ఫలాభిసంధిరూపమైన కౌటిల్యమును వర్జించియని తాత్పర్యము. సంతతయా=అను దాని భావమే మదినెప్పుడు పాయని భక్తితోడ వర్తించుచున్ అనునది. భక్తి ధారావాహికముగా నుండవలెనని భావము. అనువృత్తి లేనప్పుడు శుద్ధభక్తి ఏర్పడదు. రజోగుణ పూరితమైనభక్తి సర్వకాలములందును వర్తింపదు. కనుక మది నెప్పుడు పాయని భక్తితోడ 'అనుతతానే' 'అనువృత్యా' అనుకూలమైన భక్తితో అనెడు భావము గతార్థమైనది.

భక్త్యాత్వ నన్యయాశక్య అహమేవం విధోర్జున!
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప!

అని గీతావాక్యము. కనుక భగవదవతార రహస్యములు, ఇక అవిచ్ఛిన్న భగవద్భక్తియోగ నిష్ఠావంతులే తెలియుదురని తాత్పర్యము.

ఈ పద్యమందలి గంధశబ్దము మూలములోనిదే. 'తత్పాద సరోజగంధం' వ్యాసుఁడు. ఇచ్చటి గంధశబ్దమునకు విజయధ్వజ కారులు వే రర్థమునే చెప్పిరి. హృదయగతుఁడైన పరమాత్ముని రూప మునకే గంధమని నామాంతరము అని వారి భావము.

**హృది వ్యక్తం తు యద్రూపం హరేర్గంధ స్స ఉచ్యతే.**

అని యొక వచనపురాణము నుదాహరించిరి. వల్లభులు గంధశబ్దము నకు సరసమైన వ్యాఖ్యాన మిచ్చినారు. మాయాశబ్దముగూడఁ గ్రొత్త యర్థమును దిద్దికొన్నది. వారిదృష్టిలో మాయ యనఁగా స్వముక్తి విచారము. దీర్ఘ కాల మాదరముతో భగవంతుని పాదపద్మములను సేవింపవలెను. 'పాదసరోజ గంధం' ఎట్లేర్పడును? వాని వివరణ మిది—

**శయనే పాదసంవాహనే ఊర్ధ్వముఖస్య చరణస్య ఆఘ్రాణే గంధోఽనుభూయతే తథా, ఏషాం హృదయే స్వచ్ఛందం శేతే. బహిరింద్రియాణి చ గంధేనాకృష్టాని తత్రైవ ప్రవిశంతి.**

అనఁగా హృదయస్థితుఁడైన పరమాత్ముని చరణపంకజగంధా నుభూతి సర్వేంద్రియానుభూతమై యింద్రియము లన్నియు నందే ప్రవర్తింపవలెనని భావము. అట్టి యనుభూతికి ఎంత తీవ్రమైన భావన యుండవలెనో సాధకులకుఁ జెప్పఁబనిలేదు. మఱియొక యర్థము గూడ వారిచ్చిరి. ఆతని చరణ మనఁగా భక్తిమార్గము. శుద్ధాంతఃకరణమునం దావిర్భూతమగు సరోజమది. దాని గంధమనఁగా ప్రేమానిలము. దాని నిరంతరాస్వాదనమే భక్తి.

దివ్యపదాంబుజ గంధరాశికిన్—దివ్యమైన పదాంబుజము కర్మ ధారయము. పద మనెడు అంబుజము రూపకసమాసము. దాని గంధరాశి షష్ఠీతత్పురుషము. అరవిందభవాదులు అరవిందమందు భవము గలవాఁడు. వ్యధికరణబహువ్రీహి. అరవిందభవుఁడు ఆదిగా గలవారు నారదాదులు. తద్గుణసంవిజ్ఞాన బహువ్రీహి.

తాత్పర్యము: మాయారహితుఁడై వర్తించుచు నిరంతరభక్తిని సాధించువాఁడే బ్రహ్మాదుల కర్థముగాని హరియవతార కర్మమార్గము లెఱుఁగును.

హరిపాదద్వయభక్తి మీవలన నిట్లారూఢమైయుండునే
తిరుగం బాఱదు చిత్తవృత్తి హరిపై దీపించి మీలోపలన్
ధరణీదేవతలార! మీరలు మహాధన్యుల్ సమస్తజ్ఞులున్
హరిచింతన్ మిముఁ జెందవెన్నఁడును జన్మాంతవ్యథా యోగముల్.

మీ వలనన్ = మీ యందు, హరిపాదద్వయభక్తి = శ్రీమన్నారాయణుని పాదపద్మములపైని భక్తి, ఇట్లు = ఇంతగొప్పగా, ఆరూఢమై యుండునే = విలసిల్లుచున్నదిగా నుండును! ఈ వాక్యమాశ్చర్యార్థకము. మీలోపలన్ = మీ యందఱిలోను, చిత్తవృత్తి = మనస్సుయొక్క వ్యాపారము, హరిపైన్ దీపించి = శ్రీహరియందు నెలకొన్నదై, తిరుగం బాఱదు = అటనుండి వెన్కకు వచ్చుటలేదు. ధరణీదేవతలార = ఓ విప్రులారా! మీరలు మహాధన్యుల్ = మీరు ధన్యమైన జీవితముగల వారు, సమస్తజ్ఞులున్ = సమస్త విషయము లెఱిఁగినవారు, హరి చింతన్ = హరియందు మీకుఁగల భక్తిచేత, మిముల్ = మిమ్ములను, జన్మాంతవ్యథా యోగముల్ = జన్మ+అంత = జనన మరణములు వీనిచే నేర్పడెడు, వ్యథా = బాధలయొక్క, యోగముల్ = సంబంధములు, ఎన్నఁడున్ చెందవు = ఎప్పటికిని ప్రాప్తింపవు.

తాత్పర్యము: శ్రీమన్నారాయణ పాదద్వయభక్తి మీ యందెంత గొప్పగా నున్నది! మీ చిత్తవృత్తులు హరియందే రమించుచుండును. అటనుండి తిరిగివచ్చుట యెది? ఓ విప్రులారా! మీ జీవితము మహాధన్యమైనది. మీరు సమస్తజ్ఞులు. హరిభక్తి మాహాత్మ్యముతో మి మ్మెన్నడును జన్మమరణాది దుఃఖములు చెందవు.

విశేషార్థములు: భక్తులే భగవత్తత్త్వము నెఱుఁగుదురు. భగవంతుని తత్త్వ మెఱిఁగినవారు సమస్త మెఱిఁగినట్లే. అందువలననే

మీరు ధన్యులు కృతార్థులని తాత్పర్యము. మీ మనోవృత్తి ఐకాంతికమైనది. శ్రీమన్నారాయణుఁడు తప్ప ఇతరదైవము మీ మనస్సులోనికిఁ జొచ్చుటలేదు. ఇట్టి భక్తిని సాధించితిరి గనుకనే మీ కుగ్రమైన జన్మమరణాది వ్యథాయోగము లేదు.

పుణ్యకీర్తనుఁడైన భువనేశు చరితంబు
    బ్రహ్మతుల్యంబైన భాగవతము
సకలపురాణరాజము దొల్లి లోక భ
    ద్రముగ ధన్యముగ మోదముగఁ బ్రీతి
భగవంతుఁడగు వ్యాసభట్టారకుఁ డొనర్చి
    శుకుఁ డనియెడు తన సుతునిచేతఁ
జదివించె నింతయు సకలవేదేతిహా
    సములలోపల నెల్లసారమైన
ఈ పురాణమెల్ల నెలమి నా శుకయోగి
గంగనడుమ వచ్చి ఘనవిరక్తి
యొదవి మునులతోడ నుపవిష్టుఁడగు పరీ
క్షిన్నరేంద్రుఁ డడుగఁ జెప్పె వినుఁడు।

బ్రహ్మతుల్యము—వేదముతో సమానమైనది. ఇది సకలపురాణరాజము. సమస్త పురాణములలో శ్రేష్ఠమైనది. దీనిపేరు భాగవతము. ఇందులోనివృత్తాంత మేమి? పుణ్యకీర్తనుఁడైన భువనేశు చరితము. పవిత్రమైనకీర్తిగల శ్రీమన్నారాయణుని చరిత్రవర్ణనమే భాగవతకథ. ఆ భగవంతుని కీర్తి కేవలము పుణ్యమైనదే గాదు, దానిని వర్ణించువారినిగూడఁ బవిత్రుల నొనర్చును. పుణ్యంకీర్తనం యస్య సః అని సమాసము. సమస్త భువనములకును ఈశుఁడు శ్రీహరియే గదా! దీనిని తొల్లి—పూర్వము, లోకభద్రముగ—లోకములకు క్షేమమును గల్గించు దానినిగా, ధన్యమైన దానినిగా సమస్తమంగళములకు నాకరముగా భగవంతుఁడైన వ్యాసభట్టారకుఁడు రచించెను. ఉత్తమాధి

కారియైన శుకునితో దీనినంతయుఁ జదివించినాఁడు. ఇది సకలవేదముల పురాణములయొక్క సారము. పరీక్షిత్తు శాపదష్టుఁడైనాఁడు. అతని హృదయమును పరమవైరాగ్య మాక్రమించెను. గంగానది నడుమ ప్రాయోపవిష్టుఁ డైనాఁడు. అల్పకాలములో (ఏడు దినములలో) ముక్తిమార్గమును సాధించు టెట్లని యాతఁడు మహర్షులకు వేసిన ప్రశ్న. దాని కెవ్వరును సమాధానము చెప్పలేదు. అదృష్టవశాత్తు శుకుఁ డచ్చటి కరుదెంచినాఁడు. అతనికి నమస్కరించి మునుల నావిషయమే రా జాతనినిఁ బ్రశ్నించెను. అప్పు డాతఁడు భాగవతము నుపదేశించెను.

నాఽపృష్టః కస్య చిద్బ్రూయాత్ నాప్యన్యాయేన పృచ్ఛతః
జ్ఞానవా నపి మేధావీ జడవ త్సముపావిశేత్.

(భార. శాంతి. 287అ. 35 శ్లో.)

అడుగనిదే యెందుకు చెప్పలేదు? అది సదాచారము గాదు. పైఁగాఁ గొన్నిచోట్లఁ నవమానముగూడ గల్పింపవచ్చును. ' అడుగనిదేదియుఁ జెప్పరాదు. దురుద్దేశముతో నడిగిన వచింపరాదు. తన కా ప్రశ్న కుత్తరము దెలిసినను జడునివలెనే యుండవలెను '. ఇది భారత మొనర్చిన బోధ.

శుకబ్రహ్మ మహాజ్ఞాని. అతఁడు వ్యాసుని వదలిపోయెను. ఒక వనమునందు సమాధిస్థితుఁడై యున్నాఁడు. అతని బుద్ధివృత్తి నిఖిల దృశ్యప్రపంచమును నిరాస మొనర్చెను. అశేషవిశేషశూన్య శుద్ధబుద్ధముక్త పరబ్రహ్మయందు లీనమైయుండెను. బాహ్యజగత్తుయొక్క ధ్యానమే యాతనికి లేదు. ఆ సమయమందుఁ గొందఱు వ్యాసశిష్యు లా వనమునందుఁ బ్రవేశించిరి. వారు శుకవృత్తాంతమును వ్యాసున కెఱిఁగించినారు. అతఁడు సమాధిస్థితుఁడై సకల వృత్తాంతము నెఱిఁగెను. అప్పటికే భాగవతరచన ముగిసినది. దీనిని

శుకబ్రహ్మతోఁ జదివింపవలెనని వ్యాసునియాశ. అదెట్లు సాధ్యమగును? అతఁడు శిష్యులకు దశమస్కంధమందలి ఈ శ్లోకమును నేర్పెను.

బర్హాపీడం నటవరవపుః కర్ణయోః కర్ణికారం
బిభ్రద్వాసః కనకకపిశం వైజయంతీం చ మాలామ్,
రంధ్రాన్వేణో రధరసుధయా పూరయన్ గోపవృందైః
బృందారణ్యం స్వపదరమణం ప్రావిశద్గీతకీర్తిః.

వ్యాసముని శిష్యు లీ శ్లోకమును శుకునిచెంతఁ బలుమాఱు గానముచేసినారు. శుకున కా శ్లోకముయొక్క యర్థస్ఫూర్తి గల్గినది. చిత్త మెంత శుద్ధముగా నుండునో యంత శీఘ్రముగా భగవత్తత్త్వాను భూతి యేర్పడును. ఇది నియమము. అందుచే యుపాసన ముగిసిన యుత్తమాధికారులకు మహావాక్య శ్రవణమైనంతనే స్వరూపసాక్షా త్కార మేర్పడును. శ్లోకార్థ మవగతమైనంతనే భగవద్విగ్రహసంబంధ మైన రూపమాధురితో శుకుని మనస్సు క్షుబ్ధమై పోయినది. సమాధివిచ్చి పోయెను. అతఁడు వ్యాసశిష్యులతోఁ బలుమా రీ శ్లోకమును జెప్పించి కొనెను. అతఁ డానందోన్మత్తుఁ డయ్యెను. తానును బలుమారు చదివి నాఁడు, కాని వ్యాసుని చెంతకు రాలేదు. శిష్యులు వ్యాసభట్టారకు నకు సమస్తవృత్తాంతము నివేదించిరి. శుకుఁ డెందుకుఁ దనచెంతకు రాలేదు? ఇంతటి విలక్షణ సౌందర్య మాధుర్యముగల వానికి నా వంటి యకించనునితో నేమిపని? ఇది శుకుని సందేహమైయుండును. వ్యాసుఁడు మఱల శిష్యులకు భగవంతుని దయాళుత్వమును బ్రశం సించు నొక శ్లోకమును నేర్పెను. అది యీ క్రిందిది.

అహో! బకీయం స్తనకాలకూటం
జిఘాంసయా ఽపాయయ దప్యసాధ్వీ,
లేభే గతిం ధాత్ర్యుచితాం తతోఽన్యం
కం వా దయాళుం శరణం వ్రజేమ.

మఱల శిష్యులు శుకునిచెంత కేతెంచి దీనిని గానము చేసిరి. అదివిన్న శుకుఁడు ముగ్ధుఁడైనాఁడు. ఈ శ్లోక మెందులోని దని శుకుఁడు వారి నడిగెను. మా గురువులు అష్టాదశ సహస్రపరిమితమైన మహాసంహితను రచించినారు. ఈ శ్లోక మందులోని దన్నారు. శుక బ్రహ్మ వ్యాసుని చెంత కేతెంచెను. అతఁడు భాగవతము నధ్యయన మొనర్చినాఁడు. పై కథ కరపాత్రస్వామి వచించినది. 'నిశ్శ్రేయ సాయ లోకస్య' అనుదానిని లోకభద్రముగ నని పోతన్న యన్నాఁడు. ధన్యం మూలములోనిదే. మోదముగన్=‘స్వస్త్యయనం' అనుటకుఁ దెనుఁగు. శుకునకే యెందుకుఁ జెప్పవలసి వచ్చినది? 'అత్మవతాం వరం'=అతఁ డుత్తమాధికారులలో నుత్తముఁడు.

వచ: కృష్ణుండు ధర్మజ్ఞానాదులతోడం దన లోకంబునకుం జనిన పిమ్మటం గలికాల దోషాంధకారంబున నష్టదర్శనులైన జనులకు నిప్పు డీ ప్పురాణంబు కమలబంధుని భంగి నున్నది. నాతండు భూరితేజుండయి కీర్తించుచున్న విప్రర్షి వలన నేఁ బఠించిన క్రమంబున నా మదికి గోచరించినంతయు వినిపించెద ననిన సూతునకు మునివరుండైన శౌనకుం డిట్లనియె.

అర్థము: తన లోకంబునకుఁ జనినపిమ్మటన్=తన దివ్యధామ మైన వైకుంఠమునకుఁ బోయినవాఁడు కాఁగా కృష్ణుఁ డీ లోకమం దున్నప్పుడు ధర్మము జ్ఞానము మున్నగున వన్నియు నాతని నాశ్ర యించి యుండినవి. ఆ స్వామి వైకుంఠము నందినంతనే సమస్త సద్గుణము లాతనితోఁ బోయిన ట్లైనది. ఆ గుణముల కాశ్రయ మొసఁగువాఁ డెవ్వఁడును లేకపోయెను. కలికాలమందు దోషాంధకార మలమి కొన్నది. జనులు నష్టదర్శనులైనారు. అనఁగా భగవత్ప్రాప్తికి సరియైన మార్గము దోఁపనివారైనారు. 'కలౌ నష్టదృశాం' అని మూలము. కలియుగమందు నష్టదృక్కులు కాఁగా అని యర్థము.

పోతన్నగారు 'కలౌ' అను సప్తమ్యంతమును గ్రహించి వ్యాసభావము నూహించి కలికాల దోషాంధకారంబునన్ – అని వివరించినారు. కమలబంధుఁ డనఁగా సూర్యుఁడు. సూర్యోదయముతో తమస్సు నశించును భాగవతపురాణోదయముతోఁ గలిదోషములనెడు తమస్సు నశించినది. భూరితేజసః—అనుపదము తెనుఁగులోని కల్లే వచ్చినది. విప్రర్షేః – మూలములోనిదే 'యథామతిం' అను దాని వివరణము 'నా మదికి గోచరించి నంతయు' ననుట. అప్పుడు శౌనకుఁడు సూతు నిట్లు ప్రశ్నించెను.

పుట్టపర్తి నారాయణాచార్యదాసునిచే విరచింపఁబడిన
'భాగవతసుధాలహరి' యందు ప్రథమ
స్కంధమున తృతీయాధ్యాయము
**వ్యాఖ్య ముగిసినది.**



# భాగవతసుధాలహరి

## ప్రథమ స్కంధము

## చతుర్థాధ్యాయము

* * *

వ్యాస ఉవాచ :

ఇతి బ్రువాణం సంస్తూయ మునీనాం దీర్ఘసత్రిణామ్,
వృద్ధః కులపతి స్సూతం బహ్వృచః శౌనకో ఽబ్రవీత్. 1

శౌనక ఉవాచ :

సూత ! సూత ! మహాభాగ ! వద నో వదతాంవర !
కథాం భగవతీం పుణ్యాం యదాహ భగవాన్ శుకః. 2

కస్మిన్ యుగే ప్రవృత్తే ఽయం స్థానేవా కేన హేతునా,
కుత స్సంచోదితః కృష్ణః కృతవాన్ సంహితాం మునిః. 3

తస్య పుత్రో మహాయోగీ సమదృఙ్నిర్వికల్పకః,
ఏకాంతమతిరున్నిద్రో గూఢో మూఢ ఇవేయతే. 4

దృష్ట్వాఽనుయాంత మృషిమాత్మజ మప్యనగ్నం,
దేవ్యోహ్రియా పరిదధుర్న సుతస్య చిత్రమ్,
తద్వీక్ష్య పృచ్ఛతి మునౌ జగదుస్తవాస్తి
స్త్రీపుంభిదా న తు సుతస్య వివిక్తదృష్టేః. 5

ఇతి=ఇట్లుగా, బ్రువాణం=పలుకుచున్నట్టి, సూతం=సూతుని, సంస్తూయ=గొప్పగా స్తుతించి, దీర్ఘసత్రిణాం=దీర్ఘకాలికమైన సత్రయాగము నొనర్చుచున్న, మునీనాం=మునుల మధ్యలో, వృద్ధః=వృద్ధుఁడును, కులపతిః=కులమునందు శ్రేష్ఠుఁడును, బహ్వృచః=ఋగ్వేదమును బాగుగా నభ్యసించిన, శౌనకః=శౌనకుఁడు, అబ్రవీత్=పలికెను.

ఆ మునులు దీర్ఘకాలికమైన సత్రయాగము నొనర్చుచుండిరి. వారిలో శౌనకుఁడు కులపతి, వయోవృద్ధుఁడు. ఋగ్వేదమంతయు నభ్యసించినవాఁడు. అతఁడు భాగవతసంసేవనము చేయింపఁ బోవుచున్నందులకు సూతు నెంతయో పొగడెను. మఱియు నిట్లు పలుకనారంభించినాఁడు. 1

మహాభాగ!=కృష్ణకథాకథన మనెడు గొప్పభాగ్యమేర్పడిన, సూత!సూత!=ఓయి సూతుఁడా! ఆదరాతిశయమందు పిప్స, వదతాంవర!=వాక్చాతుర్యముగల వారిలో శ్రేష్ఠుఁడా!, భగవాన్ శుకః=బ్రహ్మనిష్ఠులలో గొప్పవాఁడైన శుకుఁడు, యదాహ=ఏ భాగవతకథను పలికెనో, పుణ్యాం=పుణ్యవర్ధకమైనట్టియు, భాగవతీం=భగవంతుని యవతారకథలకు సంబంధించినదియునైన, కథాం=కథను, నః=మ మ్ముద్దేశించి, వద!=వాఖ్యానింపుము.

ఓయి సూతా! నీవు మహాభాగ్యశాలివి. భగవత్కథాకథనమను నదృష్టము ఏ కొలఁదిమందికో పట్టును. అంతమాత్రమే గాదు. వాక్చాతుర్యమున్న వారిలో నీవు శ్రేష్ఠుఁడవు. అందుచే ప్రతిపదమును రసవత్తరముగా నొనర్చి వ్యాఖ్యానించు సామర్థ్యము నీది. దీనిచే శ్రోత లందఱు త్వత్కథా కథనమందే లీనమైన చిత్తవృత్తులు గలవారగుదురు. శుకమహర్షి పరీక్షిత్తునకు వర్ణించి చెప్పిన భాగవతకథను యథాధీతముగా మాకు వివరింపుము. తచ్ఛ్రవణము మహాపుణ్యము. అందులో భగవదవతార చరిత్రలు తరంగములవలె పైపై నుబుకుచుండును. 2

ఇయం=ఈ భాగవతకథ, కస్మిన్ యుగే=ఏ యుగమందు, స్థానేవా=ఏ ప్రదేశమందు, కేనహేతునా=ఏ కారణముచేత, ప్రవృత్తా=రూపు చేకొన్నది?

కృష్ణః మునిః = కృష్ణాభిధానుఁడైన వ్యాసమహాముని, శుత స్సంచోదితః = దేనిచేఁ బ్రేరేపింపఁబడినవాఁడై, సంహితాం = ఈ మహాసంహితను, కృతవాన్ = విస్తరించినవాఁ డయ్యెను.

సూతా! పరమపుణ్యమైన ఈ సంహిత ఏ యుగమందు రూపు చేకొన్నది? ఏతత్సంహితా జన్మకారణమైన పుణ్యప్రదేశ మేది? ఏ కారణముచే నిది ఏర్పడెను? ఏతన్మహాసంహితా రచనమునకు భగవదవతారుఁడైన వ్యాసమహాముని నెవ్వరు ప్రేరేచిరి. 3

సమదృక్ = సమానమైన దృష్టిచేఁ గూడినవాఁడును, నిర్వికల్పకః = వికల్పబుద్ధి లేనివాఁడును, ఏకాంతమతిః = ఒకేవస్తువునందుఁ బర్యవసించిన మనస్సుగలవాఁడును, ఉన్నిద్రః = నిద్రతో సమానమగు మాయలేనివాఁడును, గూఢః = అవ్యక్తమైన స్వరూపముఁ గలవాఁడును, మహాయోగీ = గొప్పయోగియు నైన, తస్య = ఆ వ్యాసభగవానునియొక్క, పుత్త్రః = పుత్త్రుఁడైన శుకబ్రహ్మ, మూఢ ఇవ = మూఢునివలె, ఈయతే = కనుపించును.

వ్యాసపుత్త్రుఁడైన శుకమహాముని పరీక్షిత్తునకు భాగవతమును విన్పించె ననుట యెట్లు సంఘటించును? ఎందుకనఁగా బాదరాయణియైన శుకుఁడు మహాయోగి. సర్వపదార్థములందును భేదములేక ప్రకాశించెడు బ్రహ్మమునందే దృష్టిగలవాఁడు. ఒకదానియందే నిమగ్నమైన మనోనిగ్రహముగలవాఁడు. అవిద్యారూపమగు మాయను గెలిచినవాఁడు. పరమజ్ఞాని. ఇతఁ డిట్టివాఁడని ఎవ్వరికిని దెలియఁబడనివాఁడు. గూఢునివలె, మూఢునివలె వ్యవహరించెడువాఁడు. 4

అనుయాంతం = శుకబ్రహ్మననుసరించిపోవుచున్న, అనగ్నం అపి = నగ్నుఁడు గాక, వస్త్రపరిధానవంతుఁడైన, ఋషిం = వ్యాసభగవానుని, దృష్ట్వా = చూచి, దేవ్యః = దేవస్త్రీలు, హ్రియా = సిగ్గుచేత, పరిదధుః = వస్త్రములను ధరించిరి, ఆత్మజం = తన పుత్త్రుఁడైన శుకుని (దృష్ట్వా తు = చూచి, పరివధుః = వస్త్రధారణము సేయరైరి), సుతస్య = పుత్త్రునియొక్క (పుత్త్రవిషయకమైన), చిత్రం = ఆశ్చర్య

జనకమైన, తత్=ఆ సంఘటనను, వీక్ష్య=చూచి, మునౌ=వ్యాసభగవానుఁడు, పృచ్ఛతి సతి=ప్రశ్నించినవాఁడు కాఁగా, స్త్రీపుంభిదా=స్త్రీ పురుషు లనెడు భేదము, తవ అస్తి=నీకుఁ గలదు, వివిక్తదృష్టేః=పరిశుద్ధభావముతోఁ గూడిన, సుతస్య=నీ కుమారుఁడగు శుకబ్రహ్మకు, న తు = లేదని, జగదుః=బదులు పలికిరి.

అవ: శుకబ్రహ్మ యొక్క మాహాత్మ్యమును జెప్పుచున్నాఁడు—

అవధూతయైన శుకబ్రహ్మ పోవుచుండెను. వ్యాసుఁడు సుత వ్యామోహముతో వెంటఁ దవిలినాఁడు. త్రోవలో నొక జలాశయము. అప్సరఃస్త్రీలందు నగ్నలై క్రీడించుచుండిరి. వారి వస్త్రములు గట్టుపై నుండెను. ఆ త్రోవనే శుకబ్రహ్మ దిగంబరుఁడై నడచివెళ్ళెను. వారి కాతనిఁ జూచినప్పుడు లజ్జ దోఁపలేదు. అతనివెనుక నేగిన వ్యాసుఁడు బద్ధపరిధానుఁడు. అతనిఁ జూచినంతనే యప్సరసలు సిగ్గుఁజెంది గట్టు పైని వలువలుదీసి ధరించిరి. వ్యాసునిరాకతో వారికి లజ్జ దోఁచినది. ఈ సంఘటనతో వ్యాసుఁ డాశ్చర్యపడినాఁడు. అతఁడు వారినే ప్రశ్నించెను. 'దేవకాంతలారా! నా కుమారుఁడు నగ్నుఁడు. నేను వస్త్రముల ధరించితిని. అతఁడు యువకుఁడు. అతఁ డీ దారిని నడచి వెళ్ళగా సరకుసేయరైతిరి. నేను వృద్ధుఁడను. నగ్నుఁడను గాను. నన్నుఁ జూచి మీరు సిగ్గిలు టేల? దీనికిఁ గారణము దెలుపవలెను. వెంటనే వా రన్నారు. 'వ్యాసమునీ! తమకు స్త్రీ పురుష భేదదృష్టి యున్నది. శుకబ్రహ్మ కది లేదు. నిరంతరము పరిశుద్ధబ్రహ్మభావన మాత్రమే యాతని కున్నది. అందుచే మాకు లజ్జ దోఁప లేదు.' 5

శ్రీధరీయము :

అక్కడనేక ఋషులు చేరిరి. వా రందరును మాటాడ నారంభించినచో నొకరిమాట మఱియొకరికి వినపడదు. అందరికిమారుగా నొకఁడే మాట్లాడవలెను. వా రందఱు శౌనకు నెన్నికొన్నారు. ఎందుకు? అతఁ డందరిలో వృద్ధుఁడు. పైఁగా కులపతి. కులపతు

లెందరో యున్నారు. వారిలో ఋగ్వేది. ఋగ్వేదమునకు గొప్పగౌర వము. ఇన్ని యోగ్యతలతో శౌనకుని వారు పెద్దగా నెన్నికొన్నారు.

రెండవశ్లోకము విశేషము లేదు.

మహాభారతాది సర్వశాస్త్రములను ఇంతకుముందే వ్యాస భగ వానుఁడు రచించెను. మరల నీ సంహితారచనకుఁ గారణమేమి? కుతః? అనుచోట సార్వవిభక్తికమైన 'తసిల్' ప్రయోగము.

సమదృక్=సమస్త పదార్థములందును బ్రహ్మను సమముగాఁ జూచువాఁడు. అందుచేతనే నిర్వికల్పుఁడు. నిరస్తమైన భేదబుద్ధిఁగల వాఁడు. స్వార్థమందు 'క' ప్రత్యయము. ఏకాంతా మతిః యస్య సః=ఏకాంతమతిః=ఒక్క విషయమునందే అంత మనఁగా సమాప్తి. అదిగల బుద్ధి=అట్టిబుద్ధితోఁ గూడినవాఁడు. అనఁగా బ్రహ్మభావమందే విలీనమైన చిత్తవృత్తిఁ గలవాఁడని పిండితార్థము. ఉన్నిద్రః=మాయా శయనము నుండి యుద్బుద్ధుఁడైనవాఁడు. నిద్ర యనఁగా నిచ్చట మాయ.

యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ

అని గీతావచనము. అందుచేత గూఢుఁడు=అప్రకటమగు ప్రవృత్తిఁ గలవాఁడు. మూఢ ఇవ ఈయతే=మూఢునివలె ఇతరుల కగుపించు వాఁడు. నిర్వికల్పః=విరుద్ధః కల్పః వికల్పః. విరుద్ధమైన కల్పము విక ల్పము అనఁగా పరస్పర విరుద్ధమైన పక్షద్వయము=అది లేనివాఁడు. సంశయాత్మకమైన జ్ఞాన మాతనికి బొత్తిగా లేదని తాత్పర్యము. నిశ్చయాత్మకజ్ఞాన ముండుటచే సర్వసంశయములను ఛేదించికొన్న వాఁడు. ఏకాంతమతిః=నిర్జనదేశ నివాసరసికుఁడు అనఁగా మనుష్య మాత్రుఁడు లేని స్థలములందే వసించెడివాఁడు, మహాయోగి=నిరంతర యోగతత్పరుఁడు.

వీరరాఘవ వ్యాఖ్య:

సమదృక్–'సుహృన్మిత్రార్య్యుదాసీన మధ్యస్థద్వేష్య బంధుషు' అను గీతావచనమువలె వీ రందరియందును సమానబుద్ధిఁ గలవాఁడని తాత్పర్యము.

ఐదవశ్లోకము విశేషము లేదు.

వంశీధరుఁడు:

ఏకో దశసహస్రాణియో ఒన్నదానాదినాభరేత్
స వై కులపతిః ప్రోక్తః

అని భారతటీకలో నీలకంఠుఁడు.

సువతి ప్రేరయతి శుభే కర్మణి వ్యాసశిక్షయా లోకానితి సూతః=వ్యాసభగవానుని శిక్షతో లోకములను శుభకర్మలకై ప్రేరేఁచు వాఁడు గనుక సూతుఁడు. ఇతనితండ్రి రోమహర్షణుఁడు. అందుచే నితనికి 'రౌమహర్షణి' యనియును బేరు. సూతుఁ డన్నది జాతి నామము. అందుచే నీతని స్వనామధేయమేమో తెలియదు. మహా భాగ=కృష్ణకథను జెప్పువారును, వినువారును, అనుమతించువారును సర్వులును మహాభాగులే. 'తే ధన్యాస్తే మహాభాగా ఏషాం కృష్ణ కథారతిః' అని అభియుక్తోక్తి. వదతాంవర!=కృష్ణకథను జెప్పువాఁడే శ్రేష్ఠమైన వాక్కుగలవాఁడు. 'సావాగ్యయా తన్యగుణాన్ గృణీతే' అని భాగవతమే చెప్పుచున్నది. భగవాన్=సర్వజ్ఞుఁడు.

ఉత్పత్తిం ప్రళయం చైవ భూతానామగతిం గతిమ్,
వేత్తి విద్యా మవిద్యాం చ స వాచ్యో భగవానితి.

అని లక్షణము. శోచయతి హరివిముఖాన్ నిజశాస్త్ర శ్రవణేన ఇత్యన్వర్థనామా శ్రీశుకదేవః' తనదైన భాగవతశాస్త్ర శ్రవణముచేత నితరులకుఁ దమ జన్మలందు పరితాప మేర్పడునట్లు చేయువాఁడు గనుక శుకుఁడు. అందుకే–

యైర్న శ్రుతం భాగవతం పురాణం
నారాధితో యైః పురుషః పురాణః,
హుతం ముఖే నైవ ధరామరాణాం
తేషాం వృథా జన్మగతం నరాణామ్.

అని సంహితావచనము.

మూఁడవశ్లోకము వేదరూపమైనది.

సమ్యక్ హితం యావదతి సంహితా సా ప్రకీర్తితా,
హితం వేదానుగమనం అహితం చ తదన్యథా.

అని వరతంతువు,

సమదృక్=మా అనఁగా లక్ష్మీదేవి, ఆమెతో గూడినవాఁడు సముఁడు. సమునియందే దృష్టిగలవాఁడు సమదృక్. సమేదృక్ యస్యసః=వ్యధికరణ బహువ్రీహి.

వీరరాఘవవ్యాఖ్య:

మహాభాగ!=పరమభాగ్యవంతుఁడా! ఇక్కడ భాగ్యము నిఖిలతత్త్వ జ్ఞానస్వరూప మైనది. భాగవతీంకథాం=శ్రీమద్భాగవత మహాపురాణ ప్రతిపాద్యమానమైన, కథాం=కథను-ఆ భాగవత విశేషమును జెప్పుచున్నాఁడు. యత్=ఏ భాగవతము, భగవాన్ శుకః= భగవంతుఁడైన శుకబ్రహ్మ పరీక్షిన్మహారాజునకుఁ జెప్పెనో, పరీక్షిత్తునకు భాగవతమును విన్పించుట ఎప్పుడో జరిగినది. ఆ బుద్ధిస్థితమైన విషయమును యచ్ఛబ్దము పరామర్శించుచున్నది.

ఇందు నాల్గుప్రశ్నలు. 1. కస్మిన్యుగే ప్రవృత్తా, 2. కస్మిన్ స్థానే, 3. కేన హేతునా, 4. కేనపుంసా సంచోదితః. ఏ పురుషునిచేఁ బ్రేరేపింపఁబడినవాఁడై, ఇది నాల్గవప్రశ్న. వీనికిఁ గ్రింద సమాధానముఁ జెప్పఁబోవు చున్నాఁడు.

'సతుసంశ్రావయామాస మహారాజం పరీక్షితం' అని ముందు చెప్పఁబడినది. ఇది యసాధ్యమైన విషయము. అసాధ్య మనుటయే పైని ఐదు శ్లోకములతో నిరూపింపఁబడుచున్నది.

వ్యాసభగవానుని కుమారుఁడు మహాయోగి. శ్రేష్ఠత్వమునే సమదృక్ అనుటతో చెప్పఁబోవుచున్నాఁడు. ప్రధాన పరిణామములైన శరీరము లనేక విధములు, దేవమనుష్యాదులు. ఈ జీవవర్గము నంతయు నాతఁడు సమానముగనే చూచుచున్నాఁడు. ఎట్లు? జ్ఞానైకాకారముతో. సర్వత్ర అనుస్యూతమైన పరమాత్మనే వీక్షించుచున్నాఁడు. ప్రతిపదార్థమునం దాతనికి సత్యజ్ఞానాది కల్యాణగుణాకారుఁడైన భగవంతుఁడే దర్శన మిచ్చుచున్నాఁడు. ఈ సమవిధమే సమదర్శిత్వము.

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః.

అని గీతావాణి. నిర్వికల్పకః=భేదానుసంధానము లేనివాఁడు. దేహగత వికల్పములైన దేవమనుష్యత్వాదులను ఆత్మయం దారోపింపని వాఁడని యర్థము. లేక అబ్రహ్మాత్మకమైన స్వతంత్రవస్తు రహితుఁడు. ఏకాంతమతిః=భగవంతునందు అవ్యభిచారిణియైన బుద్ధి గలవాఁడు.

## వల్లభాచార్య సుబోధినీ వ్యాఖ్య:

శౌనకుఁ డడిగిన ప్రశ్నలు నాల్గంటిమి. వల్లభాచార్యుఁడు గూడ నాల్గే చెప్పెను. కాని రూపములో భేదమున్నది. మొదటిది భాగవత విషయక ప్రశ్న, 2 కర్తృత్వవిషయకము, 3. వక్తృవిషయకము, 4 శ్రోతృవిషయకము. నాల్గుప్రశ్నలను క్రమముగా నడుగుచున్నాఁడు—

నః=మమ్ముగూర్చి, లేక మాకొఱకు. ఇక్కడ చతుర్థీవిభక్తియే యర్థము. మేము శ్రోతలుమాత్రమే గాదు, భాగవతము పూర్తిగా

మాకు స్వాయత్తమై పోవలెను. ఈ సంప్రదానార్థముతో సూతుఁడు భాగవతకథ వివరించిపోయిన తర్వాతగూడ సర్వాత్మనా భాగవతము వారి దగుటచే తత్ప్రవచనాదులు తర్వాతఁ గూడ సాఁగుచుండుననన్న ట్లైనది. అస్మభ్యం దేహి=అనుసర్థము సిద్ధించును. భగవాన్=పరిపూర్ణ గుణములుగలవాఁడు. అనఁగా భాగవతము నధ్యయనము చేయుటకు ఏ యేగుణము లవసరమో అవియన్నియును గలవాఁడు శుకమహర్షి. నీవుగూడ 'యథాధీతం' అని చెప్పికొన్నావు గనుక నీవుగూడ నట్టి వాఁడవే యని ధ్వని. శుకుఁడు ముక్తుఁడు. అతనిచే నుపదేశము నందిన నీవును ముక్త్యధికారి వనుటలో నాశ్చర్యము లేదు.

రెండవప్రశ్న నడుగుచున్నాఁడు.

పరికరాపేక్ష కర్తకుండును గనుక పరికరములను గూర్చియుఁ బ్రశ్నించినట్లైనది. కాలదేశహేతువులు పరికరములు. ప్రయోజక కర్తయు; అందుచే నే యుగమున, నే స్థలమున, నే హేతువున, నెవ్వరుఁ బ్రేరేపఁగా భాగవతరచన సాఁగినదని ప్రశ్నసమూహము, మునిః=నిరంతర మననశీలుఁడు. సంహితారచన తత్ప్రతిబంధకము. ఐనను అతఁ డెందుకుఁ బ్రవర్తించెనని ప్రశ్న.

మహాయోగీ=సమాధిస్థితుఁడు. యోగము ఆరంభస్థితియందు దుఃఖమునే గల్గించును. పోగపోగ పరమసుఖద మగును. అట్టి సుఖ విలీనుఁడైనవాఁడు దానిని బోఁగొట్టికొని కథాకథనమం దెందుకుఁ బ్రవర్తించెనని ప్రశ్న. సమదృక్=బ్రహ్మవిత్తు, ప్రవచనము ఉచ్చావచ బుద్ధి సాధ్యము. చెప్పువాఁ డధికుఁడు. వినెడువాఁడు తక్కువవాఁడు. ఈ భావము ప్రవచనమందు దప్పదు. మఱి శుకునకుఁ బ్రవచనస్థితి యె ట్లేర్పడినది? నిర్వికల్పకః=సాంఖ్యప్రోక్తమైన జ్ఞానము సిద్ధించిన వాఁడు. నిర్వికల్పకః=నిర్గతములైన ప్రాకృతవికల్పములు గలవాఁడు. ఉన్నిద్రః=నిద్రలేనివాఁడు. స్వప్నదృష్టములైన అరిష్టాదులయొక్క

నివృత్తులను గూర్చి యపేక్షలేనివాఁడు. గూఢః=సంగ మన్నంతనే యుద్వేజితుఁ డయ్యెడువాఁడు. అందుకే లోకమునం దప్రసిద్ధుఁడు.

గిరిధరకృత బాలప్రబోధిని :

మహాభాగ ! = భాగవత కథాశ్రవణము - అనేక జన్మోపార్జిత భాగ్యములేక సిద్ధింపదు. నీవు దానినంతయు వింటివి. అందుచే నీవు నిస్సంశయముగా మహాభాగుఁడవు. భాగవతమును వినుటచేతనే వదతాంవరః = వక్తలలో శ్రేష్ఠుఁడు. భాగవతము మహాపుణ్యము. శ్రోతృ వక్తృపుణ్యావహము, పాపనివర్తకము, అగుటచే సంసార దుఃఖమును బోఁగొట్టునది. దానిని పరీక్షిన్మహారాజునకు శుకుఁడు విన్పించెను. అతని వదననిర్గతమైన కథను మాకు నట్లట్లే చెప్పుము. దేవ మనుష్యాది వివిధాకార సంయుక్తమైనది ప్రపంచము. దానిని శుకబ్రహ్మ చూచుచునే యుండెను. మఱి యేకాంత మతిత్వ మెట్లు సిద్ధించినది? దానికి సమాధానము నిర్వికల్పకః=అనునది. జీవజడాంత ర్యామి-దేవమనుష్యతిర్యగాది భేదదర్శనము లేనివాఁడు. దానికి హేతు వును జెప్పుచున్నాఁడు. సమదృక్ = జీవజడాంతర్యాముల యందు ఏకరూపమైన పరబ్రహ్మమునే జూచుచున్నవాఁడు. అది యెట్లు? ఉన్నిద్రః=అవిద్యారూపమైన నిద్రలేనివాఁడు. గూఢః=స్వమాహాత్మ్య ఆవిష్కారబుద్ధి స్వల్పముగూడ లేనివాఁడు.

వంశీధరుఁడు :

వయంయువతి జనాః కలాభిజ్ఞాః స్త్రీపుంసయోర్నయన.
దర్శనేనైవ తదంత స్తత్త్వం సర్వం జ్ఞాతుం ప్రభవామః.

మేము యువతులము. అంతమాత్రమే గాదు. కలాభిజ్ఞలము. కనుక స్త్రీపురుషుల నయన దర్శనమాత్రముచేతనే వారి యంతస్త త్త్వములను గ్రహించు శక్తి మా కున్నదని దేవకాంత లన్నారు.

శుకుఁడు జడః=కార్యాకార్య వివేకశూన్యుని వలెనుండెను. లోకవిపరీత చేష్టలతో నున్నత్తుఁడు. లోకరంజక వ్యాపారరాహిత్య ముతో మూఁగ. సమస్తోద్యమ రాహిత్యముతో జడుఁడు.

విజయధ్వజుఁడు:

నేను భాగవతశ్రవణము మీతోఁ జేయింతునని సూతుఁడు చెప్పెను. కాని వారికి తచ్ఛ్రవణమందు విపరీతశ్రద్ధ. అందుచే విశేష ముగాఁ బ్రశ్నించుటకై సూతు నడుగుచున్నాఁడు—

ఋషులలో శౌనకుఁడు జ్ఞాన వయోవృద్ధుఁడు.

కులపతిః=ఋషికుల సంప్రదాయమును దాను రక్షించుటయే గాక యితరులచేతను రక్షింపఁ జేయువాఁడు.

మహాభాగ!=భాగ్యశాలియైన సూతుఁడా! పుణ్యకర్మవాసన సమగ్రముగ నున్నవాఁడా! వదతాంవరః=పరమాత్ముని కథను వచించువారిలో నగ్రేసరుఁడైన వాఁడా!, సూత!=సూతాచార్యుఁడా! భగవాన్=పూజ్యుఁడైన, శుకః=శుకాచార్యుఁడు, యాం=ఏ భాగవత కథను, ఆహ=పరీక్షిన్మహారాజునకై వివరించెనో (తాం=అట్టి), పుణ్యాం=చెప్పెడివారిని, వినువారిని సంసారదుఃఖమునుండి తొలఁ గింపఁజేయు, భాగవతీం=భాగవతమందుఁ జెప్పిన, కథాం నః వద= కథను మాకుఁ జెప్పుము.

ఇయంకథా=ఈకథ, కస్మిన్‌యుగే=నాల్గుయుగములమధ్యలో దేనియందు, ప్రవృత్తా=నడచెను, వా=ఇంకను, కస్మిన్‌స్థానే=ఏ స్థల మందు, మునిః=సర్వజ్ఞుడైన, కృష్ణః=వేదవ్యాసుఁడు, కేనహేతునా= ఏ కారణముచేత, కుతస్సంచోదితః=ఎవరిచేఁ బ్రేరేపితుఁడై, సంహి తాం=భాగవతపురాణమనెడు పదునెనిమిదివేల గ్రంథమును, కృత వాన్,

శుకాచార్యుఁడు పరీక్షిత్తునకు భాగవతశ్రవణము సేయించె ననుట నమ్మఁదగిన మాటగాదు. శుకాచార్యుఁడని యాతనిని గుర్తించుట కెవ్వరికిని సాధ్యముగాదు. ఈ యభిప్రాయముతోఁ జెప్పుచున్నాఁడు.

తస్యపుత్త్రః మహాయోగీ = గొప్పజ్ఞాని, ధ్యాన మొనర్చుట యందుశ్రేష్ఠుఁడు, సమదృక్ = 1. అందరియందు నుండు పరబ్రహ్మను సమముగా నేకప్రకారముగాఁ జూచువాఁడు. 2. లక్ష్మీసహితునిగనే చూచువాఁడు, అందుచేతనే నిర్వికల్పకః = ఇదినాది అదివానిది అనెడు భేదబుద్ధి లేక సమస్తము నీశ్వరాధీన మని తెలియువాఁడు, ఏకాంత మతిః = ఒకఁడేయైన పరమాత్మను సదా మనస్సుతో ధ్యానమొనర్చువాఁడు, అందుచేతనే, ఉన్నిద్రః = అజ్ఞానాదిదోష పరంపరలేనివాఁడు, ఐనను గూఢః = భస్మచ్ఛన్నుఁడై గమనింపరాకుండు నట్లుండువాఁడు, మూఢ ఇవ = ఏమియు నెఱుఁగని వానివలె, ఈయతే = అజ్ఞానులకుఁ దోఁచెడివాఁడు. అందుచే నాతని దర్శనము సులభము గాదు.

నిర్వికల్పకః = అనుటకు ఈశ్వరాధీన మని తెలియుఁ వాఁడని యర్థ మొనర్చుటకును, సమదృక్ = అనుటకు ఏకప్రకారముగా శ్రీహరిని జూచెడివా రనెడు నర్థకల్పనకును ఈ క్రింది బ్రహ్మపురాణ వాక్యము ప్రమాణము.

**సామ్యమీశ్వరరూపేషు, సర్వత్ర తదధీనతామ్,**
**పశ్యతి జ్ఞానసంపత్యా, వినిద్రోయ స్సయోగవిత్.**

ఎవఁడు పరమాత్మునిరూపములందు సామ్యమును సర్వమును శ్రీహరి యధీనమను జ్ఞానమును, జ్ఞానసంపత్తితో నిద్రలేనివాఁడనెడు స్థితిని బొందినవాఁడో వాఁడే యోగము నెఱిఁగినవాఁడు. ఈ కారణములతో శుకాచార్యుఁడు మహాయోగియై యుండెనని తెలియవలెను. విజయధ్వజ వ్యాఖ్యాకారులు 'దృష్ట్వానుయాంతం' అను శ్లోకమును వ్యాఖ్యానింపలేదు. అది భాగవతమందు లేదని వారియభిప్రాయము.

శుకుఁడు సర్వమునందు వసించుచున్న పరమాత్మను ఏక ప్రకారముగఁ దెలియువాఁడు 'ఇదినాది అదివాని' దను భేదబుద్ధిలేక సర్వ మీశ్వరాధీన మను జ్ఞాన మున్నవాఁడు. పరమ ముఖ్యుఁడైన పరమాత్మ నొక్కనినే సదా మనస్సుతో ధ్యానించువాఁడు. ఈ కారణ ముతో నతని కజ్ఞానాది దోష పరంపర దూరమైనది. ఇన్నిగుణము లతోఁ గూడిన యతఁడే మహాయోగి, మహాజ్ఞాని అతఁడు భస్మ భూషితుఁడై ,గూఢుఁడై యుండుటచేత అజ్ఞు లాతని గుర్తింపనేరరు. కేవల మూఢమనుష్యుఁ డనియే భ్రమించిరి.

కథమాలక్షితః పౌరైః సంప్రాప్తః కురుజాంగలాన్,
ఉన్మత్తమూక జడవ ద్విచరన్ గజసాహ్వయే. 6

కథం వా పాండవేయస్య రాజర్షే ర్మునినా సహ,
సంవాద స్సమభూత్తాతః యత్రైషా సాత్వతీ శ్రుతిః. 7

స గోదోహనమాత్రం హి గృహేషు గృహమేధినామ్,
అవేక్షతే మహాభాగ స్తీర్థీకుర్వన్ తదాశ్రమమ్. 8

అభిమన్యు సుతం సూత ప్రాహుర్భాగవతోత్తమమ్,
తస్య జన్మ మహాశ్చర్యం కర్మాణిచ గృణీహి నః. 9

స సమ్రాట్ కస్యవా హేతోః పాండూనాం మానవర్ధనః,
ప్రాయోపవిష్టో గంగాయా మనాదృత్యాధిరాట్ఛ్రియమ్. 10

నమంతి యత్పాదనికేత మాత్మనః
శివాయ చానీయ ధనాని శత్రవః.
కథం స వీరః శ్రియమంగ దుస్త్యజాం
యువైషతో త్స్రష్టుమహో సహాసుభిః. 11

శివాయ లోకస్య భవాయ భూతయే
యఉత్తమశ్లోకపరాయణా నరాః,
జీవంతి నాత్మార్థ మసౌ పరాశ్రయం
ముమోచ నిర్విద్య కుతః కళేబరమ్. 12

తత్సర్వం న స్సమాచక్ష్వ పృష్టో యదిహ కించన,
మన్యేత్వాం విషయేవాచాం స్నాతమన్యత్ర ఛాందసాత్. 13

కురుజాంగలాన్ = కురుదేశములు-జాంగలదేశములను, సంప్రాప్తః = పొందినవాఁడును, గజసాహ్వయే = హస్తినాపురమందు, ఉన్మత్త మూక జడవత్ = ఉన్మత్తునివలెను మూఁగవానివలెను జడునివలెను, విచరన్ = తిరుగుచున్నవాఁడైన అ ముని, పౌరైః = పౌరులచేత, కథం = ఎట్లు, అలక్షితః = చూడఁబడెను?

శుకునకు స్త్రీ పురుషభేదభావన గూడ లేదు. కేవల బ్రహ్మమాత్రస్వరూపుఁడు. అతఁడు కురుదేశములందును, జాంగల భూములందును భ్రాంతునివలెను, మూఁగవానివలెను, జడునివలెను సంచరించుచుండెను. అట్టి వానిని పౌరు లెట్లు గుర్తించిరి? 6

పాండవేయస్య = పాండుకులమున జన్మించిన, రాజర్షేః = రాజర్షియైన పరీక్షిత్తునకు, మునినాసహ = మౌనియైన శుకబ్రహ్మతో, సంవాదః = సంభాషణము, కథం = ఎట్లు, సమభూత్ = సంభవించెను, యత్ర = ఏ సంభాషణమందు, ఏషాసాత్వతీశ్రుతిః = ఈ భాగవతసంహిత, ఆసీత్ = ఏర్పడినదో.

పాండురాజ వంశమందు జన్మించిన పరీక్షిత్తు గొప్పరాజర్షి. శుకబ్రహ్మ యోగి ముని. ఎవ్వరితోడను బలుకఁడు. వీ రిర్వురకును సంభాషణ మెట్లేర్పడెను? భాగవతసంహితా విచార మెట్లు జరిగినది?

మహాభాగః = పుణ్యవంతుఁడైన, సః = అ శుకబ్రహ్మ, గృహమేధినాం = గృహస్థాశ్రమము వహించిన వారియొక్క, గృహేషు = ఇండ్లముందు, తదాశ్రమం = వారినివాసమును, తీర్థీకుర్వన్ = విశుద్ధమైన తీర్థముగాఁ జేయుచున్నవాఁడై గోదోహనమాత్రం = గోవును బిదికెడునంతకాలము వఱకే, అపేక్షతే = వారికొఱకెదురుచూచును, హి = ఈ విషయము ప్రసిద్ధము గదా.

శుకబ్రహ్మ మహామహిమోపేతుఁడు. అతఁడు గృహస్థుల
హాంగణములను ప్రవేశించినంతనే వారిగేహములు మహాతీర్థములై
వును. ఆ గృహముల సట్లు పావనము లొనర్పవలెనను కారుణ్యము
తనే యాతఁ డల్పసమయ మా ముంగిళ్ల నిలువఁబడును. ఈభాగ
క సంహితావిచారమా త్వరగా ముగియునదికాదు. కనుక దీనివక్త
కబ్రహ్మ యగుట చాల యాశ్చర్యకరముగ నున్నది. అతఁ డింటి
ంగిలియం దెంతవఱకు నిలువఁబడును? గోదోహనమాత్ర సమ
మే. దీనినిబట్టి పూర్వము గోదుగ్ధము పొదుగు పట్టిపోవువఱకుఁ
ందు నాచారము లేదనియు నాల్గుసారులు మాత్రమే పిండికొని
క్కనవి దూడలకు వదలుచుండిరనియుఁ దెలిసికొనవచ్చును. 8

హే సూత!—ఓ సూతుఁడా!, అభిమన్యుసుతం—అభిమన్యుని కుమారుఁడైన
క్షిత్తును, భాగవతోత్తమం—భగవద్భక్తులలో శ్రేష్ఠుఁడని, ప్రాహుః— పెద్దల
రు, తస్య—అతనియొక్క, మహాశ్చర్యం—ఆశ్చర్యకరమైన, జన్మ—జననము,
ర్మాణి చ—కర్మములును, నః—మాకు, గృణీహి—చెప్పుము.

అభిమన్యుని కుమారుఁడైన పరీక్షిత్తు భాగవతులలో శ్రేష్ఠుఁడని
ద్ద లందురు. అతని జన్మకర్మలు మహాశ్చర్యకరము లైనవి. వానిని
మాకు వివరింపుము. 9

సమ్రాట్—చక్రవర్తియు, పాండూనాం—పాండురాజ కుమారులకు, మాన
ర్ధనః—తన జన్మకర్మలచే గౌరవము నెక్కువ చేసినవాఁడునునైన, సః—అ పరీ
త్తు, అధిరాట్ఛ్రియం—చక్రవర్తి పదవితో సంప్రాప్తించిన మహైశ్వర్యమును,
నాదృత్య — అనాదరించి, కస్మాత్ హేతోః — ఏ కారణమువలన, గంగాయాం—
ంగానదియందు, ప్రాయోపవిష్టః—ప్రాయోపవేశ మొనర్చెను.

పరీక్షిత్తు కీర్తి పాండుకుమారులకే యత్యంత గౌరవమును
ల్గించునది. అతఁడు గొప్ప చక్రవర్తి.. అతఁడు దన వైభవము
ందుకుఁ దృణీకరించెను? గంగయందుఁ బ్రాయోపవిష్టుఁ డగుటకుఁ

గారణమేమి? ప్రాయోపవేశ మొక వ్రతవిశేషము. ఆహారమును వర్జించి, శరీరమును శుష్కింపఁ జేసికొందురు. ఈశ్వరుని మాత్రమే ధ్యానించుచుందురు. అట్లుగా శరీరమును వదలుదురు. 10

**శత్రవః=శత్రువులు, ఆత్మనః = తనయొక్క, శివాయ=క్షేమముకొఱకు, ధనాని=ధనములను, ఆనీయ = తీసికొనివచ్చి, యత్పాదనికేతం= ఏ మహారాజు యొక్క పాదపీఠమును, నమంతి=నమస్కరింతురో, వీరః=శూరుఁడును, యువా= తరుణవయస్కుఁడైన, సః=ఆ పరీక్షిత్తు, అసుభిస్సహ=ప్రాణములతోఁ బాటు, దుస్త్యజాం=విడుచుటకు సాధ్యము గాని, శ్రియం=సంపదను, ఉత్స్రష్టుం=వదలుటకు, కథం=ఎట్లు, ఐషత=ఇచ్ఛించెను, అహో!=ఈ వృత్తాంత మాశ్చర్యకరమైనది.**

శత్రువుల కాతఁ డన్నచో మహాభయము. వారు తమ క్షేమమునకై ధనరాసులను దెచ్చి, యాతని చరణపీఠముకడ సమర్పించి పోవుచుండిరి. మహాశూరుఁ డాతఁడు. పైఁగా యువకుఁడు. అతఁడు రాజ్యశ్రీ నెందుకు వర్జించెను? విడువరాని ప్రాణముల నెట్లు విడువ సంకల్పించెను? అతని ఈ చరిత్ర మహాశ్చర్యకర మైనది. 11

**లోకస్య=లోకముయొక్క, శివాయ=క్షేమముకొఱకు, భవాయ=అభివృద్ధి కొఱకు, భూతయే=ఐశ్వర్యముకొఱకు, ఉత్తమశ్లోక పరాయణాః=ఉత్తమశ్లోకుఁడైన భగవంతు నాశ్రయించియున్న, నరాః=నరులు, జీవంతి=జీవించియుందురు, న ఆత్మార్థం=తమకొఱకుఁ గాదు, అసౌ=ఈ రాజు, నిర్విద్య=నిర్వేదముగొన్న పరాశ్రయం=ఇతరుల కాశ్రయమైయున్న, కళేబరం=శరీరమును, కుతః=ఏ కారణముతో, ముమోచ=వదలెను.**

భక్తులు భగవంతుని సర్వాత్మనా యాశ్రయించియుందువారు. వారు జీవించుట లోక సుఖముకొఱకే, సమృద్ధికొఱకే, ఐశ్వర్యముకొఱకే. వారికి స్వార్థ మే కోశమందును లేదు. అందుచే వారి శరీరము పరాశ్రయమైనది. అట్టి భక్తులలో చూడామణియైన పరీక్షిత్తు తనశరీరము నెందు కుపేక్షించెను? అతఁడు విరక్తుఁడు. ధనాది విష

యములలో నాశలేనివాఁడు గావచ్చును. కాని లోకక్షేమ మాతని బాధ్యత. దానినిగూడ యుదాసినించునట్టి గాథనిర్వేద మాతని కెందు కేర్పడినది? అది ప్రబలకారణమైయుండును. దానిని వివరింపుము. 12

యదిహాకించన=ఇప్పుడే విషయమును, పృష్టః=మాచే నడుగఁబడితివో, తత్సర్వం=దానినంతయు, నః=మాకు, సమాచక్ష్వ=చెప్పుము, ఛాందసాదన్యత్ర=వేదములకంటెను భిన్నమైన, వాచాం విషయే=వాక్కుల విషయమందు, స్నాతం=పారంగతునిగా, త్వాం=నిన్ను, మన్యే=తలఁతును.

మే మేయే విషయముల నిన్నడిగితిమో వాని నెల్లను సమగ్రముగా విస్తరించి మాకుఁ జెప్పుము. వేదములను వదలి తక్కిన విషయము లన్నిఁటియందును నీవు పారంగతుఁడవు. నీ యెఱుఁగని దేదియు లేదు. 13

శ్రీధరీయము:

పైనిఁ జెప్పిన గుణములతోఁ గూడిన పరీక్షిత్తు ఎట్లుగా నాలక్షితుఁ డయ్యెను? కురుజాంగలములు దేశవిశేషములు. గజసాహ్వాయే విచరన్=గజసహితః అహ్వాయో యస్య=గజసాహ్వాయః అని విగ్రహము. గజముచేఁ గూడికొన్న అహ్వాయముగల పట్టణము హస్తినాపట్టణ మని పేరు. హస్తి యను నొక రాజుండెను. అతఁడే యా నగరమును నిర్మించెను.

అర్థము: సాత్వతీశ్రుతిః భాగవతసంహిత

అర్థము: గోదోహనమాత్రకాలమే శుకబ్రహ్మ ప్రతీక్షించును. అదియును దన భిక్షకై గాదు. వారి యాశ్రమం=వారిగృహమును, తీర్థీకుర్వన్=పవిత్రమునొనర్చుచు, ఇట్టివాఁడు వక్తయగు టాశ్చర్య మని భావము.

అర్థము: శ్రోతచరిత్ర మంతకన్న నాశ్చర్యకరమైనది. దానినే యైదు శ్లోకములతో నిరూపించుచున్నాఁడు.

పదియవ శ్లోకము: విశేషము లేదు.

అర్థము: ఈ యాత్మ నేపద ప్రయోగ మార్గము.

అర్థము: విరక్తులకు ధనాదులతో నేమిపని? పని యున్నదని వివరించుచున్నాడు. లోకస్యశివాయ=లోకసుఖముకొఱకు, భవాయ=సమృద్ధికొఱకును, భూతయే=ఐశ్వర్యముకొఱకును.

అర్థము: ఛాందసాదన్యత్ర=వైదికవ్యతిరేక విషయములందు. సూతుఁడత్రైవర్ణికుఁడు గనుక నట్లు చెప్పెను.

వంశీధరుఁడు:

గృహేషు=ఇచ్చటి గృహశబ్దముచే గృహస్థులు గ్రాహ్యులు. మంచాః క్రోశంతి=అనుప్రయోగమునందువలె లక్షణ లేక తద్గత జీవమాత్రుఁడు గూడ సద్గతిని బొందుదురని భావము.

సఖీర్యేషాంతే=అభియః, పృషోదరాది గణమందుఁ జేరుటచే హ్రస్వము. అభియు లనఁగా ద్రోణకర్ణాదులు. తైః మన్యతే=వారిచే శూరుఁడుగా శ్లాఘింపఁ బడినవాఁడు గనుక నభిమన్యుఁడు.

**ఏనేష్టం రాజసూయేన, మండలస్యేశ్వరశ్చయః,**
**శాస్తి యస్యాజ్ఞయారాజ్ఞః, స స్సమ్రాడితి కథ్యతే.**

అని ప్రమాణము.

అర్థము: భారతమందు పరీక్షిదుపాఖ్యానములో నీ శ్లోకమున్నది.

**పరిశ్రాంతో వయస్థశ్చ, షష్టివర్షో జరాన్వితః,**
**క్షుధితస్సమహారణ్యే, దదర్శ మునిస త్తమమ్.**

కనుక భారతరచననుబట్టి శాపము ప్రాప్తించునాటికి వృద్ధుఁడు, భాగవతము 'యువా' యనుచున్నది. సమన్వయ మెట్లు?

ఆచత్వారింశద్యౌవన మాషష్టిమధ్యమం వయః

అను ప్రమాణముచేత షష్టివర్షము మధ్యమవయస్సే యగుచున్నది. కాని యౌవనము అంతకు ముందున్న దానివలన మధ్యమవయస్సు దానితో సంబద్ధమైనది. కనుక మధ్యవయస్సు గూడ యౌవనము క్రిందికే లెక్క. పరమశక్తితోఁ గూడికొన్న దేహమగుటవలన. అందుకే—

తథా చ షష్టివర్షోఽపి వయస్థస్తరుణో యువా

వార్ధక్యం షష్టి తః పరం .... .... ....

ఇత్యాది అభియుక్తోక్తు లున్నవి.

జరాన్వితః=జీర్యతే అంబుపానేనేతి జరా - ఈ యుత్పత్తిచేత 'జర' యనఁగా దప్పి.

వీరరాఘవ వ్యాఖ్య:

ఆఱవశ్లోకము: విశేషము లేదు.

యత్రైషా సాత్వతీ శ్రుతిః. సాత్వతీ=సాతయతి సుఖయతీతి. సాత్ పరమాత్మా, అనఁగా భక్తులను సంతోషపెట్టువాఁడు లేక, సాత్ =ఆ శ్రీమహావిష్ణువే ప్రతిపాద్యుఁడుగాఁ గలది సాత్వతి. శ్రుతిః=శ్రుతులతో, సమానమైనది.

ఎనిమిది, తొమ్మిది, పది, పదునొకండు శ్లోకములలో విశేషములు లేవు.

ప్రాహుర్భాగవతోత్తమం అనుటచేత పరీక్షిత్తు మహాభాగవతుఁడనుట స్పష్టము. భాగవతులకు స్వదేహమునందును, తదనుబంధులైన వారియందును విరక్తి స్పష్టముగా నుండునుగదా! అనుటను నిషేధించుచున్నాఁడు. భాగవతులు విరక్తులు. నిజమే. ఐనను వారికి ఉత్తమశ్లోకుఁడైన భగవంతుఁడే అయనము. అనఁగా మార్గము. ప్రాప్యము, ప్రాపకుఁడు, ఆధారము సర్వమును వాఁడే. వారు స్వతం

త్రులు గారు. అట్లైనపుడు ప్రాయోపవేశ ప్రయత్నమున కెందుకుఁ బూనుకొన్నాఁడు?

**రాధారమణ గోస్వామికృత దీపిక:**

పూర్వశ్లోకమందు (9వ శ్లోకమందు) దేవ్యః అనుటకు అప్సరస లనియే యర్థము.

**తస్యాం క్రీడం త్యభిరతాః తే చైవాప్సరసాంగణాః.**

గోదోహనకాలము ఒక ముహూర్తమం దష్టమభాగము. పంచ దశకలాత్మకమైనది. ఇది స్మృతి ప్రసిద్ధము.

**వల్లభాచార్యులు:**

ఒకవ్యక్తిలో నున్న యోగ్యతను గనుఁగొనుటకు సాధారణ ముగా మూఁడు కారణములు. 1. అవ్యక్తి ప్రదర్శించెడి స్థైర్యాదులు, 2. మాటలు, 3. సదాచారము. శుకునియం దీ మూఁడును గన్పింపవు. ఉన్మత్త మూక జడులవలె నున్నాఁడు. పరీక్షిన్మహారాజు రాజర్షి. అందుచే నాతని కనాచారాదులందు శ్రద్ధ యుండదు. శుకుఁడు మౌని సర్వజ్ఞుఁ డగుటచే నితరులతో మాటాడి తెలిసికొన వలసిన దాతని కేమియు లేదు. మఱి సంభాషణ మెట్లేర్పడినదని ప్రశ్న. సాత్వతీ శ్రుతిః–వైష్ణవమైన వేదము.

గోదోహనకాలముకంటె నధికకాలము సన్న్యాసులు గృహస్థు లయం దుండరాదు. ఉన్నచో రాగమేర్పడును. అది బంధకారణము. గృహేమేధాయస్య సః–గృహమేధీ–సంసారమందు బుద్ధిగలవాఁడు.

పాండునాం మానవర్ధనః–పాండవుల వంశమం దుద్భవించు టచేఁ బరీక్షిత్తునకు గౌరవము రాలేదు. ఆతని ప్రవర్తనమే వారికి గౌరవము గల్గించినది. గంగాదర్శనముతోనే సర్వపురుషార్థసిద్ధి యగు చుండఁగా గంగయందే ప్రాయోపవేశము చేయవలసిన యవసర మెందు కేర్పడినది? అని ప్రశ్న.

**విజయధ్వజ వ్యాఖ్య:**

శుకబ్రహ్మ కురు జాంగలములను దేశములందుఁ దిరుగుచుం డెను. అతఁ డొక్కొక్కయెడఁ బిచ్చివానివలెను, మఱి యొక్కచో మూఁగవలెను, వేఱొక్కచోట జడునివలెను వర్తించుచుండెను. అవధూతల స్థితియేయిది. ఈ వేషముననున్న శుకాచార్యులను జ్ఞానియని తెలిసికొనుటంత సులభముగాదు. మఱి హస్తినావతీ పట్టణవాసులు ఇతనిని శుకుఁడని యెట్లు గుర్తించిరి? పట్టణవాసులకే తెలిసికొనరాని శుకుఁడు అంతఃపురవాసులచే గుర్తింపఁబడుట మఱియు నాశ్చర్యకరము గదా!

ఒకవేళ పరీక్షిత్తు శుకునిజూచినను వారికి నడచిన సంభాషణ అత్యంతదుర్లభమను భావమున నడుగుచున్నాఁడు. ఏషా=ఈ భాగవత మనెడు, సాత్వతీ=నిర్దోషమై శ్రీహరికి సంబంధించిన, శ్రుతిః= సంహితారూపమైన గ్రంథము, రాజర్షేః=జ్ఞానియైన పరీక్షిత్తునకు, మునినా సహ=మననశీలి, జ్ఞానియునైన శుకబ్రహ్మతోడి, సంవాదః= సంభాషణ, వా=ఎట్లు, సమభూత్=అయ్యెను?

శుకునిదర్శనమే దుర్లభము గదా! సంభాషణ మఱియు దుర్లభము గదా! ఈ యర్థమును 'వా' శబ్దముచే సూచించుచున్నాఁడు.

పరీక్షిత్తునకు శుకునకు సంభాషణ జరగిననే కదా పురాణోపదేశము. శుకుఁడు మహామననశీలి, జ్ఞాని, నిస్పృహులలో నిస్పృహుఁడు, అట్టివానికి రాజర్షియైన పరీక్షిత్తుతో మాటాడవలసిన యవసర మేమి యేర్పడినది? అట్టి యిద్దరు జ్ఞానులు. సంభాషణయందు కేవల నిర్దోషియు, గుణపరిపూర్ణుఁడునైన శ్రీహరికి సంబంధించిన, భాగవతకథ ప్రవృత్తమైనది. కాని వారి సంభాషణమే యసంభావితమని మా కనిపించుచున్నది.

పురాణరూపమైన పెద్దగ్రంథము నుపదేశింపవలె నన్నచోఁ జాలకాల మొకచోటనే యుండవలెను. శుకుఁ డందమూ చాలసే

పొకచో నిలుచువాఁడు గాఁడు. మఱి సంభాషణము దుర్ఘటమే యను నభిప్రాయముతోఁ జెప్పుచున్నాఁడు.

మహాభాగః సః తదాశ్రమం=ఆ గృహస్థుల యిండ్లను, తీర్థీ కుర్వన్=తనపాదము నుంచుటతోఁ బవిత్రము నొనర్చుచు, గృహమేధినాం=గృహస్థాశ్రమమున నుచితములైన యజ్ఞయాగాది కర్మము లొనర్చు సద్వైష్ణవులయొక్క, గృహేషు=ఇండ్లయందు భిక్షకై పోయినవాఁడు, గోదోహనమాత్రం=భిక్షగొని వచ్చుటకు గోదోహన కాలమాత్రమే, అపేక్షతే=ఎదురుచూచును. ముఖమును తగ్గించుకొని శ్రీహరిని ధ్యానించుచు గోదోహన సమయమాత్రమే నిల్చును. అటుపై ముందునకు సాఁగును. గృహస్థులు భిక్షదెచ్చువఱకు నాతఁడాఁగుట లేదు. భిక్ష వేసినను వేయకున్నను గోదోహనకాల మాత్రమునకుఁ దరువాత ముందునకు సాఁగిపోవు స్వభావ మాతనిది. ఆ యింత కాలము గృహములముం దాఁగుటఁ గూడఁ దన ప్రయోజనమునకై గాదు. ఆ గృహస్థులఁ బవిత్రుల నొనర్చుటకే. ఇట్టి నిరపేక్షియైన శుకుఁడు చాలకాల మొకచో నిలువఁడు. అతఁడు భాగవతము నుపదేశించె ననుట యత్యాశ్చర్యము.

పైనిఁ జెప్పినట్లు భాగవతవక్తయైన శుకుఁడు అంతకాలమొకచో నిలుచుట సంభావితమని తెలిపి గంగలోఁ బ్రాయోపవేశమును బరీక్షిన్మహారా జుపక్రమించుటను, ముందుఁ బ్రశ్నింపఁబోవువారై పరీక్షిత్తు వంటి భగవద్భక్తుని కథను గూడ విను టావశ్యకమని తెలిపి యతని కథనుగూడఁ జెప్పుటకై యర్థించుచున్నాఁడు.

భాగవతోత్తమం=భగవద్భక్తులలో శ్రేష్ఠుఁడైన వాఁడని, ప్రాహుః=చెప్పిరి, తస్య మహాశ్చర్యం జన్మ=బ్రహ్మాస్త్రముచే హతుఁడైనను, శ్రీహరి యనుగ్రహముచే బ్రదికి పుట్టుటను, కర్మాణిచ=కలిని నిగ్రహించుట మొదలగు కర్మములను, నః=శ్రవణాదరులైన మాకు, గృణీహి=చెప్పుము.

తాత్పర్యము: పరీక్షిత్తు భగవద్భక్తులలో నుత్తముఁడు. ఇట్లుగా వింటిమి. భగవంతుని చరిత్ర భక్తుల చరిత్రతోఁ జేరియే యుండును. పరీక్షిత్తు బ్రహ్మాస్త్రదగ్ధుఁడై గర్భమందే మరణింపవలసి యుండెను. కాని శ్రీహరి యనుగ్రహమున బ్రదికి బయటకు వచ్చినాఁడు. ఇంత యాశ్చర్యజనకమైన దాతని జన్మ. అతఁడు రాజుగా నున్నప్పుడు కలి యుగము ప్రవృత్తమయ్యెను. కలిపురుషుఁడుఁ దిన్నగాఁ బ్రవేశించెను. పరీక్షిత్తు పరాక్రమవంతుఁడు. కలి నడ్డినాఁడు. ఈ కథలు గొన్ని యింతకుముందే విన్నాము. కలి నిగ్రహము గూడ యాశ్చర్యకర మైనదే. ఇట్టి మహామహిమగల పరీక్షిత్తు జన్మకర్మలను విస్తరముగాఁ దెలిసికొనవలెనని యభిప్రాయమున్నది. మాకుఁ దెలియఁజెప్పవలెను.

పరీక్షిత్తునకు వైరాగ్యము గల్గిన కారణము నడుగుచున్నాఁడు—

తాత్పర్యము: పరీక్షిత్తు పాండవుల మర్యాదకు హాని గల్గించు నట్టి పని యేదియుఁ జేయలేదు. అతని ప్రతికార్యమును పాండవుల కీర్తిని హెచ్చించునదిగనే యుండెను. అతని యాజ్ఞకు దేశమం దే మూలయందును తిరస్కారము లేదు. అప్రతిహతమైన దాతని చక్రవ ర్తిత్వము. అతఁడు గంగలోఁ బ్రాయోపవేశ మొనర్చి యుపవిష్టుఁ డయ్యెనని తెలిసితిమి.

అనర్ఘమైన సంపత్తును విడువవలె నన్నచో గొప్పకారణ ముండ వలెనని యాశంకించుచున్నాఁడు—

పరీక్షిత్తు సామాన్యుఁడు గాఁడు. అతని కెంతోమంది సామం తులు. శత్రువు లాతనికి భయపడుచుండిరి. వారు దమ క్షేమము నకై మాటిమాటికిని గప్పములఁ గొనితెచ్చి యాతని చరణములకడ నుంచి నమస్కరించి పోవుచుండిరి. మహావీరుఁ డతఁడు. అతని సంపత్తు సామాన్యమైనదిగాదు. మానవుఁడు గాంచనమును విడుచుట మహాకష్టము. ఇట్టి యైశ్వర్యవిభవముల నాతఁ డెందుకు విడువవలసి

వచ్చినది? దీని కేదో మహాకారణ ముండవలెను. అంతమాత్రమే గాదు. అతఁడు దన ప్రాణములఁ గూడ విడువ సాహసించెను. ఇది ఇంకను నాశ్చర్యకర మైనది.

పరమాత్మునియందు ప్రేమాతిశయము గల భక్తుఁడు విషయ సుఖములను దుచ్ఛముగాఁ జూచును. కనుక విరక్తుఁడై రాజ్యసంప దను, దేహమును బరీక్షిత్తు త్యజించెనని సమాధానము చెప్పికొంద మన్నను నదియు సరిగా దనుచున్నాఁడు-

యే ఉత్తమశ్లోక పరాయణాః = శుద్ధము, నిరతిశయమునైన కీర్తిగల శ్రీహరియే ముఖ్యమైన యాశ్రయమని తెలిసి వానినే సేవిం చెడి, నరాః=భగవద్భక్తులు, ఆత్మార్థం=తమకొఱకై (స్వార్థమునకై), న జీవంతి = జీవింపరు, లోకస్య = లోకప్రజలయొక్క, శివాయ- భవాయ-భూతయే (జీవంతి=జీవింతురు).

తాత్పర్యము: పరిశుద్ధము అత్యుత్తమమునైన కీర్తిగల శ్రీహరి యందే భక్తిగల భగవద్భక్తులు ఎన్నఁడును స్వార్థమునకై జీవిం పరు. వారి జీవనము సత్పురుషుల సుఖాదులకు. విరక్తుల జీవనమే యిట్లుండునప్పుడు పరీక్షిత్తు తన సంపత్తును దేహమును బరోపకార మునకై వినియోగింపక వానిని విడువఁదలఁచిన దెందుకు? విరక్తుఁ డైనను నడపికొని పోవలసియుండెను గదా! ఈ యన్ని సందేహము లను బరిహరించుటకుఁ బరీక్షిన్మహారాజు కథను నీవు తొలుత మాకు చెప్పవలెను. మేము దీర్ఘసత్రనిష్ఠులము. హరికథలను వినుటకంటె మా కిపుడు వేఱు పనిలేదు. ఏ ప్రశ్నగూడ నిది యల్పమని త్రోసి వేయక దయచేసి యన్నిఁటికిని సమాధానము చెప్పుము. నీవు సూతుఁడ వగుటచే వేదార్థములను వివరించెడి వేదానుపూర్వికంటె భిన్నములైన పురాణవిషయములందు సంపూర్ణపాండిత్యమును సంపా దించితివి. సకల పురాణజ్ఞుఁడవైన నీకు మా ప్రశ్నల కుత్తరమిచ్చుట కష్టము గాదు.

పోతన్నగారు।

సూతా! యే యుగవేళ నేమిటికి నెచ్చోటన్ మునిశ్రేష్ఠ నే
శ్రోతల్ గోరిరి యేమి హేతువునకై శోధించి లోకైక వి
ఖ్యాతిన్ వ్యాసుఁడు మున్ను భాగవతముం గల్పించెఁ దత్పుత్త్రుఁ డే
ప్రీతిన్ రాజున కీ పురాణకథఁ జెప్పెం జెప్పవే యంతయున్.

వ. బుధేంద్రా! వ్యాసపుత్త్రుఁడైన శుకుం డను మహాయోగి సమదర్శనుం డేకాంతమతి మాయాశయనంబు వలనం దెలిసినవాఁడు గూఢుండు మూఢునిక్రియనుండు నిరస్తఖేదుం డదియునుం గాక,

శుకుఁడు గోఁచియులేక పైఁ జనఁ జూచి తోయములందు ల
జ్జకుఁ జలింపక చీర లొల్లక చల్లులాడెడి దేవక
న్యకలు హా శుక! యంచు వెన్కఁ జనంగ వ్యాసునిఁజూచి యం
శుకములం ధరియించి సిగ్గువ స్రుక్కి రందఱు ధీనిధీ!

వ. మఱియు నగ్నుండుఁ దరుణుండునై చను తన కొడుకుం గని వస్త్రపరిధానం బొనరింపక వస్త్రధారియు వృద్ధుండును నైన తనుం జూచి చేలంబులు ధరియించు దేవరమణులం గని వ్యాసుండు గారణం బడిగిన, వారలు 'నీ పుత్త్రుండు స్త్రీ పురుష లనెడు భేదదృష్టి లేకయుండు. మఱియు నతఁడు నిర్వికల్పుండు గాన నీకు నతనికి మహాంతరంబు గల' దనిరి. అట్టి శుకుండు కురుజాంగల దేశంబుల నొచ్చి హస్తినాపురంబునఁ బౌరజనంబులచే నెట్లు జ్ఞాతుం డయ్యె! మఱియు నున్మత్తునిక్రియ మూఁగతెఱంగున జడునిభంగి నుండు నమ్మహాయోగికి రాజర్షియైన పరీక్షిన్మహారాజు తోడ సంవాదం బెట్లు సిద్ధించె? బహుకాలకథనీయంబైన శ్రీభాగవత నిగమవ్యాఖ్యానం బే రీతిసాఁగె? న య్యోగిముఖ్యుండు గృహస్థుల గృహంబుల గోవును బిదికిన యంతతడవు గాని నిలువంబడం డతండు గోదోహనకాలంబు సంచరించిన స్థలంబులు తీర్థంబులగు నండ్రు. పెద్దకాలం బేక ప్రదే

శంబున నెట్లుండె? భాగవతోత్తముండైన జనపాలుని జన్మకర్మంబు లే ప్రకారంబు? వివరింపుము?

పాండవవంశంబు బలము మానంబును
వర్ధిల్లఁ గడిమి నెవ్వాఁడు మనియెఁ
బరిపంథి రాజులు భర్మాది ధనముల
నర్పింతు రెవ్వని యంఘ్రియుగముఁ
గుంభజకర్ణాది కురుభట వ్యూహంబు
నొచ్చి చెండాడె నేశూరుతండ్రి
గాంగేయసైనికాక్రాంత గోవర్గంబు
విడిపించి తెచ్చె నేవీరు తాత

యట్టి గాఢకీర్తియగు పరీక్షిన్మహా
రాజు విడువరాని రాజ్యలక్ష్మిఁ
బరిహరించి గంగఁ బ్రాయోపవిష్టుఁడై
యసువులుండ నేల యడఁగియుండె.

ఉత్తమకీర్తులైన మనుజోత్తము లాత్మహితంబు లెన్నఁడుం
జిత్తములందుఁ గోరరు హసించియు లోకులకెల్ల వర్ధ నం
పత్తియు భూతియున్ సుఖము భద్రముఁ గోరుదు; రన్యరక్షణా
త్యుత్తమమైన మేను విభుఁడూరక యేల విరక్తిఁ బాసెనో.

సారములనెల్ల నెఱుఁగుదు
పారఁగుఁడవు భాషలందు బహువిధ కథవా
చారుఁడవు మాకు సర్వముఁ
బారము ముట్టంగఁ దెలియఁ బలుకు మహాత్మా!

అర్థము: మునిశ్రేష్ఠున్=మునులలో శ్రేష్ఠుఁడైన వ్యాస మహాముని, ఏ శ్రోతల్=పురాణము వినవలెనను నానక్తి గలిగిన ఎవ్వరు, ఏ యుగవేళన్=ఏ యుగమందు, ఎచ్చోటన్=ఏ స్థానమందు, ఏమిటికిన్=ఏ కారణముతో, కోరిరి=ప్రార్థించిరి, ఏమి హేతువునకై=దేని

నిచ్చించి, శోధించి = వేదములను ఇతిహాసములను మున్నుగువానిని జక్కగాఁ బరీక్షించి, లోకైక విఖ్యాతిన్ = సమస్త లోకములందును ఇట్టి గ్రంథ మెక్కడను లేదను ఖ్యాతికిఁ గారణమైన, భాగవతమున్ = పరమ రహస్యమైన భాగవతమును, మున్ను వ్యాసుఁడు గల్పించెన్ = పూర్వము భగవంతుఁడైన వ్యాసుఁడు రచించెను. తత్పుత్త్రుఁడున్ = అతని కుమారుఁడైన శుకబ్రహ్మ, ఏ ప్రీతిన్ = ఏ యనురాగముతో, రాజునకున్ = శాపదష్టుఁడైన పరీక్షిన్మహారాజునకు, ఈ పురాణకథఁ జెప్పెన్ = ఈ భాగవత పురాణమును విన్పించెను. అంతయున్ జెప్పవే = ఈ వృత్తాంతము నంతయు సమగ్రముగా మాకు విన్పింపుము.

లోకైకవిఖ్యాతిన్ = లోకములయందు ఏకమైన విఖ్యాతి అని విగ్రహము. 'ఏకే ముఖ్యాన్య కేవలాః' అని నిఘంటువు. కేవలమగు విఖ్యాతి యనఁగా నితరులచేఁ బొందుట కసాధ్యమైన ఖ్యాతి.

తాత్పర్యము: సూతా! ఏ యుగమందు ఏ స్థలమందు ఏ హేతువున నీ భాగవతము ప్రవృత్తమైనది? ఏ శ్రోతలు వ్యాసభగవానునిఁ బ్రార్థించిరి? శుకబ్రహ్మ యెందువలనఁ బరీక్షిత్తున కీ కథ విన్పించెను? దయచేసి మాకు సమగ్రముగా విన్పింపుము.

ఏ ప్రీతిన్ = ఒకరియందు ప్రీతిలేకున్నచో వారి కుపకార మొనర్చుట జరుగదు. పరీక్షిత్తును శుకబ్రహ్మ ఇంతకుముందుఁ జూచి యెఱుఁగడు. అతని కీతనిపైఁ బ్రీతిగల్గుట కేమి కారణము?

అర్థము: బుధేంద్రా = పండితులలో గొప్పవాఁడా! ఇంద్రాది శబ్దములు సమాసములలో శ్రేష్ఠవాచకములు. మహాయోగి = నిరంతర యోగతత్పరుఁడు. సాంఖ్యవిజ్ఞానరతుఁడని భావము. సమదర్శనుఁడు. అనేకాకారములతో నున్న సమస్త భూతములందును పరబ్రహ్మనే చూచెడివాఁడు. ఏకాంతమతి = నిర్జనప్రదేశ నివాసరసికుఁడు. జనులను జూచినంతనే యా ప్రదేశమును వదలి మఱియొక ఏకాంతప్రదేశము

నకుఁ బోవువాఁడు. మాయాశయనము వలనం దెలిసినవాఁడు= మాయ యనెడు శయనము-పడక. దాని వ్యాప్తినుండి తప్పికొన్న వాఁడు. మాయ అనెడు శయనముపైఁ బండుకొన్నప్పుడు సుఖముగనే యుండును. ఈ యైహికప్రపంచము నందలి సుఖదుఃఖములు మానవు నెప్పు డాకర్షించుచునే యుండును. కాని యవి వాని నాత్యంతిక క్షేమమునుండి మఱపించును. ఎల్లకాల మిట్టే వాఁడు జననమరణాది రూపమైన మాయాశయనమునఁ బొరలుచునే యుండును. మూలము నందలి 'ఉద్బుద్ధః' అను శబ్దమునకు శ్రీధరుఁడు 'మాయాశయనాదు ద్బుద్ధః' అని వ్యాఖ్యానించెను. ఆ సమాసమునే పోతన్న వాడినాఁడు. నిర్వికల్పః అను విశేషణమును పోతన్న వదలెను. వికల్పములున్న వాని కీ స్థితి పట్టనే పట్టదు గదా! గూఢుండు = తన స్వరూపమును నల్లురకును దెలుపుట కాసక్తి లేనివాఁడు. వచన వ్యాపారాదులచేతఁ దెలిసికొనుటకు వీలుగానట్లును సంచరించెడివాఁడు. మూఢునిక్రియన్ ఉండున్ = ఏమియుఁ దెలియని వానివలె నుండెడివాఁడు. నిరస్త ఖేదుఁడు = తుడిచివేయఁబడిన ఖేదము గలవాఁడు. ఖేదమే గాదు. అతనికి మోదమును లేదు. ఇచ్చట ఖేద మనుట యుపలక్షణము. సుఖదుఃఖములు రెండును నాతనికి లేవని యర్థము. ఈ స్థితి తనంతఁ దానుగ వచ్చునది గాదు. జీవుఁ డెన్ని జన్మలనో ప్రయత్నించి సాధింపవలసినది. కనుక నిరస్తయనఁగా పోఁగొట్టుకొనఁబడిన అని యర్థము. పురుషకారముతో ననేక జన్మలు ప్రయత్నింపఁగా నాపూర్వ పుణ్యవాసనలతో నొకానొక జన్మమున నా స్థితి యేర్పడును. కనుక శుకుఁడు మహాసంస్కారి యని యర్థము.

గోఁచియున్=కౌపీనముగూడ, పైజనంబూచి=తమ్మును దాఁటి పోఁగా గమనించి, తోయములందున్ = నీటియందు, లజ్జకున్ జలిం పక= ఏమాత్రమును సిగ్గును వహింపక, చీరలు ఒల్లక=వస్త్రములను ధరింపక చల్లులాడెడి దేవకన్యకలు, స్త్రీలు జలకేళి యొనరించునపుడు క్రీడార్థమై యొకరిపైనొకరు నీరు చల్లుకొందురు. దానికే చల్లులాడుట

యని పేరు. చల్లులు + ఆడుట అని పద విభాగము. దేవకన్యకలు = దేవతాస్త్రీలు. ఇక్కడ దేవకన్యక లనఁగా నప్సరస లనియే యర్థము. ఈ సందర్భమున సంస్కృత భారతప్రయోగ మింతకుముం దీయఁబడినది. 'హా శుక! యంచున' 'ఓయీ! శుకా!' యని. వెన్కఁ జనంగన్ = శుకబ్రహ్మ వెన్వెంట వెళ్ళగా వ్యాసునిం జూచి = అట్టి వ్యాస మహామునిని జూచి, అంశుకములం ధరియించిరి. వస్త్రములను గట్టికొని, అందరున్ సిగ్గునన్ స్రుక్కిరి = ఆ యప్సరసలందరును సిగ్గుఁజెంది సంకోచము నొందిన వారైరి. దీనిధీ! = సంబోధనము.

శుకుఁడు కౌపీనము గూడ లేక పోవుచుండెను. అతని దృష్టి యాతనిది. ఆ సమయమందు అప్సరసలు చీరలు గట్టులపై నుంచి జలకేళి సవరించికొనుచుండిరి. శుకునిజూచి వారికి లజ్జ గలుగలేదు. ఆతనిపోక యట్లుగా నుండెను. వారే శుకుని వెన్నంటి చనుచున్న వ్యాసుని జూచి, సిగ్గున చీరలు ధరించి స్రుక్కిరఁట.

విశేషార్థము: శుకుని జూచినదియు నప్సరసలే. వ్యాసుని జూచినదియు వారే. కనుక తద్గత భావవికారము లన్నియు వారి మనస్సులలోనే. శుకునిచూపు లెచ్చటనో. అతఁ డంతర్దృష్టి. ఆతని చూపులలో బాహ్యావలోకనమే లేదు. వ్యాసుఁ డందమా? అతఁడును శుకునివలె సంపూర్ణజ్ఞానియే. పుత్రుని జ్ఞానానుభూతికన్న వ్యాసుని యనుభూతి తక్కువది గాదు. కాని, శుకుఁడు పారమార్థికపు ముద్ద. వ్యాసభగవానుఁడు రెండుప్రపంచముల నెఱిఁగిన విజ్ఞానఖని. ఆతని దృష్టిలో బ్రహ్మానుభూతి యున్నను ఆతని చూపులు బాహ్యజగత్తును విస్మరించినవి గావు. అందుచే దేవకాంతల కట్లర్థమైనది. లజ్జకుఁ జలింపక = శుకుఁడు పోవుచున్న సమయమందుఁ గూడ వారికి లజ్జ దోఁపకపోలేదు. ఎవ్వరు చూడకున్నను నగ్నులైయున్నప్పుడు స్త్రీలకుఁ గాని పురుషులకుఁ గాని లజ్జ దోఁచుట సహజము. కాని యా లజ్జ వెంటనే వస్త్రముల ధరించెడునంత తీవ్రముగ నుండదు. స్త్రీలునగ్నలై

యున్నప్పుడు వారి యంగసౌష్ఠవమును జూచికొని వారికే యౌవన కృతమైన లజ్జ యేర్పడుట అసహజము గాదు. కాని యది వెంటనే వస్త్రములను ధరించునంతటి తీవ్రతను గలిగియుండలేదు. దానిని వారణచికొన్నారు. వ్యాసునిరాక నప్సరస లెట్లు గమనించిరి? 'హా శుకా!' యని గట్టిగ నఱచుచుం బోవుచున్న యాతని శబ్దము వారి నెచ్చరించినది. వెంటనే వచ్చి గుడ్డలు ధరించినారు. వస్త్రపరిధానలైనను సిగ్గున క్రుక్కు టెందులకు? ఆందరలో నస్తవ్యస్తము గనే వస్త్రముల ధరించియుందురు. అందుచే సిగ్గు. అవయవసంకోచమును, లేక తా మీ స్థితిలో నుంటిమని వ్యాసునకుం దెలిసె గదా! యని గూడ నుండవచ్చును.

నగ్నుండు=దిగంబరి, తరుణుండు=వయసులోనున్నవాఁడు. వస్త్రపరిధానము=గుడ్డలనుధరించుట. వస్త్రధారి=గుడ్డలను గట్టికొన్నవాఁడు. చేలము=వస్త్రము. దేవరమణులు=దేవతాస్త్రీలు, భేదదృష్టి=భిన్నమైన దృష్టి, నిర్వికల్పుఁడు=వికల్పజ్ఞానము లేనివాఁడు. నిరస్తభేదుఁడని శ్రీధరులవ్యాఖ్య, మహాంతరము=గొప్పతారతమ్యము, కురుజాంగల దేశంబులు=కురుదేశ మొకటి జాంగల దేశము మఱియొకటి లేక భిన్నరాష్ట్రము లైనను గావచ్చును. హస్తినాపురంబునన్=హస్తి యను రాజుచే నిర్మింపఁబడిన పట్టణము. పౌరజనంబులు=పురమునందున్నవారు పౌరులు, ఉన్మత్తునిక్రియున్=మూఁగతెఱంగునన, జడుని భంగిన్=పిచ్చివానివలె, మూఁగవానివలె, మూర్ఖునివలె, 'బాలోన్మత్త పిశాచవ'త్తుగా నవధూత లుందురని పెద్దలనుడి. రాజర్షి=రాజులలో ఋషివంటివాఁడు. అనఁగా రాజ్యపాలన మొనర్చుచున్నను, ఆ సుఖములకు మనసునఁ జోటివ్వక, ఋషివంటి జీవితమును గడపువాఁడు. కేవల మనాసక్తుఁడై, రాగద్వేషరహితుఁడై రాజ్యము నొనర్చువాఁడని తాత్పర్యము. శుకుఁడు మహాయోగి. ఉన్మత్తమూక జడులవలె నుండెడివాఁడు. అతఁడు పలుకనే పలుకఁడు. జనులు మెచ్చుకొను

సదాచార మాతనియందుఁ గన్పింపదు. పరీక్షిత్తు రాజర్షి యగుటచే ననాచారులం దాతనికి దృష్టిలేదు. మఱి వీ రిర్వురు నుత్తరదక్షిణ ధ్రువముల వంటివారు. వీరి సంభాషణ మెట్లు పొసఁగెను? బహుకాల కథ నీయము—చాలకాలము చెప్పఁదగినది. అనఁగా బహుకాలము వ్యాఖ్యానింపఁదగిన విస్తారముగలది, శ్రీభాగవత నిగమవ్యాఖ్యానము. నిగమ మనఁగా వేదము. 'నిగమములు వేయుఁజదివిన' అని పోతన్న ప్రయోగము. సాత్వతీ శ్రుతిః—అనుటకిది తెనుఁగు. గోదోహనకాలమాత్రమే శుకుఁ డింట్లముందు నిలుచును. ఆ నిలుచుటయు వారినిఁ బవిత్రుల నొనర్చుటకే. ఇది ప్రసిద్ధమైన విషయము. పెద్దకాలము—చాల కాలము, ఏకప్రదేశంబునన్—ఒకేచోటునందు, భాగవతోత్తముఁడు—భగవద్భక్తులలో శ్రేష్ఠుఁడు, జనపాలుని జన్మకర్మంబులు—జన్మమును కర్మలును-ద్వంద్వసమాసము.

పాండవ వంశముయొక్క బలమును, కీర్తియు, వర్ధిల్లన్—అభివృద్ధిఁ బొందెడు నట్లు, కడిమిన్—పరాక్రమముతో, ఎవ్వాఁడు మని యెన్—ఎవఁడు జీవించెనో, ఆటువెలఁదియందలి పరీక్షిన్మహారాజు అను దానితో నన్వయము. పాండూనాం అనుటను పోతన్న పాండవవంశముగా నన్వయించెను. ఇతని ప్రవర్తన పాండవుల వంశమైన చంద్ర వంశమందుఁ బుట్టిన రాజుల కందరికిని గీర్తి సంపాదించునదిగా నుండె నని భావము. పాండుమహారాజును ప్రసిద్ధుఁడు. అతని పుత్త్రులును ప్రసిద్ధులు. వా రందరు జన్మించుటచే నది పాండవవంశ మైనది. ఆ పేరుతోఁ బ్రచారములోనికి వచ్చెను. రఘువంశమన్నట్లు పరాక్రమము తోనే క్షత్రియునకుఁ గీర్తి, బ్రాహ్మణునకు వేదవిద్యతో నున్నట్లు. అందుచేతనే 'కడిమిన్' అనుచున్నాఁడు. ఎవ్వని యంఘ్రియుగమున్—ఎవని పాదముల జంటను, పరిపంథిరాజులు—శత్రురాజులు, ధర్మాది ధనములన్—బంగారు మొదలగు ధనములచేత, అర్చించిరి—పూజించిరో శత్రురాజులు పరీక్షిన్మహారాజుచే జయింపఁబడి కప్పములు దెచ్చి

యాతని పాదములకడ నర్పించి పోవుచుండిరి. 'యత్పాద నికేతనం' అని మూలములో చరణపీఠికను జెప్పెను. ఇతఁడు చరణములనే చెప్పు చున్నాఁడు. పోతన్ననాఁటి కది యాచారముగా వచ్చెను. ఏ శూరు తండ్రి=శూరుఁడైన పరీక్షిత్తు జనకుఁడగు నభిమన్యుఁడు, కుంభ జుఁడు=అనఁగా ద్రోణుఁడు, కర్ణాదులచేఁ గూడిన కురుభటులయొక్క వ్యూహంబున్=పద్మవ్యూహ మనెడు సైనికవిన్యాసమును, చొచ్చి చెండాడెన్=మహాసాహసముతోఁ బ్రవేశించి వారిని దన పరాక్రమముచే డీల్పఱచెనో, ఏ వీరుతాత=ఏ రాజు తాతయైన యర్జునుఁడు, గాంగేయ సైనికాక్రాంత=గాంగేయుఁడు మొదలైన సైనికులచే నాక్రాంతమైన, గోవర్గంబున్ = గోవుల సమూహమును, విడిపించి తెచ్చెన్=సాధించి తెచ్చి విరాటరాజున కప్పగించెనో, గాఢకీర్తి=గొప్పకీర్తిఁ గలవాఁడు, ఈ కీర్తి తండ్రితాతల నుండియు సంతతి ముందున్న మహారాజుల నుండియు నీతనికి సంక్రమించినది. అతఁడు దానికిఁ గళంక మాపాదింపక జాగ్రత్తగా రక్షించికొనెను. పితృపితామహాది సంక్రాంతమైన యాస్తిని సంరక్షించి కొన్నట్లు. విడువరాని రాజ్యలక్ష్మి=దుస్త్యజాం అనుటకుఁ దెలుఁగు. గంగన్=గంగానదియందు, ప్రాయోపవిష్టుఁడై =ఉపవాసముతోఁ బ్రాణములను వదలఁ దలఁచినవాఁడై, అసువులుండన్=ప్రాణములుండఁగనే, ఏల యడఁగియుండెన్=ఎందుకు రహస్యముగా నుండెను. రాజులకు యుద్ధములందు మరణించుట యుత్తమ ధర్మము. పరీక్షిత్తునకు యుద్ధములో మరణము సిద్ధింపదు. అతనిని జయించెడి వారుండరు గనుక. కాని బలవంతముగాఁ బ్రాణములఁ దీసికొన నెందు కుద్యమించెను?

ఉత్తమకీర్తులు=గొప్పకీర్తిగలవారు బహువ్రీహి. మనుజోత్తము లనుటకు విశేషణము. మనుజ+ఉత్తములు, రాజశ్రేష్ఠులు, ఆత్మ హితంబున్ = తమ హితమును, హసించియున = నవ్వుటాలకైనను, చిత్తములందుం గోరరు, లోకుల కెల్లన్=జనుల కందఱకును 'లోకస్తు

భుపనే జనే' అని యమరము. అర్థసంపత్తియున్ = ధనసమృద్ధియు, భూతియున్=ఐశ్వర్యమును, సుఖమున్ భద్రమున్=యోగక్షేమము లను గోరుదురు. అన్యరక్షణాత్యుత్తమమైన మేను = పరులను రక్షించు టకును సుత్తమ ధర్మముచేత గొప్పదైన శరీరమును, విభుఁడు=పరీక్షిత్తు, ఏల విరక్తిన్ పూనెనో=వైరాగ్యమున నెందుకుఁ ద్యజించెనో! ఉత్తమశ్లోక పరాయణాః = అను శబ్దమును శ్రీధరుఁడు వ్యాఖ్యానింప లేదు. తక్కినవారు ఉత్తమశ్లోకుఁడైన భగవంతునం దాసక్తులైనవారు అనఁగా భాగవతులని యన్వయించిరి. పరీక్షిత్తు మహాభాగవతుఁడు గదా! ప్రాహుర్భాగవతోత్తమం' అని మూలమందే యున్నది. కాని పోతన్న రాజులకే యన్వయించినాఁడు. ఉత్తమమైన శ్లోకము, గొప్ప కీర్తి-దానియందు పరాయణులు ఆసక్తిగలవారు. నరాః అనిమూలము. దానిని పోతన్న రాజుల కన్వయించికొనెను. రాజులకెప్పుడును గొప్ప కీర్తిని. సంపాదించి కొనుటయందు దృష్టి, వారికి స్వార్థముగాఁ బట్టుదు. పరీక్షిత్తు రాజు. ప్రజల క్షేమమునకై యాతఁడు బ్రదుక వలెను. మఱి యట్టివాఁడు ప్రాయోపవేశముతో ప్రాణము వదల నెందుకు సాహసించెనని ప్రశ్న.

పోతన్నగారు మూలము నిట్లు వ్యాఖ్యానించికొనుట తన కాలమును బట్టియే యని నా యూహ. అనాఁటి రాజుల కాతఁడు- ధ్వనిమార్గముతో కర్తవ్యము నుపదేశింపఁదలఁచి నాఁడేమో!

సారములన్ ఎల్లన ఎఱుఁగుదు=సమస్త పురాణేతిహాసమ్ముల సారముల్లెల్ల నెఱుఁగుదువు. భాషలందు పారగుఁడవు. వాక్చమత్కారము గలవాఁడవని యర్థము. లేక మధ్వాచార్యులు చెప్పినట్లు వివిధభాషలందు సమర్థుఁడవని చెప్పికొన్నచో మఱికొంత చమత్కార ముగ నుండునేమో. వారు పురాణేతిహాస భాషను మూఁడు రీతులుగ వింగడించిరి. గుప్తభాష, సమాధిభాష, దర్శనభాష. ఈ మూఁడింటి యర్థవివరణము చక్కఁగాఁ దెలిసిన వాఁడవని భావము. బహువిధ-

అనేక విధములుగా, కథన=రసోజ్జ్వలముగాఁ జెప్పుటయందు, ఉదారుఁడవు=గొప్పవాఁడవు, పారము ముట్టంగన్=అవధులు దాఁటునట్లు, మాకు మఱల ప్రశ్నలు పుట్టి నీవు పోయిన తరువాత వికల్పములతో బాధలు పడకుండునట్లుగా నని యర్థము. తెలియన్ పలుకుము= మా కర్థ మయ్యేడునట్లు చెప్పుము.

సూత ఉవాచః

ద్వాపరే సమనుప్రాప్తే తృతీయే యుగపర్యయే,
జాతః పరాశరోద్యోగీ వాసవ్యాం కలయా హరేః. 14

స కదాచి త్సరస్వత్యా ఉపస్పృశ్యజలం శుచి,
వివిక్త ఏక ఆసీన ఉదితే రవిమండలే. 15

పరావరజ్ఞ స్స ఋషిః కాలేనావ్యక్తరంహసా,
యుగధర్మ వ్యతికరం ప్రాప్తం భువి యుగేయుగే. 16

భౌతికానాం చ భావానాం శక్తిహ్రాసం చ తత్కృతమ్,
అశ్రద్దధానా న్నిస్సత్త్వాన్ దుర్మేధాన్ హ్రసితాయుషః. 17

దుర్భగాంశ్చ జనా న్వీక్ష్య ముని ర్దివ్యేన చక్షుషా,
సర్వవర్ణాశ్రమాణాం యద్దధ్యౌహిత మమోఘదృక్. 18

చాతుర్హోత్రం కర్మశుద్ధం ప్రజానాం వీక్ష్య వైదికమ్,
వ్యదధా ద్యజ్ఞసంతత్యై వేదమేకం చతుర్విధమ్. 19

ఋగ్యజుస్సామాథర్వాఖ్యా వేదా శ్చత్వార ఉద్ధృతాః,
ఇతిహాసః పురాణం చ పంచమో వేద ఉచ్యతే. 20

తృతీయే = మూఁడవదియైన, యుగపర్యయే = యుగపరివర్తనమందు, ద్వాపరయుగము, సమనుప్రాప్తే=వచ్చినదగుచుండఁగా, పరాశరాత్ =పరాశరముని నుండి, వాసవ్యాం=వాసవియను పేరుఁగలిగిన సత్యవతీదేవియందు, హరేః=హరి యొక్క, కలయా=అంశతో, యోగీ=యోగియైన వ్యాసుఁడు, జాతః=జన్మించెను.

ఈ భాగవతకథ ఏ యుగమందుఁ బ్రవృత్తమైనది? ఈ ప్రశ్న కుత్తరము చెప్పుచున్నాఁడు. కృత త్రేతా ద్వాపర కలియుగములు ఒకసారి చుట్టివచ్చుట కొక పర్యాయ మని పేరు. మూఁడవదియైన పర్యాయమందు ద్వాపర యుగారంభమందు ఉపరిచరుఁడను పేరుఁగల వసువుయొక్క పుత్రిక యగుటచే వాసవి యను పేరుగల సత్యవతి యందు పరాశరునుండి విష్ణువునంశతో పరమయోగియైన వ్యాస భగవానుఁ డవతరించెను. 14

సః=అతఁడు, కదాచిత్=ఒకానొకనాఁడు, రవిమండలే=సూర్యమండలము ఉదితే=ఉదయించిన కాలమందు, సరస్వత్యాః=సరస్వతీదేవియొక్క, జలం=జల మును, ఉపస్పృశ్య=ఆచమించి, శుచిః=శుద్ధుఁడై, వివిక్తే=జనసంచారములేని స్థానమందు, ఏకః=ఒక్కఁడే, ఆసీనః=ఉపస్థితుఁడై యుండెను.

ఒకానొకనాఁడు సూర్యోదయ వేళ వ్యాసభగవానుఁడు సర స్వతీనదియందు స్నానాది కృత్యములు నిర్వహించి పరిశుద్ధుఁడ య్యెను. జనసంచారములేని ఒకానొక స్థలమందు (బదరికాశ్రమ ప్రదేశమందు) ఒంటరిగాఁ గూర్చొనియుండెను. 15

పరావరజ్ఞః=త్రికాలజ్ఞుఁడైన, సః ఋషిః=ఆ మహర్షి, అవ్యక్తరంహసా =తెలియరాని వేగముతోఁ గూడిన, కాలేన=కాలముచేత, భువి=భూమియందు, యుగే యుగే = ప్రతియుగమందును, ప్రాప్తం=సంభవించియున్న, యుగధర్మ వ్యతికరం=యుగధర్మముల సాంకర్యమును, వీక్ష్య=చూచి, భౌతికానాం=భూత ములయం దేర్పడెడు, భావానాం=వస్తువులయొక్కయు, తత్కృతం=కాలకృత మైన, శక్తిహ్రాసంచ=శక్తుల తగ్గిపోవుటను, జనాన్=జనులు, అశ్రద్ధధానాన్= శ్రద్ధలేని వారుగా, నిస్సత్త్వాన్=బలము లేనివారుగా, దుర్మేధాన్=బుద్ధిశక్తి లేనివారి నిగా, హ్రసితాయుషః = తగ్గిపోయిన ఆయుస్సుగల వారినిగా, దుర్భగాన్=భాగ్య హీను లనుగా, దివ్యేన చక్షుషా=తన దివ్యదృష్టిచేత, వీక్ష్య=చూచి, అమోఘ దృక్=వ్యర్థముగాని యాలోచనగల, మునిః=వ్యాసభగవానుఁడు, సర్వవర్ణాశ్ర మాణాం=సకల వర్ణాశ్రమములకును, హితం యత్=ఏది హితమని, దధ్యౌ= తలపోసెను.

ఆ ఋషి ఏకాంతమం దుండెను. అతఁడు త్రికాలవేది. కాలము గమనింప నసాధ్యమైన వేగము గలది. దాని వేగముతో యుగ యుగములందును మనోవేగముతో ధర్మవ్యత్యాస మేర్పడు చుండును. పంచభూతముల సమ్మేళమున నేర్పడిన ప్రాణులు, దేహబలము తగ్గినవిగాఁ దయారైనవి. దానికిఁ గారణము గాలమే. తమకు హితకరములైన విషయములందు జనులకు శ్రద్ధలేదు. మనోబలము శూన్యము. బుద్ధిశక్తి కొఱవడినది. క్రమముగా నాయువు తగ్గును. భాగ్యము క్షీణించును. ఇవి ఆ నాఁటికే మొదలుకొని వచ్చుచుండెను. ఈ మార్పును గమనించిన వ్యాసముని, సర్వవర్ణములకును ఆశ్రమములకును హితకరమైన మార్గమేది యని తలపోయ నారంభించెను. అతఁ డమోఘమైన జ్ఞానము గలవాఁడు. అతని నిశ్చయ మెప్పుడును దప్పదు. 16–18

జనానాం–జనులకు, వైదికం–వేదమందుఁ జెప్పఁబడిన, చాతుర్హోత్రం–నల్గురిచే నిర్వహింపఁబడెడు, కర్మ–కర్మము, శుద్ధం–శుద్ధకరమని, వీక్ష్య–చూచి, యజ్ఞసంతత్యై–యాగాదుల సతతస్థితికొఱకు, ఏకం వేదం–ఒకటే వేదమును, చతుర్విధం–నాల్గుగా, వ్యదధాత్–విభాగించెను.

బ్రహ్మ, హోత, అధ్వర్యుఁడు, అగ్నీధ్రుఁడు వీరు నల్వురు. వీరికి సముదితముగా ఋత్విక్కులని పేరు. ఈ నల్వురును హోమమందుఁ బాల్గొనెడివారే. అందుకే యజ్ఞము చాతుర్హోత్రము. ఇది జనులను బవిత్రులుగా నొనర్చును. ఈ విషయమును జ్ఞానదృష్టితో గమనించిన వ్యాసముని యొకటిగా నున్న వేదమును నాల్గుగా విభజించెను. 19

ఋగ్యజుస్సామాథర్వాఖ్యాః–ఋక్ యజు స్సామ అథర్వణము లనెడు పేరుతోఁ గూడిన, చత్వారః వేదాః–నాల్గువేదములు, ఉద్ధృతాః–గడ్డకుఁ దీయఁబడినవి, ఇతిహాస పురాణం చ–ఇతిహాస పురాణమును, పంచమో వేదంచ–ఐదవ వేదమని, ఉచ్యతే–చెప్పఁబడుచున్నది.

ఋగ్యజు స్సామాథర్వణములను పేరులతోఁ గూడిన నాల్గుభాగములుగా వేదము నొనర్చెను. ఇతిహాసము పురాణ మనెడి నామములతో సమస్త వేదసారముల నొకచోటఁ జేర్చి పంచమవేద మని పేరిడెను. ఈ సంప్రదాయము నాల్గువేదములవలెనే ప్రసిద్ధమైనది. 20

శ్రీధరీయము :

వివిక్తే—నిర్జనప్రదేశము నాశ్రయించినది చిత్తైకాగ్రతకొఱకు. బదరికాశ్రమ మందని దీనిచేతనే సూచితము.

వంశీధరుఁడు :

యుగపర్యయే—యుగానాం సత్యాదీనాం పర్యయః అతిక్రమః యత్ర తస్మిన్—సత్యయుగాదులు గడచుట. 'పర్యయో ఽతిక్రమస్తస్మిన్నతిపాత ఉపాత్యయః' అని యమరము. బహుయుగములు గడవగా నని యర్థము. లేక కృష్ణావతారమునకు సంబంధించిన ద్వాపరమనియు నర్థము చెప్పికొనవచ్చును. కృష్ణావతారము వైవస్వత మన్వంతరీయమైన యష్టావింశతితమ ద్వాపరయుగమందు జరిగినది. ఎటువంటి తృతీయమందు? ప్రతియుగము గూడ మూఁడు రూపములు గలది. సంధ్యారూప, యుగరూప, సంధ్యాంశరూపములు. కనుక, తృతీయే—ద్వాపరయుగ సంధ్యాంశ రూపమని యర్థము. ఉపరిచర వసువుకథ మహాభారతమందు వచ్చును. చేదిదేశపురాజు వసురాజు. అతఁ డింద్రుని మెప్పించి విమాన మొకటి సంపాదించెను. నాటినుండి ఉపరిచర వసువైనాఁడు. అతఁ డొకనాఁడు పిత్రాజ్ఞతో వేఁటకు వెళ్ళెను. అతనిభార్య గిరిక. ఆమె యపుడు ఋతుస్నాత. వేఁటకు వెళ్ళినపుడు వసువు దనభార్యను దలఁచెను. వెంటనే రేతస్ఖలనమైనది. దాని నతఁడు వటపర్ణమందు సంగ్రహించి, గిరిక కివ్వవలసినదని ఒకడేగ ద్వారా పంపెను. దాని నది తీసికొనిపోవుచుండఁగా మఱియొక శ్యేనము, మొదటిశ్యేనము మాంసమును గొనిపోవుచున్నదనుబుద్ధితో నడ్డి నిలిచెను. ఆ రెంటికిని జరగిన పోరులో రేతస్సు

కాళిందినదిలోఁ బడినది. అందులో నద్రికయను నప్సరస మునిశాప ముతో మత్స్యమై యుండినది. అది ఆ వీర్యమును గ్రమింగెను. దాని నొకదాశరాజు పట్టినాఁడు. అతఁడు దానిని తన యేలిక కీయఁగా నందులో నొక కొడుకు, కూతురు నుండిరి. అద్రికకు శాపమోక్ష మయ్యెను. కుమారుని రాజు దీసికొనెను. వాఁడే మత్స్యదేశమునకు రాజైనాఁడు. దాశరాజు స్వీకరించిన కన్యపేరు సత్యవతి. ఆమెకుఁ బరాశరునితో సంబంధ మేర్పడెను. సద్యోగర్భమున వ్యాసుఁడు జన్మించినాఁడు.

**విజయధ్వజము :**

ఏ యుగమందు భాగవతము ప్రవృత్తమైనది? దానికుత్తరము—

తృతీయే = కృతయుగమునుండి మూఁడవదియైన, ద్వాపరే యుగే = ద్వాపరయుగమునందు, పర్యయే సమనుప్రాప్తే = పర్యవసా నము పొందుచుండఁగా, హరేః కలయా = హరి స్వరూపాంశముచేత, పరాశరాత్ = హింసను దూర మొనర్చిన పరాశరుఁడను ఋషినుండి, వాసవ్యాం యోగీ జాతః = యోగియైన పరాశరుఁడు వాసవి యందు జన్మించెను. ఈ భాగవతపురాణము ద్వాపరయుగముయొక్క కొన యందుఁ బుట్టినదైనది. ఇచ్చటి జాతః అనుటకు వ్యక్తుఁ డయ్యెనని యర్థము. ఇది సద్యోగర్భము. ప్రాకృతమైన పద్ధతి గాదు.

అవ : శ్రీహరియొక్క వ్యాసావతారప్రయోజనమును దెలుపు చున్నాఁడు—

తాత్పర్యము : వ్యాసాశ్రమసమీపముననే సరస్వతీనది పాఱు చున్నది. అతఁ డందు స్నానాదికార్యముల ముగించినాఁడు. నిత్య శుద్ధుఁడైన వ్యాసునకు నీటితో నగత్యము లేదు. కాని లోకుల కుప దేశ మొనర్చుటకై యతఁ డట్లొనర్చెను. అంతలో సూర్యోదయ మైనది.

అర్థము: పరావరజ్ఞః = పరతత్త్వమును, అపరతత్త్వమును జక్కఁగాఁ దెలిసిన, ఋషిః=ఋషికులమును దుద్భవించిన, సః=అందరి కంటెను సారభూతుఁడైన అనఁగా సర్వోత్తముఁడైన వేదవ్యాసుఁడు, అవ్యక్తరంహసా=స్పష్టముగాఁ దెలియుట కసాధ్యమైన వేగముగల, కాలేన=కాలముచేత, యుగేయుగే =ప్రతియుగమునందును, భువి= భూలోకమందు, ప్రాప్తం=ఏర్పడిన, యుగధర్మవ్యతికరం=యుగధర్మ ముల సాంకర్యమును, వీక్ష్య=చూచి.

తాత్పర్యము: వ్యాసుఁడు త్రికాలజ్ఞాని. పరాపరతత్త్వము నెఱిఁగినవాఁడు. సర్వదా అబాధితజ్ఞానము గలవాఁడు. ఆ వ్యాస రూపుఁ డగు శ్రీహరి అవ్యక్తమై బహువేగముగఁ బరుగిడు కాలప్రవాహ ముతో భూమియం దేర్పడిన యుగధర్మసాంకర్యము నెఱిఁగెను.

అర్థము: తత్కృతం ఆ కాలముచే నేర్పడిన పంచభూతకార్య ములైన, భావానాం = శరీరము మొదలగు పదార్థములయొక్క, శక్తిహ్రాసంచ=శక్తి సంకోచమును, అందుచేతనే, అశ్రద్దధానాన్=పర లోకభావశూన్యులను, నిస్సత్త్వాన్ = దుర్బలు రగుటతో నుత్సాహరహి తులను, దుర్మేధాన్ = ధారణాశక్తిలేని వారిని, హ్రసితాయుషః = అల్పాయుష్కులను, దుర్భగాన్=1 బంధకమైన భాగ్యమునుబొందిన 2. మోచకభాగ్య రహితులైన, జనాన్ చ వీక్ష్య = జనులను జూచి, అమోఘదృక్ =1. సార్థకమైన జ్ఞానమున్న, 2. అబాధితమైన జ్ఞానము గల,మునిః=మననశీలుఁడైన వేదవ్యాసుఁడు, దివ్యేనచక్షుషా=అపరోక్ష జ్ఞానమను దృష్టితో, సర్వవర్ణాశ్రమాణాం=యత్ (హితం) చిరం దధ్యౌ.

విశేషములు: అమోఘదృక్ అని చెప్పుటతో నిత్యజ్ఞానియైన వేదవ్యాసుఁడు జ్ఞానదృష్టితో నాలోచనాధీనుఁడైనట్లు గన్పడినది. దుష్ట జనమోహనార్థమే. కౌర్మపురాణవచనము—

నిత్యజ్ఞానస్య చిద్దృష్టి ర్లోకదృష్టి వ్యపేక్షయా,
సర్వజ్ఞో ప్యజ్ఞవ ద్దేవః సర్వశక్తి రశక్తివత్.

ప్రత్యాయయతి లోకానాం అజ్ఞానం మోహనాయ చ.

నిత్యజ్ఞానియైన శ్రీహరి వ్యాసాద్యవతారములందు ఒకొక్క సారి యాలోచించెనని చెప్పుట అజ్ఞజనులదృష్టితోఁ జెప్పినది. దుష్ట జన మోహనార్థమై శ్రీహరి గూడ సర్వజ్ఞుఁడయ్యు నజ్ఞునివలె, సర్వ శక్తుఁడయ్యు నశక్తునివలె నటించును.

అర్థము: మునిః చాతుర్హోత్రం కర్మ=యాగాది కర్మమును, శుద్ధం = సమస్తాంగములతోఁ గూడ, వైదికం = మూల వేదోక్తమైన యగ్నిష్టోమాది కర్మలు, ప్రజానాం=ప్రజలచేతఁ జేయఁబడుట కసాధ్యమని, ప్రజానాం=వైదికజనులకు, శుద్ధిం=శుద్ధికరమైన, రాగాది దోషరహితమైన కర్మమును, వీక్ష్య = తెలిసి, యజ్ఞసంతత్యై = యాగ కర్మసంప్రదాయము ప్రవృత్తమగుటకు, ఏకం వేదం = ఒకటేయని భావింపఁ బడుచున్న వేదమును, చతుర్విధం = నాల్గు విధములుగా, వ్యదధాత్ = చేసెను.

మొదలు-నడుమ-కొన వీనియందు హరిస్మరణ మొనర్చి, యతని పూజగా చేయఁబడు కర్మ. ప్రజలకు జ్ఞానము నిచ్చుటతోఁ బాటు శుద్ధికరము. అంద అన్ని కర్మలును జేయనేరరు. అందుకే శాఖాభేదమును గర్మభేదమును వ్యాసభగవానుఁ డొనర్చెను.

ఋగ్యజుస్సామాథర్వాశ్చత్వారో వేదాః-మూలవేదమను సముద్రమునుండి నాల్గువేదము లుద్ధరింపఁబడినవి. వానిని వేదవ్యాసుఁడు రచించెనని యర్థము గాదు. ఆ వేదార్థమును సరిగాఁ దెల్పుట కొఱకే యితిహాసపురాణము నొనర్చెను. వానినే యైదవవేద మన్నాఁడు. ఇతిహాస పురాణాదులను క్రొత్త శబ్దములతో రచించెనని తెలియవలెను. అర్థము నిత్యము. అందుచే క్రొత్తగాఁ రచింపఁబడదు.

హోత, అధ్వర్యుఁడు, ఉద్గాత, బ్రహ్మ - ఈ నల్వురిచే ప్రారంభింపఁబడి చేయఁబడు నగ్నిష్టోమాదులు నిలిచిపోక ముందుకు

సాఁగవలెను. వానిని శ్రీహరిస్మరణ పూర్వకముగా నొనర్పవలెను. అ ట్లొనర్చినపుడు కర్మ యొనర్చినవారు శుద్ధు లగుదురు. జ్ఞానప్రాప్తి యగును. ఈ దృష్టితో వ్యాసుఁడు మొదలే విభక్తము లైనను ఒకటే యని భావింపఁబడుచుండిన వేదరాశిని దానిలోఁ జెప్పఁబడిన కర్మ సమూహమును నాల్గుగా వింగడించెను. అన్నికర్మ లంద రాచరింప నేరరు. కనుక వారివారి యోగ్యతకుఁ దగినట్లు వేదములు, తక్కిన కర్మల నేర్పఱచి ధర్మము సాఁగున ట్లొనర్చెను. మూలవేదము సము ద్రమువలె నపారము, అగాధము. ఆ వేదరాశినుండి మొదలే ఋగా దులు విభక్తములై యుండెను. అవిగూడ కలిజనులు పఠించుట కసా ధ్యము లగుటచే నా మహావేదములనుండి అదే పేరుగల యుపవేద ములను వింగడించెను. వ్యాసరూపుఁడైన శ్రీహరి యర్థము దెలియ కున్నచో వేద ముపయోగము లేదని యా వేదోద్ధారమును సరియైన రీతితోఁ జూపించుటకు భారత మను నితిహాసమును, బురాణములను రచించెను. రచన యనఁగాశబ్దము మాత్రమే క్రొత్తది. వేదములలోని యర్థమే వీని యర్థము. కనుక అనాదియై నిత్యమైన యా యర్థమును వ్యాసుఁడు క్రొత్తగా రచింపలేదని పిండితార్థము.

తత్ర్గ్వేదధరః పైలః సామగో జైమినిః కవిః,
వైశంపాయన ఏవైకో నిష్ణాతో యజుషాంగణే. 21

అథర్వాంగిరసా మాసీత్ సుమంతు ర్దారుణో మునిః,
ఇతిహాసపురాణానాం పితా మే రోమహర్షణః. 22

త ఏతే ఋషయో వేదం స్వంస్వం వ్యస్యన్నేకధా,
శిష్యైః ప్రశిష్యై స్తచ్ఛిష్యై ర్వేదాస్తే శాఖినోఽభవన్.23

త ఏవ వేదా దుర్మేధైః ధార్యంతే పురుషైర్యథా,
ఏవం చకార భగవాన్ వ్యాసః కృపణవత్సలః. 24

స్త్రీ శూద్ర ద్విజబంధూనాం త్రయీ న శ్రుతిగోచరా,
కర్మశ్రేయసి మూఢానాం శ్రేయ ఏవం భవే దిహ.
ఇతి భారతమాఖ్యానం కృపయా మునినాకృతమ్. 25

తత్ర=దానిలో, ఋగ్వేదధరః=ఋగ్వేదము నభ్యసించినవాఁడు, పైలః= పైలుఁడనెడు ముని, సామగః=సామగాన మొనర్చెడివాఁడు, కవిః జైమినిః= దూరదృష్టిఁ గల జైమిని ముని, యజుషాం నిష్ణాతః=యజుర్వేదమునందు నిష్ణా తుఁడు, వైశంపాయనః ఏకఏవ=వైశంపాయనుఁ డొక్కఁడే నాల్గుగా విభాగింపఁ బడిన ఈ వేదముల నొక్కొక్కదానిని బఠించెను. పైలుఁడు ఋగ్వేదనిష్ణాతుఁడై నాఁడు. దూరదర్శియైన జైమిని సామమును స్వాయత్తీకరించికొనెను. వైశం పాయనుఁడు యజుర్వేదము నభ్యసించినవాఁడు.

అథర్వాంగిరసాం = అథర్వము అంగిరస్సు వీనికి, దారుణః సుమంతుః మునిః=నిష్ఠాభయంకరుఁడైన సుమంతుఁడను ముని, (ఆసీత్=ఏర్పడెను) అనఁగా నభ్యసించెనని భావము. ఇతిహాసపురాణానాం=ఇతిహాసములు పురాణములు, వీనికి మే పితా=నా తండ్రియైన, రోమహర్షణః=రోమహర్షణుఁడు (ఆసీత్=అయెను).

అవ. అథర్వవేదమునందు వచ్చెడు, అభిచారికము మొదలైన క్రియలను గూర్చి చెప్పుచున్నాఁడు.

ఆ భాగములను నిష్ఠాభయంకరుఁడైన సుమంతుఁడను ముని పఠించెను. ఇతిహాస పురాణములు నా తండ్రియైన రోమహర్షణునికి పాఠయోగ్యములైనవి. 21, 22

తే ఏతే ఋషయః=అ యీ మహర్షులు, స్వంస్వం వేదం=తమతమ వేద మును, అనేకధావ్యస్యన్=అనేకవిధములుగా విభజించిరి, శిష్యైః=శిష్యులచేతను, ప్రశిష్యైః=తచ్ఛిష్యుల చేతను, తచ్ఛిష్యైః=వారి శిష్యులచేతను, తే వేదాః=అ వేదములు, శాఖినః అభవన్=శాఖలై వర్ధిల్లినవి.

అ ఋషులు తా మభ్యసించిన వేదములను, తర్వాత ననేక విధములుగా విభజించిరి. వారిశిష్యులు, ప్రశిష్యులు వారిశిష్యశిష్యులు

ఈ రీతి పరంపరగాఁ బఠించుటచేత, నా వేదములు బహు శాఖలుగా నైనవి. 23

తే వేదా ఏవ=ఆ వేదములే, దుర్మేధైః పురుషైః=బుద్ధి శక్తి తక్కువగా నున్న పురుషులచేత, యథాధార్యంతే=ఏ రీతిగా ధరింపఁబడునో, కృపణవత్సలః=దీనులయందు దయఁ గలిగిన, భగవాన్ వ్యాసః=భగవంతుఁడైన వ్యాసుఁడు, ఏవం చకార=ఆ రీతిగాఁ జేసెను.

అవ. వేదవిభాగము యొక్క ప్రయోజనమును దెలుపుచున్నాఁడు

మహామేధాసంపన్నులచే మాత్రమే వేదములు సాధింపఁదగినవి. వ్యాసభగవానుఁ డీ కష్టమును దలఁచి దీనులయందు దయఁ గలవాఁడై, వేదముల నారీతి శాఖోపశాఖలుగా విభజించెను. వేదమను మహావృక్షమును శాఖోపశాఖల రీతిని వ్యాసమహాముని విభజించినాఁడు. 24

స్త్రీశూద్రద్విజ బంధూనాం=స్త్రీలు, శూద్రులు, హీనులైన బ్రాహ్మణులు-వీరికి, త్రయీ=వేదము శ్రుతిగోచరా న=చెవులలోఁ బడుటకు వీలులేనిది, కర్మశ్రేయసి=కర్మరూపమైన శ్రేయస్సునందు, మూఢానాం=మూఢులైనవారికి, ఇహ శ్రేయః=ఈ లోకమందు శ్రేయస్సు, ఏవం భవేత్ ఇతి=ఈ రీతిగా గల్గుఁ గాక యని తలఁచి, భారతం ఆఖ్యానం=భారత మనెడు మహాగ్రంథము, మునినా నిర్మితం=మునిచే నిర్మితమైనది.

స్త్రీలు, శూద్రులు, అధమబ్రాహ్మణులు-వీరికి వేదమును వినుటయో, అభ్యసించుటయో తదనుగుణముగ వర్తించి, శ్రేయస్సును, సాధించికొనుటయో సాధ్యముగాని పని. వారి గతి యేమి? వ్యాసభగవానుఁడు కృపణవత్సలుఁడు. వారు గూడ సద్వ్యక్తిని బొందవలెనని వారి ననుగ్రహించుటకై సర్వవేదసారమైన భారతాఖ్యానమును రచించెను. 25

**శ్రీధరీయము :**

కవిః జైమినిః—జైమిని మహాముని పూర్వ మీమాంసాకర్త. అందుచే నాతనికి 'కవి' యని ప్రత్యేక విశేషణము.

సుమంతు ర్దారుణోమునిః—అథర్వణవేదమందున్న యాభిచారిక క్రియలన్నియు నభ్యసించినవాఁడు. అందుచే సుమంతునకు దారుణః అని విశేషణము.

ద్విజబంధూనాం = ద్విజు లనఁగా రెండు జన్మలు గలవారు. ఉపనయనమునకు ముందొక జన్మ. కర్మాధికార మేర్పడిన తర్వాత మఱియొకజన్మ. బ్రహ్మక్షత్రియ వైశ్యులు. కనుక ద్విజబంధు లనఁగా త్రైవర్ణికాధములు.

**వంశీధరుఁడు :**

కవిః—సూక్ష్మదర్శియైనవాఁడు, వైశంపాయన ఏవ—ఇచ్చట ఏవకారము మనుష్యులను యజుర్వేదము దానొక్కఁడుగా మొట్ట మొదట నభ్యసింపఁజేసినవాఁడని యర్థము. దేవతలందు సూర్యుఁడు వ్యాపింపఁ జేసినట్లు.

ఇతిహాసపురాణానాం—

ఆర్షాది బహుదాఖ్యానం దేవర్షి చరితాశ్రయమ్,
ఇతిహాసమితి ప్రోక్తం భవిష్యద్భూత ధర్మయుక్.

ఇతిహాస:మనుటకు పైఁజెప్పిన దొకలక్షణము. వేఱొకలక్షణమును గద్దు.

ధర్మార్థ కామమోక్షాణా ముపదేశసమన్వితమ్,
పూర్వవృత్త కథాయుక్త మితిహాసం ప్రచక్షతే.

అని మఱియొక లక్షణము. పురాణమనఁగా మఱియొక లక్షణ మిది.

వర్ణ్యంతే యత్ర సర్గాద్యాః పంచవా దశవా చ తత్,
పురాణం ప్రోచ్యతే వేదాఽఖిలార్థానాం ప్రపూరణమ్.

(విష్ణుపురాణ టీక)

రాధారమణదాస గోస్వామి విరచితదీపనీ వ్యాఖ్య:

అధ్యేతవ్యం నచాన్యేన బ్రాహ్మణం క్షత్రియం వినా.

అని పురాణవచనము. మఱి సూతున కధ్యాపనాధికార మె ట్లేర్పడి నది? అధ్యయనాధికార మెట్లు వచ్చినది? రోమహర్షణుఁడు భగవ దవతారము. కూర్మపురాణము త్రయోదశాధ్యాయమున నిట్లున్నది-

వేణుపుత్రస్య వితతే పురా పైతామహే మఖే,
సూతః పౌరాణికో జజ్ఞే, మాయారూప స్స్వయం హరిః.

ప్రవక్తా సర్వశాస్త్రాణాం ధర్మజ్ఞో గుణవత్సలః,
తం మాం విత్త ! మునిశ్రేష్ఠాః ! పూర్వోద్భూతం సనాతనమ్.

ఏతస్మిన్నంతరే వ్యాసః, కృష్ణద్వైపాయన స్స్వయమ్,
శ్రావయామాస సంప్రీత్యా పురాణం పురుషోత్తమః.

మదన్వయే చ యే సూతాః, సంభూతా వేదవర్జితాః,
తేషాం పురాణ వక్తృత్వం, వృత్తిరాసీ దజాజ్ఞయా.

వీరరాఘవీయము:

దారుణః సుమంతః - అనుదానికి దరుణః పుత్రః దారుణిః అని వ్యాఖ్యానము.

విజయధ్వజము:

అప: ఋగ్వేదాదులకుఁ బ్రవర్తకులైన వేదవ్యాసుల శిష్యు లను గూర్చి చెప్పుచున్నాఁడు-

తత్రేతి పైఁ జెప్పిన వేదములమధ్యలో, ఋగ్వేదధరః పైలః జైమినిః - జైమినఋషి పుత్త్రుఁడైన జైమిని, సామగః = శిష్యులందు సామవేదమును బ్రచార మొనర్చువాఁడుగా, అసిత = అయ్యెను, కవిః-సూక్ష్మజ్ఞానియైన, తతః-జైమిని తరువాత, ఏకః-ప్రధానుఁ డైన, వైశంపాయన ఏవ - వైశంపాయన ఋషియే, యజుషాం =

యజుర్వేదమంత్రములందు, నిష్ణాతః = సమర్థుఁడు, వైశంపాయన ఏవ = వైశంపాయనుఁడే, ఏకః నిష్ణాతః = ముఖ్యముగా పారంగతుఁడు, తతః = అతని యనంతరము సూర్యుఁడు మొదలగువారును పారంగతులైరి. వారుణః మునిః = వరుణుని కుమారుఁడును, మననశీలుఁడును నైన, సుమంతుః = సుమంతుఁడు, అథర్వాంగిరసాం = అథర్వవేదమంత్రములకు, ఆసీత్ = ప్రవర్తకుఁ డయ్యెను. మే పితా రోమహర్షణః ఇతిహాసపురాణానా మాసీత్ = నా తండ్రి రోమహర్షణుఁడు ఇతిహాసపురాణముల ప్రవర్తకుఁడుగా నయ్యెను.

విశేషములు: ఇతిహాసపురాణములు పంచమవేదములు. వేదవ్యాస రచితములైన ఈ గ్రంథము లెట్లు ప్రమాణములైనవి? అను సందేహము పరిహృతమైనది. 'ఇతిహాసపురాణః పంచమో వేదానాం వేదః' అనెడు శ్రుతివాక్యము గూడ దీనికిఁ బ్రమాణము.

తాత్పర్యము: పైలఋషి ఋగ్వేదమును బ్రవర్తింపఁ జేసెను. జైమిన కుమారుఁడు జైమిని సామవేద ప్రవక్త. యజుర్వేద నిష్ణాతుఁడు వైశంపాయనుఁడు. తర్వాత సూర్యదేవుఁడును యజుర్వేద ప్రవర్తకుఁ డయ్యెను. వరుణుని కుమారుఁడైన సుమంతుఁడు అథర్వణ వేదమును బ్రసిద్ధిపఱచెను. నా తండ్రియైన రోమహర్షణుఁడు భారతాది ఇతిహాసములను గడ్డకు తెచ్చెను. విజయధ్వజుఁడు 'యజుషాం మునే' అను పాఠమునకు బదులు 'యజుషాం తతః' అనుపాఠమును స్వీకరించెను. 'సుమంతు ర్వారుణో మునిః' అని వీరి పాఠము.

అవ: వేదవ్యాసుల యాజ్ఞతో నాల్గువేదముల శాఖోపశాఖా భేదములను వారి శిష్యప్రశిష్యులైన మునులు చేసిరని చెప్పుచున్నాఁడు- (ఇంక నే విశేషములు లేవు).

అవ: ఈ రీతిగా విభాగించుటకు వ్యాసుఁడే ముఖ్యకారణమని తెలిపి, వ్యాసపదముయొక్క అన్వర్థతను వ్యాఖ్యానించుచున్నాఁడు-

కృపణ వత్సలః భగవాన్ = త్రికాలజ్ఞానియైన వ్యాసుఁడు, దుర్మేధైః పురుషైః తే ఏవ వేదాః యథాధార్యం తే ఏవం వ్యవస్యత్ అట్లు విభాగ మొనరింపఁ జేసెను. వేదవ్యాసుని యనుజ్ఞలేక అట్లు విభాగించుటకు శిష్యులకు స్వాతంత్ర్యము లేదని తెలియవలెను.

అవ: పైనిఁ జెప్పినట్లు భగవద్భక్తులైన బ్రహ్మ క్షత్రియ వైశ్యులైన మూఁడుజాతులు వేదోక్తమైన కర్మననుష్ఠించి, శుద్ధాంతఃకరణులై శ్రీహరిని సేవించి, దానిచేఁ బ్రాప్తమైన జ్ఞానముతో తదనుగ్రహము సంపాదించి ముక్తులు గావచ్చును. అట్లే వేదమునం దధికారములేని స్త్రీలు, శూద్రులు మొదలైనవారు శ్రీహరిని సేవించి ముక్తు లయ్యేడి ఉపాయమును వ్యాసభగవానుఁడు చెల్పలేదేమి? యనుటు కుత్తరమును జెప్పుచున్నాఁడు-

కర్మశ్రేయసి = వేదోక్తములైన యజ్ఞ యాగాది కర్మ లనెడు శ్రేయస్సాధనములందు, మూఢానాం=జ్ఞానరహితులైన, స్త్రీ శూద్ర ద్విజ బంధూనాం= స్త్రీలు శూద్రులు ఆచారరహితులైన బ్రాహ్మణాధములు మున్నగు వారికి, త్రయీ న శ్రుతిగోచరా ఇతి = వేదములు వినరాదు అనెడు కారణమువలన, ఏవం = మ ।దచిత భాగవతాదులందుఁ జెప్పినట్లు కీర్తించినచో, ఇహ = ఈ జనులకు, శ్రేయః = మోక్షము, భవేత్ = అగును అని, మునినా = త్రికాలజ్ఞానియైన వేదవ్యాసునిచేత, భారతమాఖ్యానం = భారతమనెడు నితిహాసము, తక్కిన పురాణములు, కృతం = చేయఁబడినది.

విశేషార్థములు: వేదశ్రవణాధికారము లేని స్త్రీలు, శూద్రులు ఆచారహీనులగు త్రైవర్ణికులు వీరికొఱకై, భారతాదులు రచింపఁబడినవి అగుటచేత వారే వాని కధికారులని తెలియరాదు. 'ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్' అను వచనానుసారము వేదార్థమును దెలియవలసినచో విప్రులును భారతాదుల నభ్యసింప

వలసినదే. కనుక సత్తములకు వేదములందును, భారతాదులందుఁ గూడ నధికారము. స్త్రీ శూద్రాదులకు భారతోక్త కర్మానుష్ఠాన మొనర్చి మోక్షమును బడయు నధికారము. అందుకే భాగవతమందు మహర్షి ఏవకారమును ప్రయోగింపలేదు. ఈ విషయమునే మధ్వాచార్యులు సప్రమాణముగ నిరూపించి యున్నారు.

భారతం బ్రాహ్మణాదీనం వేదార్థపరివిత్తయే,
త ఏవ వేదాస్త్వన్యేషాం వర్తేత్తత్కస్యచిత్సుఖమ్.

(స్కాందపురాణము)

వేదార్థజ్ఞానమునకై భారతాది పురాణములు విప్రులకుఁ గూడ నావశ్యకములే. ఇతరుల కవే వేదస్థానీయములై యుండును. కనుక మోక్షము గావలెనన్నచో నెవ్వనికిఁ గాని భారతాదుల నుపేక్షసేయఁ జెల్లదు.

ఏవం ప్రవృత్తస్య సదా భూతానాం శ్రేయసి ద్విజాః,
సర్వాత్మకే నాపి యదా నాఽతుష్యద్ధృదయం తతః. 26

ద్విజాః_ఓ బ్రాహ్మణులారా! ఏవం=ఈ ప్రకారము, సదా=ఎల్లప్పుడు, భూతానాం=ప్రాణులయొక్క, శ్రేయసి=శ్రేయస్సునందు, సర్వాత్మకే నాపి=త్రికరణ పూర్వకముగా, ప్రవృత్తస్య హృదయం=ప్రవర్తించిన వ్యాసునియొక్క మనస్సు, యదా న అతుష్యత్=ఎప్పుడు సంతోషపడలేదో,

బ్రాహ్మణులారా! ఇట్లు సమస్త భూతానుకంపి వ్యాసుఁడు. అతఁ డెల్లప్పుడును జనులయుద్ధతికై మార్గముల నన్వేషించుచుఁ ద్రికరణశుద్ధిగఁ బరిశ్రమించుచుండెను. ఐనను అతని హృదయము శాంతిని బొందలేదు.

నాఽతి ప్రసీదద్ధృదయః, సరస్వత్యాస్తటే శుచౌ,
వితర్కయన్ వివిక్తస్థః, ఇదం ప్రోవాచ ధర్మవిత్. 27

నాఽతిప్రసీదద్ధృదయః = ఎక్కువగాఁ బ్రసాదమును బొందని మనస్సు గలవాఁడై, శుచౌ=శుద్ధమైన, సరస్వత్యా స్తటే=సరస్వతీ నదీతీరమందు, వివిక్త స్థః=ఏకాంతమందున్న వాఁడును, వితర్కయన్=ఆలోచించుచున్నవాఁడునునైన, ధర్మవిత్=సమస్తధర్మవేత్తయైన వ్యాసుఁడు, ఇదం=ఇట్లు, ప్రోవాచ=పలికెను, (తలపోసెను).

అది పరిశుద్ధమైన సరస్వతీ నదీతీరము. చిత్తశాంతి చెడిన వ్యాసుఁ డేకాంతిమతియై యుండెను. అతని మనస్సులోఁ బలువిధము లైన యాలోచనలు. సమస్తధర్మవేత్త యాతఁడు,ఐనను శాంతి చిక్క లేదు. తనలోఁ దానిట్లు తలపోసెను.

ధృతవ్రతేన హి మయా, ఛందాంసి గురవో ఽగ్నయః,
మానితా నిర్వ్యళీకేన, గృహీతం చానుశాసనమ్. 28

ధృతవ్రతేన=వ్రతస్థుఁడనైన, మయా=నాచేత, ఛందాంసి=వేదములు, గురవః=గురువులు, అగ్నయః=అగ్నులు, నిర్వ్యళీకేన=నిష్కపటమైన మన స్సుతో, మానితాః=పూజింపఁబడినవి, అనుశాసనం=నియమము, గృహీతంచ= గ్రహింపఁబడినది.

బ్రహ్మచర్యమును గ్రహించిన నేను వేదముల గౌరవించితిని, గురువుల మన్నించితిని. అగ్నుల నుపాసించితిని. వీని నన్నిఁటిని కప టము లేక నిర్వహించితిని. గురువుల యాజ్ఞ నెన్నఁడు నతిక్రమింపక సర్వవిధముల ననుసరించితిని.

భారతవ్యపదేశేన హ్యామ్నాయార్థశ్చ దర్శితః,
దృశ్యతే యత్ర ధర్మాది స్త్రీశూద్రాదిభి రప్యుత. 29

యత్ర=ఏ మహాసంహితయందు, స్త్రీశూద్రాదిభిః=స్త్రీశూద్రులు, వ్రాత్యులు మొదలగువారిచేత, ధర్మాది=ధర్మము మొదలైనది, దృశ్యతే=చూడఁబడుచున్నదో భారతవ్యపదేశేన=భారతమనెడు పేరుతో, ఆమ్నాయార్థః=వేదార్థము, దర్శితశ్చ= ప్రకాశింపఁజేయఁబడినది.

వేదమును దెలిసికొనుటకు యోగ్యతలేని స్త్రీలు శూద్రులు త్రైవర్ణికాధములు మొదలగువారికి, ధర్మాదిపురుషార్థ స్వరూపము చక్కఁగాఁ దెలియవచ్చుటకై భారతాఖ్యానమును రచించి వేదార్థములను జక్కఁగా నిరూపించితిని.

**అథాఽపి బత మే దైహ్యోహ్యాత్మా చైవాత్మనా విభుః,**
**అసంపన్న ఇవా భాతి బ్రహ్మవర్చస్య సత్తమః. 30**

అథాపి=ఐనను, మే=నాయొక్క, దైహ్యః=దేహమందున్న, ఆత్మా=ఆత్మ, విభుః=పరిపూర్ణుఁడును, బ్రహ్మవర్చస్య సత్తమః అపి=బ్రహ్మవర్చస్సుతో శోభించుచున్న వారియందు శ్రేష్ఠుఁడైనను, ఆత్మనా=స్వరూపముతో, అసంపన్న ఇవ=సంయోజన లేనివానివలె, ఆభాతి=కన్పించుచున్నది.

నా జీవాత్మ నిజమునకుఁ బరిపూర్ణుఁడు. వేదాధ్యయనము, శ్రవణము మొదలగు వానితో నేర్పడు తేజస్సుతో శోభించుచున్న వారిలో శ్రేష్ఠుఁడు. కాని పరమాత్మతో నైక్యము లేనివానివలె నసంతృప్తుఁడుగా నున్నాఁడు.

**కిం వా భాగవతాధర్మా, న ప్రాయేణ నిరూపితాః,**
**ప్రియాః పరమహంసానాం త ఏవ హ్యచ్యుత ప్రియాః. 31**

పరమహంసానాం = పరమహంసలైనవారికి, ప్రియాః=ప్రియములైన, భాగవతా ధర్మాః=భాగవతధర్మములు, ప్రాయేణ=ఎక్కువగా, కిం వా న నిరూపితాః = నిరూపింపఁబడని దానివలన నేమో ! (నిరూపింపఁబ డలేదా !) హి=ఎందువలన నవఁగా, త ఏవ=ఆ భాగవత ధర్మములే, అచ్యుత ప్రియాః=భగవంతునకుఁ బ్రియము లైనవి.

అవ: ఆత్మయొక్క అసంతృప్తి కారణమును స్వయముగనే యూహించుచున్నాఁడు-

నేను భాగవతధర్మములను బ్రధానముగా నిరూపింపలేదని తోచుచున్నది. పరమహంసలైన భక్తులు ఆ ధర్మములకే యిష్టపడెదరు.

అవే భగవంతునకుఁ బ్రియములైనవి. ఆ ధర్మ ప్రతిపాదనము పరిపూర్ణముగ నే నొనర్పకుండుటఁ బట్టియే యాత్మప్రసాద మేర్పడలేదు.

**తస్యైవం ఖిలమాత్మానం, మన్యమానస్య ఖిద్యతః,**
**కృష్ణస్య నారదోఽభ్యాగా దాశ్రమం ప్రాగుదాహృతమ్. 32**

ఆత్మానం=ఆత్మను, ఏవం=ఈ ప్రకారము, ఖిలం=తక్కువైన దానినిగా, మన్యమానస్య=తలఁచుచున్నట్టియు, ఖిద్యతః=దుఃఖించుచున్న, తస్య కృష్ణస్య=ఆ వ్యాసమహామునియొక్క, ప్రాగుదాహృతం=ముందు చెప్పఁబడిన, ఆశ్రమం=ఆశ్రమమునుగూర్చి, నారదః=నారదుఁడు, అభ్యగాత్=వచ్చెను.

ఇట్లు వ్యాసుఁడు దన యాత్మయం దపరితోషముతో బాధపడు చుండెను. ఆ సమయమున వ్యాసమహాముని యాశ్రమమునకు నారదుఁ డేతెంచెను.

**తమభిజ్ఞాయ సహసా, ప్రత్యుత్థాయాగతం మునిః,**
**పూజయామాస విధివ, న్నారదం సురపూజితమ్. 33**

మునిః=వ్యాసమహాముని, ఆగతం=దయచేసిన, తం నారదం=ఆ నారదుని, అభిజ్ఞాయ=గమనించి, సహసా=ససంభ్రమముగా, ప్రత్యుత్థాయ=ఎదురేగి, సురపూజితం=దేవవందితుఁడైన నారదుని, విధివత్=విధియుక్తముగా, పూజయామాస=పూజించెను.

ఆశ్రమమున కేగుదెంచిన నారదుని వ్యాసుఁడు గమనించెను. ససంభ్రమముగా నెదుర్కొన్నాఁడు. సురవందితుఁడైన నారదుని విధియుక్తముగాఁ బూజించెను.

**శ్రీధరీయము :**

సర్వాత్మకేనాపి=త్రికరణములతో సాధింపఁబడిన.

నాఽతిప్రసీదద్ధృదయః = న+అతిప్రసీదత్+హృదయం యస్యసః=ఎక్కువగా ప్రసాదమును బొందని హృదయము గలవాఁడై.

'దేహేభవః ఆత్మా జీవః వస్తుతో విభుః పరిపూర్ణ ఏవ ఆత్మాస్వేన రూపేణ' నా జీవాత్మ పరిపూర్ణమైనది. ఐనను, అసంపన్న ఇవ= తాదాత్మ్యమును బొందని దానివలె, ఆభాతి=ప్రకాశించుచున్నది, బ్రహ్మవర్చస్యసత్తమః=వేదశ్రవణ అధ్యాపన ఉత్కృష్టజం తేజః, తత్ర సాధవో బ్రహ్మవర్చస్యాః, వేదశ్రవణాదులతో నేర్పడిన తేజము-దానితో గొప్పవారు.

**విజయధ్వజము :**

అవ: ఏ కారణముతో నెవరిచేత ప్రేరితుఁడై వేదవ్యాస రూపియైన పరమాత్ముఁడు భాగవత మహాపురాణమును రచించెను? అనెడు శౌనకుని ప్రశ్న కుత్తరమిచ్చుచు నవతారకార్యక్రమమును ప్రాయశః= సమస్తమును జేసినను దుర్జనులకు మోహము గొల్పుటకై వేదవ్యాస రూపిగూడ సామాన్యజనునివలె నటించెనని, యీ ప్రకారము చెప్పు చున్నాఁడు.

హేద్విజాః! భూతానాం=ముక్తియోగ్య జీవులయొక్క, సదా శ్రేయసి=నిత్యమైన ముక్తికి, సాధనము సూచించుటయందు ప్రవృత్త స్యాపి=కడఁగినవాఁడైనను, యదా=ఎప్పుడు, హృదయం=మనస్సు సర్వాత్మకేన=' నా యవతార మందొనర్పవలసిన సమస్తకార్యములను జేసి ముగించితి నను భావనయందు, నాఽతుష్యత్=తృప్తిఁ బొందక పోయెనో! (ఇంకను జేయవలసిన కార్య మేదియు మిగుల లేదనెడు భావమును బొందలేదో!) తదా=అప్పుడు.

తాత్పర్యము: ఇట్లు తన యవతారకార్యమును కొంచెము తక్కువగా ముగించిన వేదవ్యాసరూపియగు శ్రీహరి దుష్టజనమోహ నార్థమై సామాన్య జనులవలె నటించుచు వచ్చెను. శౌనకాదులారా! సజ్జనులకు ముక్తిసాధనమును జూపించి, వారి కనుకూలముగనుండు టయే యెల్లకాలములందును మధుసూదనుని కార్యము. వేదవ్యాస రూపియైన పరమాత్మ వేదవిభాగము, భారతాది పురాణ రచన వీనిని

ముగించినను అతని మనస్సునకుఁ దృప్తి యేర్పడ లేదు. ఇంకను గ్రంథరచన మావశ్యకమని తలఁచెను. అందుచేతనే సర్వాత్మనా హృదయము తృప్తము గాలేదు.

ధర్మవిత్ = 1. సమస్త ధర్మవేదియైన, 2. అతీంద్రియములైన పదార్థములను జూచెడు, నాతిప్రసన్నహృదయః = సంపూర్ణముగాఁ దన యవతార కార్యము ముగిసినదను తృప్తి యేర్పడని, వ్యాస రూపియైన శ్రీహరి, శుచౌ సరస్వత్యాః తటే వివిక్తస్థ వితర్కయన్ = తన మనస్సుయొక్క అతృప్తికి గారణ మేమని లోకజనులవలె ననేక రీతులఁ దలపోయుచున్న వాఁడై, ఇదం = పైఁ జెప్పఁబడు రీతితో, ప్రోవాచ = తలపోసెను.

తాత్పర్యము : వ్యాసుఁడు సమస్త ధర్మవేది. అతనికిఁ దెలియని అతీంద్రియ వస్తువే లేదు. ఇట్లు పరిపూర్ణుఁడైన శ్రీహరి సామాన్య జనులవలెఁ 'దన మనస్సునం దతృప్తి గలదని దానికిఁ గారణమే' మని అనేకరీతులఁ దలపోయుచున్నవానివలెఁ గన్పించును. సరస్వతీ తీరమందు శుద్ధమైన యొక ప్రదేశము. జనరహితమైన ఏకాంతము. అట్టి స్థలమున నుపవిష్టుఁడై సామాన్యునివలె నిట్లాలోచించెను.

ధృతవ్రతేన = లోకజనుల కాచారమును శిక్షింపవలెనని వేదోక్తములైన వ్రతముల నాచరించిన, మయా నిర్వ్యళీకేన, ఛందాంసి గురవః = అధ్యయన మాచరింపఁజేసిన గురువులు, అగ్నయః = అహావనీయ-గార్హపత్య-దక్షిణాగ్నులను మూఁడగ్నులు, మానితాః = గౌరవింపఁ బడినవి, అనుశాసనం = గురువుల యాజ్ఞయును, గృహీతం హి = అనుసరింపఁ బడినదియు. ఇక్కడ సర్వజ్ఞుఁడు స్వతంత్రుఁడు నైన శ్రీహరిగూడ, 'యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః' అనునట్లు లోకసంగ్రహమునకే యాచారము ననుసరించి చూపించిరని తెలియవలెను. పరిపూర్ణుఁడైన శ్రీహరికిఁ గర్మానుష్ఠానముతో నేమియుఁ

ప్రయోజనము లేదు. లోకశిక్షకే యాచరణ. అట్లే యపరోక్షజ్ఞానులు గూడ వేదవ్రతాది వైదికధర్మములను అనుసరింపవలెనని సూచించుట యైనది.

తాత్పర్యము: పెద్దవారైన శిష్టు లెట్లు వర్తింతురో, సామాన్యులు వారి ననుసరింతురు. కనుక సామాన్యుల కాదర్శమైన రీతిలో సంప్రతిపన్నులు వర్తింపవలెను. ఈ కారణముతోనే నేను వేదోక్తములైన సమస్త కర్మల ననుష్ఠించితిని. వేదముల నధ్యయన మొనర్చి, వాని యర్థమును దెలిసి యనుష్ఠానమునకుఁ దెచ్చితిని. సర్వజ్ఞుఁడనైనను గురువులచెంత యధ్యయన మొనర్చి వారిని గౌరవముతోఁ జూచి లోకమునకు మార్గదర్శినైతిని. మూఁడగ్నులను సేవించి యజ్ఞయాగాదు లొనర్చితిని. గురువుల యానతి మన్నించితిని. వేదములను వింగడించి శాఖోపశాఖ లొనర్చి, యల్పబుద్ధులకు గూడ నధ్యయనము సాధ్యమగున ట్లొనర్చితిని.

యత్ర స్త్రీశూద్రాదిభి రపి ధర్మః దృశ్యతే భారత వ్యపదేశేన ఆమ్నాయార్థః ప్రదర్శితః హి! చక్కగాఁ జెప్పఁబడినది. దానియందుఁ దెలుపని యర్థమే లేదని భావము.

తాత్పర్యము: వేదములకు సంప్రదాయానుసారమైన యర్థము వచించుచు, మహాభారతము మొదలగు పురాణము లొనర్చితిని. భారతమందు వేదాధికారులైన బ్రాహ్మణులు, వారియందే యనధికారులైన స్త్రీలు, శూద్రులు, అనాచారులైన త్రైవర్ణికులు-వీ రందరికి శ్రేయస్సాధనమైన ధర్మమును విశదముగఁ జూపితిని. దానియందుఁ జెప్పని విషయమే లేదు. ఇట్లు అనుష్ఠింపవలసిన సమస్తధర్మములను ఆ యా యధికారులకుఁ దెల్పుటయే నా యవతార ముఖ్యకార్యము.

అథాఽపి నః దైహ్యాః=దేహాత్మకమైన, ఆత్మనా=స్వరూపము చేతనే, విభుః=వ్యాప్తమైన, బ్రహ్మవర్చస్య సత్తమః=అధ్యయనమును

ముగించి బ్రహ్మతేజస్సు గలవారని మన్నింపఁబడిన వారిలో శ్రేష్ఠ మైన, మే ఆత్మా=నా ఆత్మ, సంపన్న ఇవ=అవతార ప్రయోజనము సంపూర్ణముగ నెరవేర్పఁ బడకుండుటచే ప్రయోజనమును బొందని దానివలె ఆభాతి.

తాత్పర్యము: ఇక్కడ దైహ్యః అను పదమునకు దేహమందున్న జీవుఁడని గాని, ఆత్మనా అసంపన్నః=బ్రహ్మతో నైక్యమును బొందనిదని గాని వ్యాఖ్యాన మొనర్పరాదు. దీనికిఁ బ్రమాణమునే 'హి' అను పదముచే సూచించినాఁడు.

తస్య సర్వావతారేషు న విశేషోస్తి కశ్చన,
దేహిదేహ విభేదశ్చ న పరే విద్యతే క్వచిత్.
సర్వే ఽవతారా వ్యాప్తాశ్చ సర్వే సూక్ష్మశ్చ తత్త్వతః,
ఐశ్వర్య యోగా ద్భగవాన్ క్రీడత్యేవం జనార్దనః.

(మహాసంహిత)

పరమాత్ముని యవతారములలో భేదములేదు. దేహిదేహములకును భేదములేదు. సమస్తావతారములును వ్యాప్తములు, సూక్ష్మములు. ఈ మహాసామర్థ్యము ఐశ్వర్యవంతుఁడైన శ్రీహరికిఁ గ్రీడామాత్రమే. కనుక నవతారరూపియైన వేదవ్యాసరూపమందు ఏ దోషమూహింపరాదు.

తాత్పర్యము: ఇంతఁ జేసినను నా దేహాత్మకమైన యాత్మకుఁ గార్యమంతయు ముగిసినదను దృప్తి యేర్పడలేదు. నా రూపము స్వాభావికముగా సర్వత్ర వ్యాప్తమైనది. సమస్త వేదముల నధ్యయన మొనర్చి బ్రహ్మవర్చస్సును సంపాదించిన వారిలో నావంటి శ్రేష్ఠుఁడు లేఁడు. ఐనను నా యవతార ప్రయోజనము పూర్ణమైనట్లు భాసించుట లేదు. ఏదో కొంత మిగిలియున్నట్లే యున్నది. ఈ యవతారమందొనర్పవలసిన కార్యము నేది విడిచినాను? సమస్తము నొనర్చినట్లే గదా!

అవ: అతృప్తి కారణ మిదియే యుండవచ్చు ననుచున్నాడు-

భాగవతాః-భగవంతునకును, భాగవతులకును సంబంధించిన ధర్మాః=ప్రాయేణ కిం న నిరూపితా వా=పరమహంసానాం ప్రియాః త ఏవ-ఆ పరమహంసలే, అచ్యుతప్రియాః=శ్రీహరికిఁ బ్రీతిపాత్రులు హి=ఈ కారణముతోనే నా మన స్సతృప్తమైనట్లున్నది.

విశేషములు: ప్రాయేణ అనుటతో భారతమందు సమస్త ధర్మము లున్నవి. ఐనను భారతార్థము నెఱుఁగుట కష్టము. మందాధి కారులకై యా ప్రమేయములనే వేఱు గ్రంథమందు వచించు టావ శ్యక మనిపించుచున్నది. మహాభారతమందు సమస్త ప్రమేయములు చెప్పఁబడిన వనుటకుఁ బ్రమాణము.

**యథా తు భారతే దేవో న తథాన్యేషు కేషుచిత్,**
**ఉచ్యతే న తథాఽపీశం జానం త్యజ్ఞా జనార్దనమ్.**

(స్కాందపురాణము)

మహాభారతమందుఁ జెప్పినట్లు దేవునిఁ గూర్చి మఱి ఎచ్చ టను జెప్పలేదు. కాని మందాధికారులు దానిని దెలియలేరు.

తాత్పర్యము: నా యతృప్తి కేదో కారణ ముండవలెను. నేను భారతమందు భగవంతుఁడు భగవద్భక్తి వీని ధర్మములను సమగ్ర ముగా నిరూపించితిని, కాని భారతము చాలకఠినమగు గ్రంథము. మందాధికారు లా ప్రమేయములను దెలియనేరరు. సమస్తాధికారుల కును దగిన మఱియొక్క గ్రంథరచన యావశ్యకము. ఇదే నా యతృప్తికిఁ గారణము.

ఇట్లు వేదవ్యాసరూపియైన శ్రీహరి దలఁచెను. మాధవుఁడు భక్తవత్సలుఁడు. భక్తులకీర్తియే తనకీర్తిగాఁ దలఁచువాఁడు. పరిపూర్ణుఁ డైనవానికిఁ గీర్తి యావశ్యకతయే లేదు, లోకమందు మహాపురుషులు దమకుఁ దెలిసియున్నను దామొక కార్యమందుఁ బ్రవృత్తులు గావలసి

నచో నితరులచేఁ బ్రేరితులయియే ప్రవృత్తు లగుదురు. అట్లే శ్రీహరి గూడ నారదప్రేరితుఁడై భాగవతరచన మొనర్పవలెనని ఇచ్ఛించెను. దీనితో నారదునకును లోకమందు గీర్తి యేర్పడఁ గలదు.

భాగవత మనెడు గ్రంథాంతరమును రచించుటతోనే దన మనస్తృప్తియని వ్యాసరూపియైన హరికిఁ దెలియును. ఐనను మతి యొక ప్రేరణ నపేక్షించెను. నారదుని కత్యుత్తమకీర్తి రావలెనని భక్తవత్సలుఁ డగుటచే యోచించి యాతని రాక నాకాంక్షించెను. అక్కడికి నారదుఁడు గూడ నేతెంచెను.

అవ : ఏవం ఆత్మానం ఖిన్నం మన్యమానస్య ఖిద్యతః తస్య కృష్ణస్య ప్రాగుదాహృతం ఆశ్రమం ప్రతి నారదః అభ్యగాత్. ఖిద్యతః=అతృప్తిపడిన అని యర్థము.

తాత్పర్యము: అతృప్తునివలెఁ దన యాశ్రమమందు వ్యాసుఁడు నారదునకై ప్రతీక్షించుచుండెను. నారదుని బ్రేరేపించు వాఁడును, శ్రీహరియే గదా! హరిచేఁ బ్రేరితుఁడై నారదుఁ డా యాశ్రమమునకు వచ్చెను.

సహసా తం అభిజ్ఞాయ మునిం ప్రత్యుత్థాయ సురపూజితం=తనకన్నను దక్కువైన దేవతలచేత గౌరవింపఁబడునట్టి, నారదం=విధివత్, పూజయామాస=సన్మానించెను. దీనితో శౌనకుల ప్రశ్న కుత్తర మేర్పడెను. సరస్వతీనదీ తీరమందున్న వ్యాసుల యాశ్రమమునకు నారదుఁ డరుదెంచెను. వ్యాసరూపియైన శ్రీహరి నారద ప్రార్థితుఁడై, భగవద్భాగవత ధర్మములను స్పష్టపఱచుచు భాగవత సంహితను రచించెను.

**పోతన్నగారు:**

వచనము: అని యడిగిన శౌనకాదిముని శ్రేష్ఠులకు సూతుం డి ట్లనియె. తృతీయంబైన ద్వాపరయుగంబుఁ దీఱు సమయంబున,

నుపరిచరవసువు వీర్యంబున జన్మించి వాసవి నాఁదగు సత్యవతి యందుఁ బరాశరునికి హారికళం జేసి విజ్ఞానియైన వేదవ్యాసుండు జన్మించి యొక్కనాఁడు బదరికాశ్రమంబున సరస్వతీ జలంబుల స్నానాది కర్మంబులం దీర్చి శుచియై పరులు లేనిచోట నొంటిఁ గూర్చుండి సూర్యోదయవేళ నతీతానాగత వర్తమానజ్ఞుండైన యా ఋషి వ్యక్తంబుగాని వేగంబుగల కాలంబునం జేసి యుగధర్మంబులకు భువి సాంకర్యంబువొందు. యుగయుగంబుల భౌతిక శరీరంబులకు శక్తి సన్నం బగు. పురుషులు నిస్సత్త్వులు ధైర్యశూన్యులు మంద ప్రజ్ఞులల్పాయువులు దుర్బలులు నయ్యెదరు అని తన దివ్యదృష్టిం జూచి, సర్వవర్ణాశ్రమంబులకు హితంబు సేయం దలంచి నలువురు హోతలచేత ననుష్ఠింపఁదగి ప్రజలకు శుద్ధికరంబులయిన వైదిక కర్మంబులగు యజ్ఞంబు లెడతెగకుండు కొఱకు నేకంబైన వేదంబు ఋగ్యజుస్సామాథర్వణంబులను నాలుగు నామంబుల విభాగించి ఇతిహాసపురాణంబు లన్నియుఁ బంచమ వేదంబని పల్కె నందు-

పైలుండు ఋగ్వేద పఠనంబు దొరఁకొనె;
సామంబు జైమిని చదువుచుండె;
యజువు వైశంపాయనాఖ్యుండు గైకొనెఁ
దుది నథర్వము సుమంతుఁడు పఠించె;
నఖిల పురాణేతిహాసముల్ మా తండ్రి
రోమహర్షణుఁడు నిరూఢిఁ దాల్చెఁ;
దమతమ వేద మా తపసులు భాగించి
శిష్యసంఘములకుఁ జెప్పి రంత;

శిష్యు లెల్లరు నాత్మీయ శిష్యజనుల
కంత బహుమార్గములఁ ద్రుంచి యనుమతింపఁ
బెక్కుశాఖలు గలిగి యీ పృథివిలోన
నిగమ మొప్పారె భూసుర నివహమందు.

వ: ఇట్లు మేధావిహీనులైన పురుషులచేత నట్టి వేదంబులు ధరియింపఁబడుచున్నవి. మఱియు దీనవత్సలుండయిన వ్యాసుండు స్త్రీశూద్రులకుఁ ద్విజవర్ణికాధములకు వేదంబులు విన నర్హంబులు గావు గావున మూఢుల కెల్ల మేలగునని భారతాఖ్యానంబు సేసియు న మ్మునిభూతహితంబునందుఁ దన హృదయంబు సంతసింపకున్న సరస్వతీ తటంబున నొంటినుండి హేతువు వితర్కించుచుఁ దనలో నిట్లనియె.

వ్రతధారినై వేదవహ్నిగురుశ్రేణి
మన్నింతు విహితకర్మములఁ గొఱఁత
పడకుండ నడపుదు భారతమిషమునఁ
బలికితి వేదార్థభావమెల్ల
మునుకొని స్త్రీశూద్ర ముఖ్య ధర్మములందుఁ
దెలిపితి, నేఁజెల్ల ! దీనఁజేసి
యాత్మసంతసమంద దాత్మలో నీశుండు
సంతసింపక యున్న జాడదోఁచె

హరికి యోగివరుల కభిలషితంబైన
భాగవతవిధంబుఁ బలుకనైతి
మోసమయ్యెఁ దెలివి మొనయదు మఱచితి
ననుచు వగచుచున్న యవసరమున.

తనచేతి వల్లకీ తంత్రీచయంబున
సతతనారాయణ శబ్దమొప్ప
నానన సంభూత హరిగీతరవసుధా
ధారల యోగీంద్రతతులు సొక్కఁ
గపిల జటా భార కాంతిపుంజంబుల
దిశలు ప్రభాతదీధితి వహింపఁ
దనులగ్న తులసికాదామ గంధంబులు
గగనాంతరాళంబుఁ గప్పికొనఁగ

వచ్చె మింటనుండి వాసవీనందను
కడకు మాటలాడఁ గరుణతోడ
భద్ర విమలకీర్తిపారగుఁ డా రూఢ
నయ విశారదుండు నారదుండు.

కనియెన్ నారదుఁ డంతన్
వినయైక విలాసు నిగమ విభజనవిద్యా
జనితోల్లాసున్ భవదుః
ఖనిరాసున్ గురుమనోవికాసున్ వ్యాసున్.

వ. ఇట్లు నిజాశ్రమంబునకు వచ్చిన నారదు నెఱింగి లేచి వ్యాసుండు వివిధక్రమంబులఁ బూజించిన నతండు లే నగవు నెగడెడి మొగంబుతోడ విపంచికాతంత్రీ వ్రేల మీటుచు ని ట్లనియె.

శౌనకాది మునిశ్రేష్ఠులకుఁ = శౌనకుఁడు మొదలగు గొప్ప మునులకు, తృతీయంబైన ద్వాపరయుగము 'తృతీయే యుగపర్యయే' అని మూలము. 'యుగస్య పర్యయే పరివర్తే చరమభాగే ఇత్యర్థః' అని శ్రీధరుఁడు. దీనికి వంశీధరుఁడు మొదలగువారు భిన్నవ్యాఖ్యానము లొనర్చిరి. వంశీధరుఁడు కృష్ణావతారము వైవస్వతమన్వంతరమందు అష్టావింశతితమ ద్వాపరయుగమందు జరిగినది గనుక నా ద్వాపరమం దని వ్యాఖ్యానించెను. తృతీయే అనుటకు ద్వాపరయుగ సంధ్యాంశ రూప మందని-యతని వ్యాఖ్యానము. పోతన్న శ్రీధరునే యనుస రించినాఁడు. ఉపరిచరవసువు పీర్యంబున జన్మించి-వసువు చేదిదేశపు రాజు. అతఁ డింద్రుని మెప్పించి యొక విమానమును బొంది దాని యందుఁ దిరుగుచుండెను. అందుచే నాతని కుపచరవసు వని పేరు గలిగినది. దీనికి సంబంధించిన కథ సంస్కృత మూలశ్లోకవ్యాఖ్యాన మందుఁ దెల్పితిమి. వాసవినాఁదగు సత్యవతి యందు = వసువుబిడ్డ యగుటచే వాసవి. పరాశరమహాముని వలన, హరికళంజేసి = హరి యొక్క యంశవలన విజ్ఞానియైన, యోగి-అనుమాట కిది పోతన్న

వ్యాఖ్య. 'ఉపస్పృశ్య' అనుటకు స్నానాది కర్మంబులఁ దీర్చి అని వివరణ. ఒంటిఁగూర్చుండి = ఏకాంతస్థితుఁడై, అతీతానాగతవర్తమాన జ్ఞుఁడైన పరావరజ్ఞః అనుటకుఁ బోతన్న రచన. మూఁడుకాలములను దెలిసినవాఁడు వ్యాసుఁడు ఆ ఋషి. 'ఋగతౌ' అని ధాతువు. గత్యర్థములకు జ్ఞానార్థకత్వ మంగీకృతము. అందుచే ఋషి యనఁగా సర్వమును దెలిసినవాఁడు. మూలమందలి ఈ శబ్దము ఉచితజ్ఞుఁడైన పోతన్న అట్లే పెట్టెను. వ్యక్తంబుగాని ..... .... కాలంబునం జేసి = కాలముయొక్క వేగము గమనింపలేము. క్షణక్షణము నది గదలి పోవుచుండును. కాలంబునం జేసి యనఁగా కాలమువలన అని యర్థము. కాల మనఁగా నేమి? వైశేషికులు కాలమును ద్రవ్యము లలోఁ జేర్చిరి.

'పృథివ్యాప స్తేజో వాయురాకాశం కాలోదిగాత్మా మన ఇతి నవ ద్రవ్యాణి' వారి సిద్ధాంతములో తొమ్మిది ద్రవ్యములు. రావ ణుఁడు గూడ వైశేషికమర్మజ్ఞుఁడుగాఁ గనుపించుచున్నాఁడు. బ్రహ్మ సూత్ర శాంకరభాష్యటీక రత్నప్రభలో రావణభాష్యముయొక్క చర్చ యున్నది (2.2.11 సూ.). కాని ఆ భాష్య మిప్పుడు లభించుటలేదు. రావణుఁడు కాలమును గట్టివేసియుండెనని కొన్నికథలు; దీని భావా ర్థము కాలమర్మమును దెలిసినవాఁడని. కాలమర్మమును దెలిసిన వాఁడు గనుకనే యాతనికి మహాకాల స్వరూపుఁడుగా రాముఁడు దర్శన మొసఁగెనని తదభిజ్ఞు లందురు. కాలము ద్రవ్యమని యంగీక రించినపుడు గుణసంపర్కమున్న దనవలెను. ఏ దేని యొకగుణము లేని ద్రవ్య మెక్కడఁ గూడ నుండదు. కనుక కాలము గుణముల కాధారము. వైశేషికుల సిద్ధాంతము ననుసరించి కాలద్రవ్య వివేచన మిట్లు సాఁగును. 'రావణుఁడు నశించెను', గోధూళిసమయ మగు చున్నది. 'ధర్మసంస్థాపన మేర్పడఁబోవును' ఈ వాక్యములచేఁ ద్రికాల జ్ఞానము-కాలద్రవ్యముయొక్క సహాయముచేతనే యేర్పడుచున్నది.

కాల మనెడు ద్రవ్యము లేనిది, త్రికాలముల వింగడింపు దేనినిబట్టి చేయవలెను? వేదాంతులు దీని నంగీకరింపరు. కాలముయొక్క రూప గుణస్వభావము లవ్యక్తములని వా రందురు. పంచభూతములలోఁ గాలము చేరదు. రూప రస గంధ స్పర్శలు దీనికి లేవు. గనుక నిది యతీంద్రియము. సంకల్ప వికల్పము లొనర్చుట మనస్సుయొక్క స్వభావము. అవియును దీనికి లేవు. ఆలోచించి నిశ్చయించుట బుద్ధిగుణము. అదిగూడ దీనికి సున్న. స్మరణ విస్మరణములు చిత్తమున కున్నవి. దీనికి లేవు. అహంజ్ఞానము జీవస్వభావము. అది లేనిది కాలము. జీవుఁడు భగవంతుని పరిచ్ఛిన్న లీలాప్రయోజనార్థమై కాలసీమకు లోఁబడి యభివ్యక్తుఁ డగుచున్నాఁడు. జీవునకు అసీమమైన కాలమునకు సంబంధించిన జ్ఞానము లేదు. త్రిగుణాత్మకమైన యభివ్యక్తి సర్వమును గాలమునకు లోఁబడినదే. సృష్ట్యాదులు గాలాపేక్షతో నేర్పడునవి. కనుక కాలము త్రిగుణాతీతమైనది. సత్త్వ గుణ స్వభావములైన జ్ఞాన, శాంతి, త్యాగ, దయాప్రేమాదులు గాలమునకు లేవు. రజోగుణమైన కామనాకర్మ భోగేచ్ఛ యిందులేదు. తమోగుణస్వభావములైన నిద్రాతంద్రాదులు శూన్యము. మఱి కాల మనఁగా నేమి? కాలము త్రిగుణాతీత మంటిమి. ఆత్మగూడ నట్టిదే. మఱి కాలమే యాత్మ యగునా? ఆత్మ యజన్మ. కాలము గూడ నట్టిదే. కాలసీమయందే సమస్తమును జన్మించుచున్నది. అది స్వయముగా జన్మలేనిదై సమస్తముల జన్మాదులను సిద్ధమొనర్చును. సమస్త సృష్టియుఁ గాలమందే యుత్పన్న మగుచున్నది. ఆత్మవలెనే కాలము నమరము. ఎందు కనఁగా సర్వమున కవధి యదియే. దాని యవధియందే సమస్తమును చివరిదశను బ్రాప్తించుచున్నవి. కాలమే సమస్తముయొక్క మృత్యువును సిద్ధపఱచుచున్నది. ఆత్మ యజరము. కాలము నట్టిదే. అది యజరమై సమస్తమును జర మొనర్చును. ఆత్మవలెనే కాలమును సర్వవ్యాపకము. ఎందుకనఁగాఁ బరమాణువు నుండి మహత్తువరకుఁ గాలము సదా యుండనే యున్నది.

ప్రత్యణువునను వ్యాపించియున్నది. ఏ పరమాణువుగూడ నవధిరహితము గాదు. అన్నిటియందు వ్యాపించినను ఆత్మ యసంగము. కాలముగూడ నట్లే. అది నిర్లిప్తము. దానికి శత్రుమిత్రులు లేరు, బంధువులు లేరు. స్వపరభేదము లేదు. ఆత్మ సమము. కాలమును సమమే. దానికి ధర్మమందుఁ బక్షపాతము, అధర్మమందు ద్వేషమును లేదు. దాని యొడిలో ధర్మాధర్మములు రెండును గవలపిల్లలవలె నాడుకొనుచుండును. కృత త్రేతా ద్వాపరములుగా వికసించును. ఆత్మవలెనే కాలమును నిత్యము. అది నిత్యమై సర్వము ననిత్యము నొనర్చుచుండును. అది యపరిచ్ఛిన్నము. ఆత్మయు నంతే. కాలము తన వర్తమానతలో సర్వముయొక్క పరిచ్ఛిన్నతను సిద్ధ మొనర్చును. ఆత్మ అసీమము. కాలము నంతే: అది యసీమమై సర్వమునకును హద్దు తీర్చుచును. ఆత్మవలెనే కాలము నజ్ఞేయము. కాల మనంతము. ఆత్మయు ననంతము. ఆత్మయు కాలమును అనాదులు. సమస్తముయొక్క మొదలును కాలమునందే యున్నది. ఆత్మవలెనే యది యప్రమేయము. కాలము స్వయముగా నప్రమాణిత మగుచు, నితరములను ప్రమాణములుగా నొనర్చును. మఱి కాలము, ఆత్మ రెండు నొకటేనా? ఈ గుణములతోఁ బోల్చినచో నొకటే యనవలెను. కాని భేదధర్మములు గొన్ని యున్నవి.

**ఆత్మస్వయంప్రకాశము:**

తన ప్రకాశముతో నది ఇతరములఁ బ్రకాశమొనర్చును. ఆత్మ చేతనయే యాత్మప్రకాశము; అచేతన బుద్ధియందుఁ బ్రవేశించి దానిని ప్రకాశ మొనర్చును. ఇట్లు మనస్సు, చిత్తము, ఇంద్రియములు, శరీరము అన్నిటిని బ్రకాశ మొనర్చును. మఱల వీనిమూలముననే సమస్త జగత్తును బ్రకాశితముఁ జేయును. అనఁగా నన్నింటియొక్క యస్తిత్వమును సిద్ధ మొనర్చును. ఈ యాత్మప్రకాశము లేనిది బుద్ధి నిశ్చయాదుల నొనర్పలేదు. చిత్తము స్మృతిలబ్ధి నందఁజాలదు. మనస్స

సంకల్పవికల్పవిహీన మగును. తక్కిన ఇంద్రియములు గూడ నింతే. ఆత్మయొక్క చేతనప్రకాశముతో చైతన్యమునందియే సమస్తమును గర్మశీల మగుచున్నది. కాలముగూడ నిట్లు స్వయంప్రకాశ మేనా? అదియును నిట్లే. బుద్ధి, మనస్సు, చిత్తము, ఇంద్రియములు, శరీరము సమస్త జగత్తు వీనికి చైతన్యమును గల్గించునా?

దాని కా శక్తి లేదు. ఇది మొదటి విభేదక ధర్మము. ఆత్మ సర్వశక్తిమంతము. అది యొకానొక పిండమునకు శక్తి నొసఁగినట్లే సమస్త బ్రహ్మాండమునకు నొసఁగును. కాలమిట్లు సర్వశక్తిమంతము గాదు. దాని ప్రయోజనము కాలగణనవఱకే. ఈ కాలము ఆత్మశక్తి మూలముననే గతిశీల మగుచున్నది. ఆత్మమూలముననే ప్రమాణమగు చున్నది. ఇట్టి శక్తిని కాలమున కెవ రిచ్చిరి? ఆత్మ జ్ఞానస్వరూపము. అనుభవస్వరూపము. కాలమట్టిదిగాదు. స్వప్రకాశముగాని స్వశక్తిగాని లేని జ్ఞానస్వరూపము అనుభవస్వరూపము గాలేదు గదా? కాలముతో నాత్మప్రమాణితము గాలేదు. ఆత్మమూలముననే కాలము ప్రమాణిత మగుచున్నది. ఆత్మ కాలము నెఱుఁగఁ గలదు. కాల మాత్మ నెఱుఁగ లేదు. కనుక కాల మొక యచేతనతత్త్వము. ఆత్మ చేతనతత్త్వము. అచేతనతత్త్వము చేతనతత్త్వము చేతనే ప్రమాణిత మగుచున్నది. కాలము భగవంతుని నుండియే శక్తిను బొందినది. సంసారమును భయభీత మొనర్చుచున్నది. ఇది యాత్మపైఁ దన యధికారమును నెఱపలేదు. పరమాణువునుండి బ్రహ్మవఱకు జగత్తు వ్యాపించి ఉన్నది. ఇదియంతయుఁ గాలముచే నిర్మితమూ లేక దీనికన్నను భిన్నమైన తత్త్వము జగన్నిర్మాణమునకుఁ గారణమా! ఈ సమస్త సృష్టికిని మొదటికారణము 'ఏకోఽహం బహుస్యాం' అనెడు పరమాత్ముని యాదిసంకల్పము. ఈ సంకల్పముచే నే యే తత్త్వము లుత్పన్నము లైనవో సీ క్రింద వివరింపఁబడినవి. 1. ఆదియిచ్ఛ, 2. సీతిశక్తి, 3. దేశము, 4. కాలము, 5. గతి, 6. త్రిగుణములు, 7. అహంకారము.

8. పంచభూతములు, 9. సంఖ్య, 10. జీవుఁడు- ఇవి భగవంతుని లీలకు సదస్యములు. అతని యాది సంకల్పములో నొక్కఁ డనేకములు గావలెనను ధారణయున్నది. నీతిశక్తియే యోగమాయ. ఇది పరమాత్మని ఇచ్ఛ ననుసరించి రంగమును దయారొనర్చును. 3. అనంత లీలకొఱకు యోగమాయ లోక పరలోకములఁ దయా రొనర్చును. ఇదే దేశాపేక్ష, 4. ఎప్పటినుండి యెంతవఱకు లీల సాగవలెను? ఇది కాలాపేక్ష, 5. లీలకుఁ గ్రియాత్మకరూప మొసఁగుటకు గతియొక్క యపేక్ష యున్నది. ఇదే క్రియాశక్తి, 6. అనేక విధములైన లీలల కొఱకు నానాభావముల యపేక్షయున్నది. ఆ భావములు త్రిగుణాత్మకరూపముతో నొక యహంకారముగా నిద్రితములై యుండును. వానిని జాగృత మొనర్చుటకు కాలగతి యపేక్ష గలదు, 7. గతిని బొంది జాగృతములైన గుణములు, ఒక యహంకారమునుండి గుణభేదముతో మూఁడుగా నగుచున్నవి. సాత్త్వక, రాజస, తామసాహంకారములు, 8. తామసాహంకారముయొక్క పరిణామములు పంచభూతములు, పాంచభౌతిక పదార్థములు, శరీరనిర్మాణము. రాజసాహంకార పరిణామము ఇంద్రియములు. ప్రాణములు సాత్త్వికాహంకారపరిణామము. అంతఃకరణ చతుష్టయము-మనస్సు,బుద్ధి,చిత్తము, అహంకారము, 9. పాంచభౌతిక పదార్థములు. శరీరములు త్రిగుణాత్మకములైన యనేక భావములు. వీని తారతమ్యముతోనే యనేక ఘటన లేర్పడుచున్నవి. ఈ ఘటనలు శరీరములు పదార్థములు వీని నిర్ణయమునకే సంఖ్యయొక్క యపేక్ష. 10. ఈ యన్నిప్రకారములైన శరీరములు పదార్థములు వీనియందు మమతాబుద్ధి, అహంబుద్ధి, గల్గియుండుట జీవుని యపేక్ష. ఇవన్నియు నాదిసంకల్పముయొక్క పరిణామములు, కేవల కాలపరిణామములుగావు. కాలముపని యవధి నిర్ణయమువఱకే. అదిగూడ ననాత్మతత్త్వములు, పదార్థములు, శరీరములు-వీనికి సంబంధించినంత వఱకే. సర్వమునకును లోన వెలుపల వ్యాపించియున్న యాత్మకు సంబంధించి గాదు. తక్కిన పనులు

తక్కినవి చేయును. యోగమాయ దేశ, దిక్, త్రిగుణ, గతి-వీని స్వరూప మవ్యక్తము, అట్లే, కాలస్వరూపము గూడ నిరాకారము, అవ్యక్తము. కనుక కాలప్రయోజనము అవధి నిర్ణయమువఱకే. ఇది సమస్తమునకును గర్తయు ధర్తయుం గాదు. దీని యవ్యక్తస్వరూపమును మనమే సాకారముగ ననుభవించుచున్నాము. ఎట్లు? ఘటనలమూలమున. 'తెల్లవారినది'. పక్షులు గూయనిచో సూర్యోదయము గానిచో మనము తెల్లవారెనని చెప్పలేము. ఈ ఘటనలే కాలము వ్యతీతమైనదని తెల్పును. ఇప్పుడు, రేపు, రెండు గంటలు, పది దినములు-ఇవన్నియు సమయమును గొల్చుట కాధారములు. ఇవన్నియును ఘటనలే. శుక్ల కృష్ణపక్షములు-అయనములు, సంవత్సరములు, మన్వంతరములు, యుగములు, కల్పములు - ఇవన్నియు ఘటనలే. వీనితోనే కాలమును గొల్తుము. ఘటనలు పదార్థములు, శరీరములు, ఋతు సంవత్సరములు, యుగకల్ప పరివర్తనములు. ఇవియే కాలముయొక్క యాకారములు. ఇవియే కాలరూపములు. వాస్తవమునకుం గాలము నిరాకారము.

గుణవ్యతికరాకారో నిర్విశేషోఽప్రతిష్ఠితః,
పురుష స్తదుపాదాన మాత్మానం లీలయాఽసృజత్.
(శ్రీమద్భాగవతము. 3వ స్కం. 10 శ్లో.)

విశ్వం వై బ్రహ్మతన్మాత్రం సంస్థితం విష్ణుమాయయా,
ఈశ్వరేణ పరిచ్ఛిన్నం కాలేనావ్యక్తమూర్తినా.
(శ్రీమద్భాగవతము. 11వ స్కం. 12వ శ్లో.)

త్రిగుణాత్మకములైన పదార్థములయొక్క రూపాంతరమే కాలస్వరూపము. స్వయముగా కాలము నిర్విశేషము; అప్రమాణము. దీని నిమిత్తముగాం జేసికొని భగవంతుఁడు దన్ను పరిచ్ఛిన్నమూర్తిగా వ్యక్తమొనర్చికొనెను. అవ్యక్తమైన ఆత్మ యనేక జీవాత్మలుగా విభక్తమైనట్లు ఒక్క ఆదిసంకల్పము అనేకసంకల్పములుగా మాఱినట్లు, ఒక

దేశమే యనేక దేశములైనట్లు, ఒకయిచ్ఛయే అనేకేచ్ఛలుగా నైనట్లు ఒక బుద్ధి యనేక బుద్ధులుగా, ఒక మన స్సనేక మనస్సులుగా విభక్త మైనది. ఒక విరాట్స్వరూపమే యనేక శరీరములుగా విభజింపఁబడినది. అట్లే, కాలమును పరమాణువు నుండి మహత్తువఱకు ననేకములుగా విభక్తమైనది. పృథివియొక్క సూక్ష్మతమమైన యంశమేదో, దేనిని విభజింప సాధ్యము గాదో అదే పరమాణువు. ఈ పరమాణువు పరమ మహత్తులో అంశము. పరమాణువు సూక్ష్మతమము. దానికి విరుద్ధము మహత్తమము. ఈ కొలతతోనే యవ్యక్తమైన కాలము పరమాణువు నందు పరమాణు రూపముగను, మహత్తునందు మహద్రూపముగను విభక్త మగుచున్నది.

స కాలః పరమాణుర్వై యో భుంక్తే పరమాణుతామ్,
సతో ఽవిశేషభు గ్యస్తు సకాలః పరమో మహాన్.

అర్థము: ఏ కాలము పరమాణువునందు వ్యాప్తమైనదో, అది పరమసూక్ష్మము. సృష్టియొక్క యుత్పత్తినుండి ప్రళయపర్యంతము వ్యాప్తమైన కాలము పరమ మహత్తు. రెండు పరమాణువుల సంయోగముతో నొక యణు వేర్పడును. మూఁ డణువుల చేరిక యొక త్రసరేణువు. గవాక్షమందు సూర్యకిరణములు ప్రవేశించినపుడు త్రసరేణువు లెగురుచుండును. మూఁడు త్రసరేణువులు దాఁటి పోవుటలో సూర్యుఁ డెంతకాలమును దీసికొన్నాఁడో దానికి త్రుటి యని పేరు. నూఱు త్రుటు లొక వేధ. అట్టివి మూఁడు లవము. మూఁడు లవము లొక నిమేషము. మూఁడు నిమేషము లొక క్షణము. ఐదు క్షణము లొక కాష్ఠ. పదునైదు కాష్ఠము లొక లఘువు. పదునైదు లఘువు లొక నాడిక. ఇట్టివి యా ఱొక ప్రహారము. తొమ్మిది ప్రహారములొక్క దినము. పదునైదు దినము లొక పక్షము. రెండుపక్షము లొక నెల. ఇది పితరుల కొక దినము. రెండు మాసము లొక ఋతువు. ఆఱు మాసము లయనము. ఈ రెం డయనములును దేవతల కొక్క దినము.

అనఁగా ఒక్క మానవసంవత్సరము దేవతల కొక దినము. కలియుగము ఆయువు - సంధ్యాసంధ్యాంశ సహితముగా నాల్గులక్షల ముప్పది రెండు వేలు మానవీయ వర్షములు. ద్వాపరయుగము-సంధ్యాసంధ్యాంశ సహితము ఎనిమిది లక్షల ముప్పదినాల్గు వేలు. ఇవియును మానవీయ వర్షములే. పైన నిట్లే చూచికొనవలెను. త్రేతాయుగము పంద్రెండులక్షల తొంబదియాఱు వేలు. సత్యయుగము పదునేడులక్షల ఇరువదిఎనిమిది వేలు. చతుర్యుగముల ప్రమాణము నలువదిమూఁడు లక్షల ఇరువదివేల మానవీయ వర్షములు. చతుర్యుగీ పర్యంతము ఒక మనువు ఆయుఃప్రమాణము. దీనికొక మన్వంతర మని పేరు. ఒక మన్వంతరము తరువాత మహాప్రళయము వచ్చును. మనువు, ఇంద్రుఁడు, దేవతలు, సప్తర్షులు ఈ ప్రళయములో నశింతురు. వేయి చతుర్యుగసంఘము బ్రహ్మ కొక్కదినము. దీని కొక కల్ప మని పేరు. ఈ రీతి బ్రహ్మ కొక్క పగలు 4332000000 × 1000. రాత్రిప్రమాణము గూడ నింతే. కనుక బ్రహ్మయొక్క దినము 8640000000. దీనిని 30తో హెచ్చించినపుడు బ్రహ్మ కొక మాస మగును. దానికి పంద్రెండింతలు చతుర్ముఖున కొక సంవత్సరము. దీని నూఱింతలు బ్రహ్మ ఆయుస్సు. ఈ ఆయుస్సులో నర్ధభాగమునకు పరార్ధ మని పేరు. బ్రహ్మ మొదటి పరార్ధ మిపుడు గతించిపోయినది. రెండవ పరార్ధముయొక్క మొదటిదినము జరుగుచున్నది. ఇప్పుడు జరుగుచున్నది వారాహకల్పము. ఇది రెండవ పరార్ధముయొక్క మొదటి కల్పము. బ్రహ్మ యాయుఃప్రమాణమైన రెండు పరార్ధములకాలము శ్రీమహావిష్ణువుపై నధికారము చెలాయింపలేదు. ఇది కేవలము బ్రహ్మసృష్టి నంతమొనర్చు నంతే. ఈ రీతిగా కాలవిభాగము పరమాణువు మొదలుకొని బ్రహ్మవఱ కున్నది. ఇది 'క్షరబ్రహ్మ'కు సంబంధించిన విభజనము మాత్రమే. ఇంతవఱకు కాలవ్యాపక స్వరూప మున్నది. దీనికి పైన అక్షరబ్రహ్మరాజ్యము. అదే శ్రీమహావిష్ణువు శ్రేష్ఠధామము. భాగవతమున నిట్లు గలదు.

వికారైః సహితో యుక్తైః విశేషాదిభి రావృతః,
అండకోశో బహి రయం పంచాశత్కోటి విస్తృతః.

దశోత్తరాధికైర్యత్ర ప్రవిష్టః పరమాణువత్,
లక్ష్యతేంతర్గతా శ్చాన్యే కోటిశోహ్యండరాశయః.

తదాహు రక్షరం బ్రహ్మ సర్వకారణకారణమ్,
విష్ణోర్ధామ పరం సాక్షా త్పురుషస్య మహాత్మనః.

(భాగవతము 3వ స్కం. 4-11-39 శ్లో.)

ప్రకృతి, మహత్తత్త్వము, అహంకారము, పంచతన్మాత్రలు, ఈ యెనిమిది ప్రకృతులతోఁ బాటు పది ఇంద్రియములు, మనస్సు, పంచభూతములు వెరసి 24. ఈ వికారములతోఁ జేరినదే బ్రహ్మాండము. అక్షరపరబ్రహ్మముతోఁ బోల్చుకొన్నప్పుడు ఈ బ్రహ్మాండ మొక పరమాణువు. ఇట్టివి కోట్లకొలఁది యున్నవి. ఈ యన్నిఁటి కిని గారణ మక్షరబ్రహ్మ. ఇదియే శ్రీహరి దివ్యధామము. సమయ పునరావర్తనమే కాలచక్రము; గతి లేనిది. కాలచక్రము గతిశీలము గాదు గదా! వాస్తవమునకుఁ గాలచక్రమునకు రెండవపేరే కాలగతి. గతి కూడ కాలమువలెనే యొక యసంగతత్త్వము వ్యాపకతత్త్వము. అవ్యక్తతత్త్వము గతి లేనిది. జగత్తునం దే క్రియయును జరుగదు. ఇదియేసమస్తపదార్థములు, జీవులు, తత్త్వములు, లోక-పరలోకములు అన్నిటియందును వ్యాపించియున్నది. సూర్యచంద్రాదులు, తారా గ్రహములు, పృథివీ జలాగ్ని వాయువులు ఇవన్నియు గతిశీలములే. సమస్త జగత్తును గతిశీలమే. అణువణువు, పరమాణువు పరమాణువు జీవనము సర్వము గతిశీలమే. ఇది శ్వాసతోఁ జేరినపుడు శ్వాసగతి యందురు. హృదయముతోఁ జేరినపుడు హృదయగతి యందురు. ఇట్లే రక్తగతి, బుద్ధిగతి, జీవగతి ఇట్లనేక సంజ్ఞలు. కాని గతి యసంగమైనప్పుడు కేవల గతిగనే యుండును. మఱియొక తత్త్వముతోఁ జేరినపుడు ఆ పేరు వహించును. ఇట్టిదే కాలగతి. ఇది లేనిది సమస్త

జగత్తును బురుషార్థహీన మగును. పురుషుని పురుషత్వమును గతియే. శుభకర్మతో మానవునకు స్వర్గము, దుష్కర్మతో నరకము ప్రాప్తించును. గతియే సమస్తమునకును గిలకము. జీవుని బునరావర్తనమునకు జీవగతి యని పేరు. ఈ గతి ఇచ్ఛతోఁ గూడికొన్నప్పుడు ఇచ్ఛాశక్తి యందురు. జ్ఞానముతోఁ గూడినపుడు జ్ఞానగతి యందురు. త్రిగుణ సంయోగముతోఁ ద్రిగుణామయీ శక్తి. పంచభూతసంయోగముతో భౌతికశక్తి. క్రియతోఁ గూడిన క్రియాశక్తి. దీనితోనే సమస్త ప్రపంపము క్రియాశీల మగుచున్నది. ఇదియే భగవంతుని ప్రభావశక్తి; అనఁగా యోగమాయ. ఇది సమస్తమునందును వ్యాపించి సమస్తమును నిర్మించుచున్నది. ఇది గ్రుడ్డిది గాదు. భగవంతుని పూర్ణజ్ఞానముతోఁ గూడిన క్రియాశక్తి. ఇది సమస్త జడ చేతన పదార్థములు, జీవులు—వీని స్వభావముగా విద్యమానము. ఏ భావము మానవుని యందుఁ బలుమా రేర్పడునో దానికే స్వభావ మని పేరు. జగత్తు యొక్క ఉదయాస్తమయములు స్వభావము. ఈ స్వభావము పలుమా రేర్పడుటనే కాల మందురు. ఈ స్వభావచక్రమే కాలముతోఁజేరి కాల కాలచక్ర మనిపించికొనును. కాలము ప్రత్యేక స్వభావమందును, అవధిరూపముగా నుండుచున్నది. సత్యమునకు స్వభావచక్రమే కాల చక్ర మనిపించికొనును. వీనిని మాయాచక్ర మన్నను ఇచ్ఛాచక్ర వాసనాచక్రాది నామములతోఁ బిలిచినను వాస్తవమునకు సమస్తమున కవధి నేర్పఱచు చక్రము. ఈ రీతిగా స్వభావ పునరావర్తనమే సమయపునరావర్తనము. దీనికే కాలచక్ర మని పేరు. శ్వాసోచ్ఛ్వాసములు లోపలకు బయటకుఁ బ్రసరించును. దీని కొక క్రమచక్ర మున్నది, కాలము శ్వాసతో నభిన్నము. ఎందుకనఁగా నిది శ్వాస యొక్క యవధియై శ్వాసతోఁబాటు గతాగతము లొనర్చుచుండును. మనుష్యుఁ డొక్కదినమునకు సుమారు 21600 సారులు ఉచ్ఛ్వాస నిశ్వాసము లొనర్చును. ఈ క్రమముతోనే దినసంఖ్య. రాత్రియు నిదే పద్ధతి. మఱల రాత్రిందినచక్రము గదలుచునే యుండును. మానవుని

యాయువు ముగిసిపోవును. వారములో ఆది సోమవారముల పున రావృత్తిచక్రము జరుగుచుండును. మఱల పక్షము. ఇవి పితరుల యాయువును క్షీణింపఁజేయును. తరువాత ఋతుచక్రము. దీనితో వనస్పతుల సృష్టి స్థితి సంహారము. మఱల సూర్యాది గ్రహముల ద్వాదశరాశిభ్రమణచక్రము. ఇదే జ్యోతిష్కుల కాలచక్రము. దేవతల యాయుర్హరము-యుగచక్రము. మన్వంతరము-కల్పచక్రము. కల్ప చక్రము బ్రహ్మ యాయువునకు తుది. ఇట్లు సంసార సృష్ట్యాదులు జరగిపోవుచుండును. మఱల కాలచక్రము పరివర్తిత మగుచునేయుం డును. జీవుఁ డీ కాలచక్రములో నిట్లే తిరుగుచున్నాఁడు. ఈ చక్రము నుండి తప్పించుకొనుట ఎట్లు? ఇదే కాలచక్ర ప్రయోజనము.

యుగయుగంబులన్=ప్రతియుగమునందును, భౌతికశరీరంబు లకు-పాంచభౌతికములైన శరీరములకు, శక్తిసన్నంబగున్=శక్తి క్షీణిం చును, నిస్సత్త్వులు-బలములేనివారు ధైర్యశూన్యులు, మందప్రజ్ఞులు= మందమైన బుద్ధిగలవారు. సర్వవర్ణములకును, ఆశ్రమములకును హితంబు సేయందలంచి=మేలుచేయవలె ననుకొన్నవాఁడై, బ్రహ్మ, హోత, అధ్వర్యుఁడు, ఉద్గాత యని నల్వురు హోతలు అనఁగా ఋత్వి క్కులు. శుద్ధికరము=శరీరమునకును మనస్సునకు శుద్ధిని గలిగించు నవి. ఒకటిగా నున్న వేదములు ఋగ్యజుస్సామాథర్వణములుగా వ్యాసుఁడు భాగించెను. ఇతిహాస పురాణములు పంచమవేద మని పల్కెను.

దొరకొనెన్=ప్రారంభించెను. జైమినమహాముని కుమారుఁడు జైమిని. ఇతఁడు పూర్వమీమాంసాకర్త. వైశంపాయనాఖ్యుఁడు= వైశంపాయనుఁ డను పేరు గలవాఁడు. 'ఆఖ్యాహ్వేత్యభిధానంచ' అమరము. అథర్వము ఆభిచారిక క్రియలతోఁ గూడిన అథర్వణ వేదము సుమంతుఁ డను ముని పఠించెను. మూలమందు 'దారుణః' అను శబ్ద మున్నది. భయంకరుఁ డని శ్రీధరుల వ్యాఖ్య. దరుణుని

కుమారుఁడని వీరరాఘవవ్యాఖ్య. 'వారుణో మునిః' అని విజయధ్వజుల పాఠము. వరుణుని కుమారుఁడని యర్థము. దీనిని పోతన్న తొలఁగించెను. రోమహర్షణుఁడు నిరూఢిం దాల్చెన్ — నిరూఢి = ప్రసిద్ధముగా. సూతుని తండ్రి రోమహర్షణుఁడు. వ్యాసుని యాజ్ఞతో నీ నల్వురు ఋషులు దమ తమ వేదములకు భిన్నశాఖ లేర్పఱచిరి. అవి వారి వారి శిష్యపరంపరలతో మఱియు భిన్నశాఖలుగా విస్తరిల్లెను. ఇట్లీ వేదములు బహుశాఖలై భూసురులయందు వ్యాపించెను.

వ. మేధావిహీనులు = జ్ఞాపకశక్తి లేనివారు; స్త్రీ శూద్రాదులు ద్వంద్వసమాసము. త్రైవర్ణికాధములు = మూఁడు వర్ణములందును సక్రమమైన యాచారము లేక చెడిపోయినవారు. 'ద్విజబంధూనాం' అని మూలము. ఇట్టివారికి మేలగునని వ్యాసముని భారత వ్యాఖ్యానమును రచించెను. భారతమునం దర్థమంతయు వేదమే. శబ్దముల కూర్పుమాత్రమే క్రొత్తది. త్రైవర్ణికాధములకు మాత్రమే భారతమని తలఁపరాదు. వేదాధికారము గలవారికిని భారతము చదువఁదగినదే. 'ఇతిహాస పురాణాభ్యాం వేదం సముప బృంహయేత్' ఇతిహాస పురాణవచనములతో వేదార్థములకుఁ బరిపుష్టి నొసఁగవలెనని భారతమే చెప్పుచున్నది. ఇంత చేసినను అతని హృదయము సంతసింపలేదు. ఏదో కొఱత ననుభవించుచున్నది. తనలో నిట్లు తలపోయుచున్నాఁడు—

వ్రతధారినై = వేదోక్త నియమములను జక్కఁగా ననుష్ఠించు నియమము గలవాఁడనై. వాస్తవమునకు వ్యాసునకుఁ గర్మమార్గముతో నేమియు సంబంధము లేదు. కాని లోకశిక్షార్థ మాతఁ డంగీకరించెను.

'యద్యదా చరతి శ్రేష్ఠస్తత్త దేవేతరో జనః' అని గీత. వేద వహ్ని గురుశ్రేణిన్ — వేదములు, గార్హపత్య, ఆహవనీయ దాక్షిణాగ్నులను మూఁ డగ్నులు, అధ్యయనము నేర్పిన గురువులు — వీరిని పొరపాటు లేక గౌరవించుచునే యున్నాను. విహితకర్మములఁ గొఱఁత

వడకుండ నడపుదున్ = వేదవిహిత కర్మములను క్రియావైకల్యము నెచ్చటను రానీక యనుష్ఠించుచున్నాను. భారతమిషమునన్ = భారత మనెడు వ్యాజముతో, వేదార్థమెల్లం బలికితిన్ - వేదార్థముల నన్నిటిని స్పష్టపఱచితిని. స్త్రీలకు, శూద్రులకు, ద్విజబంధువులకుఁ బనికివచ్చు సమస్తధర్మములు మహాభారతమందుఁ బ్రతిపాదింపఁబడినవి. ఆత్మలో నీశుండు ...... జాడదోఁచెన్ - ఆత్మలో = దేహమందున్న, ఈశుండు = పరమాత్మ సంతసింపనున్నట్లుగా కనుపించుచున్నది, హరికిన యోగి వరులకున్ - పరమహంసలకును, అభిలషితము = ప్రియమైనది అయిన, భాగవతవిధంబు = భగవంతుని యొక్కయు, భక్తులయొక్కయు ధర్మములనుగూర్చి చర్చింపలేదు. తెలివిమొనయదు = నాకుఁ దోఁచలేదు, మఱచితి ననుచున్ వగచుచున్న యవసరమునన్ = ఖేదపడుచున్నప్పుడు

'తథాఽపి బత మే దైహ్యోహ్యాత్మా చైవాత్మనా విభుః' - దీనికి శ్రీధరులు 'దైహ్యః = దేహేభవః, ఆత్మా - జీవః వస్తుతః విభుః పరిపూర్ణ ఏవ ఆత్మనా స్వేనరూపేణ అసంపన్న ఇవ' అని వ్యాఖ్యానించిరి. అనఁగా దేహమందు జీవస్థితిలో నున్న స్వయంపరిపూర్ణుఁడైన పరమేశ్వరుఁడు తన స్వస్వరూపముతో సంతోషించినట్లు లేదని యర్థము. తెలుఁగులోఁ బోతన్నగారీ మార్గమునుండి కొంతప్రక్కకుఁ దొలఁగి నట్లున్నది. ఆత్మలోన్ = శరీరమందు, ఈశుండు = జీవభావమున భాసించుచున్న యాత్మ దన స్వస్వరూపముతోఁ బ్రసాదము నొంది నట్లు లేదని యొకరీతిగా సరిపెట్టుకొనవలెను.

వల్లకీతంత్రీ చయంబునన్ = వీణయొక్క తంత్రుల సమూహమందు నిరంతరమును నారాయణశబ్దమే వినవచ్చుచున్నది, ఆనన = ముఖమునుండి, సంభూత = పుట్టిన, హరిగీతరవ = హరికి సంబంధించిన గానశబ్ద మనెడు, సుధాధారలన్ = అమృతధారలచేత, యోగీంద్ర తతులు = మహాయోగులు, చొక్కన్ = మైమఱచిపోఁగా, తంత్రీచయమందు 'నారాయణ' యను నొక్కొక్క శబ్దమే వినవచ్చుచున్నచో,

గాన మొనర్చు పాటల కనుగుణముగా నుండదు. గానము భిన్నతాళ ములతో నుండును. నారాయణశబ్ద మొక్క టే యన్నితాళములకును సమన్వయింపదు. కనుక తంత్రీచయమందు తాళానుగతికములైన నారాయణ పరములైన శబ్దములు వినవచ్చుచున్నవని భావము. యోగీంద్రతతులు సొక్కన్ = నారదమహర్షి గానముతో యోగుల సమాధిస్థితి చెదరినది. వారు నారదుని గానసుధారస ధారలందు మైమఱచి యున్నారని భావము. కపిల .... .... వహింపన్=పసుపు ఎఱుపు మిశ్రమమే కపిలవర్ణము. ఆ వర్ణముతోడి జడలు వాని వాని కాంతిసమూహముతో దిక్కులయందు ప్రభాతదీధితు లాక్ర మించినట్లునది. తనులగ్న=శరీరమందున్న, తులసికాదామ=తులసీ మాలలయొక్క, గంధంబులు=సుగంధములు, గగనాంతరాళంబునన =భూమ్యాకాశములను గప్పి నిండఁగా. నారదుఁడు తులసీమాలలు ధరించియుండెను. విష్ణుభక్తుల కది లక్షణము. వాని సుగంధములు దిశ లన్నిటు వ్యాపించినవి. వాసవీనందను కడకున్=వాసవి యను పేరుగల సత్యవతి కుమారుఁడు. వ్యాసుఁడు భద్రవిమలకీర్తి పార గుఁడు=లోకక్షేమకరమైన, స్వచ్ఛమైన యపారకీర్తిగలవాఁడు. 'కీర్తి పారనుఁడ'ని రాళ్లపల్లివారి పాఠము. ఆరాధనయు విశారదుఁడు= ప్రసిద్ధమైన నీతియందు నేర్పరి.

తాత్పర్యము: నారదుఁడు ధరించిన వీణనుండి తాళానుగతి కములైన నారాయణపరములైన శబ్దములు వచ్చుచుండెను. అతని ముఖమునుండి హరిగీతము లనెడు నమృతధారలు బయటికి వచ్చు చుండెను. ఆ గీతములతో సమాధులు చెదరి యోగీంద్రులు మది సొక్కి వినుచుండిరి. అతని జటాభారము జేగురువర్ణమున నుండెను దాని కాంతులు దిక్కులకు విరఁజిమ్మి కృతకప్రభావమును గల్పించు చున్నవి. మెడలోఁ దులసీమాలలు. దిశల వ్యాపించిన వాని సుగం ధము. లోకక్షేమకరమగు స్వచ్ఛమైన కీర్తిగలవాఁడు నారదుఁడు భాగవతధర్మములందు నేర్పరి. వ్యాసుని చెంతకు వచ్చెను.

అంతన్—తరువాత, నారదుఁడు వినయైక విలాసున్—వినయము తోడి ప్రవర్తన గలిగినట్టి, నిగమ.... ....ఉల్లాసున్=వేదములనువిభా గించుటచేత నొక మహాకార్యము నెరవేర్చితినను సంతృప్తితోఁగూడిన వాఁడును, భవదుఃఖ నిరాసున్=గ్రంథరచనా మూలమున లోకజను లకు సంసారవిముక్తి గల్గించి మోక్షపుఁ దెరువుఁ జూపినవాఁడును, గతమనోవికాసున్=తనకార్య మింకను మిగిలియున్నదను నతృప్తితోఁ గూడినవాఁడును నైన, వ్యాసున్—వ్యాసుని, కనియెన్=చూచెను.

తాత్పర్యము: విజ్ఞానఖనియైన వ్యాసుని ప్రతి కర్మయందును వినయమే తొంగలించుచుండెను. నిగమవిభజనము చాల గొప్ప పని. దానిని జేసితినను తృప్తి యొకవంక, దాను చేయువలసినది ఇంకను మిగిలియున్న దను నతృప్తి యొకవంక—ఈ రెండు భావములతో డోలాయమాన చిత్తవృత్తి గలవాఁడు. పురాణరచనములతో లోకము లకు మోక్షమార్గమును జూపిన దాతఁడే. అట్టి వ్యాసుని నారదుఁడు చూచెను.

నిజాశ్రమంబునకున్—తన యాశ్రమమునకు, వివిధ క్రమంబు లన్ - శాస్త్రచోదితములైన యనేకోపచారములచేత, పూజించినన్= గౌరవింపఁగా, లే నగవు=తిన్నని నవ్వు, విపంచికా తంత్రిన్=వీణా తంత్రిని, వ్రేలమీటుచున్=వ్రేలితో మీటుచు, ఇట్లనియెన్=ఇట్లనెను.

తాత్పర్యము: ఆశ్రమమునకు వచ్చిన నారదుని వ్యాసుఁ డనేక భంగులఁ బూజించెను. అతఁడు చిఱునగువుతో వీణనుమీటుచు నిట్లు ప్రశ్నించినాఁడు.

పుట్టపర్తి నారాయణాచార్యదాసునిచే విరచింపఁబడిన
'భాగవతసుధాలహరి' యందు ప్రథమ
స్కంధమున చతుర్థాధ్యాయము
వ్యాఖ్య ముగిసినది.

# భాగవతసుధాలహరి

## ప్రథమ స్కంధము

## పంచమాధ్యాయము

* * *

సూత ఉవాచ :

అథ తం సుఖ మాసీన ముపాసీనం బృహచ్ఛ్రవాః.
దేవర్షిః ప్రాహ విప్రర్షిం వీణాపాణి స్స్మయ న్నివ. 1

నారద ఉవాచ :

పారాశర్య! మహాభాగ! భవతః కచ్చిదాత్మనా,
పరితుష్యతి శారీర ఆత్మా మానస ఏవ వా. 2

జిజ్ఞాసితం సుసంపన్న మపి తే మహదద్భుతమ్,
కృతవాన్ భారతం యస్త్వం సర్వార్థ పరిబృంహితమ్. 3

జిజ్ఞాసిత మధీతంచ బ్రహ్మయత్త త్సనాతనమ్,
తథాఽపి శోచస్యాత్మాన మకృతార్థ ఇవ ప్రభో! 4

వ్యాస ఉవాచ :

అస్త్యేవ మే సర్వమిదం త్వయోక్తం
తథాపి నాఽఽత్మా పరితుష్యతే మే,
తన్మూల మవ్యక్త మగాధబోధం
పృచ్ఛామహే త్వాత్మభవాత్మ భూతమ్. 5

సూత ఉవాచ—సూతుఁ డనెను.

అథ—అనంతరము, సుఖం—సుఖముగా, ఆసీనః—కూర్చున్నవాఁడై, బృహచ్ఛ్రవాః—గొప్పకీర్తి గలవాఁడును, వీణాపాణిః—వీణ చేతఁ బట్టినవాఁడును నైన,

**దేవర్షిః=నారదుఁడు, ఉపాసీనం=సమీపమందుఁ గూర్చున్న, తం విప్రర్షిం=ఆ వ్యాస మునిని, స్మయన్నివ=చిఱునవ్వు నవ్వుచున్న వానివలె, ప్రాహ=పలికెను.**

అవ: ఐదవ యధ్యాయమందు నారదముని వ్యాసునితోఁ జిత్తప్రసాదమునకు సర్వధర్మానుష్ఠానముల కంటెను హరికీర్తనమే శ్రేష్ఠమైన మార్గమని వివరింపఁ బోవుచున్నాఁడు—

సూతుఁ డనెను. అర్ఘ్యపాద్యాదులచే సత్కరింపఁబడిన తర్వాత నారదుఁడు యోగ్యాసనమున నుపవిష్టుఁ డయ్యెను. సమీపమున విప్రర్షి గూర్చుండెను. గొప్ప కీర్తి గలవాఁడు నారదుఁడు. అతఁడు వ్యాసముని ముఖము మ్లానమై యుండుటను గమనించినాఁడు. వీణాపాణియైన యాతఁడు గమనింపనట్లుగానే మందహాసమున నిట్లు ప్రశ్నించెను.

**నారద ఉవాచ=నారదుఁ డనెను.**

**మహాభాగ!=గొప్ప యదృష్టవంతుఁడవైన, పారాశర్య=పరాశర కుమారుఁడవైన వ్యాసమునీ!, భవతః=నీయొక్క, శారీరః=శరీరాభిమానియు, మానసః=మనోభిమానియు నైన, ఆత్మా=ఆత్మ, ఆత్మనా=శరీరముతో మనస్సుతో, పరితుష్యతి కచ్చిత్=సంతోషించుచున్నవాఁడే గదా!.**

మహాభాగ్యశాలివైన వ్యాసమునీ! నీ దేహమును చిత్తమును అభిమానించెడి యాత్మ (జీవాత్మ), దేహముతోను మనస్సుతోను సంతోషించుచున్నవాఁడా? అనఁగా నీ శరీరము, చిత్తము, ఆత్మ సంతోషముగ నున్నవి గదా? (యని సారము). మహాభాగ! వేదములను విభాగించుట, భారతరచనము-రెండును సామాన్యములైన పనులు గావు. ఆ పను లొనర్చుట జీవితమహాభాగ్య మని తాత్పర్యము.

సంస్కృతములో 'భవ'చ్ఛబ్దము 'తమరు' అనెడు గౌరవ వాచకముగా నుపయోగింపఁ బడును. కాని ఇక్కడ భాషాశైలిని బట్టి నీవని యుపయోగించితిని.

తే—నీకు, జిజ్ఞాసితం—తెలియవలసిన సర్వమును, సుసంపన్నం—సమగ్రముగాఁ దెలిసికొనునదైనది, యః త్వం—ఏ నీవు, సర్వార్థపరిబృంహితం—సమస్తార్థములతోఁ గూడినట్టి, మహత్—గొప్పదియు, అద్భుతం—ఆశ్చర్యకరమునైన, భారతం—భారతమను మహాగ్రంథమును, కృతవాన్—నిర్మించినవాఁడవైతివి గదా!

తెలియఁదగిన దంతయుఁ దెలిసికొంటివి. దానికి ఫలముగా సమస్త పురుషార్థముల నుత్పత్తి చేయునదియు, సమస్త ప్రమేయములతో పరిబృంహితమును మహాద్భుతమును నైన భారతమును రచించితివి.

సనాతనం—చాలకాలముండునదియైన, బ్రహ్మ—బ్రహ్మస్వరూపము, యత్—ఏది గలదో, తత్—అది, జిజ్ఞాసితం—చక్కఁగా విచారింపఁబడినది, అధీతంచ—పొందఁబడినది, అథాఽపి—అట్లైనను, విభో!—సమస్తాధికారములు గల యో వ్యాసముని!, అకృతార్థ ఇవ—కృతార్థుఁడు కానివానివలె, ఆత్మానం—నిన్నుగూర్చి, శోచసి—దుఃఖించుచున్నావు.

సర్వకాలములయందును నశింపనిదై నిత్యమైయుండు పరబ్రహ్మ మేది గలదో ఆ బ్రహ్మపదార్థమును జక్కఁగా విచారించితివి. దానిని బొందితివి. సర్వసామర్థ్యములుగల యో మునీ! సర్వమును సాధించియుఁ జేయవలసినది పూర్తిగా నెరవేర్చనివానివలె అనవసరముగా శోకించుచున్నావు. దీనికిఁ గారణ మేమి?

త్వయా—నీచేత, ఉక్తం—చెప్పఁబడిన. ఇదం సర్వం—ఈ సర్వమును, మే—నాకు, అస్త్యేవ—ఉన్నదే-తథ్యము, తథాఽపి—ఐనను, మే ఆత్మా—నాజీవాత్మ నో పరితుష్యతే—సంతోషించుటలేదు, అవ్యక్తం—అస్పష్టముగా నున్న, తన్మూలం—ఆ మూలకారణమును, హే నారద!—ఓ నారదముని!, ఆత్మభవాత్మభూతం—బ్రహ్మమానసపుత్త్రుఁడవైన, అగాధబోధం—గంభీరమైన బోధ గలిగిన, త్వా—నిన్ను, పృచ్ఛామహే—అడుగుచున్నాను.

ఓ నారదమునీ! నీ వన్నదంతయు నిజమే. సందేహము లేదు. కాని, నా మన శ్శరీరసంబంధియైన జీవాత్మ సంతోషపడుట లేదు.

ఓ ముని! నీవు బ్రహ్మమానసపుత్త్రుఁడవు. గంభీరజ్ఞానము గలవాఁడవు. నా మనోవైకల్యమునకుఁ గారణమెంత యోచించినను దెలియుట లేదు. దీనికిఁ గారణమేమై యుండునో నీవైనను జెప్పుము!

శ్రీధరీయము:

ఉపాసీనం=సమీపమునఁ గూర్చున్నవాఁడైన, స్మయన్నివ=చిఱునగవుతోఁ గూడినవానివలె-దీనితో వ్యాసుని ముఖమును జూచి, యాతని భావమును గ్రహించిన వాఁడని తాత్పర్యము. లేక, 'ఇవ' శబ్ద మాశ్చర్యార్థకము. గొప్పవాఁడైనను వ్యాసముని మోహమును జెందినాఁడని యాశ్చర్యము.

శారీరః=శరీరాభిమానియైన యాత్మ, ఆత్మనా=నీ శరీరముచేత, మానసః ఆత్మా=మనోభిమానియైన యాత్మ సంతోషించుచున్నాఁడా?

జిజ్ఞాసితం=జ్ఞాతుం ఇష్టం=తెలిసికొన నిచ్ఛించినది. ధర్మములు మొదలైనవని యర్థము. సుసంపన్నం=చక్కఁగాఁ దెలిసికొనఁబడినది. సంపూర్వక 'పదగతౌ' అని ధాతువు. గత్యర్థకములకు జ్ఞానార్థకత్వ మంగీకృతము. ఇక్కడి 'అపి' శబ్దముచేతఁ గేవలము తెలిసికొనుటయే గాదు. అనుష్ఠితము గూడ నైనదనుచున్నాఁడు. సుసంపన్న మనుటలో హేతువు మహదద్భుతం ఇత్యాది; సర్వార్థ పరిబృంహితం- పరిబృంహితం=పరిపూర్ణమైనది.

సనాతనం = నిత్యమైన పరబ్రహ్మ, త్వయా జిజ్ఞాసితం = నీచే విచారితమైనది. అధీతంచ=అధి+ఇతం=ఇఙ్ గతౌ అని ధాతువు. కనుక అధీత మనఁగా నధిగత మని యర్థము. ప్రాప్త మని తాత్పర్యము.

ఆత్మా=శరీరాభిమానియు మనోభిమానియునైన ఆత్మ. ఇక్కడ రెండు కర్మలున్నవి. వైకల్యకారణ మొకటి. నారదు డొకఁడు నా వైకల్యకారణమును గుఱించి నిన్నడుగుచున్నానని వాక్యము. ప్రచ్ఛ ధాతువు ద్వికర్మకము.

**విజయధ్వజము :**

స్మయన్నివ—చిఱునవ్వునవ్వేడు వానివలె, పూజ్యుఁడైన శ్రీహరి ముఖ్యానుగ్రహమునకుఁ బాత్రుఁ డగుటచేత వ్యాసుని యభిప్రాయము దెలిసి, దానికిఁ దగినట్లుగనే నడచుకొనెనని సూచించుచున్నాఁడు.

తాత్పర్యము : దేవతలలోనివాఁడైన నారదుఁడు దనకార్యములతో ఋషి యనిపించుకొన్నాఁడు. కనుక నతఁడు దేవర్షి. అతఁడు తన వైశిష్ట్యమో యనునట్లు నిరంతరము మహతి యనెడు వీణను ధరించి శ్రీహరి గుణములను గానించును. ఆసీనుఁడైనను వీణనువదల లేదు. అతని సమీపమున వ్యాసమహర్షి గూర్చుండెను. వ్యాసుఁడు బ్రాహ్మణుఁడు. ఋషిత్వమున నాతఁడు విప్రర్షిగా ప్రసిద్ధుఁడయ్యెను. మనుష్యుఁడుగా నవతరించిన శ్రీహరి మనుష్యధర్మములనే చూపించెను. ఈ గుట్టు శ్రీహరి ముఖ్యానుగ్రహమునకుఁ బాత్రుఁడైన నారదునకుఁ దెలియకపోలేదు. అతృప్తునివలెఁ గూర్చుండియున్న నిత్యతృప్తుఁడైన భగవంతుని జూచి యతని ముఖమున చిఱునగ వంకురించినది. భక్తివినయములు గలవాఁడై శ్రీహరిని గుశలప్రశ్నలు వేసెను. భగవంతుఁడు స్వతంత్రుఁడు పరిపూర్ణుఁడు నగుటతో నాతఁడు నిత్యకుశలియని నారదుఁ డెఱుఁగును. కాని భగవదిచ్ఛ ననుసరించుటయే భాగవతుల ఇచ్ఛ. అందుచే శ్రీహరి మానవత్వము నాపాదించుకొన్నప్పుడు నారదుఁడు మానవునివలెనే కుశలప్రశ్న మొనర్చెను.

మహాభాగ! = సకలైశ్వర్యముల కాశ్రయుఁడైన వాఁడా!, పారాశర్య! పరాశరపుత్త్రుఁడుగా వెలసిన, భగవన్,భవతః శారీరః = శరీరరూపమైన, మానసోవా—మనోరూపమైనట్టి, ఆత్మా—స్వరూపము, ఆత్మనైవ—తమకుఁ దామే యవతార ప్రయోజనములైన సమస్తకార్యములును ముగిసినదాని వలన, కచ్చిత్—స్వతంత్రుఁడ వగుటచే నవతార కార్యములను ముగించి, పరితుష్యతి—సంతోషముగ నుంటివా!

వ్పటి ఏవకారముచేత స్వతంత్రుఁడవైన నీ కే యడ్డంకియు నుండదు. ందుకే సర్వదా సంతృప్తుఁడవే యని భావము.

అనంతములైన భాగ్యఐశ్వర్యముల కేక మాత్రాశ్రయుఁడవ య్యాను పరాశరపుత్త్రుఁ డనిపించుకొని యవతరించిన శ్రీహరీ! నీ శరీ త్మల కే భేదమును లేదు. అట్లే అత్మకును మనస్సునకు లేదు. నీ వతరించితి వన్ఁగా కేవల మభివ్యక్తి మాత్రమే. ఈ యభివ్యక్తి యును కేవలము కొన్ని కార్యములకే. స్వతంత్రుఁడవైన నీకు ఈ ర్యాచరణమం దే యాటంకము నుండదు. ఇవే నీ యవతార యోజనములు. ఈ కార్యము లన్నియు నొనర్చిన నీకు పూర్తి ప్తి యేర్పడియుండును. ఉండుటేమి! పరితృప్తుఁడవే.

అవ: సంతృప్తికిఁ గారణమును దెల్పుచున్నాఁడు-

యత్త్వం సర్వార్థపరిబృంహితం కృతవాన్ = రచించితివో దాని ంన, తే = నీ నుండి, సుసంపన్నం = సుఖపూర్ణమైన, అద్భుతం = అన్నిటికంటె నాశ్చర్యకరమైన, ౭. అముఖ్య లయకర్తయైన దుని సృష్టించిన, మహాత్ = దేశ కాల గుణములచే నింత యను ం సాధ్యముగాని పరబ్రహ్మ వస్తువు, జిజ్ఞాసితం అపి = ఇఁక పైఁ ప్పఁబోవు విషయమును జేరి లేక, మహత్ = శబ్దార్థములలో గొప్ప వ, అద్భుతం = గహనమైన, సర్వార్థపరిబృంహితం = సర్వశాస్త్రార్థముల కను నిండిన భారతగ్రంథమును రచించితివో దానిచేత, జిజ్ఞాసితం = ంలచేఁ దెలియఁబడవలెనని నీ విచ్ఛించిన సమస్త విషయమును, సంపన్నం = చక్కఁగాఁ బరిపూర్ణమై యున్నది.

తాత్పర్యము: ఓ హరీ! నీవు రచించిన మహాభారతము ర్మాది సమస్త పురుషార్థములకును నిధి. శబ్దార్థములయందు శ్రేష్ఠ ం మగుటచే దానికి మహాభారత మను పే రన్వర్థము. గుహ్యాతి హ్యమైన ఈ గ్రంథమునందు సర్వశాస్త్రార్థములును బ్రతిపాదితములు.

భారతమందు సకలజనులకును దెలియఁదగిన వన్నియును జేరి యున్నవి. ఇయ్యది సుఖపరిపూర్ణము జగద్విలక్షణ మగుటచే నత్యం తాశ్చర్యకరము, లయకార్యమం దముఖ్యకర్త గా నున్న రుద్రున కుద్భవస్థానమును, దేశకాలాది గుణములచేత నపరిచ్ఛేద్యము నైన పరబ్రహ్మ వస్తువును. ఇది సర్వోత్తమమైన వస్తువని మనోహరముగ నిర్వచించితివి. ఇట్టిచో నీకు సంతృప్తి లేకుండుట యెట్లు?

ప్రభో! = అతిశయమైన జ్ఞాన మున్నవాఁడా!, యత్ = ఏ, సనాతనం = సర్వకాల ముండుటతో నిత్య మనిపించికొన్న, బ్రహ్మ = వేదాత్మకమైన శబ్దబ్రహ్మ, అధీతం = ఉపాధ్యాయ పరంపరగా నధ్య యనము చేయఁబడినదో, తత్ అపి = దానినిగూడ, జిజ్ఞాసితం = వేదార్థ నిర్ణాయకమైన బ్రహ్మసూత్ర రచనతో నిర్ణయించితివి, తథాపి = ఇట్లు నీ యవతార కార్యము లన్నిటినిజేసి ముగించినను, అకృతార్థ ఇవ = అవతార ప్రయోజనమును బొందనివాని వలె, ఆత్మానం = నీ స్వరూప మును; శోచసి = జనులకుఁ బ్రకాశింపఁ జేయుచున్నావు. జ్ఞానకార్య మొనర్చుటకు లోకమం దవతరించిన నీవు సజ్జనజ్ఞానదాయకములైన మహాభారత బ్రహ్మసూత్రాది గ్రంథములను రచించియు నతృప్తుని వలె లోకమునకుఁ గన్పించుచున్నావు. ఇక్కడ 'శోచసి' అనుటకు దుఃఖించుచున్నావని యర్థముగాదు. సర్వసమర్థుఁడైన శ్రీహరికి శోక కారణ మేమున్నది! 'అజస్రేణ శోచిషా శోశుచానః' అను శ్రుతి యందు సంతతమైన ప్రకాశముతోఁ బ్రకాశించునని యర్థము చెప్పి నట్లు ఇక్కడఁగూడఁ బ్రకాశించుచున్నాఁడనియే యర్థము.

తాత్పర్యము: సర్వజ్ఞుఁడవైన శ్రీహరి! నీవు సర్వజ్ఞాతవయ్యు మానవులవలెనే వేదాధ్యయన మొనర్చితివి. గురుపరంపరగా వచ్చిన వేదములు సర్వకాలములందు నుండుటచే సనాతనములని ప్రసిద్ధి నందినవి. ఇవి ప్రతిశబ్దమందును పరబ్రహ్మను ప్రతిపాదించుటచే శబ్ద బ్రహ్మమని పేరు గాంచినవి. ఇవి బ్రహ్మ నెట్లు ప్రతిపాదించును?—

అను విషయమును న్యాయములతో నిర్ణయించి చూపించుటకు బ్రహ్మ సూత్రములను రచించి సమస్త వేదముల నిర్ణయించితివి. జ్ఞానాతిశయముతోఁ బ్రకాశించు నీవు అవతార కార్యమైన జ్ఞానకార్యమును బరిపూర్ణ మొనర్చితివి. ఇఁక మిగిలిన దేమి? ఐనను అవతారకార్యమును బూర్తి నొనర్పని వానివలె బ్రపంచమునకుఁ జూపించికొనుచున్నావు.

అవ: ఇట్లు నారదునిచేఁ బ్రశ్నింపఁబడిన వ్యాసరూపి శ్రీహరి దుష్టజన మోహనార్థమై యపరిమిత జ్ఞానస్వరూపుఁడైనను అజ్ఞునివలెఁ దన యసంతృప్తికిఁ గారణమేమని ప్రశ్నించుచున్నాఁడు-

త్వ యోక్తం సర్వమిదం మే అస్త్యేవ-నీ వన్నట్లు నేను చేయఁదగిన కార్య మేదియును మిగులలేదు. తథాఽపి మే ఆత్మా నపరితృప్యతే-అట్లైనను నా యాత్మ తృప్తినందుట లేదు. ఆత్మభవాత్మభూతం-1. బ్రహ్మశరీరమునుండి పుట్టిన, 2. బ్రహ్మదేవునికి స్వామియైన పరమాత్మునియందే మనస్సున్న, అగాధబోధం త్వా-అవ్యక్తం తన్మూలం పృచ్ఛామహే-పరితుష్యతే అని ప్రయోగించుటచేత, అజ్ఞులను మోహింపఁజేయుటకే వ్యాసుఁడు ప్రశ్నించినది. అజ్ఞానముతోఁ గాదని తెలిపినట్లైనది. ఇక్కడఁగూడ 'పృచ్ఛామహే' అని ఆత్మనేపదప్రయోగముతో నారదమహర్షి జ్ఞాన మల్ప మనియు వ్యాసునిజ్ఞానమపారమనియుఁ జెప్పినట్లైనది. వ్యాసునియం దశక్తి గాని అజ్ఞానము గాని లేదనుటకు క్రింది వాక్యము ప్రమాణము.

జ్ఞానశక్తి స్వరూపోఽపి హ్యజ్ఞాశక్తిం వదేద్ధరిః,
అజ్ఞానం మోహనాయేశః తే న ముహ్యంతి మోహితాః.

(పాద్మపురాణము)

వ్యాసాది రూపములందు శ్రీహరి జ్ఞానస్వరూపుఁడే. ఐనను అశక్తిని, అజ్ఞానమును బ్రదర్శించుట అజ్ఞానులను మోహింపఁ జేయుటకే. దీనిచే వంచితులై యజ్ఞులు మిథ్యాజ్ఞాను లగుచున్నారు.

స వై భవాన్వేద సమస్తగుహ్య
ముపాసితో యత్పురుషః పురాణః,
పరావరేశో మనసైవ విశ్వం
సృజత్యవ త్యత్తి గుణైరసంగః. 6

త్వం పర్యటన్నర్క ఇవ త్రిలోకీ
మంతశ్చరో వాయురివాత్మ సాక్షీ,
పరావరే బ్రహ్మణి ధర్మతో వ్రతైః
స్నాతస్య మే న్యూనమలం విచక్ష్వ. 7

నారద ఉవాచ:

భవతా ఽనుదితప్రాయం యశో భగవతో ఽమలమ్,
యే నైవాసౌ న తుష్యేత మన్యే తద్దర్శనం ఖిలమ్. 8

యథా ధర్మాదయశ్చార్థా మునివర్యాను కీర్తితాః,
న తథా వాసుదేవస్య మహిమా హ్యను వర్ణితః. 9

న యద్వచ శ్చిత్రపదం హరేర్యశో
జగత్పవిత్రం ప్రగృణీత కర్హిచిత్,
తద్వాయసం తీర్థముశంతి మానసా
న యత్ర హంసా నిరమంత్యుశిక్ క్షయాః. 10

యః—ఏ భగవంతుఁడు, మనసా ఏవ—సంకల్పమాత్రముననే, అసంగః—దేనితోను సంబంధము లేనివాఁడై, గుణైః—త్రిగుణములను గ్రహించి, విశ్వం—ప్రపంచమును, సృజతి—సృష్టించునో, అవతి—రక్షించునో, అత్తి—సంహరించునో, పరావరేశః—కార్యకారణ నియంతయు, పురాణః—సనాతనుఁడైన, పురుషః—పురుషుఁడైన, సః—ఆ వాసుదేవుఁడు, యత్—ఏ హేతువుచేత, ఉపాసితః—నీచే నుపాసింపఁబడినాఁడో, భగవాన్—ఆ నీవు, సమస్తగుహ్యం—సకలరహస్యమును, వేద—తెలియుదువు.

అవ. నారదముని యగాధజ్ఞానమును, దానికిఁ గారణమును రెండు శ్లోకములతో వివరించుచున్నాఁడు-

భగవంతుఁ డసంగి. కార్యకారణ నియంత. అతఁడు సత్త్వాది గుణములను గ్రహించి సంకల్పమాత్రముతో లోకములను సృష్టించి, రక్షించి, సంహరించును. సర్వమును నియమించువాఁడు వాఁడే. ఇంత యొనర్చినను, దేనియందును సంగలేశమును లేదు. అట్టి పురాణపురుషుఁడైన శ్రీమన్నారాయణుని నీవు చక్కఁగా నుపాసించితివి. నీ యెఱుఁగని రహస్యములు లేవు. 6

అర్క-ఇవ=సూర్యునివలెను, అంతశ్చరః=ప్రాణులలోపల సంచరించెడు, వాయురివ=వాయువువలెను, త్రిలోకీ=మూఁడు లోకములను, పర్యటన్=సంచరించెడు, త్వం=నీవు, ఆత్మసాక్షీ=ఆత్మకు సాక్షివగుదువు, పరాఽవరే=పరమయ్యును, అపరమయ్యును ఉన్న, బ్రహ్మణి=బ్రహ్మయందు, ధర్మతః=ధర్మము ననుసరించియు, వ్రతైః=వ్రతముల ననుసరించియు, స్నాతస్య=నిష్ణాతుఁడనైన, మే=నాయొక్క, న్యూనం=తక్కువతనమును, అలం=స్పష్టముగా, విచక్ష్వ=ఊహించి చెప్పుము.

నీవు సూర్యునివంటి వాఁడవు. వాయువువంటి వాఁడవు. సూర్యుఁడు బహిర్భూతుఁడై ముల్లోకముల సంచరించును. వాయువు సకలప్రాణుల కంతర్భూతుఁడై సమస్త లోకములందును సంచరించును. నీవును యోగశక్తితో సమస్తప్రాణి హృదయములందు సంచరింతువు. నేను పరావరబ్రహ్మల రహస్యములందు నిష్ణాతుఁడను. విద్యాఽవిద్యల పార మెఱిఁగితిని. నా యందలి లోపమేమి? అశాంతికిఁ గారణమేమి? స్పష్టముగా వివరింపుము. 7

భగవతః=భగవంతునియొక్క, అమలం=కళంకరహితమైన, యశః=కీర్తి భవతా=నీచేత, అనుదితప్రాయం=చెప్పఁబడని దానితో సమానముగా నున్నది, ఏన=ఏ కారణముచేత, అసౌ=ఆ భగవంతుఁడు, న తుష్యేత=సంతోషింపఁడో, తత్=అట్టి, దర్శనం=జ్ఞానము, ఖిలం=న్యూనమైనదిగా, మన్యే=నేను తలఁతును.

ఎన్నో పురాణములు రచించితివి. కాని భగవంతుని నిర్మల మైన యశస్సును వానిలోఁ బ్రధానముగ వర్ణింపకపోతివి. అల్పముగ నెక్కడనో చెప్పినను భగవద్భక్తి యనిరూపితమైనట్లే యైనది. ధర్మాది పురుషార్థములకు సంబంధించిన యనేక విషయములు నీవు నిర్వహించినను భగవంతునకుఁ దృప్తి యేర్పడలేదు. భగవత్తృప్తి యేర్పడని జ్ఞానము నిరర్థకమైనదని నా యభిప్రాయము. 8

నారద ఉవాచ — నారదుఁడనెను.

**మునివర్య! శ్రేష్ఠుఁడవైన వ్యాసమునీ! యథా — ఎట్లు, ధర్మాదయః — ధర్మము మొదలైన, అర్థాః — ప్రయోజనములు, అనుకీర్తితాః — విచారింపఁబడినవో తథా — అట్లు, వాసుదేవస్య — వాసుదేవునియొక్క, మహిమా — మాహాత్మ్యము, న అనువర్ణితః — అభివర్ణింపఁ బడలేదు.**

అవ: భగవంతుని యశస్సు భారతాదులయం దక్కడక్కడ అభివర్ణింపఁ బడినది గదా! అనుటకు సమాధానము—

ధర్మార్థములను గూర్చి వివరముగా వర్ణించితివి. అట్లే వాసుదేవుని కీర్తిని బ్రధానముగా వర్ణింపలేదు. 9

**చిత్రపదం — విచిత్రములైన పదములతోఁ గూడిన, యద్వచః — ఏ వాక్కు జగత్పవిత్రం — లోకమును బవిత్ర మొనర్చునట్టి, హరేర్యశః — భగవంతుని కీర్తిని న ప్రగృణీత — ప్రకర్షముగా వర్ణించుట లేదో, తత్ — అట్టి వచస్సు, వాయసం — కాకులకు మాత్రమే పనికివచ్చెడు, తీర్థం — తీర్థముతో సమానమైనదిగా, ఉశంతి — పెద్ద లందురు, ఉశిక్క్షయాః — కమనీయమైన పరబ్రహ్మమే నివాసస్థానముగానున్న, మానసాః — మానస సరోనివాసులైన, హంసాః — హంసలు, యత్ర — ఏ కాకులకుఁ బనికివచ్చు తీర్థమందు, కర్హిచిత్ — ఏ నాఁడును, న నిరమంతి — రమింపరో;**

అవ: వాసుదేవ విజ్ఞానరహితమైన తక్కిన జ్ఞానమంతయుఁ బనికిరానిదే. అట్లే వాసుదేవుని విడిచి, అన్యవిషయములను గూర్చి వర్ణించుచున్న వాక్చాతుర్యమును దక్కువైనదే. పూర్ణమైనది గాదు అని తెల్పుచున్నాఁడు—

విచిత్రపదములచేఁ గూడికొన్నదయ్యును, ఏ యుక్తివైచిత్రి భక్తుల సకలసంకటములను హరించి, వారిని సదా రక్షించెడు శ్రీహరిదైన లోకశుద్ధికరమైన యశస్సును వర్ణింపదో అట్టి వచోవిన్యాసము, తుచ్ఛవిషయములం దాసక్తిగల రజోగుణప్రధానులకు మాత్రమే సంతోషమును గల్గించును. అట్టి రచన కాకులు మునుఁగుటకుమాత్రమే తగిన తీర్థము వంటిది, సత్త్వగుణప్రధానమైన మనస్సుగల పరమహంస లందు సంతోషింపరు. మనస్సు నానందపఱచెడు పరబ్రహ్మయందే నిరంతరము నివసించెడువారు మానససరస్సునందుఁ గ్రీడించి దానియందలి పద్మబిసములను భుజించెడు హంసలవంటివారు. అవి వాయసతీర్థములందు మునుఁగవు గదా! పరమహంసలును భగవత్కథా వివర్జితమైన వాక్కునందు రమింపరు. 10

**శ్రీధరీయము :**

పురాణః = అనాదిసిద్ధుడైన పురుషుఁడు. అతఁ డెట్టివాఁడు? పరావరేశః = కార్యకారణ నియంత, మనసైవ = సంకల్పమాత్రముచేతనే, గుణైః కృత్వా విశ్వం సృజతి = గుణముల తోడ్పాటుతో విశ్వమును సృష్టించుచున్నాఁడు.

త్వం త్రిలోకీం పర్యటన్ = నీవు మూఁడు లోకములందును సంచరించుచు, అర్క ఇవ = సూర్యునివలె, సర్వదర్శీ = సమస్తమును జూచువాఁడవు, యోగబలేన ప్రాణవాయు రివ సర్వప్రాణినాం అంతః చరన్ = యోగబలముతో ప్రాణవాయువువలె సర్వప్రాణులలో సంచరించుచున్నవాఁడవై, ఆత్మసాక్షీ = బుద్ధిప్రవృత్తులను దెలిసినవాఁడవు. గనుక, పరే బ్రహ్మణి = పరుఁడైన బ్రహ్మయందు, ధర్మతః = యోగబలముచేత, నిష్ణాతస్య = నిష్ణాతుఁడ నైన నాకు. యాజ్ఞవల్క్య శ్లోకమిట్లున్నది-

ఇజ్యా నారదమాహింసా దానస్వాధ్యాయ కర్మణామ్,
అయం తు పరమో ధర్మో యద్యోగే నాత్మదర్శనమ్.

అపరే బ్రహ్మణి వేదాఖ్యే=అపరబ్రహ్మమైన వేదమందును, వ్రతైః= స్వాధ్యాయాది నియమములచేతను నిష్ణాతుఁడనైన నాయొక్క, యన్న్యూనం=ఏ లోపమున్నదో దానిని, విచక్ష్వ=స్పష్టముగాఁ దెలుపుము.

అనుదితప్రాయం=అనుక్తప్రాయము. భగవద్యశమును వర్ణింపక ధర్మాది జ్ఞానసంపాదనముతో భగవంతుఁడు సంతోషింపఁడు. అట్టి దర్శనము శూన్యము.

అక్కడక్కడ భగవద్యశము వర్ణితమైనను భారతాదులలో ముఖ్యముగా వర్ణింపఁ బడలేదు.

అవ: వాసుదేవ వ్యతిరిక్తమైన అన్యవిషయజ్ఞానము వలెనే అన్యవిషయ వాక్చాతుర్యము ఖిలమైనదే యనుచున్నాఁడు-

తాత్పర్యము: చిత్రపదమైనను, ఏ వచస్సు హరి యశస్సును వర్ణింపదో అది వాయసంతీర్థం. కాకసమానులైన కాకులకు మాత్రమే రతిస్థానము. ఎందుకు? మానసాః=సత్త్వప్రధానమైన మనస్సునందు వర్తించు, హంసాః=యతులు, యత్ర=ఎక్కడ, న నిరమంతి=ఒకప్పుడును దానియందు రమింపరు. ఉశిక్ క్షయాః=ఉశిక్-కమనీయం బ్రహ్మక్షయః నివాసః ఏషాంతే=ఉశిక్ క్షయాః - కమనీయమైన బ్రహ్మయే నివాసస్థానముగాఁగలవారు. ప్రసిద్ధమైనహంసలు మానస సరస్సునందు రమించుచున్నవై, కమనీయములైన యచ్చటి యబ్జ షండములను వదలి వాయసములవలె పరిత్యక్తోచ్ఛిష్ట వివిధచిత్రాన్న యుక్తములైన యుచ్ఛిష్టగర్తములందు రమింపవు గదా!

వంశీధరుఁడు:

పాద్మ బ్రహ్మాండాది పురాణములందు హరియశస్సు కీర్తింపఁ బడినది గదా! కాని మోక్షసాధనముగా మాత్రమే భక్తి వర్ణింపఁబడినది. పరమపురుషార్థముగాఁ జెప్పఁబడలేదు.

ముక్త్యై ప్రార్థాః హరేర్భక్తి ర్మధురాయాం చ లభ్యతే

ముక్తులుగూడ భక్తినే యాకాంక్షింతురు. 'అను'పౌనఃపున్యముగా వర్ణింపఁబడలేదని యర్థము. 'ఆనందమయోఽభ్యాసాత్' అను సూత్రమందు అభ్యాసమే తాత్పర్యజ్ఞాపకముగాఁ జెప్పఁబడినది.

చిత్రపదం, వచః=అనుటకు విశేషణము, చిత్రస్య=ఆశ్చర్యమునకు, పదం=స్థానముగా నున్నను అని రెండవ యర్థము. మంత్రశాస్త్రాదులు తొందరగా ఫలము నొసఁగుటతో విస్మయకరములుగా నుండును. వాయసం తీర్థం=వాయసం=దేహావస్థయొక్క నిర్వాహము జీవనోపయోగియైనది. లేక వయః హం తీతి వాయసం ఆయుస్సును హరించునది. లేక, 'యమకశ్లేష చిత్రేషు శసయోః వబయోర్నభిత్', కనుక, వాయసం అయశం అయశస్కరమైన తీర్థమనుట. మానసాః= బ్రహ్మమానసపుత్రులైన సనకాదులు; జగత్పవిత్రం=జగత్తనెడు పవి-వజ్రాయుధము. 'కులిశంభిదురం పవిః' అమరము. దానినుండి 'త్ర' రక్షించునది. లోకసంకటముల నుండి కాచునది. లేక జగత్పిబతీతి జగత్పః=లోకమును మ్రింగువాఁడు కాలపురుషుఁడు. వానినుండి రక్షించునది లేక జగత్పాంతీతి జగత్పాః= తత్త్వోపదేశాదులచేత జగత్తునురక్షించు వారు, శుకసనకాదులు. వారిచేత త్రాయతే పఠింపఁబడుచున్నది. వారు నిరంతరము భాగవతమును పఠించి వివిధ వివరణములతో దానికిఁ బుష్టి గల్గింతురని భావము.

విజయధ్వజము :

వేదవ్యాసుని యతృప్తికిఁగారణము నారదునకెట్లు తెలిసినది? దానిని వివరించుచున్నాఁడు-

అర్థము: యః=ఎవఁడు, గుణైః-సత్త్వాదిగుణములచే రచితమైన శరీరమూలకముగాఁ బ్రాప్తించు సుఖదుఃఖఫలరూపములతో, అసంగః-సంబంధము లేనివాఁడో, మనసైవ=స్వతంత్రమైన వేఱొక్క

సాధన సామగ్రి యపేక్షలేక సంకల్పమాత్రము చేతనే. విశ్వం= సమస్త జగత్తును సృజతి అవతి, అత్తి, సః=అట్టి, పరావరేశః=ముక్త ప్రపంచమునకు, అముక్తప్రపంచమునకు, నియామకుఁడైన పురాణః= 1. జగత్సృష్టికి ముందే యుండుటచే పురాతనుఁడైన, 2. జీవుల దేహాదుల నెఱిఁగిన, పురుషః – అతిశయ కర్మఫలముల నొసఁగెడు శ్రీహరి, ఉపాసితః= 1. నీనుండి యుపాసింపఁబడినాఁడో, 2. అపరోక్షముగఁ జూడఁబడినాఁడో ఆ కారణముచేత, భవాన్=శ్రీహరి యుపాసకుఁడైన నీవు, సమస్త గుహ్యం=అన్ని రహస్యవిషయములను, వేద వై=తెలిసికొనియే యున్నావు.

అవ. బ్రహ్మప్రియపుత్త్రుఁడైన నారదుఁడు సమస్తసృష్టికిని ఆదికర్తగా భగవంతు నుపాసించి తన యోగ్యతకుఁ దగినట్లు సర్వజ్ఞత్వమును సంపాదించికొన్నాఁడు. అందుచే శ్రీహరి యనుగ్రహమున వేదవ్యాసుల యతృప్తికారణమును దెలియు సామర్థ్యమును బొంది యున్నాఁడు.

తాత్పర్యము: నారదా! నీవు శ్రీహరి నారాధించి యతని యనుగ్రహమునకుఁ బాత్రుఁడ వైతివి. ఆ వాసుదేవుఁడు ఏ స్వతంత్ర సాధనాపేక్షయు లేకయే సంకల్పమాత్రముచేతనే జగత్తును సృష్టించును, రక్షించును, సంహరించును. సత్త్వరజస్తమోగుణ కార్యములైన శరీరములతోను వానిఫలములతోను సంబంధము లేనివాఁడు. అతనికి జగత్సంబంధమైన సుఖదుఃఖసంపర్కము లేదు. సృష్టికి ముందున్నవాఁడై పురాతనుఁ డనిపించుకొన్నవాఁడు. జీవులొనర్చు కర్మఫలములను అతిశయముగా నొసఁగువాఁడు వాఁడే. అందుచే ముక్తజగత్తునకుఁ గూడ నియామకుఁడై యున్నాఁడు. ఇట్టి శ్రీహరిని నీ వుపాసించితివి. అపరోక్షీకరించుకొంటివి. ఇట్లు నారాయణుని యనుగ్రహమునకుఁ బాత్రుఁడవైన నీకు సమస్తము నవగతమే. కనుక, నా యతృప్తికిఁ గారణ మేమని నీకుఁ దెలిసియే యుండును.

అవ : భగవదనుగ్రహ ప్రాప్తమైన యపరోక్ష జ్ఞానముచేతను సర్వత్ర అడ్డులేక సంచరించెడు సామర్థ్యముచేతను యోగాభ్యాసో పాత్తమైన శక్తితో సమస్తప్రాణుల శరీరములందుఁ బ్రవేశించుటను నీకు నా యతృప్తికిఁ గారణము దెలియుటకు సాధ్యమగునని వ్యాసుఁ డనుచున్నాఁడు.

అర్థము : అర్క ఇవ = సూర్యునివలె, త్రిలోకీం పర్యటన్ = ముల్లోకముల సంచరింపఁ గలవాఁడును, అంతశ్చరః = ఎల్లప్రాణుల దేహమందును సంచరించెడు, వాయురివ = ప్రాణవాయువువలె, ఆత్మ సాక్షీ = సమస్తప్రాణుల మనస్సున నుండు విషయము దెలియఁగల, త్వం = నీవు, పరావరే బ్రహ్మణి = పరబ్రహ్మయందును, అతనిని ప్రతి పాదించుటచే నపరబ్రహ్మయని పిలువఁబడెడు వేదరూపశబ్ద బ్రహ్మ యందును, ధర్మతః = వేదమందుఁ జెప్పఁబడినట్లు, భగవద్ధర్మాను ష్ఠానము నొనర్చుట చేతను, వ్రతైః = ఆ వ్రతానుష్ఠానమున కధికార మును గల్గించెడి వేదవ్రతాదికముల యనుష్ఠానముచేతను, స్నాతస్య = 1. పారంగతుఁడనైన 2. కృతకృత్యుఁడనైన, మే = నా యొక్క, న్యూనం = చేయవలసినది చేయకపోవుటచేఁ గొఱఁత యనిపించుకొను నవతారప్రయోజనమును, అలం = పూర్ణమగునట్టుగా, విచక్ష్వ = విశిష్ట మగు రీతిగా తెలుపుము. విచారించి తెలుపు మని సారము.

తాత్పర్యము : ఓయీ! నారదముని! నీవు సూర్యునివలె ముల్లోకములయందును నే యడ్డియు లేక సంచరింతువు. శరీరమందుఁ దిరిగెడి ప్రాణవాయువువలె, నీ వందరి మనస్సుల విచార సరణియుఁ దెలిసినవాఁడవు. నేను సర్వోత్తముఁడైన పరబ్రహ్మను జక్కగా విమర్శించి తెలిపితిని. ఆ పరబ్రహ్మను బ్రతిపాదించెడి యపరబ్రహ్మ యని ప్రసిద్ధమైన వేదమును గూడఁ జక్కగా నెఱిఁగితిని. వేదోక్తధర్మ ముల ననుష్ఠించి కృతకృత్యుఁడ నైనాను. దీనికెల్ల నధికార సంపదను కల్గించు వేదవ్రతములగూడ ననుష్ఠించితిని. సకలవిషయములందును బారంగతుఁడనైన నాకు ఏ కార్యన్యూనతతో మనస్సు తృప్తి నంద

కున్నదో విమర్శించి తెలుపుము. తృప్తిగల్గవలె నన్నుచో నే నేమి సేయ వలెనోకూడ నెఱింగింపుము. ఇట్లు, వ్యాసుఁడు భాషించుటతో నతఁ డజ్ఞుఁడని, యశక్తుఁడని, తెలియరాదు. నారదుని విజ్ఞానము పరి మితము. శ్రీహరివిజ్ఞాన మపరిమేయము. సర్వజ్ఞుఁడైనను బరమాత్ముఁ డజ్ఞునివలె నటించును. సర్వశక్తుఁడయ్యు నశక్తునివలెఁ గన్పించును. ఇదియే నిజమని యల్పులు భ్రమింతురు. సజ్జనులు కేవలము నటన యని భావించి యథార్థజ్ఞానమును బొంది ముక్తు లగుదురు.

అవ: సర్వజ్ఞుఁడైన వ్యాసుని మనోభావము నతని యను గ్రహముచేతనే తెలిసిన నారదుఁడు అజ్ఞజన మోహకముగా ప్రశ్నిం చిన వ్యాసునే యనుసరించుచు ఉత్తరము నిచ్చుచున్నాఁడు-

భవతా భగవతః-అమలం యశః అనుదిత ప్రాయం, భార తాదులందుఁ జెప్పఁబడినను జక్కఁగాఁజెప్పఁబడనిఁ యట్లే యైనది. సమాధి, దర్శనము, గుహ్యము అని మూఁడు భాషలు భారతమందు వాడఁబడుటచే నల్పబుద్ధులైన యధికారిచేతనులు దానిని దెలియు టసాధ్య మగుటచేత వారిపాలికి చెప్పనట్లేయైనది. యేన-మందాధి కారులకును దెలియునట్లు, భగవంతుని మహిమను బ్రతిపాదిం చెడు ఇంతవఱకును నీవు రచనసేయని ఏ శాస్త్రముచేత, అసౌ- ఆ నీ యొక్క, ఆత్మా-శరీరరూపమైన మనోరూపమైన యాత్మ, నైవ తుష్యేత-తృప్తిని బొందలేదో, తద్దర్శనం-అట్టు పరమాత్ముని యశ స్సును దెలిపెడి శాస్త్రమును, ఖిలం=తః యవతారమం దితవఱకును జేయఁబడక మిగిలిపోయినదని, మన్యే-నే ననుకొందును.

తాత్పర్యము: మోహకమైనరీతితోఁ బ్రశ్నించిన శ్రీహరి యభి ప్రాయము నెఱిఁగిన నారదుఁడు అతనివలెనే తానును నుత్తరమును గ్రొత్తగాఁ జెప్పఁబోవునట్లు వచించెను. వ్యాసమునీ! నీవు భారతాదు లందు శ్రీహరి యశోమహిమను వర్ణించితివి. కాని వానియందు సమాధి, దర్శన, గుహ్యము లనెడు ముత్తెఱఁగులైన భాష నుపయోగిం

చితివి. ఈ మూఁడువిధములైన భాషలను దెలియుట అజ్ఞులకు సాధ్యముకాదు. వారిపాలికి భగవద్యశస్సు అనుదితప్రాయమేయైనది. మందాధికారులకును, నర్థమగునట్లు తేటతెల్లముగా శ్రీహరి యశస్సును దెలుపు నొకశాస్త్రమైన నీ వింతవఱకు రచింపలేదు. అరచితమైన యా శాస్త్రమే నీ శరీరరూపమైన మనోరూపమైన ఆత్మకు శాంతి లేకుండఁ జేయుచున్నది. ఈ కారణముతో నీ వావిధమైన శాస్త్రము నిప్పుడు రచింపవలెను. నాకుఁ దోఁచు కారణ మిదే.

అవ: భారతాది శాస్త్రములందు శ్రీహరి యశస్సు వర్ణింపఁ బడినను మఱొక్క శాస్త్రరచన ఎందుకో వివరించుచున్నాఁడు-

అర్థము: మునివర్య!=1. సర్వజ్ఞులలో నుత్తముఁడా!, 2.మనన శీలురైన సర్వులచే గౌరవింపఁబడినవాఁడా!, 3 గొప్ప మననశీలురైన వారిచేతనే పొందుటకు సాధ్యమైనవాఁడా!, ధర్మాదయః=ధర్మాది పురుషార్థములు, యథా అనువర్ణితాః=భారతాదులందు సమస్తాధి కారులకును దెలియునట్లు మనస్సునకుఁ దృప్తి గలుగునట్లు వర్ణింపఁ బడినవో! తథా హి=అట్లుగా, వాసుదేవస్య మహిమా=శ్రీహరిమహిమ సర్వాధికారులకు దెలియునట్లును మనస్సునకుఁ దృప్తి గలుగునట్లును నాఽనువర్ణితః

విశేషము: భారతాదులందు ధర్మాదులకంటె నెక్కువగా శ్రీహరి యశస్సే వర్ణింపఁ బడినది. కాని మనస్తృప్తి గలుగలేదు. ధర్మాదులు స్వల్పముగాఁ జెప్పఁబడినను బూర్తిగాఁ జెప్పినట్లు తృప్తి యేర్పడవచ్చును. భగవద్యశము నెంతగాఁ జెప్పినను చెప్పితినని తృప్తి దొరకుట కష్టము. ఎంత వర్ణించినను వర్ణింపఁదగిన దింకను మిగిలియే యుండును. సజ్జనులకు శ్రీహరి మహిమయందే తాత్పర్యము. వారికిఁ దృప్తిగాఁ దెలిపిననే-తెలిపినట్లు. సూర్యోదయము గావలెనను నపేక్షగల వానికి శుక్రోదయముతోఁ దృప్తిగల్గదు గదా! ఈ విశేషమునే 'హి' యనుటతోఁ దెల్పినాఁడు.

యత్ = ఏ శాస్త్రము, జగత్పవిత్రం = హరేః యశః, కర్హిచిత్ = ఏ రీతిగనైనను, న గృణీత = ప్రతిపాదింపదో అట్టి శాస్త్రము, చిత్రపదం = అలంకారయుక్త పదములచేఁ గూడినదైనను, వచః = శాస్త్ర మనిపించికొనదు, కేవలము మాట లనిపించికొనును. యత్ర = ఏ గ్రంథమందు మానసాః = 1. బ్రహ్మదేవుని మనస్సునుండి పుట్టిన సనకాదులగు యోగులు, జ్ఞానులు, హంసాః = నిర్లేపులైన పరమహంసలు, మిమంక్షయాః = విచారరూపమైన స్నానమొనర్పవలెనను నిచ్ఛతో, నన్యపతన్ = ఆశ్రయించుట లేదో, తత్ = అట్టి, తీర్థం = శాస్త్రము, వాయసం = వయ స్సనెడు జీవనమును మాత్రమే నిర్వాహక మొనర్చెడు శాస్త్రముగా, ఉశంతి = చెప్పెదరు, యత్ర = ఏ తీర్థమందు, మానసాః = మానస సరస్సున విహరించెడు, హంసాః = పాలు నీరు వేర్పరచెడు సామర్థ్యమున్న హంసలు, మిమంక్షయాః = స్నానమాడు నిచ్ఛతో, నన్యపతన్ = ఆశ్రయింపవో, తత్ = అట్టి తీర్థమును, వాయసం తీర్థం = కాకులు మునిఁగెడు ఎంగిలినీరని, ఉశంతి = చెప్పెదరు.

తాత్పర్యము: హరిమహిమను దెలిపెడు శాస్త్రము కేవలజీవన నిర్వాహకము మాత్రమే యగును. సజ్జనులకు హరిమహిమ లేని శాస్త్రములం దాదరముండదు. వాని నింతవఱకుఁ జెప్పినది జాలును. అజ్ఞులు మాత్రమే యలంకారాది శాస్త్రములతో శ్రేయ మగునని తలఁతురు. జ్ఞాను లట్లూహింపరని తాత్పర్యము. 'న యత్ర హంసాన్యపతన్ మిమంక్షయాః' విజయధ్వజ పాఠము.

**పోతన్నగారు:**

ధాతవు భారత శ్రుతివిధాతవు వేదపదార్థజాల వి
జ్ఞాతవు కామముఖ్యరిపు షట్కవిజేతవు బ్రహ్మతత్త్వ ని
ర్ణేతవు యోగినేతవు వినీతుఁడ వీవు చలించి చెల్లరే!
కాతరుకైవడిన్ వగవఁ గారణమేమి పరాశరాత్మజా!

వ. అనినఁ బారాశర్యుం డిట్లనియె-

పుట్టితి వజు తనువునఁ జే
పట్టితివి పురాణపురుషు భజనము; పదముల్
మెట్టితివి దిక్కులం దుది
ముట్టితివి మహాప్రబోధమున మునినాథా!

వ. అదియునుం గాక నీవు సూర్యునిభంగి మూఁడులోక ములం జరింతువు. వాయువు పగిది నఖిల జనులలోన మెలంగు దువు. సర్వజ్ఞుఁడ వగుటం జేసి

నీ కెఱుఁగరాని ధర్మము
లోకములను లేదు బహువిలోకివి నీ పై
నా కొఱఁత యెట్టి దంతయు
నాకున్ వివరింపుమయ్య! నారద! కరుణన్.

వ. అనిన నారదుఁ డిట్లనియె-

అంచితమైన ధర్మచయ మంతయుఁ జెప్పితి వందులోన విం
చిందుకగాని విష్ణుకథ లేర్పడఁజెప్పవు ధర్మముల్ ప్రపం
చించిన మెచ్చునే! గుణవిశేషము లెన్నినఁ గాక నీకు నీ
కొంచెము వచ్చుటెల్ల హరిఁగోరి నుతింపమి నార్యపూజితా!

హరినామస్తుతి సేయుకావ్యము సువర్ణాంభోజ హంసావళీ
సురుచి భ్రాజితమైన మానససరస్స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామస్తుతి లేనికావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ
కరమై యుండ దయోగ్యదుర్మలినవత్కాకోల గర్తాకృతిన్.

అనేక పురాణ నిర్మాణము లొనర్చి కావ్యప్రపంచమున బ్రహ్మ దేవుఁడవే యైనావు (అభేదార్థము). భారత శ్రుతివిధాతవు. భారత= మహాభారత మనెడు, శ్రుతి=వేదమును, విధాతవు=నిర్మించినవాఁ డవు, వేదపదార్థజాల విజ్ఞాతవు = వేదపదార్థములకు సంబంధించిన,

పద=పదములయొక్క, అర్థజాల=అర్థసమూహముయొక్క, విజ్ఞాతవు= తెలిసినవాఁడవు, కామముఖ్య=కామము మొదలైన, రిపుషట్క=ఆర్గురైన అంతశ్శత్రువులను, విజితవు= జయించినవాఁడవు, బ్రహ్మ = పరబ్రహ్మయొక్క, తత్త్వ=స్వరూపస్వభావములను, నిర్ణేతవు=నిర్ణయించికొన్న వాఁడవు, యోగినేతవు = సమస్త యోగులకును నాయకునివంటివాఁడవు, వినీతుఁడవు = ఇన్ని యోగ్యతలున్నను వినయసంపన్నుఁడవైన, ఈవు=నీవు, చెల్లరే! (ఆశ్చర్యార్థకము) కాతరుకైవడిన్= పిఱికివానివలె, చలించి=మనస్స్థైర్యమును గోల్పోయి, వగవన్ కారణమేమి=దుఃఖించుటకుఁ గారణమేమి? పరాశరాత్మజా = పరాశరుని కుమారుఁడవైన వ్యాసమునీ!

విశేషార్థములు: భారత శ్రుతివిధాతవు - శ్రుతి యనఁగా వేదము. వేదములు నిత్యములు. వాని నెవ్వరును నిర్మించినవారు లేరు. భారతము శ్రుతితో సమానమైనదే గాని, కేవల శ్రుతి గాదు. దానిలోని శబ్దముల కూర్పంతయు వ్యాసునిదే. అర్థములు మాత్రమే వేదములకు సంబంధించినవి. అది శ్రుతి గాకున్నను విషయగౌరవమునుబట్టి శ్రుతులస్థానమును సంపాదించి కొన్నది. 'భరతా నధికృత్య కృతోఽయం గ్రంథం' భరతవంశీయుల చరిత్రలను వర్ణించునది భారతము. ఇది యొకవ్యుత్పత్తి. భారం చతుర్వేదాది శాస్త్రేభ్యోఽపి సారాంశం తనోతీతి భారతం. నాల్గు వేదములయందలి సమస్త శాస్త్రాదులందును గల సారాంశమును విస్తరించునది. ఇది రెండవ వ్యుత్పత్తి. మహాభారత శరీరము లక్షశ్లోకములు. భారతప్రాశస్త్యమిట్లు చెప్పఁబడినది.

నవనీతం యథా దధ్నో ద్విపదాం బ్రాహ్మణో యథా,
అరణ్యకం చ వేదేభ్యో ఓషధీభ్యో ఽమృతం యథా.

హ్రదానా ముదధిశ్శ్రేష్ఠో గౌర్వరిష్ఠా చతుష్పదామ్,
యథైతా నీతిహాసానాం తథా భారత ముచ్యతే.

తత్పారాయణ ఫల మిట్లు సంస్తుతము.

> భారతం శ్రుణుయాన్నిత్యం భారతం పరికీర్తయేత్,
> భారతం భవనే యస్య తస్య హస్తగతో జయః.
>
> యశ్చైనం శ్రావయేచ్ఛ్రాద్ధే బ్రాహ్మణాన్ పాదమంతతః,
> అక్షయ్య మన్నపానం వై పితౄన్ తస్యోపతిష్ఠతే.
>
> ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్,
> బిభేత్యల్ప శ్రుతాద్వేదో మా మయం ప్రహరిష్యతి.
>
> కార్ష్ణం వేదమిమం విద్వాన్ శ్రావయిత్వార్థ మశ్నుతే,
> భ్రూణహత్యాకృతం చాఽపి పాపం జహ్యాదసంశయః,
>
> యోగోశతం కనకశృంగమయం దదాతి
> విప్రాయ వేదవిదుషే సుబహుశ్రుతాయ,
> పుణ్యాంచ భారతకథాం శ్రుణుయాచ్చ నిత్యమ్
> తుల్యం ఫలం భవతి తస్యచ తస్య చైవ.

వేదపదార్థతత్త్వనిర్ణేతవు = వేదముల కర్థము చెప్పుట చాల కష్టము. లౌకిక సంస్కృతమునకు వ్యాకరణము వేఱు. వైదిక సంస్కృతమార్గము భిన్నము. దాని వ్యాకరణ నియమములు వేఱు. షడంగము లభ్యసించినవాఁడే వేదార్థనిర్ణయ మొనర్పఁగల్గును. శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్ప మని యా అంగములు. వైదికఛందస్సులే భిన్నములుగా నుండును. వేదములో స్వరము ముఖ్యము. స్వరభేదముతో బ్రహ్మాండమైన యర్థభేద మేర్పడును. పైఁగా పూర్వాపరవిరోధములు లేక యర్థకల్పన మొనర్పవలెను. ఈ నిర్ణయమునకే పూర్వమీమాంసాశాస్త్ర ముద్భవించినది. వేదములందలి పదములు వాని యర్థములు చక్కఁగాఁ దెలిసినవాఁడు వ్యాసముని. ఇతని శిష్యుఁడైన జైమినియే పూర్వమీమాంసాకర్త. బ్రహ్మతత్త్వనిర్ణేతవు — బ్రహ్మముయొక్క స్వరూప స్వభావములను

నిర్ణయించి యనుభవించినవాఁడవు; యోగినేతవు. యోగశబ్దము చాల వ్యాపకమైనది. సన్నహనము, ఉపాయము, ధ్యానము, సంగతి, యుక్తి అను నర్థముల నమరమే చెప్పినది. యోగశబ్దమునకు 'ప్రేమ' యను నర్థముగూడ నున్నది. ఛల మను నర్థమును గలదని మనువు. అపూర్వార్థసంప్రాప్తి, వపుస్థైర్యము, ప్రయోగము, విష్కంభాదులు, భేషజము. ఇఁక నిట్టివే పలికొన్ని. జ్యోతిష్కుల యోగ మొకటి. క్రియాయోగము ఇంకొకటి. గారుడములో ఖాండిక్య-కేశిధ్వజ సంవాదమునందు నిది విపులముగా వర్ణింపఁబడినది. ఖాండిక్య-కేశిధ్వజ సంవాదము విష్ణుపురాణమందుఁ గూడ వచ్చును. దానినే యాముక్తమాల్యదలో రాయలు ప్రపంచించెను. భగవద్గీత యందే సుమారు పదికిపైఁగా యోగములు చెప్పఁబడినవి. సాంఖ్య యోగము, కర్మయోగము, కర్మసన్న్యాసయోగము, సన్న్యాసయోగము, రాజగుహ్యయోగము మొదలగునవి. కలియుగమందు యోగ సిద్ధిలేదని కాశీఖండ మనుచున్నది-

న సిద్ధ్యతి కలౌ యోగో న సిద్ధ్యతి కలౌ తపః

కనుక కలియుగమందు యోగసిద్ధి లేదనియే యర్థము. భాగవత మందే ఏకాదశస్కంధములోఁ గొన్ని యోగములు చెప్పఁబడినవి.

శ్రీ భగవానువాచ :

యోగాస్త్రయో మయా ప్రోక్తా నృణాం శ్రేయోవిధిత్సయా,
జ్ఞానం కర్మ చ భక్తిశ్చ నోపాయోఽన్యోఽస్తి కుత్రచిత్.

నిర్విణ్ణానాం జ్ఞానయోగో న్యాసినా మిహ కర్మసు,
తేష్వనిర్విణ్ణ చిత్తానాం కర్మయోగస్తు కామినామ్.

యదృచ్ఛయా మత్కథాదౌ జాతశ్రద్ధస్తు యః పుమాన్,
న నిర్విణ్ణో నాతిసక్తో భక్తియోగోఽస్య సిద్ధిదః.

తావత్కర్మాణి కుర్వీత ననిర్విద్యేత యావతా,
మత్కథాశ్రవణాదౌ వా శ్రద్ధా యావన్న జాయతే.

స్వధర్మస్థో యజ న్యజ్ఞై రనాశీః కామ ఉద్ధవ,
న యాతి స్వర్గనరకౌ యద్యన్యన్న సమాచరేత్.

అస్మిన్ లోకే వర్తమానః స్వధర్మస్థో ఒనఘ శ్శుచిః,
జ్ఞానం విశుద్ధ మాప్నోతి మద్భక్తిం వా యదృచ్ఛయా.

న నరః స్వర్గతిం కాంక్షే న్నారకీం చ విచక్షణః,
నేమం లోకంచ కాంక్షేత దేహావేశాత్ప్రమాద్యతి.

ఏతద్విద్వా న్పురామృత్యో ర్భవాయ యతేత సః,
అప్రమత్త ఇదం జ్ఞాత్వా మర్త్యమప్యర్థ సిద్ధిదమ్.

కనుక పోతనామాత్యుఁడు ఇక్కడ ఏ విధమైన యోగము పేశించినాఁడో మనకుఁ దెలియదు. బ్రహ్మతత్త్వనిర్ణేత వను విశేష ణతో జ్ఞానయోగ మనుకొనవచ్చును. భారతాది రచనముతోఁ గర్మ గాగముగా భావింపవచ్చును. భక్తిప్రధాన భాగవతనిర్మాణముతో యోగ మని తలఁపవచ్చును. ఇంతకును వ్యాసుఁడు భగవదవ రము. అతని దే యోగమని నిర్ణయింపఁగలము?

కాతరు కైవడిన్ = పిఱికివానివలె, వగవన్ = దుఃఖించుటకుఁ రణమేమి?

పారాశర్యుఁడు = పరాశరుని కుమారుఁడు.

అజు తనువునన్ = బ్రహ్మశరీరమునుండుఁ బుట్టితివి. పురాణపురుష నమున్ = 'పురుషః పురాణః' అని మూలము.

శ్రీమన్నారాయణమూర్తి భజనమును, చేపట్టితివి = అవలం చితివి, దిక్కులన్ పదముల్ మెట్టితివి, సమస్త దిక్కులందును ర్యునివలె సంచరించుచున్నావు. పదముల్ = కిరణములు, పాద లు. 'త్వం పర్యటన్నర్క ఇవ త్రిలోకీం' అని మూలము. మహా బోధమునన్ = గొప్పజ్ఞానమునందు, తుది ముట్టితివి = పరాకాష్ఠనందు న్నావు.

తాత్పర్యము: నారదముని! నీవు బ్రహ్మశరీరమునుండి జన్మించితివి. 'ఆత్మ భవాత్మభూతం' అని మూలము. పురాణపురుషుఁడైన శ్రీమన్నారాయణమూర్తిని నిరంతరము సేవించుచుందువు. సూర్యుని వలె సమస్త లోకములఁ దిరుగుచుందువు. మహాజ్ఞానివి.

సూర్యునిభంగి=సూర్యునివలె, వాయువు పగిది=వాయువువలె.

తాత్పర్యము: నారదా! నీవు సూర్యునివలె లోకములఁ జరింతువు. వాయువువలె సంతశ్చరుఁడవు. సమస్త బుద్ధివృత్తులను జక్కఁగా నెఱుఁగుదువు.

బహువిలోకివి=అనేక విషయములను జూచి గొప్ప యనుభవమును గడించినవాఁడవు.

తాత్పర్యము: నీ వెఱుఁగనట్టి భాగవతధర్మము లేదు. ఎందరి జీవితములనో చూచి ఎన్ని విషయములనో గ్రహించితివి. నా న్యూనత యేమియో తెలుపుము.

అంచితమైన=ఒప్పుచున్న, ధర్మచయము=ధర్మముల సమూహము, అంతయుఁ జెప్పితివి=సమగ్రముగా వర్ణించితివి. అందులోనన్=ఆ ధర్మచర్చలో, ఇంచించుకగాని=కొంచెము కొంచెమే తప్ప, విష్ణుకథలు=విష్ణు యశోమహిమను సూచించెడు కథలు, ఏర్పడన్=స్పష్టముగా, అతిశయముగా. చెప్పవు=చెప్పకపోయితివి, ధర్మముల్ ప్రపంచించినన్=ధర్మములను విస్తారముగా వర్ణించినచో, మెచ్చునే=భగవంతుఁడు సంతోషపడునా?, ఈ కొంచెము హరిఁ గోరినుతింపమి=శ్రీహరిని గొప్పగా స్తుతింపకపోవుటవలన, అర్యపూజితా!=పెద్దలచే పూజింపఁబడినవాఁడా!

తాత్పర్యము: వ్యాసముని! ధర్మాదులను విపులముగా వర్ణించితివి. కాని, వాసుదేవుని మహిమను గొప్పగావర్ణింపలేదు. కేవలము ధర్మములను జెప్పినంతమాత్రమునఁ బుండరీకాక్షుఁడు సంతోషింపఁడు

తద్వాగ్విసర్గో=ఆ వాక్ప్రయోగము, జనతాఽఘవిప్లవః=జనుల పాపములను నశింపఁజేయునది. అబద్ధవతి అపి=చక్కనిపరస్పరసంబంధము లేనిదైనను యస్మిన్=దేనియందు, ప్రతిశ్లోకం=ప్రతిశ్లోకమును, యశోంకితాని=కీర్తితోఁగూడిన, అనంతస్య=గోవిందునియొక్క నామము లుండునో, యత్=దేనిని, సాధవః=సత్పురుషులు, శృణ్వంతి=విందురో, గృణంతి=పఠింతురో, గాయంతి=కీర్తింతురో.

అవ. పదములకుఁ బరస్పరసంబంధము లేకున్నను వైచిత్రినిగూర్చు నాలంకారిక సౌందర్యములు లేకున్నను భగవద్యశస్సును ప్రధానముగ వర్ణించునదైనచో నా వాగ్విసర్గము పరిశుద్ధమైనదని చెప్పుచున్నాఁడు—

అసంబద్ధమైన దైనను, ఏ వాక్ప్రయోగము భగవంతుని వాత్సల్యాది గుణములను, ప్రకాశింపఁజేయు నామములతో నడుగడుగునను గూడియుండునో ఆ వాగ్విసర్గము జనుల సమస్త పాపములను గడిగివేయును. ఆద్యంతము పరిశుద్ధులైన సత్పురుషులు ఆ నామములను యోగ్యుఁడైన పురుషుఁడు దొరకిన వానినుండి విందురు. ఒక్కొక్కపరి చక్కని శ్రోతలున్నఁ దామే ప్రవచింతురు. ఇర్వురును లేకున్నచోఁ దామే మైమఱచి సంకీర్తన మొనర్తురు.

నైష్కర్మ్య మప్యచ్యుత భావవర్జితం
న శోభతే జ్ఞానమలం నిరంజనమ్,
కుతః పునశ్శశ్వదభద్ర మీశ్వరే
న చార్పితం కర్మయదప్య కారణమ్. 12

నైష్కర్మ్యం అపి=నిష్కామతారూపమైన దైనను, నిరంజనం=ఉపాధిభూతమైన యజ్ఞానమును నశింపఁజేయున దయ్యును, జ్ఞానం=జ్ఞానము, అచ్యుతభావవర్జితం=హరిభక్తిరహితమైనచో, అలం=పూర్ణముగా, న శోభతే=శోభింపదు, శశ్వత్=నిరంతరమును, అభద్రం=మంగళకరముగానిదైన, కర్మ=కర్మమును, అకారణం=కారణరహితమైన కర్మముగూడ, ఈశ్వరే=ఈశ్వరునియందు, న చార్పితం=సమర్పితము గానిచో, పునః కుతః=ఇకఁ జెప్పవలసిన దేమున్నది.

అవ. భక్తిరహితమైన ఏ కార్యమును నిష్ప్రయోజనమే. ఈ విషయమునే కైముత్యన్యాయముతో వర్ణించుచున్నాఁడు.

జ్ఞానము బ్రహ్మాకారప్రాపకము. సమస్త సంసారక్లేశములకును ఆదికారణమైన యజ్ఞానమును మూలమట్టుముగ నశింపఁ జేయును. అదిగూడ భక్తితోఁగూడినది గానిచో సరియైన యపరోక్షానుభవమును గల్గించుటకు సమర్థము గానేరదు. సత్య మిట్లుండఁగా సాధనకాలమందును, ఫలకాలమందును కామ్యరూపమగుటచే దుఃఖకారణ మైనదియు కామ్యవర్జితమైనను ఆ కర్మము ఈశ్వరార్పితము గానిచో నది సత్కర్మముగా భాసింపదు. ఈశ్వరార్పితము గాని ఏ కర్మయును నిష్ప్రయోజన మని భావము.

అథో మహాభాగ భవా నమోఘదృక్
శుచిశ్రవాః సత్యరతో ధృతవ్రతః,
ఉరుక్రమస్యాఖిల బంధముక్తయే
సమాధినానుస్మర తద్విచేష్టితమ్. 13

అథో—అందువలన, మహాభాగ!—గొప్పభాగ్యవంతుఁడవైన వ్యాసమునీ! అమోఘదృక్—నీ వమోఘ దృష్టిఁగలవాఁడవు, శుచిశ్రవాః—పరిశుద్ధమైన కీర్తి నీకున్నది, సత్యరతః—సత్యానుభవమందును, దాని వివరణమందు మాత్రమే యాసక్తిఁగలవాఁడవు, ధృతవ్రతః—నిరంతర వ్రతనిష్ఠుఁడవు. (ఇట్టి) భవాన్—నీవు అఖిల బంధముక్తయే—సకలజనుల బంధవిముక్తి కొఱకు, ఉరుక్రమస్య—బహువిధములైన యవతారలీలలుగల యీశ్వరునియొక్క తద్విచేష్టితం— ఆ యా వ్యాపారమును, సమాధినా—సమాధ్యవస్థతో, అనుస్మర!—స్మరింపుము.

అవ: భక్తిశూన్యములైన జ్ఞానము, వాక్చాతుర్యము, కర్మకౌశలము—సమస్తమును వ్యర్థ మగుటచే శ్రీహరి చరిత్రనే వర్ణింపవలెనని వచించుచున్నాఁడు—

ఓ మహాభాగ్యశాలివైన మునీ! నీ వమోఘదృష్టిఁగలవాఁడవు. పరమపవిత్రమైన కీర్తిని సముపార్జించుకొన్న వాఁడవు. సత్యమునే

యనుభవించుటందును, వచించుటందును మేటురివి. వ్రతనిష్ఠాగరిష్ఠ
డవు. అట్టి నీవు నానా విధములగు లీలలతో సృష్ట్యాది కార్యము
లొనర్చు నా యురుక్రమునియొక్క ప్రతిచేష్టయును, సమాధిస్థితిలో
భావించి, సకలజీవుల యభ్యుదయము కొఱకు వర్ణింపుము.

తతోఽన్యథా కించన యద్వివక్షతః
పృథగ్దృశస్తత్కృత రూపనామభిః,
న కుత్ర చిత్క్వాపిచ దుఃస్థితా మతిః
లభేత వాతాహతనౌ రివాస్పదమ్. 14

తతః—అందుచేత, పృథగ్దృశః—భిన్నదృష్టితో సమస్తమును జూచువాఁడును, అన్యథా—వేఱువిధముగా, కించన—దేనినైనను, యత్—ఒకానొక దానిని, వివక్షతః—వచింపఁగోరువానియొక్క—, మతిః—మనస్సు, తత్కృతరూపనామభిః—దానిచే నేర్పడిన రూపములు నామములు— వీనివలన, దుఃస్థితాః—దుఃఖముతోఁగూడినదై, క్వాఽపి—ఒకచోటను, కుత్రచిత్—ఒకదానియందును, వాతాహతనౌరివ—గాలిచే నిటునటుఁగొట్టఁబడిన నావవలె, అస్పదం—స్థానమును, నలభేత—పొందదు.

అవ. భవత్కథను విడచి, అన్యకథా ప్రస్తావముతో నేర్పడు దోషమును జెప్పుచున్నాఁడు—

ఈశ్వరుని బహువిధలీలలే సృష్టి స్థితి సంహారములు. ఈ యేక దృష్టి గలిగియుండవలెను. దీనిని వదలి నానా ప్రకారములైన బుద్ధులతో ననేక కారణములను జెప్పుట కారంభించు వానికి చిత్తశాంతి యేర్పడదు. బహురూపములు బహునామములు వానిని భ్రమింపఁజేయును. అందుచే వానిబుద్ధి కొకచోటను సుఖము దక్కదు, ఉపశాంతి లభింపదు. వాతాహతమైన పడవవలె నొకచోట నిలువదు. ఒకయెడ నిలుకడ యొకచో స్థానము దొరకమియు జరుగును. ఒక్కొక్కసారి యొక్కొక్కకారణము దోఁచును. ఒకటియు స్థిరముగ నుండదు.

జుగుప్సితం ధర్మకృతే ఽనుశాసతః
స్వభావరక్తస్య మహాన్ వ్యతిక్రమః,
యద్వాక్యతో ధర్మ ఇతీతర స్థితో
న మన్యతే తస్య నివారణం జనః. 15

జుగుప్సితం-నిందితమైన దానిని, స్వభావరక్తస్య-సహజముగాఁ గ్రియా ఫలములందిచ్చుగలవానికి, ధర్మకృతే-ధర్మమని, అనుశాసతః-అనుశాసించుచున్న తవ-నీకు, మహాన్-గొప్ప, వ్యతిక్రమః-ధర్మాతిక్రమణము సంభవించును, యద్వాక్యతః-ఏ నీ యనుశాసనముచేత, ధర్మ ఇతి-తాననుసరించుచున్నది ధర్మమని, స్థితః-నిశ్చయముతోఁ గూడిన, ఇతరః-ప్రాకృతుఁడైన, జనః-జనుఁడు, తస్య-దానియొక్క, నివారణం-నివారణము, న మన్యతే-భావింపనే భావింపఁడు.

అవ: శ్రీహరికీర్తనము నుపేక్షించితివి. భారతాదులందు వర్ణింపఁబడిన గృహస్థాశ్రమాదికృత్యములతే గొప్ప లోకోపకారము లైనవి అను నీ సంతోషము సమర్థనీయము గాదు. ఆ యాశ్రమాదుల వర్ణనముతో జరిగిన లోకోపకారము సమగ్రమైనది గానేరదు. పైఁగా సామాన్య నపమార్గముఁ బట్టించుటచే నన్యాయము గూడ నగును. ఆ విషయమునే చెప్పుచున్నాఁడు-

తాత్పర్యము: సామాన్యమానవుఁడు కామ్యకర్మలందు స్వాభావికముగా రతుఁడు. అవి నింద్యములు. ఎందు కందువా? సంసార క్లేశములను దప్పించికొనుట కది మార్గము గాదు. అది వేఱుగా నుండును. కర్మముతోనో, సంసారలాభముతోనో, ధనార్జనముతోనో, దానాదులతోనో యెవ్వరికిని సంసారవిమోచన మేర్పడదని ' శ్రుతిమాతయే చెప్పుచున్నది గదా! నీవు భారతాదులందుఁ జెప్పిన ధర్మములనే నమ్ముకొన్న జనులకు పై శ్రుతివాక్యములందుఁ బ్రత్యయఁ మేర్పడదు. కనుకఁ బ్రవృత్తిమార్గమును ధర్మముగా ననుశాసించుట క్రమమే యైనది.

శ్రీధరీయము:

పదచాతుర్యము మొదలైన గుణములు లేకున్నను భగవద్యశః ప్రధానమైన వాక్కే పరమ పవిత్రమని చెప్పుచున్నాఁడు—

అర్థము: వాచః విసర్గః=వాగ్విసర్గః = వాక్కుయొక్క ప్రయోగము. జనతాఽఘవిప్లవః=జనులసమూహము జనత, దానియొక్క, అఘం = పాపమును నాశ మొనర్చునది. 'ప్రతిశ్లోకం అనంతస్య యశోంకితాని నామాని భవంతి' ప్రతి శ్లోకమునందును శ్రీనివాసుని యశస్సుచేఁ గూడిన నామములు వచ్చుచున్నవి. ఆ నామములను సత్పురుషులు వక్తయున్నప్పుడు వానినుండి విందురు. యోగ్యుఁడైన శ్రోత యున్నప్పుడు, గృణంతి=వివరింతురు. లేనప్పుడు స్వయముగనే పాడికొందురు.

అవ: భక్తిహీనమైన జ్ఞానము, కర్మ రెండును దక్కువే యని చెప్పుచున్నాఁడు—

నైష్కర్మ్యం=నిష్కర్మ బ్రహ్మ, తదేకాకారత్వాత్ =నిష్కర్మతా రూపం నైష్కర్మ్యం'. నిష్కర్మమైనది బ్రహ్మ. దానితో నేకాకారము నందుట వలన నిష్కర్మతారూపమైనది. అదే నైష్కర్మ్యము. అనఁగా జ్ఞానము. నిష్కర్మతారూపమైన బ్రహ్మైకాకారత్వమును గల్గించునని యర్థము. 'అజ్యతే అనేనేతి అంజనం ఉపాధి' తన్నివర్తకం నిరంజనం. 'సమస్తములైన యుపాధులను దొలఁగించునది జ్ఞానము. అచ్యుతభావవర్జితం=అచ్యుతుఁడు=చ్యుతి లేనివాఁడు. వానియందు భావ మనఁగా భక్తి, అదిలేనిదై; అలమత్యర్థం న శోభతే; ప్రకాశింపఁ దగినట్లుగాఁ బ్రకాశింపదు. అనఁగా సమ్యగమైన యపరోక్షానుభూతిఁ గల్గింపదని తాత్పర్యము. కామ్యకర్మ=సాధన కాలమందును, ఫలకాల మందును దుఃఖరూప మైనది, కామ్యము గాని కర్మ గూడ నీశ్వరార్పితము గానిచో నదియు విఫలమగును. బహిర్ముఖ మగుటచే సత్త్వ శోధక సమర్థముగాదు.

అవ : భక్తిశూన్యములైన జ్ఞానము, వాక్చాతుర్యము, కర్మ కౌశలము సమ సము వ్యర్థమే. కనుక హరిచరితమే వర్ణింపు మను చున్నాఁడు–

'అమోఘదృక్ = అమోఘా యథార్థా దృక్ ధీః యస్యసః'= యథార్థమగు బుద్ధిఁ గలవాఁడు, 'శుచిశ్రవాః–శుచిశ్రవః యస్యసః' =శుద్ధమగు కీర్తిఁ గలవాఁడు, 'సత్యరతః' 'ధృతాని వ్రతాని యేన సః' = ఎవనిచే వ్రతములు ధరింపఁబడినవో వాఁడు. ఇవన్నియు వ్యాసునిమహాభాగ్యమును నిరూపించు విశేషణములు. ఉరుక్రమస్య– చిత్రములైన లీలావిలాసములు గలవాఁడు. వివిధం=అనేకవిధములైన, చేష్టితం–లీలావైచిత్ర్యములు గలవాఁడు, సమాధినా–చిత్తైకాగ్రతతో, అఖిల బంధముక్తయే–సమస్తజనుల సంసార విమోచనము కొఱకు, త్వం అనుస్మర ! =నీ వాలోచించి వర్ణింపుము అని యర్థము.

ఈ శ్లోకమందు భవచ్ఛబ్దయోగ మున్నది. భవచ్ఛబ్దప్రయోగ మందు మధ్యమపురుషకు బదులు ప్రథమ పురుషక్రియ రావలెను. అనుస్మర అని మధ్యమపురుష ప్రయోగింపఁబడినది(క్రియ). ఈ శ్లోక మును రెండు వాక్యములుగా నన్వయించి కొనవలెను. 'భవాన్ అమోఘదృక్ శుచిశ్రవాః, సత్యరతః ధృతవ్రతః అస్తి'. ఇది యొక వాక్యము. అఖిల బంధముక్తయే ఉరుక్రమస్య యద్వివేష్టితం సమాధి నాఽనుస్మర ! అని రెండవవాక్యము.

ఉరుక్రమచేష్టితము కన్నను భిన్నమైన దృష్టిగల వానికి 'అన్యథా కించిన యద్వివక్షితః' ప్రకారాంతరముగా నర్థాంతరమును జెప్పెడు వానికి, తయా వివక్షయా–ఆ చెప్పుటచేత స్ఫురితములైన వ్యక్తములుగా నుపస్థితములైన నామములచేత, దుఃస్థితా=అనవస్థిత మైన బుద్ధి, కదాచిత్ =ఒక్క విషయమునందును, అస్పదం న లభేత– స్థానమును బొందదు.

వ్యవసాయాత్మికాబుద్ధి రేకేహ కురునందన,
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయో ఒవ్యవసాయినామ్.

అని గీతావాక్యము.

హరియశస్సును విడిచి భారతాదులందుఁ జెప్పఁబడిన ధర్మాది వర్ణనము అకించిత్కర మనుచున్నాఁడు. అంతమాత్రమే గాదు. విరుద్ధముగఁ బరిణమించిన దనియు భావము. జుగుప్సితం = నింద్యమైన కామ్యకర్మాదులు, స్వభావరక్తస్య = స్వభావముగనే వానియం దాశ గలిగిన పురుషునకు, ధర్మకృతే అనుశాసతః = ధర్మమని చెప్పిన నీకు, మహాన్ వ్యతిక్రమః = గొప్ప శాస్త్రోల్లంఘన మేర్పడినది. ఎందువలన ? యద్వాక్యతః = ఏ నీ యనుశాసనమువలన, ఇతర ప్రాకృతజనులు ఆ కామ్యకర్మలనే ధర్మముగా భావింతురు. ఎవఁడైన తత్త్వజ్ఞుఁడు నివారింపఁ బూనుకొన్నను వానిమాట వినరు. వారికిని దోఁపదు. 'న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వ మానశుః' అను శ్రుతివాక్యమును గూడ గౌరవింపరు. పై వాక్యము ప్రవృత్తి మార్గమం దధికారము లేని వారికే యని వ్యాఖ్యానింతురు. అట్లే వ్యాఖ్యానించినవారును లేకపోలేదు.

తత్రైవం శక్యతే వక్తుం యేఒంధపంగ్వాదయో నరాః,
గృహస్థత్వం న శక్యంతి కర్తుం తేషా మయం విధిః.
నైష్ఠికబ్రహ్మచర్యం వా పరివ్రాజకతాపి వా,
తైరవశ్యం గృహీతవ్యం తేనాదావే తదుచ్యతే.

విజయధ్వజము :

అవ : అతిశయముగఁ జెప్పఁబడినను వాసుదేవుని మహిమతో మనస్సునకుఁ దృప్తి యేర్పడని కారణమును జెప్పుచున్నాఁడు-

యస్మిన్ = ఏ గ్రంథమందు, ప్రతిశ్లోకం అబద్ధవత్యపి - 1. అప శబ్దములతోఁ గూడుకొన్నదై, వైయాకరణులకు జుగుప్సను గల్గించున

దైనను, 2. చిత్రపదము మొదలైన శబ్దరచనా కౌశల్యములు లేకు న్నను, అనంతస్య=దేశ కాల గుణాదులతో నంతరహితుఁడైన శ్రీహరి యొక్క, యశోంకితాని=పారిజాతాపహరణము మొదలైన క్రియలు వానిచే సంపాదితమైన కీర్తిచేఁ గూడిన, నామాని='నారాయణ' మొదలైన శబ్దములు (సంతి=ఉన్నవో), చ=ఇంకను, యత్=దేనిని, సాధవః=పరమభక్తులు=శుకుఁడు మొదలైనవారు, శృణ్వంతి గృణంతి గాయంతి సః=అట్టి ఆ గ్రంథమే, జనతాఘవిప్లవః=జనసమూహపు పాపములను బోఁగొట్టుటతో, వాగ్విసర్గః=మాటలయొక్క విశిష్ట రచన యనిపించుకొను లేక ఆ మాటల విశిష్ట రచనయే జనసమూహముల పాపములఁ బోఁగొట్టి మోక్షప్రాప్తిని గల్గించునని నిశ్చయింపఁబడినది.

ఏ గ్రంథమునందలి శ్రీహరి నామములను భక్తులు శ్రద్ధతో శ్రవణ మొనర్తురో అట్టిదే గ్రంథ మనిపించుకొనును. సమస్త జనుల పాపములను బోఁగొట్టుటచేతను సజ్జనులు స్వీకరించుటచేతను శ్రీహరి మహిమాదుల వర్ణించుటచేతను శాస్త్ర మనిపించుకొనునదే గ్రంథము; తక్కినది కాదు. కనుక శాస్త్రకారు లట్టిరచనమునే యొనర్పవలెనని భావము. 'భక్త్యర్థం భగవన్మహిమోక్తి' అన్నట్లు భగవన్మాహాత్మ్య వర్ణనము భక్తిమూలమున మోక్షకారణ మగును.

తాత్పర్యము: భగవంతుని మహిమను దెలిపెడి వాక్యరచనయే విశిష్టమైన కృతి యనిపించుకొనును. అట్టి గ్రంథము నాదరించు చునే పరమభక్తులైన శుకాదులు భగవంతుని మహిమలను విందురు. ఉపన్యసింతురు. తామే గాన మొనర్తురు. ఆ గ్రంథమున కట్టి వైశి ష్ట్యము భగవన్మహిమచేతనే యేర్పడినది. తన్మహిమ సకల సజ్జనుల పాపములను పరిహరించి మోక్షమునకుఁ గావలసిన సాధనములనన్ని టిని సమకూర్చి తత్ప్రాప్తికిఁ దోడ్పడును. ఆ గ్రంథమందుఁ బ్రతిశ్లోక మందు నపశబ్దములే యుండవచ్చును. వైయాకరణులు దానినిజూచి చీఁదటించి కొనవచ్చును. ప్రతిశ్లోకమును శబ్దార్థాలంకార రహితమై

సామాన్యవాక్యములవలె నుండవచ్చును. కాని దేశ కాలానుగుణాదులతో నంతరహితుఁడైన శ్రీహరి యశోవర్ణనముతో నదియే శ్రేష్ఠగ్రంథమనిపించికొనును. అదే శాస్త్రము. భగవన్మాహాత్మ్య జ్ఞానముతో భక్తి యేర్పడి దానినుండి మోక్షము గల్గుట కవకాశము గల్గుచున్నది.

అవ: వాసుదేవుని యశోవర్ణనము లేని శాస్త్రరచన వ్యర్థమనుట మాత్రమే గాదు. హరిభక్తిలేని నిర్నిమిత్తమైన జ్ఞానము, కర్మమొదలైనవి గూడ వ్యర్థములే యని వచించుచున్నాఁడు-

అర్థము: నైష్కర్మ్యం=కర్మరహిత మనిపించుకొనెడు, మోక్షమునకు స్వతస్సాధనమైన, అలంనిరంజనం=విషయస్పర్శ యనెడు మలసంబంధములేని (అత్యంత విరక్తియుక్తమై వేదార్థవిషయకమైన) 2. సంపాదనకాలమందు దోషస్పర్శ లేనట్టి, జ్ఞానం=శ్రీహరి విషయకమైన పరోక్షజ్ఞానము, అపి=కూడ. అచ్యుతభావవర్జితం=1. అచ్యుతుఁడైన శ్రీహరియందు భక్తి లేకపోయినచో, 2. వాసుదేవునియందు మనస్సును నిరంతరమును జేర్చకున్నచో, న శోభతే=అధికారిచేతనుని యభీష్టఫలమును సమకూర్చ నేరదు. అకారణం యద్యపి=ఫలాపేక్ష లేనిదైనను, శశ్వత్ అభద్రం=1. ఎప్పుడును బంధక మగుటతో నమంగళకరమైన, 2. సాధనకాలమందు దోషయుక్తమైన, 3. అనుష్ఠానకాలమందును ఫలకాలమందును గూడ నమంగళకరమైన, కర్మ=ఆచరింపఁబడిన కర్మము, ఈశ్వరే=శ్రీహరియందు, న చార్పితం=సమర్పింపఁ బడకున్నచో, న శోభతే ఇతి=మోక్షకారణము గానేరదు, కుతః పునః (వక్తవ్యం)=మఱి చెప్పవలసిన దేమున్నది? మోక్షసాధనములలో జ్ఞానము కర్మానుష్ఠానము కంటెను గొప్పదని ప్రసిద్ధము. హరిభక్తి లేకున్నచో నిట్టి జ్ఞానముగూడ మోక్షసాధనము గానేరదు అన్నప్పుడు హరిభక్తి లేని యాచరితములైన నిష్కామ - సకామకర్మములు మోక్షకారణములు గాఁజాలవని వేఱుగాఁ జెప్పవలసినది లేదు. కనుక భగవత్స్వరూపజ్ఞానము నివృత్తికర్మములు వీనిచేతనే మోక్షము

లభించుట సిద్ధాంతమైనప్పుడు భగవద్భక్తిని గల్గించు తన్మాహాత్మ్య ప్రతిపాదకవర్ణన కగత్యమేమను ప్రశ్నగూడ పరిహృతమైనది. భక్తి లేనప్పుడు మోక్షము నొసఁగలేవు. ఈ శ్లోకమందలి జ్ఞాన మను శబ్ద మునకు పరోక్షజ్ఞాన మనియే యర్థము. అపరోక్షజ్ఞాన మని గాదు. అప్పుడు అచ్యుతభావవర్జితం అను విశేషణ మర్థరహితమగును. భగవ ద్భక్తిచేతనే యపరోక్షజ్ఞాన మేర్పడును. 'యస్య దేవే పరా భక్తిః' ఎవనికి భగవంతునియందు సర్వోత్తమమైన భక్తిగలదో, 'య మేవైష వృణుతే తే న లభ్యః', 'తస్యైష ఆత్మానివృణుతే తనూం స్వాం' ఎవనినిఁ బరమాత్ముఁడు భక్తునిగా స్వీకరించునో వానికిమాత్రమే తన యప్రాకృతరూపము నపరోక్ష మొనర్చును. ఇత్యాది వాక్యములతో నపరోక్షజ్ఞానమునకు ముందు శ్రీహరిభక్తి యుండవలె ననుట స్పష్ట మగుచున్నది.

తాత్పర్యము: శ్రీహరి మహిమను జెప్పని శాస్త్రరచనము వ్యర్థము, అంతమాత్రమే గాదు. స్వాభావికముగా మోక్షకారణమైన పరోక్షజ్ఞానముగూడ వైకుంఠునందు నిరంతరమనోభావన లేకున్నచో తీవ్రభక్తి లేకున్నచో నెప్పటికిని మోక్షకారణము గానేరదు. ఆ జ్ఞానము వైరాగ్యయుక్తమై యుండవచ్చును. వేదార్థశోభితము గావచ్చును. కాని హరిభక్తి లేకున్నచో నరణ్యరోదనమే. జ్ఞానముయొక్క పరి స్థితియే యిట్లున్నప్పుడు దానికన్న నముఖ్యసాధనమైన నిష్కామ కర్మము కథ యేమని చెప్పవలెను? దానికి మోక్షకారణత్వ మెచ్చటు నుండి వచ్చును? భక్తిపూర్వకముగా శ్రీహరియందే సమర్పింపఁబడి నప్పుడే నిష్కామకర్మ మోక్షకారి. ఇట్లున్నప్పుడు బంధకారణమైన సర్వదా అమంగళకరమైన కామ్యకర్మము, హరిభక్తి రహితమైనప్పుడు మోక్షము నొసఁగలేదని వేఱే తెల్పవలెనా? కనుక భగవత్స్వరూప జ్ఞానము, నిష్కామకర్మ ఈ రెండుమాత్ర మున్నఁ జాలును. మోక్షము కరతలామలకము. భక్తిని గాని భక్తిని గల్గించు భగవన్మహిమ శాస్త్ర

రచనమును గాని యాదరింపవలసిన పని లేదనుట వితండావాదమే. భక్తి లేనిచో నీ పరోక్షజ్ఞానము శశవిషాణము. భగవంతుఁ డొకనిని భక్తునిగా స్వీకరించినపుడే తన యప్రాకృత స్వరూపమును వానికి వ్యక్తపఱచును. మానవుని కేవల పురుషకారముతో మోక్షప్రాప్తి యగుననుట ఇనుమునఁ దైలమును దీయుట.

అవ: ఇప్పుడు వేదవ్యాసుని మనస్సునకుఁ దృప్తిని గల్గించు మార్గమును విజ్ఞాపించుచున్నాఁడు

హే మహాభాగ అతః_ పైఁ జెప్పినట్లు, హరిభక్తి రహితమైన కర్మజ్ఞానములు నిష్ఫలము లగుటవలన ధర్మము మొదలగు విషయములను స్వల్పముగఁ జెప్పినను దృప్తి యేర్పడవచ్చును. భగవన్మహిమ నెంత చెప్పినను దృప్తి జనింపదు. కనుక అమోఘదృక్ _1. సఫలమైన జ్ఞానముగల, 2. అబాధితమైన జ్ఞానముగల, శుచిశ్రవాః_ 1. పవిత్రమైన చరిత్రగల, 2. సాక్షాద్విష్ణుస్వరూపులైన, సత్యరతః_ 1. నిర్దుఃఖానందానుభవమునందు రతుఁడవైన, 2. చూచినది చూచినట్లే చెప్పుటయం దాసక్తి గల, ధృతవ్రతః _ 1. శరణాగతపాలన మొదలైన వ్రతముల నవలంబించెడు, 2. ముక్తిసాధనమునే యుపదేశింతు ననెడు వ్రతమును ధరించిన, భవాన్ _ నీవు, అఖిలబంధముక్తయే_సమస్త సజ్జనులకును సంసారబంధములను వదలించుటకు ఉరుక్రమస్య_గొప్ప పరాక్రమముగల దామోదరునియొక్క, విచేష్టితం_విశిష్టములై వివిధములైన లీలలను, సమాధినా_ దర్శన గుహ్య సమాధు లనెడు మూఁడువిధములైన వానిలో నున్నదున్నట్లే చెప్పెడు సమాధిభాషతో, అనుస్మర! _ మందాధికారుల యోగ్యతను జ్ఞాపకముంచుకొని భగవన్మహిమా ప్రతిపాదకమైన శ్రీమద్భాగవత మనెడు గ్రంథమును రచింపుము!. తద్రచనతో నవతారప్రయోజన పూర్ణమై మనస్సునకుఁ దృప్తి యేర్పడును. 'అఖిలధర్మ గుప్తయే' అని యొక పాఠ మున్నది. అప్పుడు 'సమస్త భాగవత ధర్మరక్షణకై' అని

యర్థము. 'మహాభాగ' అనుటతో ద్రవ్యము మొదలైన యాశలతో నసత్యము చెప్పువాఁడుగాఁడని ఏర్పడును. అమోఘదృక్=వివక్షితార్థ తత్త్వజ్ఞాని. చెప్పవలె ననుకొన్న విషయముయొక్క తత్త్వమును సమగ్రముగా నెఱిఁగినవాఁడు, శుచిశ్రవాః=ప్రమాదము మొదలైన దోషములు లేనివాఁడు, సత్యరతః=అవిప్రలంభకుఁడు. మోనము చేయవలె నను బుద్ధిలేనివాఁడు, ధృతవ్రతః=తత్త్వము నుపదేశింప వలెనను నిచ్ఛగలవాఁడు. ఈ విశేషములతో నే మైనది? 'వేదవ్యాసుఁ డాప్తతముఁడు. తద్రచితమైన భాగవతము ప్రమాణతమము' అని చెప్పినట్లైనది. విష్ణుమాహాత్మ్య ప్రతిపాదకమైన వాక్యమునకు సమాధి భాష యని పేరు. 'ఉక్తో యో మహిమా విష్ణోః స్వతోక్తో హి సమాధినా' అని ప్రమాణము. భారతమునందువలె దర్శనగుహ్యాభాషలను జేర్చవలదని భావము.

తాత్పర్యము: వ్యాసమునీ! నీవు మహాభాగ్యశాలివి. ధనాదుల యాశతో సత్యమును మఱుఁగుపఱచెడి వాఁడవు గావు. యథార్థజ్ఞానివి. కనుక నీ జ్ఞానము సర్వదా నబాధితము. చెప్పవలసిన తత్త్వమును సమగ్రముగా నెఱిఁగినవాఁడవు. శుచిశ్రవుఁడని ప్రసిద్ధుఁడవై శ్రీమహావిష్ణువు సాక్షాదవతారమైన నీయందు ప్రమాదము ఇంద్రియ సామర్థ్యము మున్నగు దోషముల కవకాశమే లేదు. నిర్దుఃఖమై యానందమయమైన వైకుంఠానుభవమును నిరంతర మనుభవించు వాఁడవు నీవు. చూచినది చూచినట్లు చెప్పవలెనను దీక్షగలవాఁడవు. మోక్షసాధనము లేవో వానినే చెప్పవలెనను వ్రతము నీది. కనుక నాప్తతముని లక్షణములెల్లను నీయందుఁ గలవు. నీ చెప్పెడు శాస్త్రము ఆప్తవాక్యమై నిర్దోషమై పరమప్రమాణ మగును. మందులైన యధికారులను దృష్టియం దుంచుకొని వ్యక్తముగా శ్రీహరి మహిమలను వివరింపుము. సమాధిభాషలో భాగవతరచనము సాఁగవలెను. నీ యవతారకార్యము లన్నియు నొనర్చినట్లు మనస్సునకుఁ దృప్తి యగును.

దర్శన గుహ్యాభాషల నిందుఁ జేర్చవలదని నా మనవి. ఈ భాగవతమును బఠించి సకల సజ్జనులును సంసారబంధమునుండి విముక్తులై స్వరూపానందము ననుభవింతురు గాక! అమిత పరాక్రమ శాలియైన శ్రీహరి మహిమయే యట్టిది.

కేవల ధర్మాది విషయకములైన శాస్త్రములను రచించుటతో ననర్థము గూడ నేర్పడునని చెప్పుచున్నాఁడు—

అతః—ఈ భగవన్మహిమకు, అన్యథా—విరుద్ధములైన ధర్మాదులను, వివక్షితం—పురుషార్థకథనమునకై చెప్పవలెనను ఇచ్ఛ యేది గలదో అది, కించన — ఉపయోగము లేనిది, పురుషార్థమునకుఁ గారణము గాదని భావము. ఎందుకనఁగా, తత్కృత రూపనామభిః— ఆ గ్రంథమందు ధర్మాదుల ఫలముగాఁ జెప్పఁబడిన స్వర్గాదులందుండెడి లావణ్యము మొదలగు రూపములు మదన కళిక మొదలగు పదార్థముల పేరులచేతను, పృథగ్దృశః— 'ఇవి నా సుఖకారణములు గావు' అను వస్తుయాథార్థ్య జ్ఞానములేని వారియొక్క, దుఃస్థితా మతిః—రాగము మున్నగు దోషములచే దుష్టమై చంచలమైన బుద్ధి, కర్హిచిత్ —ఎక్కడను, క్వాఽపి—ఏ విషయమందును, వాతాహతా— సముద్ర వాయువునకుఁ జిక్కి ప్రమాదమునకు లోఁబడిన, నౌ రివ— దోనెవలె, ఆస్పదం—స్థిమితమైన యాస్పదమును, న లభేత—పొందదు.

యాదు పత్యము:

అతః—భగవంతుని చేష్టకంటె, అన్యథా—వేఱైన, యత్కించన —ఆ యా మతములవారు మోక్షసాధనము లని చెప్పిన ప్రధానము మొదలైనవి, తత్కృత రూప నామభిః—ఆ ప్రధానాదులందుఁ జెప్పఁబడిన త్రిగుణము లుండుట మున్నగు లక్షణములు. ప్రధానము, ద్రవ్యము, గుణము, కర్మము, సామాన్యము, విశేషము, సమవాయము మొదలైన పేరులు. వీనిచేత, పృథగ్దృశః—మోక్షసాధనమందు భిన్న

భిన్న జ్ఞానమున్న అధికారుల మతిః దుస్థ్సితా నతీ-చంచలమై సముద్ర వాయువునకుఁ జిక్కిన దోనెవలె నే విషయమందును దృఢమైన అవస్థానమును బొందనేరదు. భిన్న భిన్న మతవాదులు దెల్పెడి మోక్షసాధనములు పరస్పరవిరుద్ధములైన నామరూపములతోఁ దమ మతములను బ్రపంచించెదను. ఆ దర్శనములతో జనులకు సంశయము లెక్కువగునే గాని నిశ్చయజ్ఞాన మేర్పడదు. 'నయద్వచశ్చిత్రపదం' అను శ్లోకముతో సాహిత్యశాస్త్రము దూషింపఁబడినది. ఈ శ్లోకముతో కపిలుఁడు కణాదుఁడు మొదలైన సాంఖ్య వైశేషికాది మతములు దిరస్కరింపఁబడినవి.

తాత్పర్యము: శ్రీహరి మహిమను దెలుపు శాస్త్రమును వదలి కేవల ధర్మాదులను దెలుపు శాస్త్రములను రచించినచో నది నిరర్థకమే యగును. ఆ శాస్త్రములు ప్రవృత్తి ధర్మపరముగా స్వర్గాదులను జెప్పెను. వానిలో నతిసుందరములైన పదార్థము లున్నవని రూపములను, స్వర్గకళిక మున్నగు పేరులను వచించి వీనితో సుఖములభించునని యాశగొల్పును. ఇవన్నియు నశ్వరములు. శాశ్వత సుఖకారణములు గావు, మూఢు లీ సత్యము నెఱుఁగక వానియందే ప్రవృత్తులగుదురు. ఇట్టివారి మనస్సు చంచలమైయుండును. ఏ విషయమందును స్థిరముగా నిల్వనేరదు. వారి మనస్సులు సముద్రవాతాహతములైన పడవలు. సాంఖ్యవైశేషికాది దార్శనికులు తమతమ దర్శనములలోఁ బ్రధానము మొదలైన విరుద్ధనామములను, త్రిగుణత్వము మొదలైన రూపములను బ్రతిపాదింతురు. ఈ దర్శనప్రతి పాదనలు పరస్పర సంవాదము లేనివి. ఈ విషయము సామాన్యు లెఱుఁగరు. వీనిని విన్న జనులకుఁ దీవ్రసంశయమే ప్రధానఫలము. నిశ్చయజ్ఞాన మేర్పడనేరదు. సాహిత్యాది శాస్త్రము లెట్లు మోక్షసాధనములు గావో అట్లే పరస్పర విరుద్ధములైన యీ దర్శనములును మోక్షప్రాప్తి కారణములు గానేరవు.

క్రిందటి శ్లోకమందు భాగవతమును వదలి వేఱు గ్రంథము లలోఁ జెప్పిన నామరూపములతో ముగ్ధుఁడైన మానవునకు నరక ప్రాప్తియే గాని మోక్షము దొరకదని చెప్పఁబడినది. ఈ శ్లోకమందు వేఱు గ్రంథములను రచించువాఁ డనర్థములను గల్పించుటయే గాక అధర్మకారియు నగుచున్నాఁడు.

స్వభావరక్తస్య=ఇతరుల యుపదేశము లేకయే స్వాభావికము గనే ప్రవృత్తిధర్మమునం దాసక్తుఁడైన యజ్ఞునకు, ధర్మకృతే= ప్రవృత్తిధర్మము నొనర్చుమని చేసెడి, అనుశాసనం=శాస్త్రరచనము, జుగుప్సితం=తమవంటివారికి తగదు. అంతమాత్రమే కాదు. మహాన్ వ్యతిక్రమః=గొప్ప యన్యాయము గూడ. ఎందుకనఁగా యద్వాక్య తః=మీవంటి ప్రామాణికుల వాక్యములే ప్రమాణములని తెలిసి, ధర్మ ఇతి మన్యతే=ఇదే ధర్మమని నిశ్చయించికొని, ప్రవృత్తిమార్గ మందున్న మానవునకు, ఇతరః స్థితః=తద్భిన్న మార్గమందున్న శుకుఁడు మొదలైనవారు, తస్య నివారణం=ఇది ప్రవృత్తిమార్గము, ఇది ధర్మము గాదు, దీని నాచరింప వలదు అని, న=(కరోతి) చెప్ప నట్లుగా నగుచున్నది. అందుకే అట్టి గ్రంథరచన అపేక్షితము గాదు. లేక, యద్వాక్యతః=తమవంటి శ్రేష్ఠుల మాటలతో, ధర్మ ఇతి=చెప్పఁ బడినదే ముఖ్యపురుషార్థ సాధనమని, ఇతరతః స్థితః=సత్యమును దెలి సిన యుత్తమాధికారి, తస్యనివారణం=మీ మాటలయందు విశ్వాస ముంచి ప్రవృత్తిమార్గము నవలంబించిన వారిని నివారించు కార్య మును, న మన్యతే చేత్=తమ కర్తవ్యమని తెలియనిచో, మహాన్ వ్యతి క్రమః=ఆ యుత్తమాధికారి కన్యాయము ప్రాప్తించును. కనుక, నట్టి గ్రంథరచన నిందితము. దయావంతులు దమయందు నమ్మకముంచి జనులు చెడుమార్గమునఁ బోవునపుడు వారిని నట్టి పరిస్థితినుండి తప్పింపవలెనే గాని దానినే యవలంబింపఁ డనుట అధర్మము.

తాత్పర్యము : సామాన్యముగా జనులు కామ్యకర్మానురక్తులు. వారికి ప్రవృత్తిధర్మము స్వభావము. ఇతరుల ఉపదేశ మక్కఱలేదు. ఇట్టి వారికి మఱల నా ధర్మమునే యుపదేశించుట చాల జుగుప్సాకరము. ప్రవృత్తిధర్మము నాశ్రయించి చెడిపోవుచున్నవారిని దానికే మఱలఁ బ్రేరేచుట పరమాన్యాయము గదా! అది హేయ మని తెలిసి నివృత్తిధర్మము నాశ్రయించినవారు శుకాదులు. ఆ మహనీయుల వాక్యములను సామాన్యజను లెఱుఁగరు. కనుక, ప్రవత్తి ధర్మమును వదలవలెనని వారికి మీ వంటి వా రుపదేశింపవలెను. ప్రవృత్తిధర్మ బోధకశాస్త్రములను రచించుట మహానర్థకరము. దానినే నమ్మి యనుసరించు నరుఁడు నరకమున కేగును. కనుక, శ్రీహరి మహిమను దెలుపు భాగవతమునే రచింపుఁడు. అప్పుడే మీ మనస్సు పరితృప్త మగును.

**పోతన్నగారు :**

> **అపశబ్దంబులఁ గూడియున్ హరి చరిత్రాలాపముల్ సర్వపా**
> **పపరిత్యాగము సేయుఁ గావున హరి న్భావించుచుం బాడుచున్**
> **జపముల్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబు గీర్తించుచున్**
> **దపసుల్ సాధులు ధన్యులౌదురు గదా! తత్త్వజ్ఞ! చింతింపుమా!**

వచ: మునీంద్రా! నిర్గతకర్మంబై నిరుపాధికంబైన జ్ఞానంబు గలిగినను హరిభక్తి లేకున్న విశేషంబుగ శోభితంబు గాదు. ఫలంబు గోరక యుకర్మం బీశ్వరునకు నర్పణంబు సేయకున్న నది ప్రశస్తంబై యుండదు. భక్తిహీనంబు లయిన జ్ఞానవాచాకర్మ కౌశలంబులు నిరర్థకంబులు. మహానుభావుండవు, యథార్థదర్శనుండవు, సకలదిగంత ధవళకీర్తివి, సత్యరతుండవు, దృతవ్రతుండవు నగు నీవు నిఖిల బంధ మోచనంబు కొఱకు వాసుదేవుని లీలావిశేషంబులు భక్తితోడ వర్ణింపుము. హరివర్ణనంబు సేయక ప్రకారాంతరంబున నర్థాంతరంబులు వివక్షించి తద్వివక్షాకృతరూప నామంబులం జేసి పృథగ్దర్శనుండైన

వాని మతి పెనుగాలిచేతం ద్రిప్పంబడి తప్పంజను నావ చందంబున నెలవు సేరనేరదు. కామ్యకర్మంబులందు రాగంబుగల ప్రాకృత జను లకు నియమించిన ధర్మంబులు సెప్పి శాసకుండవగు నీ నడవడి దగ దది యెట్టులనిన వార లదియె ధర్మంబని జుగుప్సితంబులగు కామ్య కర్మంబులు సేయుచుం దత్త్వజ్ఞానంబు మఱతురు. కావున బుద్ధి మోహంబు జనియింపక తత్త్వప్రదుండవై వ్యథావియోగంబు సేయు మని మఱియు నిట్లనియె.

అపశబ్దంబులన్=వ్యాకరణవిరుద్ధ ప్రయోగములతో కూడికొన్నను, హరిచరిత్రాలాపముల్ = శ్రీమహావిష్ణువునకు సంబంధించిన రచనలు. సర్వపాప పరిత్యాగమున్ చేయున్=సమస్తపాపముల నుండి విముక్తిని గల్గించును. కావునన్=అందుచేత, తపసుల్=సాధులు, తపస్వులైన సత్పురుషులు లేక తపస్వులును, సత్పురుషులైన వారును, హరిన భావించుచున్=శ్రీహరినిగూర్చి నిత్యము తలపోయుచు, పాడుచున్=స్వరయుక్తముగా గానము చేయుచు, జపముల్ చేయుచున్=పవిత్రములైన యతని నామములను జపించుచు, వీనులన్ వినుచున్=చెవులతో వినుచు, అశ్రాంతంబున్=నిరంతరమును, కీర్తింపుచున్=అతనికీర్తిని గాన మొనర్చుచు, ధన్యులౌదురు గదా! = జీవితమును దరింపఁ జేసికొందురు గదా! తత్త్వజ్ఞ! = సమస్త తత్త్వములను దెలిసినవాఁడా! యోజింపుమా!=ఆలోచింపుము.

తాత్పర్యము: భగవత్కథలను గూర్చిన చరిత్రములు అపశబ్దములఁ గూడినవే గావచ్చును. కాని యవి జనుల సమస్తపాపముల నశింపఁజేయును. తపస్వులును సాధువులును అట్టి రచనలను శ్రద్ధతో విందురు. యోగ్యులైనవారు దొరకినప్పుడు దాము వక్తలై విన్పింతురు. నిరంతరమును గానమొనర్చి సంతోషింతురు. ఆ చరిత్రలను భావించికొని తీవ్రముగా శ్రీహరిని ధ్యానింతురు. ముక్తులు గూడ వాగ్విసర్గములను గౌరవింతురు. ముక్తికన్న గొప్పదగు భక్త్యనుభవ

మును అవి వారికిఁ గల్పించును. ముముక్షువులకు సాధనామార్గములై తరింపఁజేయును. భూయాంసో అపశబ్దాః అని మహాభాష్యకారుఁడు. అపశబ్దము లనఁగా వ్యాకరణ సంస్కారములేని శబ్దములని యాతని భావము. కాని యాతఁ డిచ్చిన యుదాహరణము లన్నియు నాఁటి వ్యావహారికములే. కనుక నపశబ్దము లనఁగా వ్యాకరణసమ్మతములై శిష్టజన వ్యవహారమందున్నవి గాని పదములని భావము. సర్వపాప పరిత్యాగమున్ = జనతాఘ విప్లవః అని దీనికి మూలము. పోతన్న గారి పరిత్యాగశబ్దము నా దృష్టికి చాల దుర్బలముగా నున్నది. 'పరి ధ్వంసము' 'పరీభావము' ఇత్యాదు లుండి యుండవచ్చునని నా తలఁపు. కాని ఎవ్వరుగాని పాఠభేదములలో నిట్లు చెప్పలేదు. మూల మందు 'సాధువు లట్టి రచనలను శ్రద్ధతో విందురు' ఇత్యాదులే చెప్పఁ బడినవి. ధన్యులౌదురు గదా! ఇది పోతన్నగారి చేర్పు. అశ్రాంత మున్=ఏ మాత్ర మలసటలేక అనిగూడ నర్థాంతరము.

నిర్గతకర్మంబైన = నిష్కర్మతా రూపమైన, నిరుపాధికంబైన ఉపాధినుండి విడుదలను సంపాదించునట్టి, జ్ఞానంబు=జ్ఞానము. మూల మందు 'నైష్కర్మ్యమపి' అనుశబ్దము 'నిరంజనం' అనునదియు రెండు శబ్దము లున్నవి. శ్రీధరుఁడు 'నిష్కర్మము' 'బ్రహ్మము' అనియు, తదేకాకారమగుటచేత 'నిష్కర్మతారూపము' అని యర్థము చెప్పెను. జ్ఞానోత్పత్తియైనప్పుడు సమస్తకర్మలనుండి విముక్తి యేర్పడును. అట్లే నిరంజనం=ఉపాధిని నివర్తింపఁజేయునది. జ్ఞానోత్పత్తియైన తర్వాత గూడ హరిభక్తి యవసరమే యనుచున్నాఁడు. ఫలాభిసంధి పూర్వక ముగా నొనర్చు కర్మ ఎప్పుడును మంగళకరమే. అదిలేని కర్మగూడ భగవంతున కర్పింపనిచో శోభింపదని మూలభావము. పోతన్న ఈ సందర్భమున మూలమునుండి కొద్దిగా భేదించెను. మూలకారుఁడు కర్మను రెండుగా వింగడించినాఁడు. ఫలాపేక్షతో నొనర్చు కర్మ. అది ఎప్పుడు నమంగళకరమే. ఇఁక నిష్కామకర్మ. నిష్కామకర్మను

భగవదర్పితము గాకయు నొసర్పవచ్చును. అదియును లాభము లేదని యాతని యభిప్రాయము. ఫలాభిసంధి లేకుండవలె, అది భగవదర్పితము గావలె. అట్టి కర్మయే గొప్పది. పోతనామాత్యుఁ డీ రెండవదియైన కర్మనుమాత్రమే గ్రహించెను. ప్రశస్తంబైయుండదు. చక్కఁగా శోభింపదని భావము. భక్తిహీనంబులైన=భక్తి లేనట్టి, జ్ఞాన వాచా కర్మకౌశలంబులు=ద్వంద్వాంతమైన కౌశల శబ్దమునకు ప్రత్యేకాన్వయము జ్ఞానకౌశలము, వాచాకౌశలము, కర్మకౌశలము నని హరి భక్తి లేని ఏ కౌశలముగాని నిష్ప్రయోజనము. 'గిర్వాగ్వాణీ సరస్వతీ' అని యమరము. ఇచ్చట వాచాశబ్దము స్త్రీలింగము. భాగురి మతములో నిచ్చట 'టాప్' ప్రత్యయము వచ్చును.

**వష్టి భాగురి రల్లోపం చావాప్యో రుపసర్గయోః,**
**టాపం చాపి హలం తానాం యథా వాచా నిశా దిశా.**

హలంత శబ్దములకు 'టాప్' కూడ వచ్చునని యర్థము. 'తచ్ఛ్రుత్వా బ్రాహ్మణేన శుచీభూయ శిక్షాభిర్వాచాభిః స్వజీవితార్థం దదౌ' (పంచతంత్రము. 4.48). నిరర్థకంబులు=ప్రయోజనమునుండి తొలఁగినవి. యథార్థదర్శనుండవు = వస్తుతత్త్వములను జక్కఁగాఁ దెలియు జ్ఞానదృష్టి గలవాఁడవు. 'అమోఘ దృక్' అని మూలము. సకల=సమస్తములైన, దిగంత=దిక్కులకొనలకు వ్యాపించిన, ధవళ=తెల్లనైన, కీర్తి=యశస్సు గలవాఁడవు, శుచిశ్రవాః అని మూలము. సత్యరతుండవు=సత్యము చెప్పుటయందే యాసక్తి గలవాఁడవు, ధృతవ్రతుండవు = ధరింపఁబడిన సమస్త వ్రతములు గలవాఁడవు. నీకు వ్రతాదులతోఁ బనిలేకున్నను ప్రపంచక్షేమము కొఱకై వాని నను సరింతువని భావము. నిఖిలబంధమోచనంబు కొఱకున్_నిఖిల=సమస్త జనులయొక్క, బంధ=సంసార బంధముయొక్క, మోచనంబు కొఱకున్=విముక్తి కొఱకు. అనఁగా భాగవతమును బఠించి, విని జనులు

సంసారబంధమునుండి విముక్తు లగుదురని భావము. నిఖిల=సమస్త బంధముల మోచన మనియు నర్థము గూడ. వాసుదేవుని లీలావిశేషం బులు=సృష్ట్యాదిలీలలు, భక్తితోడన్ వర్ణింపుము=భక్తితో నభివర్ణనము సేయుము. 'సమాధినా అనుస్మర' అని మూలము. పోతన్న దానిని వదలెను. హరివర్ణనంబుసేయుక.........నెలవు చేరనేరదు=ప్రకారాంత రంబునన్=పక్షాంతరంబులతో, నర్థాంతరంబులు వేఱువేఱు ప్రయోజ నంబులు, వీక్షించి=ఆలోచించి, తద్వివక్షాకృత నామ రూపంబులం జేసి=అయా యభిప్రాయములతో నేర్పడిన వివిధనామములు, భిన్న ములగు రూపములు వీనితో, పృథగ్దర్శనుఁడు=ప్రపంచమును వేఱు వేఱుగాఁ జూచెడివాఁడు, అట్టివానియొక్క, మతి=బుద్ధి, పెనుగాలి త్రిప్పునంబడి=గొప్పగాలిచేఁ గొట్టఁబడినదై, తప్పం జను=తప్పుమార్గ ములందుఁ బ్రవర్తించు, నావ చందంబునన్=నావవలె, నెలవున్= గమ్యస్థానమును పొందలేదు.

శాస్త్రములెన్నియో యున్నవి. అవి భిన్నభిన్న విషయములను జెప్పును. మోక్షమును గూడ భిన్నభిన్నములుగా వర్ణించును. ఒక్కొక్క శాస్త్రము క్రొత్తక్రొత్త పేరులను రూపములను సృష్టించును. వీనిలో నొకదాని కొకదానికిఁ బొత్తులేదు. వీనిని దెలిసికొన్న జనులుగూడ వివిధములైన నామరూపములతో వికలమనస్కులగుదురు. అది వేఱు ఇది వేఱు, ఇదిమంచి అది చెడ్డదను వికల్పములతోనే కాలము గడచి పోవును. వారిబుద్ధి యొక్కచోటను వ్యవసాయాత్మకము గాదు. బహుశాఖలై యనంతమార్గములలో సంచరించును. దేనియందును బ్రయత్నము కొనసాఁగదు. దీని ఫల మేమగును? వారి గతి వాతా హతమైన పడవను బోలును. గమ్యమును జేరనేరదు. 'పృథగ్దృశః' మూలమందలిపదము. దానికే పోతన్న 'పృథగ్దర్శనుండైన' అన్నాఁడు. కామ్యకర్మంబులందు.........మఱియు నిట్లనియె. కామ్యకర్మములు=

ఫలములయం దాసతో నొనర్చెడి కార్యములు రాగము, ఇచ్ఛ అనఁగా ఫలముచం దభినివేశము, ప్రాకృతజనులు=అజ్ఞానులు, శాసకుఁడు= నియమించువాఁడు. సామాన్యజనులు ఫలముగోరి కర్మ లొనర్తురు. వారి కట్టి కర్మలయం దాసక్తి స్వభావసిద్ధము. భారతమునందు వ్యాసుఁ డనేక కామ్యకర్మములు చెప్పెను. తారు అనఁగా వారు. అదియే ధర్మంబని కర్మములతో త్రివర్గములను సాధించుకొనుటయే యుత్తమధర్మముగా భావించెడి వారై కామ్యకర్మంబులు సేయుచు సకామకర్మ లొనర్చుచు తత్త్వమునుగూర్చిన విచారమునే మఱతురు. అది గావునన్ = ఫల మిట్లుండుట వలన, తత్త్వజ్ఞుండవై= జనులకుఁ దత్త్వము నుపదేశింపవలయు ననెడు వ్రతము గలవాఁడవై, వ్యథా వియోగంబునన్=వారలకుండెడి కష్టములనుండి విముక్తిని; సంసార బంధవిముక్తిని; భారతమందు వ్యాసుఁ డనేక కామ్యకర్మలు చెప్పెను. సామాన్య జనులకుఁ గర్మఫలమునం దాసక్తి యుండును. వ్యాసుని వంటివాఁడు కామ్యకర్మల నొత్తి చెప్పఁగా సామాన్యజను లదియే యుత్తమధర్మ మనుకొందురు. తత్త్వజ్ఞానము వంకకే పోరు. కావున నిది తగదని నారదుఁ డన్నాఁడు.

విచక్షణోఽస్యార్హతి వేదితుం విభో
రనంతపారస్య నివృత్తితస్సుఖమ్,
ప్రవర్తమానస్య గుణై రనాత్మన
స్తతో భవాన్ దర్శయచేష్టితం విభోః। 16

త్యక్త్వా స్వధర్మం చరణాంబుజం హరే
ర్భజన్న పక్వోఽథ పతే త్తతో యది,
యత్ర క్వవాఽభద్ర మభూ దముష్య కిం
కోవాఽర్థ ఆప్తోఽభజతాం స్వధర్మతః. 17

తస్యైవహేతోః ప్రయతేత కోవిదో
న లభ్యతే య ద్భ్రమతా ముప ర్యధః,
త ల్లభ్యతే దుఃఖవ దన్యతస్సుఖం
కాలేన సర్వత్ర గభీరరంహసః. 18

న వై జనో జాతు కథంచ నావ్రజే
న్ముకుంద సేవ్యన్యవ దంగ సంసృతిమ్,
స్మర న్ముకుందాం ఘ్ర్యుపగూహనం పున
ర్విహాతు మిచ్ఛేన్న రసగ్రహో జనః. 19

ఇదం చ విశ్వం భగవా నివేతరో
యతో జగత్థ్సాన నిరోధసంభవాః,
తద్ధి స్వయం వేద భవాం స్తథాఽపి మే
ప్రాదేశమాత్రం భవతః ప్రదర్శితమ్. 20

అనంతపారస్య=అపరిచ్ఛిన్నుఁడును, విభోః=సర్వవ్యాపియునైన, అస్య=పరమాత్మునియొక్క, సుఖం=అనందమును, నివృత్తితః=నివృత్తిమార్గము నాశ్రయించి, వేదితుం=తెలిసికొనుటకు, విచక్షణః=నిపుణుఁడైనవాఁడే, అర్హతి=అర్హుఁడగును, తతః=అ కారణముచే, గుణైః=గుణములచేత, ప్రవర్తమానస్య=ప్రవర్తించుచున్నవాఁడును, అనాత్మనః = దేహమునం దభిమాన మున్నవాఁడై వర్తించు జీవునికొఱకు, చేష్టితః=భగవద్వ్యాపారమును, భవాన్=నీవు, దర్శయ=చూపించుము, విభో!=సంబుద్ధి.

అవ. ప్రవృత్తిమార్గము చక్కనిది గాదు. నివృత్తిమార్గమందు సర్వక్రియలను వదలివేయవలెను. అప్పుడే ఈశ్వరస్వరూపానుభవము సిద్ధించును. మఱి, పరమేశ్వరుని యవతార లీలలను వర్ణించుటతోఁ బని యేమి? నిర్గుణస్వరూపమునే గదా వర్ణింపవలెను? ఈ సంశయమును నివారించుచున్నాఁడు-

ఈశ్వరుని నిర్వికల్పస్వరూపమునకు దేశపరిచ్ఛేదము లేదు. కాలపరిచ్ఛేదము లేదు. సర్వమునందొకేరీతిగా వ్యాపించియుండును. సర్వక్రియా నిర్ముక్తమైనది. ఇట్టి యీశ్వరుని నిర్వికల్ప స్వరూపము నతినిపుణుఁడైనవాఁడే తెలిసికొనఁగల్గును. సామాన్యుల కాశక్తిలేదు. వారికి దేహాభిమాన ముండును. సత్త్వాదిగుణ ప్రవృత్తి వారి సహజ ధర్మము. అట్టివాని కీశ్వరునియందు భక్తి జనింపఁజేయుటకు అవతార లీలా విలాసములను నీవు వర్ణింపవలెను. అప్పుడే సామాన్యుఁడైనవాని కీశ్వరునందు ప్రేమ జనించును. 16

**స్వధర్మం**=తన ధర్మమును, **త్యక్త్వా**=ఉపేక్ష యొనర్చి, **హరేః**=వాసుదేవునియొక్క, **చరణాంబుజం**=పాదపద్మమును, **భజన్**=సేవించుచున్నవాఁడై, **అపక్వః**=ఆ భక్తియందు పరిపక్వతనందకయే, **తతః**=ఆ భక్తినుండి, **అథ**=తరువాత, **పతేత్ యది**=పతితుఁడైనచో, **అముష్య**=వానికి, **యత్రక్వవా**=ఎచ్చటనైనను, **అభద్రం**=అమంగళము, **అభూత్కిం**=కల్గినదా యేమి?, **అభజతాం**=శ్రీహరిని సేవింపనివారికి, **స్వధర్మతః**=తమ ధర్మానుష్ఠానము వలన, **కోవా అర్థః**=ఏమి ప్రయోజనము, **ఆప్తః**=ఏర్పడినది.

అవ. కామ్యకర్మములతో నేర్పడున దనర్థమే. అందుచే వానినుపేక్షింపవలెను. హరిభక్తియే యనుసరింపఁదగినది. ఈ విషయము నింతవఱకు సాధించినాఁడు. నిత్యనైమిత్తికములని ద్వివిధకర్మలు. స్వధర్మానుష్ఠానము వీనిపైననే నిలిచియున్నది. వీనిని గూడ నుపేక్షించినను దోషములేదు. హరిభక్తియే పరమాశ్రయణీయము. ఈ తత్త్వమునే సామాన్యుల కుపదేశింపవలసినదని సూచించుచున్నాఁడు.

ఒకఁడు స్వధర్మము నుపేక్షించును. హరిభక్తినే యనుసరించును. కాని దానిలో వానికిఁ బరిపాకము సిద్ధింపదు. అంతకుముందే మరణించును. వాఁడు హరిభక్తి రసికుఁడు. కర్మమార్గదూరుఁడు. మఱి వానిగతి ఏమి? వాని కెట్లు చూచినను క్షతి లేదు. వానికే జన్మము సిద్ధించినను, పూర్వజన్మ వాసనయైన హరిభక్తి వానిని

వెన్నాడి వచ్చును. ఆ మార్గమందు వాఁడు పునఃప్రయాణము మొన ర్చును. పూర్వజన్మమందు సాధింపలేని యోగ్యతలను మఱుజన్మ మున సంపాదించికొనును. వాసుదేవుని సేవింపక, కేవల స్వధర్మ మును మాత్రమే నిర్వహించువాఁడు పొందెడు ఫలమేమి? కర్మఫల ములైన పుణ్యపాపములకు వాఁడు లోఁబడియుండును. వానికి చక్ర వ త్పరిభ్రమణము. భక్తిరసికునకుఁ గర్మబాధ ఉండదు. ఉత్తరోత్త రము వాని హరిభక్తి వర్ధిల్లును. సంసారవిముక్తి వానికి సుఖసాధ్యమై యుండును. 17

**ఉపర్యధః**—పైకిని క్రిందికిని, **భ్రమతాం**—తిరుగుచున్న వారికి, **యత్**— ఏ ఫలము, **న లభ్యతే**—లభించుటకు సాధ్యము గాదో, **తస్య హేతోః ఏవ**— దానిని పొందుటకొఱకే, **కోవిదః**—సమర్థుఁడైనవాఁడు, **ప్రయతేత**—ప్రయత్నింప వలెను, **గభీరరంహసా**—అధికశక్తితోఁ గూడిన, **కాలేన**—కాలముచేత, **అన్యతః** —కర్మమార్గమునుండి, **సర్వత్ర**—సర్వప్రకారములచేతను, **తత్సుఖం**—ఆ సుఖము **దుఃఖవత్**—దుఃఖమువలెనే, **లభ్యతే**—పొందుచున్నది.

అవ: స్వధర్మానుష్ఠానము ఫలరహితమైనది గాదు. 'కర్మణా పితృలోకః' కర్మానుష్ఠానముతోఁ బితృలోకము సిద్ధించుచున్నది. ఈ మాట శ్రుతిమాతయే చెప్పుచున్నది గదా! ఈ యాక్షేపమునకు సమాధాన మిచ్చుచున్నాఁడు—

పైని బ్రహ్మ వఱకును క్రింద స్థావరముల వఱకును శరీరము లున్నవి. వీనిమధ్య భిన్నభిన్న శరీరములను ధరించి జీవుఁడు చరిం చుచుండును. ఈ చక్రమునుండి తప్పించికొని పరమపదమును సాధించుటకొఱకుఁ గోవిదుఁడైనవాఁడు ప్రయత్నింపవలెను. కర్మా నుష్ఠానముతోఁ దుచ్ఛములును నశ్వరములునైన ఫలములుసిద్ధించును. అవే కర్మఫలములు. వీనిని సాధించికొనుటకుఁ బడు ప్రయాసము రిత్త. వీని ప్రయత్నములు లేకయే దుఃఖములును సిద్ధించుచున్నవి గదా! దుఃఖప్రాప్తికై మానవుఁడు శ్రమించుట లేదు. కాని, కాలవశ

మున దుఃఖములు ప్రాప్తించి వానిని బాధించుచుండును. దీనికి హేతు వేది? వాని పాపకర్మముల ఫలమే దుఃఖము; అనుభవింపక తీఱదు. అట్లే పుణ్యకర్మముల ఫలమే విషయసుఖము, ఇదియును వాని ప్రయత్నము లేకయే కాలమునుబట్టి సిద్ధించును. ఈ రెంటి ననుభవింపఁజేయు శక్తి కాలముదే. దాని నెవ్వఁడును దాఁటలేఁడు. బుద్ధియున్న పండితుఁడు ఈ రెంటినుండి విడుమఱపొంది నిత్యానంద మును బొందుటకే యత్నించును. దాని కుపకరించునదే హరిభజనము. హరిభజన మొక్కటే దాని కుపకరించునది. 18

ముకుందసేవీ=ముకుందు నాశ్రయించునట్టి, జనః=జనుఁడు, అన్యవత్=ఇతరునివలె, జాతు=ఒకప్పుడును, కథంచన=ఏ విధముగా నైనను, సంసృతిం=సంసారమును, నా వ్రజేత్=పొందఁడు, అంగ=ఇది చాల యాశ్చర్యము, యతః=ఎందుకనఁగా, రసగ్రహః=భజనరసము నందలి అగ్రహముతోఁ గూడినవాఁడు, ముకుందాంఘ్ర్యుపగూహనం=శ్రీహరి పాదపద్మములయందు సర్వసమాశ్రయణమును, స్మరన్=స్మరించుచున్నవాఁడై, పునః=మఱల, విహాతుం=వదలుటకు, న ఇచ్ఛేత్=ఇష్టపడఁడు.

అవ: హరిభక్తున కెప్పుడును నమంగళము లేదు. ఈ విషయము పైనిఁ జెప్పినాఁడు. దానినే విశదీకరించుచున్నాఁడు-

ముక్తిప్రదుఁడు శ్రీహరి. వానిని త్రికరణములతో నాశ్రయించినవాఁడు సిద్ధినిబొందక మరణించినను, ఏ యోనియందు జన్మించినను గేవల కర్మనిష్ఠునివలె సంసారక్లేశముల ననుభవింపఁడు, ఎందువలన? పూర్వజన్మమందు వాఁడు హరిపాదముల నాశ్రయించియుండెను. ఆ యానందము గొంత వాని కనుభవములో నున్నది. ఆ సంస్కారఫలమై యీ జన్మమందును వాఁడు ముకుంద పాదపద్మమును స్మరించును, సేవించును.

యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన।
పూర్వాభ్యాసేన తే నైవ హ్రియతే హ్యవశోఽపి సః. (గీత)

పూర్వజన్మమందు ఆ యభ్యాసమున కధీనుఁడైన ఆ జీవుఁడు మఱల నా మార్గమునే పట్టును. సిద్ధిఁ బొందువఱ కా మార్గముననే పయనించును. అందుచే శీఘ్రఫలము నందును. 19

ఇదం విశ్వం=ఈ లోకము, భగవాన్ ఇవ=భగవంతుఁడే గదా, సః=అట్టివాఁడు, ఇతరః=భిన్నుఁడుగా నగును, యతః=ఏ కారణముచేత, జగత్ స్థాన నిరోధ సంభవాః=సర్వజగత్తుయొక్క స్థానము, నిరోధము, సంభవము (ఏర్ప డుచున్నవో), తత్=దానిని, భవాన్=నీవు, స్వయం=స్వయముగనే, వేదహి=తెలిసికొన్నావు, తథాఽపి=ఐనను, భవతః=నీకు, ప్రాదేశమాత్రం=ఏకదేశము, ప్రదర్శితం=చెప్పఁబడినది.

అవ: భగవంతుని లీలలనే ప్రధానముగ నుపదేశింపవలెనని చెప్పుచున్నాఁడు. ఆ భగవంతుఁ డెవ్వఁడు? ఆ లీల లెట్టివి? వీనిని సూక్ష్మముగ సూచించుచున్నాఁడు-

ఈ సమస్త లోకమును భగవత్స్వరూపమే. ఐనను పరమాత్ముఁడు దీనినుండి వేఱగును. సమస్త జగత్తును యథార్థమునకు భగవంతునినుండి వేఱు గాదు. భగవంతుఁడే ప్రపంచమునుండి తన్ను వేఱుపఱచికొన్నాఁడు. ఆ కారణముతో జగత్సృష్ట్యాదులు జరగుచున్నవి. వీనిచరిత్రమే భగవంతుని లీలలు. భగవంతుఁ డనెడు నధిష్ఠానము నాశ్రయించి లోకము సత్యమువోలె భాసించుచున్నది. భగవంతుఁడు లోకాపేక్షారహితుఁడై, సర్వకాలములందును సత్యస్వరూపుఁడై ప్రకాశించుచుండును. ఈ విషయము నీకుఁ జక్కఁగాఁ దెలిసినదే. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' సమస్తమును బ్రహ్మస్వరూపమే. ఐనను 'ఆచార్యవాన్ పురుషో వేద!' ఆచార్యవంతుఁడే సత్య మెఱుఁగును. ఈ శ్రుతివాక్యము ననుసరించి నీకు నేను ప్రాదేశమాత్రముగా నెఱిఁగించితిని. 20

శ్రీధరీయము :

అవ: ప్రవృత్తిమార్గము నింద్య మంటిమి. ఇఁక నివృత్తిమార్గమందు సర్వక్రియాత్యాగముచేతనే, పారమేశ్వరమైన సుఖస్వరూపానుభూతి ఏర్పడుచున్నది. మఱి యాతని యశస్సును గీర్తించుటతోఁ బ్రయోజన మేమి? ప్రయోజనమునే వివరించుచున్నాఁడు-

అర్థము: విచక్షణః=నిపుణుఁడైన ఎవఁడో యొకఁడు, నివృత్తితః=సర్వక్రియా నివృత్తిమూలమున, అస్య=విభుఁడైన పరమేశ్వరుని, సుఖం=నిర్వికల్పక సుఖాత్మకరూపసుఖమును, వేదితుం=తెలిసికొనుటకు, అర్హతి=సమర్థుఁ డగుచున్నాఁడు. ప్రవృత్తిస్వభావుఁడైన అవిచక్షణుఁ డయోగ్యుఁడు. పరమేశ్వరుఁడు విభుఁ డనెను. అతఁడు విభుఁ డగుటకుఁ గారణమును జెప్పుచున్నాఁడు. అనంతపారస్య=కాలమునకు సంబంధించిన యంతము గాని దేశమునకు సంబంధించిన పారముగాని లేనివాఁడు. అనాత్మనః=దేహాద్యభిమానియైన జీవుఁడు. అందుచేతనే గుణైః ప్రవర్తమానస్య=సత్త్వాది గుణముల యందుఁ బ్రవర్తించుచున్న జనునియొక్క మేలుకొఱకు, యశోవర్ణన మొనర్పుమని తాత్పర్యము.

అవ: కామ్యకర్మము లనర్థహేతువు లగుటచే వానిని వర్జించి భగవల్లీలావర్ణన మొనర్పవలెనని ముందుఁ జెప్పఁబడినది. ఈ శ్లోకమందు నిత్యనైమిత్తికరూప సద్ధర్మనిష్ఠనుగూడ ననాదరించి కేవలము హరిభక్తియే యనుసరింపఁ దగినదని చెప్పుచున్నాఁడు. స్వధర్మ పరిత్యాగముతో భక్తిపరిపాకము సిద్ధించి కృతార్థుఁడైనచో మంచిదే. భక్తి పరిపక్వము గాకముందే వాఁడు గతించినను భక్తిమార్గమునుండి పతితుఁడైనను స్వధర్మత్యాగ రూపమైన గొప్ప యనర్థము సిద్ధించుచున్నది గదా! దానికి సమాధానము వచించుచున్నాఁడు-

అర్థము: భజనాత్పతేత్ =భజనమునుండి పడినను, మరణించి నను భక్తిరసికుఁడైన వానికిఁ గర్మానధికారముతో నానర్థక్యము లేదని తెల్పుచున్నాఁడు. యత్ర క్వవా=నీచయోనియందైనను, అముష్య భక్తి రసికస్య=భక్తిరసికుఁడైన యాతనికి, అభద్రమభూత్ కిం=అమంగళ మేర్పడెనా? ఎప్పుడుగూడ నేర్పడలేదని భావము. ఎందుకు? భక్తి వాసన యుండుటచే. అభజద్భిస్తు = ఈశ్వరుని భజింపని వారిచేత, కేవల స్వధర్మానుష్ఠాన మూలమున, కోవా అర్థః అప్తః= ఏ ప్రయో జనము పొందఁబడినది? అభజతాం అనుచోట సంబంధమాత్ర వివ క్షతో షష్ఠి వచ్చినది.

అవ: స్వధర్మానుష్ఠానముచేతఁ గూడ 'కర్మణా పితృలోకః' అను శ్రుతివాక్యముతోఁ బితృలోక మేర్పడుచున్నది. మఱి యది ప్రయోజన హీన మెట్లైనది? దాని కుత్తరము చెప్పుచున్నాఁడు—

అర్థము: తస్యైవ హేతోః — దానికొఱకే యత్న మొనర్పవలె నని భావము. ఉపరి=బ్రహ్మపర్యంతము, అధః=క్రింద స్థావరపర్యం తము, భ్రమద్భిః = భ్రమించుచున్నటువంటి జీవుల కేది పొందుటకు సాధ్యము గాదో, అట్టి యానంత్యమైన క్షేమమును బొందుటకు విషయసుఖము, ప్రాచీనకర్మలచేత నరకాదులయందుఁ గూడ లభించు చున్నది. దుఃఖ మప్రయత్నముగనే లభించునట్లు.

**అప్రార్థితాని దుఃఖాని యథైవాయాంతి దేహినామ్,**
**సుఖాన్యపి తథా మన్యే దైన్యమత్రాతిరిచ్యతే.**

దుఃఖములవలెనే సుఖములును బ్రాచీనకర్మ ప్రేరితములై యప్రార్థిత ములుగ లభించుచున్నవి. ఈ రెంటి విషయమునను దైన్య మసమంజ సము.

అవ: భక్తిరసికునికి అమంగళమే సిద్ధింపదని ముందుచెప్పెను. ఆ విషయమునే మఱికొంత వివరించుచున్నాఁడు—

ముకుందసేవీ జనః—పరమాత్ముని సేవించువాఁడు, జాతు—ఎప్ప టికినీ, కుయోనిగతుఁడైనను, సంసృతిం నవ్రజేత్ — సంసారదుఃఖ మును బొందఁడు. కేవల కర్మనిష్ఠునివలె నని వైధర్మ్య దృష్టాంతము. ఎందువలన? ముకుందాంఘ్ర్యుపగూహనం—వాసుదేవుని పాదపద్మ ముల, ఉపగూహనం—ఆలింగన సౌఖ్యమును, స్మరన్—స్మరించుచున్న వాఁడై, విహాతుం నేచ్ఛేత్—వదలుకొనుటకిచ్ఛింపఁడు. దానికిఁ గార ణమును జెప్పుచున్నాఁడు. రసగ్రహః, రస—రసనీయమైన భక్త్యానం దముచేత, గృహ్యతే—వశీక్రియతే—స్వాధీనపఱచికొనఁబడిన వాఁడు, లేక, రసే—రసనీయమైన భక్తియందు, గ్రహః—అగ్రహముగలవాఁడు బహువ్రీహి సమాసము.

యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన।
పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః.

(గీత)

అర్జునా! జన్మాంతరమందు వాఁ డా భక్తిమార్గమందే ప్రయాణించును. వాని కది పూర్వాభ్యస్తము. అందుచే నవశుఁడు.

అవ.: భగవల్లీలలను ప్రధానముగా వర్ణింపవలె నంటిని. భగ వంతుఁ డెట్టివాఁడు. వాని లీలలేవి? వానినే నిరూపించుచున్నాఁడు—

అర్థము: ఇదం హి విశ్వం భగవానేవ — ఈ ప్రపంచము భగ వంతుఁడే. అతనినుండి ఇతరము గాదు. ఈశ్వరునినుండి ప్రపంచము వేఱుగాదు. అతఁడు మాత్రము ప్రపంచమునుండి వేఱు. దీనికిఁ గార ణము చెప్పుచున్నాఁడు. యతో జగత్స్థాన నిరోధ సంభవాః—ఏ కార ణమువలన జగత్తుయొక్క సృష్ట్యాదులు సంభవించుచున్నవో, ఈ మాటచేతనే యతని లీలాస్వరూపముగూడఁ జెప్పఁబడినట్లైనది. లేక ఇదం విశ్వం భగవాన్ ఇతర ఇవ — ఈ సమస్త ప్రపంచమును భగవ త్స్వరూపమే యైనను భిన్నమైనట్లు కన్పడుచున్నదని భావము. జీవు డును భగవంతుఁడే. చేతనాచేతనమైన ఈ సమస్తమును తద్రూపమే.

తద్భిన్న మేదియును లేదు. బ్రహ్మపదార్థమే తత్త్వము. 'హి'శబ్దము చేత 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను ప్రమాణము సూచింపఁబడుచున్నది. తద్ధిఈ విషయమును నీవే యెఱుంగుదువు. నీవు భగవంతుడవే గనుక, ప్రాదేశమాత్రం = ఏకదేశమాత్రముగా 'ఆచార్యవాన్ పురుషోవేద' ఇత్యాది శ్రుత్యర్థసంపాదనము కొఱకు నాచేఁ బ్రదర్శింపఁబడినది.

వంశీధరకృత భావార్థదీపిక:

భవచ్ఛబ్దయోగమందు మధ్యమపురుష ప్రయోగ మార్షము. ఈ మహాసంహిత 'స సంహితాం భాగవతీం కృత్వానుక్రమ్య చాత్మజం శుకమధ్యాపయామాస నివృత్తి నిరతం మునిమ్' అను భాగవత వచనము ననుసరించి శుకునకే యుపదేశింపఁబడినది. ఎందుకు? ఆ విషయము నతఁడే చెప్పుచున్నాఁడు–

హిత్వాస్వశిష్యాన్ పైలాదీన్ భగవాన్ బాదరాయణిః,
మహ్యం పుత్రాయ శాంతాయ పరంగుహ్య మిదం జగౌ.

కనుక, భాగవతోపదేశమునకు ముఖ్యాధికారి శుకుఁడే. మఱి సామాన్యులకుఁ బ్రయోజనమేమి? దానికి భాగవతమే యుత్తరము చెప్పుచున్నది.

నివృత్తి తర్షై రుపగీయమానా
ద్భ వౌషధా చ్ఛ్రోత్ర మనోభిరామాత్.

భాగవతము భవౌషధము. శ్రోత్రములకును, మనస్సునకును రమ్యమైనది. అందుకే విషయ వాసనలు వదలని వాఁడుగూడ భాగవతముతోఁ దరించుచున్నాఁడు.

న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్,
జోషయేత్సర్వ కర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్.

అను గీతోపనిషద్వాక్యముచేత, సర్వకర్మత్యాగము చేయఁబడు చున్నది. మఱి స్వధర్మ పరిత్యాగ మెట్లు యుక్తము? పై వాక్యము జ్ఞానోపదేశకులకు సంబంధించినది. జ్ఞానమునకుఁ బూర్వరంగ మంతఃకరణ శుద్ధి. ఆ శుద్ధి నిష్కామ కర్మాధీనము. భక్తి స్వతః ప్రబల మైనది. అంతఃకరణశుద్ధి పర్యంతము గాచికొనవలసిన పనిలేదు. ఈ సందర్భము భక్తివిషయమునకు సంబంధించినది. ఈ యభిప్రాయమే ఈ క్రింది శ్లోకములో నున్నది.

స్వయం నిశ్శ్రేయసం విద్వాన్ నవక్త్యజ్ఞాయ కర్మహి,
నరా తిరోగిణోఽపథ్యం వాంఛితోఽపి భిషక్తమః.

కనుక,

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
ధర్మాన్ సంత్యజ్య యస్సర్వాన్ మాం భజేత స సత్తమః.

ఇత్యాది భగవద్వాక్యబలముతో నిత్యనైమిత్తిక స్వధర్మనిష్ఠను వర్జించి కేవల హరిభక్తియే యుపదేశింపఁ దగినది అను విషయమును చెప్పుచున్నాఁడు-

త్యక్త్వా=వదలిపెట్టి, ఈ క్త్వాప్రత్యయముచేత, భజనారంభదశ యందుఁగూడ కర్మానువృత్తి పనికిరాదని చెప్పుచున్నాఁడు.

స్వధర్మం త్యక్త్వా యో భజన్స్యాత్ అముష్యాఽభద్రం తావ న్నభవేదేవ దేవర్షి భూతాప్త నృణాం పితౄణాం.

ఇత్యాదివాక్యములు ప్రమాణము. భక్తిమార్గమునందు పరి పక్వతనందక మరణించినను దురాచారియైనను కర్మత్యాగ నివృత్తి యైన యభద్రము ఏర్పడదు. భక్తివాసన యను చ్ఛిత్తిధర్మము. సూక్ష్మరూపముతో వానియందు సర్వదా యుండనే యుండును. వాఁడు నీచయోని గతుఁడైనను భంగము లేదు.

నహ్యం గోపక్రమే ధ్వంసో మద్ధర్మస్యోద్ధవాణ్వపి.

అని భగవద్వచనము. భక్త్యంకుర మమోఘ మైనది. దానికిఁ బుష్పఫలము లేర్పడి తీరవలసినదే.

ఈ శ్లోకమందు యత్ర క్వవా 'అభద్రం లభేత్' ఎప్పుడైన నమంగళ మేర్పడునా అనిచెప్పలేదు. 'అభూత్' అని భూతకాల క్రియను వాడినాఁడు. అందుచే చిత్రకేతువు మొదలైనవారి జీవితము లాక్షిప్తము లగుచున్నవి. వాఁడు పార్వతీదేవి శాపముగ్రహించినను ముక్తుఁడగువఱకును నిలువలేదు. కనుక యే యవస్థయందును భక్తికి క్షతిలేదని యర్థము. కృషివాణిజ్యాదులు దృష్టఫలముల నొసఁగు చున్నవి. వానితో సుఖప్రాప్తి. వీనిని వర్జించి జనులు భక్తియం దెట్లు ప్రవర్తింతురు? నిజమే. కోవిదుఁడైన వాఁడు దృష్టఫలములచే వంచింపఁబడఁడు. అవి సుఖాఽభాసము లని వాఁడెఱుఁగును. వానిని మనసున నుంచికొని చెప్పుచున్నాఁడు.

తస్యైవ హేతోః=స్వరూపసాక్షాత్కార రూపమైన పరమానంద సుఖముకొఱకుఁ గాని లేక భగవద్విగ్రహధ్యానాదులతో లభించు భక్తిసుఖము కొఱకుఁ గాని యని యర్థము. గ్రంథాంతరమందిట్లు చెప్పఁబడినది.

**ఆయూ రక్షతి మర్మాణి త్వాయు రన్నం ప్రయచ్ఛతి,**
**అర్జునస్య ప్రతిజ్ఞేద్వే నదైన్యం న పలాయనమ్.**

కనుక, దేహార్థము కర్మ యనాచరణీయ మనియే భావము. 'కాలేన' ప్రాచీనకర్మ భోగావసరమందు 'నకర్మబంధనం జన్మ వైష్ణవానాం చ విద్యతే' అని పాద్మపురాణ వాక్యముగూడ. ముకుందాంఘ్ర్యుపగూహనం=ఇక్కడ, అంఘ్రీన్స్మరన్=పాదములనుస్మరించి అనిమాత్రమే చెప్పఁబడలేదు. ఉపగూహనమును స్మరించి అను చున్నాఁడు. ఒకటి రెండుసారులు భగవంతుని పాదములనుండి దురభి

మానవతుఁడై దూరము పోవచ్చును. కాని, తదుపగూహనసుఖము వానిని వదలిపెట్టదు. కృతానుతాపుఁడై మరల వెన్కకువచ్చును. విహాతు మిచ్ఛేత్ = వదలుట కిష్టపడఁడు అని యర్థము. ఇక్కడ 'నవిజహ్యాత్' వదలఁడు అని చెప్పలేదు, వదల నిచ్ఛింపఁడు అని యున్నది. దీనితో భక్తుని గర్వరాహిత్యము సూచితము. ఇచ్ఛా మాత్రమే వానిపని. తన్నిర్వాహము భగవంతునిదేయని భావము.

వీరరాఘవవ్యాఖ్య :

> నహికల్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాతగచ్ఛతి.
> ప్రాప్యపుణ్య కృతాన్ లోకా నుషిత్వా శాశ్వతీస్సమాః,
> శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే.
> అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్.

ఇత్యాది భగవద్వాక్యములచే యోగభ్రష్టుఁడైనవాఁడు శుచిమంతులైన శ్రీమంతుల యింటిలో జనించును. లేక యోగుల యింటిలో జనించును. కనుక, భక్తిరసికున కెప్పటికిని క్షతిలేదని తాత్పర్యము.

ముకుందాంఘ్ర్యుపగూహనం='గుహ సంవరణే' అని ధాతువు. సంవరణ మనఁగా సమ్యగ్వరణము, నిష్కల్మషమైన శరణాగతి. పౌర్వదైహికమైన యా శరణాగతిని గ్రహించి మరలవాఁడు దానియందే ప్రవర్తించునని భావము.

విజయధ్వజము :

సమాధిభాషయందే గ్రంథమును రచింపవలెనన్నచో దానిని దెలియు నధికారులు గావలెను, అట్టి యధికారులు లేరు. అందుచే నట్టి గ్రంథరచన యనావశ్యకము' అని పలుకరాదని విజ్ఞాపించు చున్నాఁడు.

గుణైః = సత్త్వ రజోగుణములచేత, ప్రవర్తమానస్య = సృష్టిలో తిరుగుళ్లు వడుచు, అనాత్మనః = స్వామి కార్యమును జేయకున్నట్టి, అస్య = ఈ జీవునకు, నివృత్తితః = తా ననుష్ఠించిన నివృత్తి ధర్మఫలముగా అనంతపారస్య = అపరిమితములైన మూర్తులున్నట్టియు, దేశమునుండి పారమును, కాలమునుండి యంతమును లేనట్టి, విభోః (సకాశాత్) గుణములచే వ్యాప్తుఁడైన శ్రీహరినుండి, సుఖం = ఇఁకమీద స్వరూప సుఖ ముండఁబోవునని, వేదితుం = తెలుపుటకు, విచక్షణః = విశిష్టగుణ శీలుఁడైన సాత్త్విక ప్రకృతిగల యాచార్యుఁడు, అర్హతి = తగినవాఁడు. తతః = అందుచేత, విభోః = సర్వవ్యాపియైన శ్రీహరియొక్క, చేష్టితం = లీలలను, భవాన్ = పూజ్యుఁడవైననీవు, దర్శయ = చూపింపుము. సమాధి భాషలో రచింపఁబడిన గ్రంథమందు ప్రతిపాదింపుము లేక, విచక్షణః = సమయపాదమందుఁ జెప్పిన యుక్తులవలన కపిలాదుల నాప్తులని వేదవ్యాసుఁడే ఆప్తతముఁడని నిశ్చయజ్ఞానమును బొందిన యధికారి, అనాత్మనః = మనస్సును జయింపనట్టియు, గుణైః ప్రవర్తమానస్య = విషయనిమిత్తమై ప్రవృత్తుఁడైన యధికారికి, నివృత్తితః = విషయవైరాగ్యము మాహాత్మ్యశ్రవణము మొదలైన వానిచేత శ్రీహరియొక్క యనుగ్రహమైన తర్వాత, సుఖం = మోక్షసుఖ ముండఁబోవునని, వేదితుం = పరమ పురుషార్థమని సరియైన నిశ్చయజ్ఞానమును దెల్పుటకు, అర్హతి = సమర్థుఁడై యుండును. అట్టి యధికారికొఱకై గ్రంథరచన మొనర్పుఁడని యభిప్రాయము.

తాత్పర్యము : సమాధిభాషయందు రచింపఁబడిన గ్రంథమును జదివి తెలిసికొను నధికారులు లేరని తలఁపఁగూడదు. విశిష్టగుణములు గలవాఁడై సాత్త్వికప్రకృతిగల యాచార్యుఁడు దేశకాలవ్యాప్తుఁడైన శ్రీహరి యనుగ్రహముతో జీవునకు మోక్షసుఖ మేర్పడునని తెలియును. జీవుఁడు సత్త్వ రజ స్తమస్సు లనెడు ప్రకృతిగుణముల కధీనుఁడై ఈ సృష్టియందుఁ జేరి స్వరూపజ్ఞానమును మఱచియుండును.

తన స్వామియైన వాసుదేవుని ఇష్టము ననుసరించి శ్రీహరి నెఱుఁగు కార్యమందు ప్రవృత్తుఁడు గాలేఁడు. ఇట్టి జీవుఁడు నివృత్తి ధర్మము నాచరించి తత్ఫలముగా శ్రీహరి యనుగ్రహమును సంపాదించికొనఁ జాలును. ఈ విషయము నెఱిఁగిన యాచార్యుఁడు తనచే రచితమైన భాగవతగ్రంథ మూలమున నా జీవునకు నివృత్తిధర్మము బోధించి పురుషార్థమును బడయునట్లొనర్చును. లేక వివేకశాలియైన జీవుఁడు బ్రహ్మసూత్రముల రెండవ యధ్యాయము రెండవ పాదమునఁ జెప్పిన యుక్తులను మనన మొనర్చి సాంఖ్యాది దర్శనకారుల మతము దుష్ట మగుటచే వా రనాప్తులని అమోఘజ్ఞానము గలిగి ప్రమాదాదిదోష రహితుఁడైన వ్యాసరూపి శ్రీహరియే యాప్తతముఁడని తెలియును. తెలిసి విషయాసక్తుఁడై ఇంద్రియజయము లేని ఆ జీవుఁడు నివృత్తి ధర్మము ననుసరించి హరియనుగ్రహమును సంపాదించి స్వరూపసుఖ మునుబడయ నగునని గ్రహించును. అట్టి యధికారమే యీగ్రంథము సర్థ మొనర్చికొనును. కనుక భాగవతరచనము నుదాసీనింపరాదు.

అవ: పైని చెప్పఁబోవు కారణముతోఁ బ్రవృత్తిధర్మమున కంటెను నివృత్తిధర్మమే యుపదేశమున కర్హమని చెప్పుచున్నాఁడు.

అథ=ఇంకను, స్వధర్మం=భగవద్విషయము గాని స్వధర్మాను ష్ఠాన మనెడు ప్రకృతిధర్మమును, త్యక్త్వా=వదలి సంకోచపఱచికొని, హరేః=హృషీకేశుని యొక్క, చరణాంబుజం=పాదపద్మమును, భజన్ =నివృత్తిధర్మమును బోధించు శాస్త్రములు దెల్పెడు నాచారములతో సేవించువాఁడు, తతః=అట్టి సేవతో, అపక్వః=పరమాత్ముని సాక్షా త్కారము నందకయే, యదిపతేత్=1. రాగాది విఘ్నములతోఁ బర మాత్ముని సేవను వదలినవాఁడైనచో, 2. మరణించినచో, అముష్య= అట్టి నివృత్తిధర్మరతుఁడైన భగవద్భక్తునకు, యత్ర క్వవా=ఏదో యొక సమీపమందున్న జన్మమందు, భద్రం=శుచిమంతులైన శ్రీమంతుల గృహమందు జన్మించి నివృత్తిధర్మము ననుసరించుట, అభూత్=నిశ్చ

యముగా నేర్పడును. స్వధర్మం భజతాం=కేవల ప్రవృత్తిధర్మ మని పించికొనెడు హరిస్మరణములేని యాచారముల ననుష్ఠించువారికి, అభజతాం=శ్రీహరియందు భక్తిఁ జెల్లింపని వారికి, కో వా అర్థః అప్తః =ఏ పురుషార్థము లభించును? కనుక నివృత్తిధర్మమును బోధించు శాస్త్రమును రచింపుమని ప్రార్థించుచున్నాను. హరిభక్తిని సంకుచించి స్వధర్మము నొనర్చువానికంటెను, ధర్మమును సంకోచపఱచి భక్తి చెల్లించువాఁడు సద్గతి నందును. 'ఏష్యత్తు నిశ్చితం యత్తద తత్త్వేన భణ్యతే' ముందు రాఁబోవు కార్యము నిశ్చయముగా జరుగునప్పుడు దానిని భూతకాలిక క్రియతోనే చెప్పుట సంప్రదాయము. అందుచేత 'కాఁగలదు' అను నర్థమందు అభూత్ అను భూతకాలికక్రియ యుప యోగింపఁ బడినది.

తాత్పర్యము: ప్రవృత్తి ధర్మమందే యాసక్తులైనవారు ఏ పురుషార్థమును గాని పొందలేరు. హరిస్మరణాహీనమైన యాచారము సంక్షిప్తపఱచి కొనవచ్చును; లేక వదలినను దోషము లేదు. నివృత్తి ధర్మమును బోధించు శాస్త్రముల ననుసరించి వైకుంఠుని పాదాంబుజ మును వదలక సేవించువాఁడు సాక్షాత్కారము నొందుటకు ముందే మరణించినను లేక విఘ్నములతోఁ గొంతకాలము వదలినను వాని కెట్టి క్షతియును లేదు. అట్టి యోగభ్రష్టుఁడు సమీపజన్మమందు శ్రీమంతులు శుచిమంతులునైన యధికారుల వంశమందు జన్మించును. అక్కడినుండి తన సాధనను మఱల నారంభించును. శ్రీహరి యను గ్రహమునకుఁ బాత్రుఁడై యపరోక్షానుభూతి నందును. కనుక-ధర్మా నుష్ఠానమును బెంచికొని హరిభక్తిని దగ్గించుకొనుటకంటెను ప్రవృత్తి ధర్మమును దగ్గించికొని హరిభక్తిని బెంచికొనుట లెస్స.

అవ: అందుచే వివేకియైనవాఁడు ప్రవృత్తిమార్గమును వదలి నివృత్తిమార్గమునే యనుసరింపఁ దగునని చెప్పుచున్నాఁడు-

కోవిదః=జ్ఞానియైనవాఁడు, తస్యైవ=అనంతపారుఁడైన శ్రీహరి యొక్క ముఖ్యప్రసాదముతో లభించునని చెప్పఁబడిన సుఖము యొక్క, హేతోః=కారణమైన నివృత్తిధర్మ మనిపించుకొనెడు సాధన కొఱకే, ప్రయతేత=ప్రయత్న మొనర్పవలెను. ఇతరమునకై యత్నింపరాదు. ఉపర్యధః=భూమి మఱియు స్వర్గాదులందు, భ్రమతాం=తిరుగుచున్నట్టి ప్రవృత్తిధర్మానుష్ఠాన పరులైన పురుషులకు, యత్=ఏ నిత్యమైన స్వరూపసుఖము, న లభ్యతే=సులభము గాదో, తత్ సుఖం=ఆ స్వరూపసుఖము నివృత్తిధర్మపరులైన జీవులకు, గంభీరరంహసా=1. వ్యక్తముగాఁ గనుపింపనట్టి వేగముగల, 2. అనేకజన్మముల పరిమితిగల, కాలేన=కాలమందు కాలరూపియైన, అన్యతః=అందఱు దేవతలకంటె నత్యంత భిన్నుఁడైన శ్రీహరినుండి, సర్వత్ర=అన్ని దేశకాలము లందును, అదుఃఖవత్=దుఃఖము గానిదై లేక, దుఃఖవత్=పాపులకుఁ బ్రయత్నములేకయే ప్రాప్తించు దుఃఖమువలె, లభ్యతే=వేఱు ప్రయత్నము లేకయే యభివ్యక్త మగును. లేక మఱియొక రీతిగా నన్వయించికొనవచ్చును. ఆ యన్వయక్రమ మిది.

స్వర్గాదులందు సంచరించువారికి ఏ సుఖము లభింపదో అట్టి నిర్దుఃఖమైన సుఖము కొఱకే జ్ఞానియగువాఁడు ప్రయత్నింపవలెను. అన్యతః=విషయభోగముతో, యద్దుఃఖవత్సుఖం=ఏ దుఃఖమిశ్రితమైన సుఖము గలదో, తత్=అది, అవ్యక్తవేగముగల కాలమునుండి, సర్వత్ర=అన్నిదేశ కాలములందును, లభ్యతే=చిక్కుచున్నది-అగుటచే దాని కొఱకై ప్రయత్నింపక నిత్యమైన స్వరూపసుఖమునకే ప్రయత్నింపవలెను.

తాత్పర్యము : దుఃఖములేని సుఖమనిపించికొనెడు మోక్షము శ్రీహరి పరమానుగ్రహముతో నేల లభించును. ఆయనుగ్రహమునకు నివృత్తి ధర్మాచరణమే ప్రధానసాధనము. కనుక, జ్ఞానియైనవాఁడు

నివృత్తి ధర్మరూపమైన సాధన సంపత్తికొఱకే ప్రయత్నింపవలెను. లౌకికసంపత్తి నొసఁగు ప్రవృత్తి ధర్మప్రవృత్తుఁడు గారాదు.

ప్రవృత్తిరతులకు, స్వర్గాదులందు సుఖము లభించును. కాని మోక్షసుఖ మేర్పడదు. నివృత్తి ధర్మానుష్ఠానపరులకు స్వరూప సుఖాత్మకమైన మోక్షము కాలక్రమమున, ననేక జన్మసాధనాఫలముగాఁ గాలరూపియై జగద్విలక్షణుఁడైన శ్రీహరి దయతో లభించి తీరును. పాపులకు దుఃఖము లభించునట్లు; ముక్తియోగ్యులైన నివృత్తి ధర్మపరులకు సుఖము దుఃఖలేశసంపర్కము లేనిది దొరకితీరును. దుఃఖమిశ్రితమైన లౌకిక సుఖమునకై, ప్రయత్నింపవలసిన పనిలేదు. అది కాలక్రమముతో నే విశేషప్రయత్నమును లేకయే సిద్ధించును. ప్రయత్న మొనర్పఁదగుట నిత్యమైన స్వరూప సుఖముకొఱకే. 19వ శ్లో: మఱియొక కారణము చేతగూడ నివృత్తిధర్మము శ్రేష్ఠమైనదని శ్రేయస్కరమైనదని చెప్పఁబోవుచున్నాఁడు—

అంగ: పూజ్యుఁడైన వేదవ్యాసరూప భగవంతుడా! ముకుంద సేవీ!—మోక్షప్రదుఁడైన శ్రీహరిని సేవించెడు, జనః—అధికారియైన చేతనుఁడు, అన్యవత్—శ్రీహరిని సేవింపని వానివలె, జాతు—ఏ కాలమందును, కథంచన—ఏ నిమిత్తముచే నైనను, సంసృతిం—సంసారమును, న అవ్రజేత్—పొందుటలేదు,

నహికల్యాణకృత్ కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి.

అనువాక్యమే ప్రమాణము. ముకుందాంఘ్య్రుపగూహనం—మోక్షప్రదుఁడైన వాసుదేవుని పాదకమలముల యాలింగనమును (దానితో నేర్పడు సుఖమును) స్మరన్—మనసుతోనే యనుభవించుచున్నవాఁడై రసగ్రహీ—భక్తిరసమును గ్రహించిన, జనః—జనుఁడు,పునః—మరల, విహాతుం—శ్రీహరి చరణారవిందస్మరణమును విడచుటకు, న ఇచ్ఛేత్—ఇష్టపడఁడు.

తాత్పర్యము: పూజ్యుఁడైన వేదవ్యాసుడా! శ్రీహరినిసేవించు నధికారి చేతనునకు భగవంతుని సేవింపని జీవునకు ఫలమందు గొప్ప భేద మున్నది.

హరిభక్తుఁ డే కాలమం దైనను ఏ నిమిత్తముచే నైనను సంసార మును బొంది దుఃఖింపఁడు. న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి ' వానికి దుర్గతి యెన్నఁడును లేదు. అట్టి యధికారి చేత నుఁడు తన మనస్సునందే వైకుంఠునియొక్క పాదపద్మాలింగన సుఖము ననుభవించుచుండును. ఇట్టి భక్తిరసములోని రుచి నెఱిఁగిన ముక్తియోగ్య జీవుఁడు శ్రీహరి పాదముల నెప్పుడును వదల నేరఁడు. వదలుట కిష్టముండదు.

రసజ్ఞులైన భక్తులు సేవించెడు శ్రీహరి లక్షణమును నిర్వచించు చున్నాఁడు.

సః భగవాన్—భక్తులు మనస్సుతో ధ్యానించెడు వైకుంఠుఁడు, ఇదం—ఈ మన కన్నుల కగుపించెడు, విశ్వమివ—ప్రపంచము వలెనే యుండును. వాడే ప్రపంచము గాదు. ఇతరః—జగత్తునకంటె విలక్ష ణుడు, యతః—ఏ శ్రీహరినుండి, జగత్ స్థాన నిరోధ సంభవః—జగత్తు యొక్క సృష్ట్యాదులు నడచునో, హి—జగత్సృష్టి మొదలగు లక్షణములచేఁ దెలియఁ బడెడు సర్వజ్ఞత్వ స్వతంత్రత్వ సర్వ శక్తత్వ సర్వస్వామిత్వాది గుణములచేతఁ బూర్ణుఁ డగుటచే నా సర్వజ్ఞత్వము మొదలైన గుణములు పరిమితములుగా నున్న లక్ష్మీ బ్రహ్మాదులగు జగత్తుకంటె భిన్నుఁడనుట యనుభవసిద్ధము, తత్— తనయందున్న ఆ జగ ద్వైలక్షణ్యమును, స్వయం—తానే, వేద— తెలిసికొన్నవాఁడు, హి—ఆ కారణముచేతనే జగత్తునకు, వాసుదేవు నకు నైక్యము చెప్పుట ప్రమాణ విరుద్ధము, భవాన్—పూజ్యుఁడైననీవు వేద—ఈ విషయమును దెలిసినవాఁడవు, తథాఽపి—నీవు సర్వజ్ఞుఁడ వైనను ఉపాధ్యాయునిముందు విద్యార్థివలె, భవతః—అవ్యాకృతాకా శము వలె, నపరిమిత జ్ఞానమున్న నీకు, ప్రాదేశమాత్రం—ఒక ప్రదేశ

మునకుఁ బరిమితమైయున్న యాకాశమంత అత్యంత స్వల్పముగా, జ్ఞానము (మయా=నాచేత) ప్రదర్శితం=చెప్పఁబడినది. 'ఈ విశ్వము భగవంతుఁడు. భిన్నుఁడైన వానివలెనున్న జీవుఁడును భగవంతుఁడే' ఈ యర్థకల్పనముఁ జేయరాని దని 'హి' శబ్దముచే సూచించుచున్నాఁడు. సర్వం ఖల్విదం బ్రహ్మ. ఇత్యాదిశ్రుతుల కభేదము తాత్పర్యము గాదు.

ఈ శ్లోకమందు 'ఇవ' - 'ఇతర' శబ్ద ప్రయోగములచే నీ యర్థమే దృఢపఱుపఁబడుచున్నది. పైఁ జెప్పఁబడిన శ్రుతికి జీవ జడాత్మకమైన ప్రపంచమునకు 'సత్త' మొదలగు ధర్మముల నొసఁగువాఁ డనియే యర్థము చెప్పవలెను. దీనినే భాగవతము ప్రతిపాదించినది.

తాత్పర్యము : భగవద్భక్తుల ధ్యానగోచరుఁడైన శ్రీహరి మన కన్నుల కగుపించు ప్రపంచమువలె, సత్యస్వరూపుఁడు. ప్రపంచమే యతఁడుగాదు. వాఁడు ప్రపంచవిలక్షణుఁడు; కనుక జగత్తునకంటెను భిన్నుఁడు. వానినుండియే ఈ సృష్ట్యాదు లేర్పడు చున్నవి. అందుచే వాఁడు సర్వజ్ఞుఁడు. స్వతంత్రుఁడు. సర్వశక్తుఁడు. సర్వస్వామి. వాని యందు సమస్తగుణములును బరిపూర్ణములై యుండును. అతనికంటె భిన్నులైన లక్ష్మీ బ్రహ్మాదిచేతనులు జగత్తు వా రస్వతంత్రులు. అసర్వజ్ఞులు. అసర్వశక్తులు; అసర్వస్వాములు. కనుక, శ్రీహరి జగత్తునకన్న భిన్నుఁ డనుట సర్వసిద్ధము. తన జగద్విలక్షణత్వమునుగూర్చి శ్రీహరి చక్కగా నెఱుఁగును. అతని యవతారమే యైన నీకును నిది స్పష్టమే. వైకుంఠునకును జగత్తునకును ఐక్యమును జెప్పుట ప్రమాణవిరుద్ధము. అవ్యాకృతాకాశమువలె పరిమితి లేని జ్ఞానముమీది. నేను విజ్ఞాపించినది.. కేవలమొక్క ప్రదేశమందున్న యాకాశమువలె ప్రాదేశమాత్రమే. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' ఇత్యాది శ్రుతుల కర్థాంతరములను గల్పించు మతములను ఖండించెడు భాగవత గ్రంథమును రచింపుఁడు. జీవ జడాత్మకమైన ప్రపంచమునకు సత్తాదిప్రదుఁడైన భగవంతుని యథావత్తుగా దెలిపి, సజ్జనుల నుద్ధార మొనర్పవలెను.

త్వ మాత్మనాత్మాన మవేహ్యమోఘదృక్
పరస్య పుంసః పరమాత్మనః కలామ్,
అజం ప్రజాతం జగత శ్శివాయ త
న్మహానుభావాభ్యుదయో ఽధిగణ్యతామ్. 21

అమోఘదృక్ = నిష్ఫలముగాని దృష్టిచేఁ గూడినవాఁడా!, త్వం = నీవు, ఆత్మనా = స్వయముగనే, ఆత్మానం = ఆత్మస్వరూపునిగను, అజం = జననములేనట్టి వానిగను, జగతః = ప్రపంచముయొక్క, శివాయ = మంగళముకొఱకు, ప్రజాతం = ప్రకర్షముగా జన్మించినట్టి, పరస్య పుంసః = పరమపురుషుఁడైన, పరమాత్మనః = పరమాత్మునియొక్క, కలాం = అంశభూతునిగా, అవేహి = తెలిసికొమ్ము, మహానుభావాభ్యుదయః = గొప్పదైన అనుభవముచేఁ గూడిన వానియొక్క పరాక్రమమును అధిగణ్యతాం = వర్ణింతువు గాక.

అమోఘ దృష్టిగల వ్యాసముని! నీవు పరమేశ్వరుని యవతార భూతుఁడవు. నీ కాచార్యాపేక్ష యవశ్య ముండవలసినది లేదు. నీ వమోఘదృష్టిగలవాఁడవు. నీ జ్ఞానమున కెప్పుడును దోషస్పర్శలేదు. స్వయముగ నాత్మస్వరూపుఁడవు; జన్మాది వికారరహితుఁడవు. లోక క్షేమమునకై స్వేచ్ఛగా నవతరించిన పరమపురుషుఁడైన పరమాత్ముని కళాభూతుఁడవు. అందుచే మహానుభావుఁడైన వైకుంఠవాసుని యొక్క పరాక్రమమును, ప్రధానముగా నిరూపింపవలెను.

ఇదం హి పుంసస్తపస శ్శ్రుతస్య వా
స్విష్టస్య సూక్తస్య చ బుద్ధిదత్తయోః,
అవిచ్యుతోఽర్థః కవిభి ర్నిరూపితో
యదుత్తమశ్లోక గుణానువర్ణనమ్. 22

ఉత్తమశ్లోక గుణానువర్ణనం = ఉత్తమమైనకీర్తిగల పరమేశ్వరునియొక్క గుణానువర్ణన మనునది, యత్ = ఏదికలదో, ఇదం హి = అదియే, పుంసః = పురుషుని యొక్క, తపసః = తపస్సుయొక్కయు, శ్రుతస్య = శ్రవణముయొక్కయు,

స్విష్టస్య=అగ్నిష్టోమాద్యనుష్ఠానము యొక్కయు, సూక్తస్య=ఉత్తమమైన వాచా వ్యవహారముయొక్కయు, దానయోః=దానముయొక్కయు, కవిభిః=విద్వాంసుల చేత, అవిచ్యుతోఽర్థః=ఉత్తమోత్తమమైన ఫలముగా, నిరూపితః=సిద్ధాంతీక రింపఁబడినది.

అవ: ఈ యొక్క కార్యకరణముచేతనే తపస్సు మొదలైన సమస్తమును సఫలీకృత మగునని వివరించుచున్నాఁడు. పురుషుఁ డొనర్చెడు తపస్సు, వేదాంతశ్రవణము, వేదాధ్యాపనము, అగ్నిష్టో మాది కర్మలు, తటాకప్రతిష్ఠాదులు, సూక్తవాచావైభవము, దాన ధర్మాదులు వీని యన్నింటికిని ఫల మొక్కటే, పరమేశ్వరుని గుణాభి వర్ణనము. ఇట్లే విద్వాంసులు నిరూపించిరి.

**శ్రీధరీయము:**

అజం=జన్మాది వికారములతోఁ గట్టువడెడువాఁడు కానప్పటికి, జగత శ్శివాయ ప్రజాతం=జగత్ క్షేమముకొఱకు స్వేచ్ఛగా నవత రించిన వానినిగా, అవేహి=తెలియుము. ఎందువలన? పరస్య పుంసః కలాం=పరమపురుషుని యంశభూతుఁడవు నీవు. శ్రీహరియొక్క పరాక్రమాదులను, అధి=ఎక్కువగా, గృణీతాం=నిరూపింపుము.

శ్రుతస్య స్విష్టస్య ఇత్యాదులందు భావే క్తప్రత్యయము అవి చ్యుతః=నిత్యమైన, అర్థః=ఫలము.

**వంశీధరుని భావార్థదీపిక :**

అమోఘ=లోకకల్యాణకరమైన, దృక్=దృష్టి అనఁగా జ్ఞానము గలవాఁడా! 'సర్వవర్ణాశ్రమాణాం యత్ దధ్యౌ హి తమమోఘ దృక్' అనుచోటఁ గూడ నీ శబ్దమే వాడఁబడినది. సమస్త ధర్మపరి త్యాగ మొనర్చినను, కేవల భక్తి చేతనే మానవుఁడు కృతార్థుఁ డగు నని పిండితార్థము.

అవ: ఒకానొక భిక్షునకుఁ గొన్ని కర్మలయందు స్పృహ యున్నను అ ధర్మానుష్ఠానఫలము గూడ భక్తితోనే సిద్ధించు నను చున్నాఁడు-

అవిచ్యుతోఽర్థః=అవిచ్యుత=అవ్యభిచారియైన, అర్థ మనఁగా హేతువు. 'యత్కర్మభిర్యత్తపసా' ఇత్యాది భగవద్వాక్యములచేత తపశ్చరణాది ఫలములుగూడ భగవద్భక్తిచేతనే సిద్ధించుచున్నవి. మఱి తదనుష్ఠానము నిష్ఫలమని భావము. 'స్మర్తవ్యస్సతతం విష్ణుః' 'విస్మర్తవ్యో న జాతుచిత్, సర్వే విధినిషేధాస్స్యు రేతయో రేవ కింకరాః' 'ధర్మో యస్యాం మదాత్మకః' అనునదిగూడ భగవద్వాక్యమే. మధుసూదన సరస్వతియు 'సర్వశాస్త్రవాక్యానాం శ్రీభగవత్యేవ తాత్పర్యం' అన్నాఁడు. తప మనఁగా కాయక్లేశ లక్షణమైన వ్రతాదులు. శ్రుతం=శాస్త్రశ్రవణము, స్విష్టం=ఉత్తమకల్పముల ననుసరించిన యజనము, సూక్తం=అధ్యయనము. దత్త మనఁగా దానము.

**విజయధ్వజము:**

అవ. నేను చెప్పిన విషయము లన్నియుఁ దమకుఁ దెలిసినవే అని నారదుఁడు వివరించుచున్నాఁడు-

హే అమోఘదృక్ త్వం. అజం. ఆత్మానం=నిన్ను, పరమాత్మనః=దానము మొదలైన యుత్తమ కార్యములయొక్క కర్తగా నున్న, పరస్య పుంసః=కలాం, అంశ మనియు, జగతః=జీవరాసులయొక్క, శివాయ=మోక్షరూపమైన పురుషార్థమునకు, ప్రజాతం=అవతరించిన వానినిగా, ఆత్మనా=ఇతరుల యుపదేశము లేకయే, అవేహి=తెలియుదువు. సర్వజ్ఞుఁడవైన నీకు ఇతరులు తెల్పవలసిన పనిలేదు. తత్=అ నీయొక్క, మహానుభావాభ్యుదయః=మహాసామర్థ్యమనెడు చరిత్రయొక్క ఉదయమును జగత్కల్యాణమునకై, అనుగణ్యతాం=ప్రధానముగా వర్ణింపుము. నీ చరిత్రను వర్ణించుటచేత నధికారి చేతనులకు మోక్షము లభించునని యభిప్రాయము. అనుగణ్యతాం అని వీరి పాఠము.

అవ: భగవన్మహిమారూపమైన యభ్యుదయమును వర్ణించుట జగత్క్షేమమునకుఁ గారణ మెట్లగును? దానిని వివరించుచున్నాఁడు-

యత్=ఏ, ఉత్తమశ్లోక గుణానువర్ణనం=శ్రేష్ఠమైన యశస్సు నందిన శ్రీహరి గుణములను జక్కగా వర్ణించుటనుట గలదో, ఇదం హి=ఇదే, పుంసః=అధికారి చేతనునియొక్క, తపసః=కాయక్లేశరూపమైన తపస్సు, శ్రుతస్య=శాస్త్రశ్రవణము, స్విష్టస్య=ఉత్తమరీతితో సాంగముగ నెఱవేర్పఁబడిన యజ్ఞము, సూక్తస్య-వేదము మొదలగు శాస్త్రాధ్యయనము, బుద్ధదత్తయోరివ-తెలియుట దానము మున్నగు వానియొక్క, అవిచ్యుతోఽర్థః-అపరోక్షజ్ఞానమును గల్గించి మోక్ష కారణమగుటచేత, వినాశము లేని ఫల మనిపించికొనెడు ప్రయోజన మని, కవిభిః-జ్ఞానులచేత, నిరూపితః-నిరూపింపఁబడినది. శ్రీహరి మహిమను వర్ణించుటచే నధికారి చేతనుల కందఱకును మోక్షము లభించును. అందుచే తా మా పనినే యొనర్పవలెనని యర్థము.

తాత్పర్యము: వేదవ్యాసమునీ! నీ జ్ఞాన మమోఘము. జననాది దోషములు లేనివాఁడవు నీవు. సమస్తమునకు స్వామియైన శ్రీహరియే యుత్తమకర్త. సర్వోత్తముఁడు. అతని యవతారమే నీవు. అధికారిచేతనుల ననుగ్రహించి వారికి మోక్షసాధనమును దెలియపఱచుటయే నీ యవతార ప్రయోజనము. ఈ విషయము నేను నీకుఁ జెప్పవలసినది లేదు, నీకే తెలియును. కనుక నీ మహామహిమోపేతమైన చరిత్రనే భాగవతమందు వర్ణింపవలెను. ఆ చరిత్రను మనన మొనర్చి సజ్జనులు మోక్షాది పురుషార్థము లందెదరు. అధికారిచేతనులు వారి వారి యోగ్యతకుఁ దగి ట్లు శరీరమును దండించి తప మొనర్పవచ్చును. శాస్త్రశ్రవణము సేయవచ్చును. ఉత్తమరీతితో నంగసాకల్యముగా యజ్ఞయాగాదు లొనర్పవచ్చును. వేదము మొద

లైన శాస్త్రాధ్యయనము సేయవచ్చును. సమస్త విషయములను దెలిసి, తెలుపవచ్చును. ఇవన్నియు నపరోక్షజ్ఞానమును గల్గించి శాశ్వత ఫల మనిపించుకొనెడు మోక్షమునకుఁ గారణములు గావలెను. మోక్షము శ్రీహరి గుణవర్ణనాపూర్వకమైన సాధనతోనే సాధ్య మగునని జ్ఞానుల మతము. అందుచే నధికారిచేతనులు స్మరించుట కనుకూలమగునట్లు శ్రీహరి గుణములను వర్ణించు భాగవతశాస్త్ర మొనర్పవలెను.

**పోతన్నగారు :**

చ. ఎఱిఁగెడువాఁడు కర్మచయమెల్లను మాని హరిస్వరూపమున్
నెఱయ నెఱుంగుఁ దాను మదినేరుపుఁ జూపు: గుణానురక్తుఁడై
తెలుపవలేక భ్రమ్మరుచు దేహధనాద్యభిమాన యుక్తుఁడై
యెఱుఁగని వానికిం దెలియ నీశ్వరలీల మునీంద్ర! చెప్పుమా!

చ. తన కులధర్మమున్ విడిచి దానవవైరి పదారవిందముల్
వనివడి సేవసేసి పరిపాకము వొందక యెవ్వఁడేని ఱ
చ్చిన మఱుమేననైన నది సిద్ధివహించుఁ దదీయసేవఁ బా
సినఁ గులధర్మగౌరవము సిద్ధివహించునె యెన్ని మేనులన్?

వచ: అది గావున నెఱుకగలవాఁడు, హరిసేవకుం బ్రయత్నంబు సేయందగుఁ; గాలక్రమంబున సుఖదుఃఖంబులు ప్రాప్తంబు లయినను హరిసేవ విడువం దగదు. దానంజేసి యూర్ధ్వంబున బ్రహ్మపర్యంతంబు గ్రింద స్థావర పర్యంతంబు దిరుగుచున్న జీవులకు దుఃఖంబులట్లు సుఖంబులు ప్రాకృతకర్మాధీనంబులై సిద్ధించు; నెయ్యది పొందరాదట్టి మేలు సిద్ధించుకొఱకు హరిసేవ సేయవలయు. హరి సేవకుండగు వాఁడు జననంబునొందియు నన్యునిక్రియ సంసారంబునం జిక్కండు. క్రమ్మఱ హరిచరణ స్మరణంబుఁ జేయుచు భక్తిరస వశీకృతుండై విడువ నిచ్చగింపఁడు; మఱియును

విష్ణుండు విశ్వంబు; విష్ణునికంటెను
వేఱేమియును లేదు; విశ్వమునకు
భవ వృద్ధి లయములా పరమేశుచే నగు;
నీ వెఱుంగుదు గాదె; నీ ముఖమున
నెఱిఁగింపఁబడ్డది; యేకదేశమున నీ
భువనభద్రమునకై పుట్టినట్టి
'హరికళాజాతుండ' వని విచారింపుము
క్రమముగా హరి పరాక్రమము లెల్ల

వినుతిసేయు మీవు; వినికియుఁ జదువును
దాన మతులనయముఁ దపము ధృతియుఁ
గలిమిలెల్ల ఫలముగాదె పుణ్యశ్లోకుఁ
గమలనాభుఁ బొగడఁ గలిగెనేని.

అర్థము: ఎఱిఁగెడువాఁడు = సదసద్వివేచనము గలవాఁడు, కర్మచయము = ప్రవృత్తి ధర్మరూపమైన కర్మకాండను, ఎల్లన్ మాని = సమస్తమును వదలివైచి, హరి స్వరూపమున్ = శ్రీమహావిష్ణువు నిర్వికల్పక సుఖాత్మకమైన రూపమును, నెఱయన్ = నిండుగా అనఁగా సంపూర్ణముగా, ఎఱుంగున్ = అనుభవించును, తాన్ మదిన్ నేరుపున్ జూపుచున్ = ఆ యనుభవముచే నేర్పడిన ఆనందముతో వివేకవంతుఁడై యుండును. గుణానురక్తుఁడై = త్రిగుణముల ప్రభావములకు లోఁగినవాఁడై, తెలుకువ లేక = జనన మరణముల నుండి తప్పించుకొనవలె ననెడు వివేకము లేక, దేహధనాద్యభిమానయుక్తుఁడై = దేహము ధనము మున్నగు వానియందు 'ఇవి నావి' యను నభిమానము గలవాఁడై, క్రుమ్మరుచున్ = జన్మచక్రములందుఁ దిరుగుచునుండు నట్టి, ఎఱుఁగని వానికిం దెలియన్ = అజ్ఞాని కర్థమగునట్లు, మునీంద్రా! = ఓ వ్యాసమహర్షీ!, ఈశ్వరలీలలన్ చెప్పవే! = పరమేశ్వరుని లీలలను చెప్పుము.

తాత్పర్యము: ఎవఁడో యొకఁడు విచక్షణుఁడైనవాఁడు సర్వక్రియా నివృత్తి యొనర్చును. ఒనర్చి నిర్వికల్పక సుఖాత్మకమైన

పరమపురుషుని రూప మెఱిఁగి తదనుభవరసికుఁడై చాకచక్యముతోఁ బ్రదుకును. ప్రవృత్తిస్వభావుఁడైన జీవుఁ డవిచక్షణుఁడు. దేహాద్యభిమానము గలవాఁడు. తత్ఫలముగా వివేకహీనుఁడు. దానితో జన్మమరణ చక్రమందు నిరంతరము భ్రమించువాఁడు. అట్టి వాని కర్థమగునట్లు వాఁడు తన యజ్ఞానము నెఱిఁగి వివేకమునఁ బ్రవర్తించునట్లు పరమేశ్వరుని లీలలను వర్ణింపుము. పూర్వపద్యములందుఁ బ్రవృత్తిమార్గమును నిందించెను. సర్వక్రియా పరిత్యాగముచేతనే నివృత్తిమార్గమందు పారమేశ్వరసుఖానుభూతి. వాస్తవ మిట్లుండఁగా వైకుంఠుని యశఃకథనముచేఁ గల్గు లాభమేమి? యనుటకీ పద్యమున నుత్తరము చెప్పినాఁడు.

అర్థము: తన కులధర్మమున్ విడచి=తన కులమున కనుగుణముగా ననుష్ఠింపవలసిన ధర్మమును వదలిపెట్టి, దానవవైరి–శ్రీమహావిష్ణువుయొక్క, పదారవిందముల్–పాదపద్మములను, పనివడి–అక్కఱగా, సేవచేసి–సేవించి, పరిపాకమున్ పొందక–ఆ భక్తిమార్గమందు నిష్ణాతుఁడు గాకముందే, ఎవ్వడేఁన్ చచ్చినన్–ఎవఁడైనను మరణించినచో, మఱుమేననైనన్–తరువాతి జన్మమందైనను అది అనుష్ఠితమై ఫలపరిపాకమును బొందని భక్తి, సిద్ధి వహించున్–క్రమముగా ననుష్ఠింపఁబడి ఫలస్వరూపమును దాల్చును. తదీయసేవన్–ఆ శ్రీమహావిష్ణువునకు సంబంధించిన సేవను, పాసిన–వదలిపెట్టిన, కులధర్మగౌరవము=కులధర్మానుష్ఠానముచేత నేర్పడెడు గొప్పతనము, ఎన్నిమేనులన్–ఎన్నిశరీరము లెత్తినను, సిద్ధివహించునె?–ఫలము పొందిన దగునా!

తాత్పర్యము: ఎవఁడైనను తన కులధర్మమును వదలిపెట్టి శ్రీహరి పాదాబ్జములను సేవించినచో వాని కెన్నఁడును చ్యుతిలేదు. కులధర్మమును వదలిన పాపము వానినంటు నేరదు. ఈ ధర్మమందు వాఁడు భక్తిమార్గమును బరిపూర్ణముగ సాధింపలేక మరణించినచో,

మఱుజన్మమున నా సంస్కారము వాని నంటికొనుచున్నది. వాఁడు అక్కడనుండి దన యభ్యాసమును ముందుకు సాగించును. ఈ జన్మముననో తదుపరిజన్మమందో వాని కా భక్తిమార్గములో సిద్ధి ప్రాప్తించి తీరును. ఒకవేళ ఈ జన్మమందే కొంతభక్తిని సాధించి మఱల తద్విరుద్ధములైన యాచారముల ననుసరించి పతితుఁడైనను ఆ సంస్కారము వానిని వదలిపెట్టదు. సమయము వచ్చినంతనే యది యుద్బుద్ధమై మఱల వానిని భక్తిమార్గమున కీడ్చును. శ్రీమహావిష్ణువు సేవను వదలి ఎవఁడైనను కులధర్మగౌరవమునే పట్టుకొని ప్రేలాడుచున్నచో వాని కెన్నఁటికిని సిద్ధిలేదు. ఎన్నిజన్మ లెత్తినను వాఁడు ధర్మానుష్ఠానములోఁ బొరలుచుండ వలసినదే. ఇందులో 'విడచి' శబ్దమునకు మూలము 'త్యక్త్వా' అనునది. భక్తిమార్గానుసరణమునకు ముందే కర్మమార్గము నుల్లంఘింపవలెనని వంశీధరుఁ డర్థము చెప్పెను. కుల ధర్మములను వదలుటవలనఁ గలుగు లోపములను భక్తియే పూరించునని యతని యభిప్రాయము. విజయధ్వజుఁడు దీని నంగీకరింప లేదు. స్వధర్మానుష్ఠానమును బొత్తిగా వదలిపెట్టుట మూలకారుని యభిప్రాయము గాదని యాతని తలఁపు. భక్తిని కుంచించుకొని ధర్మానుష్ఠానముఁ బెంచికొనుట కంటెను దానిని సంకుచించికొని భక్తిని సాధించుట లెస్స యని యతని యభిప్రాయము. 'పనివడి', అక్కఱతో సేవింపవలెను; అనఁగా నితఁ డొకఁడే శరణ్యమని సేవింపవలె ననుట. 'మా మేవ యే ప్రపద్యంతే' అను గీతావచనానుసారముగా నని యభిప్రాయము. పరిపాకమున్ పొందక=పరిపాకము పొందక ద్వితీయకు ప్రథమవచ్చి దానిపై గనడదవాదేశము. పరిపాకము పొందకపోవుట రెండు రీతులుగా 1. జన్మమంతయు భక్తిని సాధించినను అది పక్వము గాకపోవచ్చును. ఒక జన్మమందే సాధకుఁడు కొంతకాలము భక్తినొనర్చి తదుపరి తద్భిన్నవర్తనము ననుసరింపవచ్చును. ఎట్లైనను భక్తిమార్గములో క్షతిలేదని అభిప్రాయము.

తదీయ సేవన్ = ఆ శ్రీమహావిష్ణువునకు సంబంధించిన అని యొక యర్థము. తదీయు లనఁగా భాగవతులు. వారిసేవ తదీయసేవ. భగవంతునివలెనే భాగవతులనుగూడ సేవింపవలెనని భావము. కుల ధర్మగౌరవము=కులధర్మముల ననుష్ఠించుటచే నేర్పడిన గొప్పతనము. ఎన్నిజన్మములెత్తినను భగవదనుభవమును బొందింపలేదని భావము.

అర్థము : అదిగావునన్ = సత్య మిట్లుండుటచేత, ఎఱుకగల వాఁడు=కోవిదుఁడైన జనుఁడు, హరిసేవకున్ ప్రయత్నంబుసేయన్ తగున్=కర్మమార్గమును సంకుచించికొని, వాసుదేవుని పదసేవకై యత్నింపవలెను. కాలక్రమంబునన్=వాని వాని ప్రాప్తికాలమందు సుఖదుఃఖంబులు=సుఖములును, దుఃఖములును, ప్రాప్తంబులైననున్ = సంప్రాప్తించినను, హరిసేవవిడువందగదు = శ్రీమహావిష్ణుసేవ వదలుకొనరాదు. దానంజేసి=దానివలన, కాలక్రమమున సుఖదుఃఖ ములు ప్రాప్తములైనను హరిసేవ వదలరానిదగుటవలన, ఊర్ధ్వంబున బ్రహ్మపర్యంతంబు=ఊర్ధ్వలోకములందు చతుర్ముఖబ్రహ్మవఱకును, క్రిందస్థావరపర్యంతంబు=క్రిందిలోకములందు స్థావరముల వఱకును దిరుగుచున్న జీవులకున్ = భ్రమించుచున్నట్టి జీవులకు, ప్రాకృత కర్మాధీనంబులై = తా నింతకుముందు జన్మలలో నొనర్చికొన్న ఫల కామనా పూర్వకములైన క్రియలచే నేర్పడెడు పుణ్యపాపములకు అధీ నములై, దుఃఖంబుల యట్లుసుఖంబులును సిద్ధించు=దుఃఖములవలెనే సుఖములును ప్రాప్తించును. సుఖప్రారబ్ధముతో సుఖమును, దుఃఖ ప్రారబ్ధముతో దుఃఖమును, ప్రాప్తించునని భావము. ఎయ్యది పొంద రాదు=మానవులకు దుర్లభమైనదేదో, అట్టి మేలు సిద్ధించుకొఱకున్= అట్టి సర్వోత్తమమైన మోక్షరూప సుఖప్రాప్తికొఱకు, హరిసేవ సేయ వలయున్=హరి నర్చింపవలెను, హరిసేవకుండగువాఁడు=హరిభక్తిని సాధించినవాఁడు, జననంబునొందియున్=జన్మమునందినవాఁడైనను, అన్యునిక్రియన్=ఇతరునివలె, సంసారంబునం జిక్కండు=సంసార

బంధమునఁ దగుల్కొనఁడు, క్రమ్మఱన్=మరల, హరిచరణస్మరణంబున్ చేయుచున్ = వాసుదేవుని పాదములనే స్మరించుచు, భక్తిరస వశీకృతుండయి=భక్త్యానందమునకులోఁబడిన మనస్సుగలవాఁడై, విడువన్ ఇచ్ఛగింపండు=విడుచుట కంగీకరింపఁడు, మూలము 'యద్భ్రమతా ముపర్యధః' అని గలదు. 'యదుపరి బ్రహ్మపర్యంతం' 'అధస్థావర పర్యంతం చ' అని శ్రీధరుని వ్యాఖ్య. ఆ వాక్యములను పోతన్న అట్లే దించెను. 'స్మరన్ ముకుందాం ఘ్ర్యుపగూహనం' అని మూలము. హృషీకేశుని పాదపద్మముల నాలింగనము చేసికొనుటచే నేర్పడిన సుఖ మని భావము. దీనిని పోతన్న రెండు సమాసములుగా వింగడించెను. 'హరిచరణ స్మరణంబు సేయుచున్' – 'భక్తిరస వశీకృతుండై'–అని యీ రెండు సమాసములు. విడువన్ ఇచ్ఛగింపండు. దీనికి మూలము 'విహాతుం నేచ్ఛేత్' అని. తీవ్రమైన ఇచ్ఛమాత్రమే జీవుని ధర్మము. అది యున్నప్పుడు దానిని సాధించుటలోఁ గల బాధలను పరమేశ్వరుఁడే స్వయముగా నివారించునని తాత్పర్యము. అందుకే మూలములో 'విహాయ' అని చెప్పలేదు.

అర్థము: విష్ణుండు విశ్వంబు = లోకమంతయు భగవంతుని స్వరూపమే. విష్ణునికంటెను వేఱేమియు లేదు. శ్రీమహావిష్ణువునకన్న భిన్నమైన పదార్థమే లేదు. సమస్తమునందును సత్స్వరూపముగా భాసించుచున్నాఁడని భావము. ఇచటి 'విష్ణు' శబ్దము సార్థకమైనది. విష్ణు వనఁగా సమస్తమందును వ్యాపించి యున్నవాఁడు. విశ్వమునకున్=సమస్త ప్రపంచమునకును, భవవృద్ధిలయములు=సృష్ట్యాదులు, ఆ పరమేశుచేన్ అగున్=ఆ శ్రీమహావిష్ణువుచేతనే యేర్పడుచున్నవి. నీ వెఱుంగుదు గాదె=ఇది నీకుఁ దెలిసిన విషయమే, నీ ముఖమునన్=నీ చేతనే, ఏకదేశమునన్=ప్రాదేశమాత్రముగా స్వల్పముగా, ఎఱిఁగింపఁబడ్డది=భారతాదులందు నిరూపింపఁబడినది, భువన భద్రమునకై=ప్రపంచముల క్షేమార్థమై పుట్టినట్టి, హరికళాజాతుండవని విచారిం

పుము = కేశవుని యంశముచేఁ బుట్టిన వాఁడవని తెలిసికొమ్ము, ఈవు=నీవు, క్రమముగాన్=వరుసగా, హరిపరాక్రమములెల్లన్=శ్రీమన్నారాయణుని శౌర్యాది సమస్త ప్రవర్తనలను, వినుతిసేయుము=వర్ణింపుము, వినికియున్=శ్రుతపాండిత్యమును, చదువున్, దానము, అతులనయము=సాటిలేనిధర్మము, తపమున్, ధృతియును=ధైర్యమును, అను నీ గుణములయొక్క, కలిమిన్=కలిగియుండుటకు, పుణ్యశ్లోకున్ కమలనాభున్=పవిత్రకీర్తిగల శ్రీమహావిష్ణువును, పొగడం గలిగెనేని=వర్ణింపఁ గలిగినచో, ఎల్లఫలము గాదె=సమస్తమైన ఫలము గదా!

తాత్పర్యము: జగమంతయు విష్ణుస్వరూపము. తద్భిన్నమేదియు లేదు, ఈ విశ్వమునకు సృష్ట్యాదులు పరమేశ్వరునుండియే యేర్పడుచున్నవి. వ్యాసమునీ! ఈ తత్త్వము నీ వెఱుఁగుదువు. నీవే భారతాదులం దేకదేశముగా నీ విషయమును నిరూపించితివి. లోకక్షేమమునకై యవతరించిన శ్రీమహావిష్ణువు నంశపురుషుడవు నీవు. హరిపరాక్రమములు క్రమముగా భాగవతమందు వర్ణింపుము. శ్రుతపాండిత్యము విద్య మొదలైన మానవుఁడు సంపాదించుకొన్న సమస్త యోగ్యతలకును ఫలము శ్రీమహావిష్ణువును వర్ణించుటే.

**అహం పురాఽతీత భవేఽభవం మునే**
**దాస్యాస్తు కస్యాశ్చన వేదవాదినామ్,**
**నిరూపితో బాలక ఏవ యోగినాం**
**శుశ్రూషణే ప్రావృషి నిర్వివిక్షతామ్.** 23

**తే మయ్యుపేతాఖిల చాపలేఽర్భకే**
**దాంతే ఽధృతక్రీడన కేఽనువర్తిని,**
**చక్రుః కృపాం యద్యపి తుల్యదర్శనాః**
**శుశ్రూషమాణే మునయో ఽల్పభాషిణి.** 24

ఉచ్ఛిష్టలేపా ననుమోదితో ద్విజైః
సకృత్స్మభుంజే తదపాస్త కిల్బిషః,
ఏవం ప్రవృత్తస్య విశుద్ధచేతసః
సద్ధర్మ ఏవాత్మరుచిః ప్రజాయతే. 25

తత్రాన్వహం కృష్ణకథాః ప్రగాయతా
మనుగ్రహేణా శృణవం మనోహరాః,
తాః శ్రద్ధయాఽమే నుపదం విశృణ్వతః
ప్రియ శ్రవస్యంగః మమా భవద్రతిః. 26

తస్మింస్తథాలబ్ధ రుచేర్మహామునే
ప్రియశ్రవస్య స్ఖలితా మతిర్మమ,
యయాఽహమేత త్సదస త్స్వమాయయా
పశ్యే మయి బ్రహ్మణి కల్పితం పరే. 27

ఇత్థం శరత్ప్రావృషికా వృతూహరే
ర్విశృణ్వతోమే ఽనుసవం యశోఽమలమ్,
సంకీర్త్యమానం మునిభిర్మహాత్మభి
ర్భక్తిః ప్రవృత్తా ఽఽత్మరజస్తమోపహా. 28

అహం-నేను, పురా-కడచిన కల్పమందు, అతీతభవే-పూర్వజన్మమందు వేదవాదినాం - వేదాధ్యయనపరులకు సంబంధించిన, కస్యాశ్చన - ఒకానొక, దాస్యాః-దాసికి, సుతః-కొడుకుగా, అభవం-జనించితిని, బాలక ఏవ-నేను బాలకుఁడుగా నున్నపుడే, ప్రావృషి-వర్షాకాలమందు, నిర్వివత్సతాం-ఏకస్థానమందు వసించుట కిచ్ఛించుచున్న, యోగినాం-యోగులయొక్క, శుశ్రూషణే-శుశ్రూషయందు, నిరూపితః-నియుక్తుఁడనుగా నైతివి.

అవః సత్సంగతితో సిద్ధించుచున్న హరికథా శ్రవణాదుల ఫలమును తన స్వానుభవముతో విస్తరించుచున్నాఁడు-

ఓ మునీ! గతకల్పమందు జరిగిన వృత్తాంతమును నీ వివరించుచున్నాను. అది నా పూర్వజన్మము. ఆ జన్మమందొకాని దాసికి బుత్త్రుఁ డనుగా జన్మించితిని. ఆమె వేదవాదుల యిం బరిచర్య లొనర్చికొనుచు కాలము గడపుచుండెడిది. నా యదృ వశమున నచ్చటికిఁ గొందఱు పరమహంస లేతెంచిరి. వారు చా ర్మాస్య లచ్చటనే గడప నిచ్చగించినారు. శ్రోత్రియ బ్రాహ్మణ నన్ను వారిసేవ లొనర్చుటకై నియోగించిరి. నా బాల్యము వా నందేహాస్పదము గాలేదు.

**తే మునయః—ఆ మహర్షులు, తుల్యదర్శనాః యద్యపి—అందఱియంద సమానదర్శనముగల వారైనను, అపేతాఽఖిలచాపలే—ఏ చాపల్యములును లే వాఁడును, దాంతే—ఇంద్రియ చాపల్యములకు లోఁగనివాఁడును, అధృతక్రీడనే ఆడుకొనుటకుఁ గావలసిన వస్తువులపై యాసలేనివాఁడును, అనువర్తిని—స కాలములందును వారి ననుసరించువాఁడును, శుశ్రూషమాణే—సర్వదా జాగ్రత్త శుశ్రూష సల్పుచున్నవాఁడును, అల్పభాషిణి—అవసర మున్నంతవఱకే మాటల వాఁడును, అర్భకే— చిన్నవయస్సున మన్నవాఁడును నైన, మయి—నా యం కృపాం—అనుగ్రహమును, చక్రుః—చేసిరి.**

ఓ మహాముని! నేనాచిన్నవయసుననే, సమస్త చాపల్య లను దాఁటి యుంటిని. ఇంద్రియములు నన్ను స్వాధీనపఱచికొ జాలకుండెను. ఆటలపై నామనసు పోవుటలేదు. క్రీడావస్తువులయ దిచ్ఛ లేదు. తేయుంటవళ్ళు వారినే యనుసరించు చుంటిని. వ శుశ్రూషలను సర్వదా నప్రమత్తతతో నిర్వహించుటయే నా లక్ష్యవ కావలసిన దానికన్న నెక్కువ భాషించుటలేదు. ఇన్నిఁటికి పైఁగా బాల్యావస్థ వారి కెక్కువగా నాకర్షణీయమై యుండెను. వారు స దర్శనులు. కాని, నాగుణములు వారి నాకర్షించినవి. వారు యందు దయ వెట్టిరి.

**ద్విజైః — ఆ బ్రాహ్మణులచేత, అనుమోదితః — అంగీకారమును బొం వాఁడనై, ఉచ్ఛిష్టలేశాన్—వారి ఎంగిల్లలేశములను, సకృత్—ఒకసారి, భుంజే**

**—భుజించితిని, తదపాస్తకిల్బిషః—ఆ మహాభాగ్యముచే నశించిన సమస్తపాపములు గలవాఁడనైతిని, ఏవం = ఈ ప్రకారము, ప్రవృత్తస్య = ప్రవర్తించుచున్న, విశుద్ధచేతసః—విశేషముగా శుద్ధిని బొందిన మనస్సు గలవాఁడనైన నాకు, తద్ధర్మ ఏవ—వా రనుసరించెడు ధర్మమందే, ఆత్మరుచిః—నా మనస్సుయొక్క తాత్పర్యము, ప్రజాయతే స్మ—ఏర్పడిన దగుచుండెను.**

వారు నాయందమిత దయాపరులై యుండిరి. ఒకానొకనాఁడు వారి యనుజ్ఞతో వారి యుచ్ఛిష్టలేశమును భుజించితిని. దానితో నా సమస్త పాపములును సమూలముగ నశించినవి. ఆ మహర్షుల యుచ్ఛిష్ట మాహాత్మ్య మట్టిది. పాపనివృత్తి యైనంతనే నా మనస్సు సర్వవిధముల విశుద్ధ మయ్యెను. వదలక వారి సేవనే యొనర్చుచుంటిని. నా మనస్సు వారి ధర్మమున నాకృష్టమయ్యెను. 25

**తత్ర—అక్కడ, అన్వహం—దినమంతయు, కృష్ణకథాః—కృష్ణుని కథలను, ప్రగాయతాం = గానముచేయుచున్నట్టి వారియొక్క, అనుగ్రహేణ — దయచేత, అశ్రుణవం—వారికథాకీర్తనమును నేనుగూడ వింటిని, మనోహరాః—మనస్సును హరించునట్టి, తాః—ఆ కథలను, అనుసవం—ప్రతిదినమును, శ్రద్ధయా—పరమ శ్రద్ధతో, విశ్రుణ్వతః—చిత్తైకాగ్రతతో వినుచున్న, మమ—నాకు, అంగ—ఓ పూజ్యుఁడవైన మునీ! ప్రియశ్రవసి—ప్రియమైన కీర్తిగలిగిన శ్రీమహావిష్ణువునందు, రతిః—తాత్పర్యము, అభవత్—ఏర్పడినది.**

ఆ వసించెడి పరమహంసలు దినమంతయు పరవశులై కృష్ణ కథాగాన మొనర్చుచుండిరి. నేనుగూడ వారి యనుగ్రహముతో, నా కథలను విలీనమైన మనస్సుతో నాలకించుచుంటిని. ఆ కథలెంతో మనోహరములు. ఆ కీర్తనాపద్ధతి పరమ మనోహరమై యుండెను. నాకుఁ దెలియకయే వానిపై శ్రద్ధ యేర్పడుచుండెను. వారి యనుగ్రహవిశేష మట్టిది! ప్రతిదినమును విడుమరలేక కీర్తనము సాఁగుచుండినది. కృష్ణ యశోవర్ణనము నాకు రాఁగ రాఁగ మహాప్రియము మైనది. ఆ హృషీకేశునియందు బ్రహ్మాండమైన రతి యేర్పడెను. 26

మహామునే!=పరమర్షివైన వ్యాసమునీ! ప్రియశ్రవసి=ప్రియమైన యశస్సుతోఁ గూడిన, తస్మిన్=ఆ భగవంతునియందు, లబ్ధరుచేః=రుచిని బొందినట్టి మమ=నాయొక్క, మతిః=బుద్ధి, తదా=అప్పుడు, అస్ఖలితా=చాంచల్యము లేనిదిగ నయ్యెను, యయా=ఏ బుద్ధితో, అహం=నేను, పరే=పరుఁడైన, బ్రహ్మణి=బ్రహ్మస్వరూపమునందు, సదసత్=స్థూలసూక్ష్మస్వరూపమైన, ఏతత్=నాయీ శరీరము స్వమాయయా=పరుని మాయచేత, కల్పితం=కల్పింపఁబడిన దానినిగా, మయి=నాయందు, పశ్యే=చూచితిని (తెలిసికొంటిని).

ఓ మహామునీ! దినదినమును కృష్ణ యశోవర్ణనము నాకు ప్రీతికరము గాఁజొచ్చెనంటిని. ఆ కృష్ణునియందు నారుచి గొప్పగా ప్రవృద్ధ మయ్యెను. నా బుద్ధి పరిశుద్ధ మైనది. నివాతదీపమువలె నా మనస్సు కృష్ణుని పాదములందే నిమగ్న మయ్యెను. మనశ్చాంచల్యము లన్నియుఁ దొలఁగిపోయినవి. అప్పుడేమైనది! 'నేను ప్రపంచాతీతుఁడను; నేను బ్రహ్మస్వరూపుఁడను'. ఈ సత్యము నాకు ముకురమునందువలె స్పష్టముగా భాసింపఁ జొచ్చెను. స్థూల సూక్ష్మములైన శరీరములు రెండును బ్రహ్మస్వరూపుఁడనైన నాయందు మాయచేఁ గల్పింపఁబడినవని యనుభవమునకు వచ్చెను. 27

ఇత్థం=ఈ ప్రకారము, శరత్ప్రావృషికౌ=శరత్కాలము వర్షాకాలమనెడు రెండు ఋతువులందును, మహాత్మభిః=మహాత్ములైన, మునిభిః=మునులచేత, అనువవం=త్రిసంధ్యలందును, సంకీర్త్యమానం=సంకీర్తనము చేయఁబడుచున్న, అమలం=నిర్మలమైన, హరేః=హరియొక్క, యశః=కీర్తిని, విశ్రుణ్వతః=వినుచున్నట్టి, మే=నాకు, ఆత్మరజస్తమోపహా=మనసును గ్రమ్ముకొన్న రజస్తమో గుణములను నాశ మొనర్చునట్టి, భక్తిః=ఈశ్వరునందలి పరానురాగ రూపమైన భక్తి, ప్రవృత్తా=ఏర్పడినది.

అవ: పైనిఁ జెప్పినట్లు ఆత్మస్వరూపుఁడైన తనయందు స్థూల సూక్ష్మరూపమైన శరీరము మాయాకల్పితమన్న జ్ఞానము భాసించినది. దీనితో మహావాక్యమందున్న త్వంపదార్థముయొక్క శుద్ధమైన

యర్థ మనుభవమునకు వచ్చెను. దానితోఁబాటు స్థూల సూక్ష్మశరీర ములను బాధించు వికారములు ఆత్మను బాధింపవన్న విషయము గూడ ననుభవమునకు వచ్చినది. ఇదే విక్షేపశక్తినివృత్తి. ఇదే వేదాంతశాస్త్రమందుఁ జెప్పఁబడినది. ఈ యవస్థానంతర మేర్పడిన జ్ఞానాభివృద్ధిని నారదుఁడు వర్ణించుచున్నాఁడు-

ఓయీ! మహాముని! వారు వర్షాకాలము రెండు మాసములు, శరత్కాలము రెండు మాసము లచ్చట గడపిరి. త్రిసంధ్యలందును కృష్ణకథాగాన మవిచ్ఛిన్నముగా సాఁగుచుండెను. తద్గానాకర్ణనము పరమపవిత్ర మైనది. వారు శరీరములు మఱచి సంకీర్తన మొనర్చు చుండిరి. వారి మనస్సులు పరిశుద్ధములు. వా రొనర్చు సంకీర్తనము బంగారునకు తావి. దినదినము నా కీర్తనము వినుటతో నా హృదయ మందు భక్తి జనించినది. శుద్ధమైన భక్తి జనించినంతనే రజ స్తమో గుణములు నాశ మయ్యెను. శుద్ధ భక్తిస్వరూప మట్టిది. 28

శ్రీధరీయము:

అవ: సత్సంగముతో నేర్పడెడి హరికథా శ్రవణాది ఫలమును స్వానుభవపూర్వకముగా వెల్లడించుచున్నాఁడు-

పురా=పూర్వకల్పమందు, యోగినాం=సన్న్యాసులయొక్క, ప్రావృషి=వర్షోపలక్షితమైన చాతుర్మాస్యవ్రతమందు, నిర్వివక్షతాం= నిర్వేశ మనఁగా నొకచోటియందు వాసము. దానిని గోరుచున్న వారు.

అపేతాని అఖిలాని చాపలాని యస్మాత్ అపే తాఖిల చాపలః తస్మిన్=ఎవనినుండి యఖిలములైన చాపలములును నిర్గతములైనవో యట్టివాఁడు. క్రీడనకము లనఁగా నాటవస్తువులు, అధృతక్రీడనకే= ధరింపఁబడని యాటవస్తువులు గలవాఁడు. క్రీడాసాధనములను త్యజించినవాఁ డని యర్థము.

ఉచ్ఛిష్టలేపాన్ = పాత్ర లగ్నములైన యాహారవస్తువుల నని యర్థము. 'లేశా'నని పాఠాంతరము. తత్ - ఆ యుచ్ఛిష్టభోజనము చేత, అపాస్తకిల్బిషః - వదలిపోయిన పాపములు గలవాఁడనై, తద్ధర్మే = తేషాం ధర్మః తద్ధర్మః తస్మిఁ వారి ధర్మమునందు ఆ పరమహంస లనుసరించెడు కీర్తనాదిరూపమైన ధర్మము.

ప్రియశ్రవసి - ఎవని కథలను గూర్చిన శ్రవణము మనఃప్రియ మైనదో వాఁడు ప్రియశ్రవుఁడు. అట్టి భగవంతునియందు నాకు రతి ఏర్పడెనని భావము.

పరమేశ్వరునియందు భక్తి యుత్పన్నమైనది, సాధించిన శుద్ధ భక్తికి ఫల మేమి? తాను బ్రహ్మస్వరూపుఁడ ననియుఁ దనయందు స్థూల సూక్ష్మాత్మకమైన శరీరము మాయచేఁ గల్పింపఁ బడినదనియు నవగత మైనది. 'తత్త్వమసి' అను సూత్రమందలి త్వం పదార్థ మయ్యెను. 'త్వం తత్ అసి' 'నీ వా బ్రహ్మపదార్థము. దానికన్నను వేఱు గా'వని సూత్రార్థము. ఈ జ్ఞానము గలిగిన వెంటనే దేహాది కృతమైన విక్షేపముయొక్క నివృత్తి ఏర్పడెను. అప్పుడు రజస్తమో నివర్తకమైన దృఢభక్తి జన్మించినది.

**వంశీధరుఁడు:**

అవ: యాదృచ్ఛికమైన భాగవతుల కృపయే శ్రద్ధకును శుద్ధమైన భక్తికిని హేతువగుచున్నది. తపస్సు మొదలైనవి కావని తన్నే యుదాహరించి చెప్పుచున్నాఁడు-

యోగినాం = సన్న్యాసుల కని శ్రీధరుల యర్థము. 'శ్రుణ్వతాం స్వహం కృష్ణకథాః ప్రగాయతాం' అని పైనిఁ జెప్పఁబోవుచున్నాఁడు కనుక నిక్కడి యోగులు భక్తియోగులు.

తుల్యదర్శనాః - ఉత్తమశీలముగల వారియందును, దుశ్శీలము గల వారియందును, దమ్ము సత్కరించెడు వారియందును, దిరస్క

రించెడు వారి యందును, సదాచారులందును, దురాచారులందును సమమైన దృష్టిఁ గలవారు. వారి కనుగ్రాహ్యులు లేరు, నిగ్రాహ్యులును లేరు. ఇట్టి వారైనను నాపై కారుణ్యము సూపిరి. వారు సర్వత్ర సమదర్శనులైనను భరతప్రహ్లాదాదులందు వారి కెక్కువ దయ ఏర్పడు చుండును. మొట్టమొదట వారు నా సౌశీల్యాదికముల యపేక్షలేకయే నాపై కృపఁ జూపిరి. వారి యనుకంపతో నేర్పడిన సౌశీల్యాద్యను వృత్తులతో వారికరుణ ఇంకను నతిశయముగాఁ బ్రసరించినది. వారు తుల్యదర్శనులే. వారి దయ సమస్తమునందును నిరుపాధికముగనే ప్రసరించుచుండును. అది యతిశయముగ నాపైఁ బ్రసరించుట నా పూర్వపుణ్య వశముననే. అనుగ్రహము రెండు రీతులు. గుణమయము, నిర్గుణము గుణోపాధికమైన దయ లోకమందుఁ జూడఁబడుచున్నదే. వాఁ డాశించిన గుణ మదృశ్యమైనంతనే కరుణయు నదృశ్యమగును. దోషోదయముతో ద్వేషమో లేక యుదాసీనతయో యేర్పడును. నిర్గుణమైన దయ నిస్తీర్ణసంసారులైన మహామహుల కుండును. వారు పరమసాత్త్వికులు. వారి యనుకంప సోపాధికము గాదు. శుకోక్తమైన ఈ క్రిందిశ్లోకము వంటిది.

> గిరయో ముముచు స్తోయం క్వచిన్న ముముచు శ్శివమ్,
> యథా జ్ఞానామృతం కాలే జ్ఞానినో దదతేన వా.

ఈ రీతిగా నెప్పుడో యెవరినో విషయీకరించుకొనును.

ద్విజైః = ఈ సందర్భము నందలి 'యోగినః' అను దానికి భక్తియోగులని ముందే యర్థముఁ జెప్పితిమి. ఆ భక్తియోగు లెవరు? సనకాదులు. బ్రహ్మవైవర్త పురాణమం దిట్లున్నది:

> ఏ తస్మిన్నంతరే విప్రా అయయు ర్విప్రమందిరే,
> శిశవః పంచవర్షీయా మహాతాంచ మహీయసః.
> ఫలమూలాదికం కాలే చత్వారో మునిపుంగవాః,
> విప్రదత్తం బుభుజిరే తచ్ఛేషం బుభుజే శిశుః.

**వీరరాఘవీయము :**

పరే=బ్రహ్మస్వరూపమైన అనఁగా పరబ్రహ్మచేత ధార్యమైన మయి=నాయందు వర్తమానమైన, ఏ తత్ = సదసత్కార్య కారణ త్మకమైన జగత్తు, స్వమాయయా = స్వసంబంధినియైన ప్రకృతిచే కల్పితం=నిష్పాదితమైనది, వాస్తవమునకు లేనిదన్నమాట. 'తద్యథ రథస్యాఽరేషు నేమిరర్పితా నాభావరా అర్పితాః ఏవ మేవైతా భూ మాత్రాః ప్రజ్ఞామాత్రా స్వర్పితాః ప్రజ్ఞామాత్రాః ప్రాణేఽర్పితాః జీ భూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్' అనునట్లు ప్రకృ చేతనునిచే భేదింపఁబడుచున్నది. చేతనుఁడు పరమాత్మధార్యుఁడు ఇట్లు దేహాత్మభేదమును ఆత్మ పరమాత్మ సంబంధమును దెలిసికొన వాఁడయ్యెనని తాత్పర్యము.

**విజయధ్వజము :**

అవ : శ్రీహరి కథాశ్రవణము మొదలైనవి జనుల కల్యాణమ నకుఁ గారణమగుచున్నవని తెలుపుటకు నారదుఁడు దన పూర్వజన వృత్తాంతమును జెప్పుచున్నాఁడు. అట్లే తనకు భాగవతగ్రంథోపదే మైన పద్ధతినిగూడ సూచించుచున్నాఁడు–

అర్థము : అతీతభవే=గడచిపోయిన బ్రహ్మకల్పమునకుఁ జె దిన జన్మమందు, వేదవాదినాం = వేదప్రతిపాద్యుఁడైన శ్రీహరి గూర్చియే విచారించెడు అధికారి చేతనులయొక్క, కస్యాశ్చ దాస్యాస్తు=ఏదో విశిష్టగుణమున్న యొకానొక దాసికి సుతుఁడనుగా అభవం=పుట్టినాను, ప్రావృషి = వర్షఋతువు మొదలుకొని, నాల్గ మాసముల కాలము, నిర్వివక్షతాం యోగినాం శుశ్రూషణే బాల ఏవ = చాపల్యము మొదలగు దోషములులేని శిశువునైన నేనే, నియు పితః=నియుక్తుఁడ నైతిని.

తాత్పర్యము : శ్రీహరిగుణ వర్ణనరూపమైన కథను వినుట మోక్షమునకు మార్గమగుచున్నది. వ్యాసమునీ! దీనికి నేనే సాక్ష్యము

నా పూర్వజన్మ వృత్తాంతము నీకుఁ దెలిసినదే. ఐనను మఱియొక సారి విజ్ఞాపించికొనుచున్నాను. ఈ బ్రహ్మకల్పమునకు ముందటి బ్రహ్మకల్పమందు నే నొక దాసీపుత్త్రుఁడనై జన్మించితిని. ఆమె అందఱి వంటిది గాదు. హరిభక్తి మొదలైన విశిష్టగుణము లెన్నియో యామె యందుండెను. వేదప్రతిపాద్యుఁడైన శ్రీహరిని గూర్చి నిరంతరము శోధన నల్పెడు జ్ఞానుల ఇంటిదాసి యావిడ. ఆ భక్తురాలి కుమారుఁ డనై జన్మించిన నాకు బాల్యమందును చాపల్యము మొదలైన దోషము లంటలేదు. శ్రీహరి భక్తులైన సన్న్యాసులు కొందఱు వర్షా శరత్తు లొకేచోట నివసింపవలె ననెడు శాస్త్రనియమము ననుసరించి చాతు ర్మాస్య సంకల్ప మొనర్చి నిల్చిరి. వారి సేవకు చిన్నవాఁడైన నన్నే యా శ్రోత్రియులు నియమించిరి.

అర్థము : తే=విశిష్టగుణములచేఁ బ్రసిద్ధులైన, మునయః=మనన శీలురైన యోగులు, తుల్యదర్శనా యద్యపి=1. గుణక్రియా రూపము లలో సర్వకాలమందును నొకటే రీతిగానుండు బ్రహ్మను దర్శించు వారు, 2. వస్తుస్వభావ మేదియో యట్లే దర్శించువారు, 3. శత్రు మిత్ర పక్షములందు సమభావన గలవారు, అపేతాఖిల చాపలే = సమస్త చాపల్యములనుండి విడుదుర నొందినట్టి, దాంతే=జితేంద్రి యమును నియమించికొన్న, అందుచే అధృతక్రీడనకే=ఆటవస్తువు లను బొత్తిగా వదలిన, అనువర్తిని శుశ్రూషమాణే అల్పభాషిణి అర్భకే మయి కృపాం చక్రుః-ఈశ్లోకమందు రెండు పాఠభేదములు 1. యత క్రీడనకే, 2. అల్పధారిణి అనఁగా శైశవ సంబంధమైన అల్పమైన దేహమును ధరించియున్నవాఁ డని యర్థము.

తాత్పర్యము : బాల్యసహజములైన చాపల్యము మొదలైన దోషములు నాయం దుండలేదు. రుచులు రుచులుగాఁ దిండి తినవలె నన్న జిహ్వాచాపల్యము నున్న. ఆటవస్తువులతోఁ గ్రీడింపవలె నను బుద్ధిగూడఁ గానరాదు. పనికిరాని మాటలతో కాలము గడపుట నా

కిష్టము లేదు. ఎపుడును మితభాషిని. ఆ యతులనే యనుసరించి వారి కనుకూలముగాఁ బ్రవర్తించుచుంటిని. వారు మహాగుణవంతులు. గుణక్రియా రూపములయం దేక ప్రకారముగ సాక్షాత్కరించెడు శ్రీహరిని గన్నవారు; అపరోక్షజ్ఞాన మున్నవారు. వస్తువును యథా తథముగఁ దెలియువారు. శత్రువులందు క్రోధమును, మిత్రులందు స్నేహమును లేక సర్వసము లైన వారు. సర్వము శ్రీహరి యధీనమన్న యోర్పుగలవారు. ఇట్టి యా యతులు నా గుణములకు హర్షించి చిన్నవాఁడైనను నాయం దనుగ్రహమును వహించిరి. అదే వారు నా యందుఁ గన్పఱచిన దయ.

ద్విజైః ఉచ్ఛిష్ట లేపాన్యనుమోదితః — 1. ఎంగిలిపాత్రల నెత్తి వైచి యా స్థలమును గోమయముతో శుద్ధి యొనర్చు కార్యమం దనుజ్ఞఁ బొందిన వాఁడనై, 2. ఎంగిలిపాత్ర కంటుకొని యున్న యన్నము మొదలైన వానిని వారి యాజ్ఞతో, సకృత్ — దినమున కొకసారి మాత్రము, భుంజే — తినుచుంటిని, తదపాస్త కిల్బిషః జాతః ఏవం — ఇట్లు ఆ యతిధర్మమునందే, ప్రవృత్తస్య — ప్రవృత్తుఁడనైన, విశుద్ధచేతసః — విశేషముగా నిర్మలమైన మనస్సుగల నాకు, తద్ధర్మ ఏవ — ఆ యతుల ధర్మమైన విషయవైరాగ్యము, భగవత్కథా శ్రవణా ధ్యానము మొదలైన సాధనలందే, అభిరుచిః — అతిశయమైన ఉత్కంఠ, ప్రజాయతే — అతిశయముగా జన్మించెను. ఇప్పుడును ఇట్టి ధర్మాను ష్ఠానముతో మోక్షసాధనమం దాసక్తి గల్గునని తెలుపుటకు వర్తమాన క్రియల నుపయోగించినాఁడు. ఉచ్ఛిష్ట లేపాద్యనుమోదితః సకృచ్చ భుంజే అని పాఠాంతరము.

తాత్పర్యము : ఆ బ్రాహ్మణయతులు భుజించిన పాత్రలను దీయుట, ఆ స్థలమును గోమయాదులచే శుద్ధి యొనర్చుట, వారు మిగిల్చిన యన్నమును దినుట వీని యన్నిటికి నాకు వారి యనుజ్ఞ లభించెను. నేను వారినే యాదర్శముగ నెంచికొని యుంటిని.

కనుక వారివలెనే నేనును దినమున కొక్కతడవ మాత్రమే భుజించు వాఁడను. వారి యన్నశేషమును దిని జీవించియున్న నాకు సమస్త పాపములును బరిహారమైనవి. శుద్ధమైన యాహారము సేవించుచున్న నాకు మనస్సు పరమశుద్ధమయ్యెను. రాగాదిదోషములు నశించినవి. వారినే యనుసరించుచున్న నాకు వారి ధర్మమందే యాశ యేర్పడెను. విషయవైరాగ్యము, భగవత్కథా శ్రవణము మొదలైన వాని యందు తీవ్రాభిరుచి గల్గినది. ఒక్కక్షణమైన వానిని వదలియుండుట నాకు సాధ్యము గాలేదు. ఈ భాగ్యము నా కొక్కనికి మాత్రమే గాదు. నాఁడు మాత్రమేగాదు. నేఁడుగూడ భగవద్భక్తులను శుశ్రూషించు నధికారి చేతనుల కందఱికి నిట్టి యాన గల్గితీరును.

అవ: మోక్షసాధనమం దేర్పడిన యభిరుచితో నే మైనదో చెప్పుచున్నాఁడు.

తత్ర=ఆ సన్న్యాసుల సమీపమందు, మనోహరాః కృష్ణ కథాః=శ్రీహరి మాహాత్మ్యరూపములగు కథలను, అన్వహం=ప్రతిదిన మును ప్రాతఃకాల స్నానానంతరము, ప్రగాయతాం=భక్తిపూర్వక ముగా గాన మొనర్చెడి యా పరమహంసల యాజ్ఞారూపమైన యను గ్రహముచేత, అశ్రుణవం అంగ! శ్రద్ధయా=నిజమైన యాసక్తితో, తాః అనుపదం విశ్రుణ్వతః మే తదా మతిః=ధ్యానరూపమైన యుపా సన, ప్రియశ్రవసి=పరమ మంగళకరమైన కీర్తిగల శ్రీహరియందు, అభవత్=ఏర్పడెను.

తాత్పర్యము: శ్రీహరికథలు అతి మనోహరములైనవి. ఆ పరమహంసలు వానిని ధర్మనిష్ఠులై నిరంతరము గాన మొనర్చుచుం డిరి. న న్ననుగ్రహించినవారు ఆ కథలను వినుట కనుజ్ఞ నొసఁగిరి. ప్రాతస్స్నానానంతర మా శ్రీహరి మహిమను గీర్తించుచున్న వారి యనుగ్రహముననే నా భగవత్కథలను నిండుగా వినుచు వచ్చితిని.

మూఁడువేళలందును కథాకీర్తనము సాఁగుచుండినది. ఆ యమృతము నా హృదయమును ప్లావిత మొనర్చెను. పరమమంగళమైన శ్రీహరి యశోగానమే నా కభ్యాస మైనది. ధ్యానరూపమైన యుపాసన యారంభమైనది.

అవ: అఖండముగా స్మరణ యొసర్చుట యను ఉపాసనతో నేర్పడు ఫలమును జెప్పుచున్నాఁడు-

మహామునే! తస్మిన్ లబ్ధరుచేః మమ తదా ప్రియశ్రవసి అస్ఖలితా మతిః=రాగాది దోషములతో నుపహతముగాని సంతతస్మరణ రూపమైన యుపాసన, అభవత్-ఏర్పడెను, యయా-ఏ యుపాసన చేత, అహం-ఏ తత్సదసత్=కార్యకారణ రూపమైన యీ జగత్తును, మయి=నాయందున్న, పరే=పూర్ణుఁడైన, బ్రహ్మణి-బింబభూతుఁడైన శ్రీహరియందు, స్వమాయయా=వాని యిచ్ఛచేతనే (నాయం దను గ్రహము నెఱపుట కభిముఖమైన ఇచ్ఛచేతనే) కల్పితం-శ్రీహరి చేతనే సృష్టము, రక్షితము, సంహృతమునై ఇచటనే తన యధీనమై యుండ నిమ్మని సంకల్పితమైన దానినిగా, పశ్యే=తెలిసికొంటిని.

ఈ జగత్తంతయు శ్రీహరి యిచ్ఛచేతనే యతని కధీనమైనదని తెలిసికొన్నాను. కొందఱు, మయి బ్రహ్మణి=నాకంటె యభిన్నమైన బ్రహ్మయందు, కల్పితం-అధ్యస్తమైనదని, తెలిసికొంటినని యర్థముఁ జెప్పెదరు. ముత్తెపుఁ జిప్పయందు వెండిని భ్రమించినవాఁడు యథార్థ జ్ఞాని గాలేఁడు. యథార్థజ్ఞాని కావలెనన్నచో నిది వెండి గాదు ముత్తెపుఁ జిప్ప యని తెలియవలెను. కనుక, నిచట నధ్యాసమును జోడించుట సరికాదు.

తాత్పర్యము: త్రికాలజ్ఞానియైన వ్యాసమునీ! సర్వప్రీతికర మైన యశముగల శ్రీహరియందు నా కతిశయమైన అభిరుచి యేర్పడి నది. నామనస్సునుండి రాగద్వేషములు దూరమైనవి. లౌకిక విషయ

ుల నాలోచించుట వదలుకొంటిని. ప్రియకరమైన మాహాత్మ్యము ల శ్రీహరినే నిరంతరము ధ్యానించుచు వచ్చితిని. ఈ నంతర హరి ్మరణమే భగవదుపాసన. దీనితో నాకు 'నారాయణుఁడే సర్వోత్త ుఁడు, స్వతంత్రుఁడు నను జ్ఞాన మేర్పడెను. నా యందు బింబరూప ుగనున్న పరిపూర్ణుఁడైన శ్రీహరి యిచ్ఛయే కార్యకారణాత్మకమైన గత్తును నిర్మించి, రక్షించి, సంహరించున దని తెలియ వచ్చినది. నుక, ఈ జగత్తు సంపూర్ణముగ నాతని కధీనము. ఇట్టి వివేకజ్ఞానము ాకుఁ గల్గెను. వీని ననుగ్రహింప వలెననుట శ్రీహరి యిచ్ఛచేతనే; ేఱు కారణముతోఁ గాదు. అస్వతంత్రమైన జగత్తు, స్వతంత్రుఁడైన రమపురుషుఁడు రెండు నొకటి గానేరవు. ఈ జగత్తు వైకుంఠుని యందు భ్రాంతితోఁ గల్పితమైనది గాదు. ఈ విషయములనే మహా ంహిమోపేతులైన యతులు భక్తిపురస్సరముగాఁ గీర్తించుచుండిరి.

అవ: భక్తి యుపాసన రెండును పరస్పరము నిమిత్తము లని ెల్పుచున్నాఁడు—

ఇత్థం — పైనిఁ జెప్పినట్లు, మహాత్మభిః — మహిమోపేతులైన, ునిభిః — తమ యోగ్యతానుసారముగ సర్వజ్ఞులైన యోగులచేత, ంకీర్త్యమానం అమలం హరేః యశః అనునవం శరత్ప్రావృషికౌ ృతూ విశృణ్వతః — విశేషరూపముగా వినుచున్న, మే — నాకు, శ్రీహరిని ందలి తక్కిన విషయములందు వైరాగ్యముతోఁ గూడికొన్న, ఆత్మ ఱజస్తమోపహా — మనస్సంబంధియైన రజస్తమోగుణములను వానినుండి యేర్పడు విషయరాగము, అన్యథాజ్ఞానము మొదలైన దోషములను ోఁగొట్టెడి, భక్తిః — శ్రీహరియే సర్వోత్తముఁ డనెడు జ్ఞానరూపమైన ిరంతర హృషీకేశ స్నేహము (అభూత్ — కల్గెను).

తాత్పర్యము: ఆ యతులు, తమతమ యోగ్యతకుఁ దగినట్లు ర్వవిషయములను దెలిసిన వారు. శరద్వర్షాకాలములను మూఁడు వేళలను విశేషమైన భక్తితో నేను కేశవునిఁ గీర్తించుచుంటిని. అది

దోషరహితమైనది. నిత్యశుద్ధమైనది. ఆ శ్రవణరూపమైన యుపాస ఫలముగా శ్రీహరి యపరోక్షమునకుఁ గారణమైన 'విష్ణువే నర్వ ముఁ'డనెడు జ్ఞానపురస్సరమైన స్నేహము నాయం దేర్పడెను. దీ భక్తి యనిపేరు. అప్పుడు మనస్సునకు సంబంధించిన విషయాన అన్యథాజ్ఞానము మొదలైన దోషములు తొలఁగి పోయినవి. ఇ భక్తి, యుపాసన, యీ రెండును, ఒకదాని కొకటి నిమిత్తమ యుండును.

పోతన్నగారు :

వచ: మహాత్మా! 'నేను బూర్వకాలంబునం దొల్లింటి జన మున వేదవాదుల యింటి దాసికిఁ బుట్టి, పిన్ననాఁడు వారల బంపంబడి, యొక్కవానకాలంబునఁ జాతుర్మాస్యంబున నేక నివాసంబుసేయ నిశ్చయించిన యోగిజనులకుం బరిచర్య సేయు

ఓటమితో నెల్లప్పుడుఁ
బాటవమువఁ బనులుసేసి బాలురతో నే
యాటలకుఁ బోక యొక జం
జాటంబును లేక భక్తినలుపుదు వనఘా!

కుంగక మనుచును వారల
యెంగిలి భక్షింతు; వానకెండకు నోడన్
ముంగల నిలుతును; నియతిని
వెంగలి క్రియఁ జనుదు నురువివేకముతోడన్.

వచ: ఇట్లేను వర్షాకాల శరత్కాలంబులు సేవించితి; వారు నాయందుఁ గృపసేసిరి. అంత-

వారల్ కృష్ణచరిత్రముల్ సదువఁగా వర్ణింపఁగాఁ బాడఁగా
నారావంబు సుధారసప్రతిమమై యశ్రాంతమున్ వీనులన్
దోరంబై, పరిపూర్ణమైన, మది సంతోషించి నే సంతటన్
బ్రారంభించితి విష్ణుసేవ, కితరప్రారంభ దూరుండనై.

వచ: ఇట్లు హరిసేవారతిం జేసి ప్రపంచాతీతుండును, బ్రహ్మ రూపకుండు నయిన నా యందు స్థూలసూక్ష్మంబైన యీ శరీరంబు నిజమాయాకల్పితం బని యెఱింగితి; న మ్మహాత్ములగు యోగిజనుల మూలంబున రజస్తమోగుణ పరిహారణీయ మయిన భక్తి సంభవించె. అంతం జాతుర్మాస్యంబు నిండిన న య్యోగిజనులు యాత్రసేయు వారలై యి వ్విధంబున-

అర్థము: మహాత్మా=గొప్పవాఁడా!, నేను పూర్వకల్పంబునన్=అతీత బ్రహ్మకల్పంబునందు, తొల్లింటి జన్మంబున=నా పూర్వ జన్మమందు, వేదవాదుల ఇంటిదాసికిం బుట్టి=నిరంతరమును వేద విచారముసేయు శ్రోత్రియుల ఇండ్లయందుఁ బరిచర్య లొనర్చు ఒకా నొక దాసికి సుతుఁ డనుగా జన్మించి, పిన్నవాఁడు-బాల్యమునందు, వారలచేఁ పంపఁబడి=ఆ శ్రోత్రియులచే నియోగింపఁబడిన వాఁడనై యొక వానకాలంబునఁ=వర్షాకాలము శరత్కాల మను నాల్గు మాసములు, చాతుర్మాస్యంబునఁ-ఈ నాల్గు నెలలును, ఏకస్థల నివాసంబునఁ=ఒక చోట వసించుటను, చేయ నిశ్చయించు యోగి జనులకుఁ-చేయవలెనను శాస్త్రనియమమునకుఁ గట్టువడి నిశ్చ యించుకొన్న సన్న్యాసులకు, పరిచర్య సేయుచుఁ-ఉపచారము లొనర్చుచు.

తాత్పర్యము: మహాత్మా! పూర్వబ్రహ్మ కల్పమందు జరిగిన వృత్తాంతమును నీకుఁ దెల్పుచున్నాను. అది నా పూర్వజన్మ. అప్పు డొకానొక దాసికిఁ బుత్త్రుఁడనుగా జన్మించితిని. ఆమెపేరు నాకు జ్ఞాప కము లేదు. తెలిసికొన యత్నింపనుగూడ లేదు. ఆమె వేదవాదుల ఇంటిదాసిగాఁ బరిచర్య లొనర్చుచుండెను. వారి సేవానిరతితో నామె కును గొంత సంస్కార మేర్పడినది. మా యూరికిఁ గొందఱు సన్న్యా సులు వచ్చిరి. ఇంతలో వర్షాకాలము సమీపించెను. వర్షాశరత్తులలో సన్న్యాసు లెచ్చటికిని గదలరాదు. అది చాతుర్మాస్య నియమము.

నా బాల్య మా శ్రోత్రియులకు బాధకముగాఁ దోఁచలేదు. వారు నన్నా సన్న్యాసులకు సేవ లొనర్చుటకై నియమించినారు. ఆ యోగులు పరమభక్తులు. ఆ పరమహంసలు సనత్కుమారాదులని కొందఱన్నారు.

అర్థము: ఓటమితోన్ – భయభక్తులతో, ఎల్లప్పుడుఁ = సకల కాలములందును, పాటవమునన్ – సమర్థతతో, పనులుసేసి – వారు నియమించిన కార్యములను దీర్చి, బాలురతోన్=తక్కిన వయస్సుగల పిల్లలతో, ఏ యాటలకుఁ బోక=ఏ క్రీడలకును జనక, ఏ ఙంజాటం బును లేక =వారి సేవతప్ప వేఱొక్క తగులములేక, భక్తిఁ చలుపు దుఁ = వారికి సేవాపూర్వకమైన భక్తిని జెల్లించుచుంటిని, అనఘా= పాపము లేనివాఁడా!

తాత్పర్యము: నాకు వారియందు భక్తితోఁ గూడిన భయ ముండెను. వా రేమి చెప్పెదరో యని తన్నిరీక్షణమే నా ధ్యేయము. వారు చెప్పిన పనులు సమర్థముగ నిర్వహించుచుంటిని. వారు నా కొక పని చెప్పినప్పుడు దాని కంగములైన పనులను గూడ వారు చెప్పిన ప్రధానకార్యమునకు బాధకములుగాక నిర్వర్తించి వచ్చుచుంటిని. సవయస్కులతోడి యాటలు నాకుఁ గాఁబట్టుట లేదు. వారి సేవయే నాపెద్ద చాపల్యమై యుండెను. ఇటు నేను వారికి సేవాభక్తిఁ జెల్లిం చుచుంటిని. 'దాంతే–అనువర్తిని' ఈ రెంటి యర్థమునే 'ఒక ఙంఝా టంబును లేక' యని తెల్పినాఁడు. 'అధృతక్రీడనకే' అను దానిని 'బాలురతోనే యాటలకుఁ బోక' అని వివరించినాఁడు. 'అపేతాఖిల చాపలే' అనుదాని యర్థముగూడ ఙంజాటము లేకపోవుటలోనున్నది. 'అల్పభాషిణి' అనుదానిని వదలినాఁడు. నారదుని బాల్యము దీనిని చెప్పుటలోఁ బోతన్నకు బాధకముగాఁ దోఁచెనేమో!

అర్థము: మంగళమనుచును=సర్వపాప వినాశకముగా సమస్త మంగళములను గలిగించునదని యెంచి, వారల యెంగిలిఁ భక్షింతు

పరమహంసల యుచ్ఛిష్టలేశమును భుజించుచుంటిని. వానకుః
కకుః ఓర్డః = ఎండవానలకు జంకను, ముంగలః నిలుతుః=
రేమి పని చెప్పెదరో యని వారి ముఖములనే నిరీక్షింతును,
ుతునే నిలిచియుందును, నియతిః=వారి కార్య నిర్వహణమందు
ి మే మాత్రమును రాని నియమముతో, నేన్= నేను, వివేకము
ః=గొప్ప వివేకముతో, వెంగలిక్రియః చనుదుః=వారి యాజ్ఞల
ప్రత్యుత్తర మీయక 'ఇదిగా దదిగాద 'నక కేవల జడునివలె నా
్యములందుఁ బ్రవర్తించుచుంటిని.

తాత్పర్యము: వ్యాసమునీ! ఆ పరమహంసల యుచ్ఛిష్టము
స్త కిల్బిషములను నాశన మొనర్చును. వారి యనుజ్ఞతో దానిని
ంచుచుంటిని. అది గూడ నాకు సకృత్తుగా లభించుచుండెను. ఆ
ంతమాత్రమే నా సమస్తపాపములను బోఁద్రోలినది. నా హృదయ
ుతయో పరిశుద్ధ మయ్యెను. దాని ప్రభావముతో శాంతిదాంతులు
ు సహజములై పోయినవి. వానకు వెఱచుట లేదు. ఎండకు
కుట లేదు. వారి ముఖమునుండి ఏ యాజ్ఞ వచ్చునో యని నా
కతే చింత. అందుచే నిరంతరము వారి ముఖములపై దృష్టినిలిపి
ుతునే నిలిచికొనుచుంటిని. వారి కార్యముల కే లోపము నంతు
ుకుండుటే నా ప్రధాన నియమమై యుండెను. వారిసేవ నాకుఁ
మ వివేక మొసఁగినది. వా రేమైనఁ బని చెప్పినప్పుడు 'ఇదిగో
ం'నని యాలసించుటలేదు. ఇట్లు చేయవచ్చునటు లేదు. కేవల
ునివలె వారి కార్యములందుఁ బ్రవర్తింపుచుంటిని.

అర్థము: ఇట్లు=ఈ రీతిగా, ఏను=నేను, వర్షాకాల శరత్కా
ులు = వర్షర్తు శరదృతువులను నాల్గు మాసములు సేవించితిని.
రును నాయందుఁ గృపసేసిరి= వారు నాయందు దయఁ జూపిరి.

తాత్పర్యము: ఓ భగవానుఁడా! వారు తుల్యదర్శనులు. సదా
రియందును దురాచారియందును, తమ్ము గౌరవించెడు వారి

యందును దిరస్కరించెడు వారియందును వారి కొక్కటే చూపు. ఆ పరమహంసల కనుగ్రాహ్యులు లేరు. నిగ్రాహ్యులు లేరు. కాని శైశవాలంకృతమైన నా సేవ తుల్యదర్శనులైన వారిహృదయములను గూడ లోఁగొన్నది. ఆ భక్తియోగులకు నాపై, శైశవముపై, నా సేవా రతిపై దయ జనించెను. వారు నన్ననుగ్రహించిరి. ఎంతవఱకు? వా రొనర్చు కీర్తనాసేవను శ్రవణ మొనర్చుట కనుజ్ఞ నిచ్చినారు.

అర్థము: వారల్ = ఆ పరమ హంసలు, కృష్ణచరిత్రముల్ చదువఁగా పురుషోత్తముఁడైన కృష్ణుని యశోవర్ధకములైన చరిత్రలు, చదువగాన్=వ్యాఖ్యాన పూర్వకముగాఁ జదువుచుండఁగా, వర్ణింప గాన్=ఇతరుల మనస్సున కెక్కునట్లు- 'పరస్పరం బోధయంతః' అను రీతిని వర్ణించుచుండఁగా, పాడఁగాన్=రాగ లయ యుక్తముగా గానింపఁగా, ఆ రావంబు=ఆ ధ్వని, సుధారసప్రతి మమై=అమృతరస ముతో సమానమైనదై, అశ్రాంతమున=నిరంతరమును, వీనులన్= చెవులయందు, తోరంబై=యెక్కువైనదై, పరిపూర్ణమైన=అన్నిరీతులఁ బరిపూర్ణమైనది కాఁగా, నేను, అంతటన్, ఇతరప్రారంభదూరుండనై= ఇతరకార్యారంభములనుండి దూరముగనున్నవాఁడనై, విష్ణుసేవకున్= శ్రీమహావిష్ణువుసేవకు, ప్రారంభించితిన్=ఆరంభ మొనర్చితిని.

తాత్పర్యము: ఆ పరమహంసలు కృష్ణచరిత్రను త్రిసంధ్యల యందును బాడుచుండిరి. పరస్పరము వర్ణించుచుండిరి, చదువుచుం డిరి. వారి యనుగ్రహముతో శ్రవణ భాగ్యము నాకు లభించినది. వారి కీర్తనాపద్ధతి పరమమనోహర మైనది. ఆ రావ మమృత ప్రవా హమై నా వీనుల నిండుచుండెను. ఆ కృష్ణకథామృతము నాకర్ణముల కొక మహాపర్వము. పరమశ్రద్ధతో తదేకాగ్రమైన మనస్సుతో నాల కించుచుంటిని. నా మనస్సు పరమ తృప్తమైనది. ఇతరచింత లేవియు నామనసునకుఁ బట్టులేదు. తక్కిన వ్యాపారము లన్నియుఁ దమంతనే వీడిపోయినవి. విష్ణుసేవ కారంభించితిని.

భాగవతము నవవిధ భక్తులను జెప్పెను.

**శ్రవణం కీర్తనం విష్ణో స్స్మరణం పాదసేవనమ్,**
**అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్.**

**ఈ** భక్తులలో శ్రవణభక్తితర్వాత కీర్తనభక్తి మహాప్రశస్తమైనది. **మన**(గా నేమి?

**సంకీర్తనం నామ భగవద్గుణకర్మ నామ్నాం స్వయముచ్చారణమ్.**

భగవంతునికి సంబంధించిన గుణములు వాని చరిత్రములు ...యోద్ధార పూర్వకముగా గాన మొనర్చుటయే సంకీర్తనము. ...ంకీర్తన మె ట్లొనర్చినను పరమ శ్రేయస్కరమని భాగవతమే నది_

**సాంకేత్యం పారిహాస్యం వా స్తోత్రం హేళన మేవ,**
**వైకుంఠనామగ్రహణ మశేషాఘ హరం విదుః.**

భగవచ్ఛంకర పాదులు, విష్ణుసహస్రనామ భాష్యమం దీక్రింది ... లన్నారు.

**శ్రద్ధా భక్త్యో రథాపేపి భగవన్నామ సంకీర్తనం**
**సమస్తం దురితం నాశయతీత్యుక్తం కి ముత శ్రద్ధాభక్తి పూర్వకమ్.**

సంకీర్తన భక్తితో భగవంతుని యావిర్భావము శీఘ్రముగా ...ను.

**సంకీర్త్యమానః శీఘ్రమేవా విర్భవతి అనుభావయతి చభక్తాన్.**

(నారద భక్తిసూత్రములు)

'భగవన్నామ సంకీర్తనముతో నేర్పడు ఫలము మహోత్కృష్ట ' చెప్పుట కేవల యర్థవాదము మాత్రమే అని కుత్సితవాద ...నర్చు వారిని బ్రహ్మసంహిత యిట్లు మందలించినది.

యన్నామకీర్తన ఫలం వివిధం నిశమ్య
నో శ్రద్ధధాతి మనుతే యదుతార్థవాదమ్,
యో మానుష స్తమపి దుఃఖ చయే క్షిపామి
సంసారఘోర పరితాప నిపీడితాంగమ్.

గీతామాత కూడా 'సతతం కీర్తయంతో మాం' అని య
శించినది. భగవన్నామ మేదైనను మానవునిఁ దరింపఁజేయును. క
భాగవతము ముఖ్యముగాఁ గృష్ణమాహాత్మ్య ప్రతిపాదక మగుట
'కృష్ణ చరిత్రముల్' అని చెప్పినట్లున్నది. మూలమునందును కృ
కథాః ప్రగాయతాం' అనియే కలదు. కృష్ణశబ్దము పరమ మో
ప్రదమని కృష్ణభక్తుల విశ్వాసము.

కృష్ణేతి మంగళంనామ యస్య వాచి ప్రవర్తతే,
భస్మీభవంతి రాజేంద్ర! మహాపాతకకోటయః.

(విష్ణుధర్మము)

విప్రన్ బ్రాహ్మణ మత్యంతం కామతో వా సురాం పిబేత్,
కృష్ణ కృష్ణేత్యహోరాత్రం సంకీర్త్య శుచితా మియాత్.

(బ్రహ్మవైవర్తపురాణము)

పరదారరతో వాఽపి పరాఽపకృతి కారకః,
విశుద్ధోముక్తి మాప్నోతి కృష్ణనామాను కీర్తనాత్.
నామ్నాం ముఖ్యతరం నామ కృష్ణాఖ్యం యత్పరంతప,
ప్రాయశ్చిత్త మశేషాణాం పాపానాం మోచకం పరమ్.

(స్కాందపు. ప్రభాసఖండము)

సంకీర్తనా పరునకు అశౌచాది దోషములు గూడ లేవ
తున్నాఁడు_

చక్రాంకితస్య నామాని సదా సర్వత్ర కీర్తయేత్,
నా శౌచం కీర్తనే తస్య స పవిత్రకరో యతః. (విష్ణుధర్మము)

ముఖ్యముగా కలియుగమందు కీర్తనభక్తిని మించిన మార్గమే లేదు. ఈ విషయమును శ్రీమద్భాగవతమే యెలుఁగెత్తి చాటినది.

**కలిం సభాజయం త్యార్యాః గుణజ్ఞా స్సారభాగినః,**
**యత్ర సంకీర్త నేనైవ సర్వస్వార్థోఽభిలభ్యతే.**

**న హ్యతః పరమో లాభో దేహినాం భ్రామ్యతా మిహ,**
**యతో విందేత పరమాం శాంతిం నశ్యతి సంసృతిః.**

వచ: ఇట్లు హరి సేవారతిం జేసి, ప్రపంచమున కన్నను భిన్నుఁడనై బ్రహ్మరూపకుండనైన నాయందు బ్రహ్మస్వరూపుఁడనైన నా విషయమందు, స్థూలసూక్ష్మం బైన యీ శరీరంబు = స్థూలము సూక్ష్మము ననెడు భేదములుగల ఈ శరీరము, నిజమాయాకల్పితంబని = మాయచేఁ గల్పింపఁబడిన భ్రమమాత్రమే యని అ మ్మహాత్ములగు ........మూలంబునన్ = ఆ యోగిజనుల కారణంబుగా, రజస్త........ సంభవించెను = మనస్సునందలి రజస్తమోగుణములను బోఁగొట్టు భక్తి యేర్పడెను, అంత.... ....ఇ వ్విధంబునన్ = అటుతర్వాత, చాతుర్మాస్య వ్రతము ముగియగా నా యోగు లా యూరు విడిచి పోవువారలై-

తాత్పర్యము: నే ననుష్ఠించుచున్న యీ సేవారూపమైన భక్తితో శుద్ధమైన జ్ఞానము నా కేర్పడినది. నేను ప్రపంచాతీతుఁడనైన పర బ్రహ్మననియు, స్థూల సూక్ష్మరూపమైన ఈ శరీరము బ్రహ్మస్వరూపుఁడ నైన నాయందు మాయచే నారోపింపఁబడిదననియుఁ దెలిసికొంటిని. బ్రహ్మసూత్రము లందలి 'తత్త్వమసి' అను మహావాక్యములోని 'త్వం' పదార్థము నా కవగత మైనది. చాతుర్మాస్యములు గడచి పోయినవి. ఆ మహాయోగుల యనుగ్రహముతో నాకు భక్తి సంభ వించినది. అది నా మనస్సునందున్న రజస్తమోగుణములఁ బూర్తిగాఁ బోఁగొట్టునదియై యుండెను.

తస్యైవం మే ఽనురక్తస్య ప్రశ్రితస్య హతైనసః,
శ్రద్దధానస్య బాలస్య దాంతస్యా ఽనుచరస్యచ. 29

జ్ఞానం గుహ్యతమం యత్త త్సాక్షా ద్భగవతోదితమ్,
అన్వవోచన్ గమిష్యంతః కృపయా దీనవత్సలాః. 30

ఏవం=ఈ ప్రకారము, అనురక్తస్య=భగవంతునిపై నెక్కువ ప్రేమగలవాఁడును, ప్రశ్రితస్య=వినయముచేఁ గూడికొన్నవాఁడును, హతైనసః=పూర్తిగా నశించిన పాపములు గలవాఁడును, శ్రద్దధానస్య=శ్రద్ధగల వాఁడును, దాంతస్య=ఇంద్రియములను లోఁబఱచి కొన్నవాఁడును, అనుచరస్య=వారిని సర్వకాలములందు ననుసరించి నడచుచున్నవాఁడును, బాలస్య=బాలుఁడునైన, తస్యమే=అటువంటి నాకు (అయినట్టి నాకు), కృపయా=కృపతో, దీనవత్సలాః=దుఃఖితులయందు వాత్సల్యమున్నట్టివారు, గమిష్యంతః=చాతుర్మాస్యదీక్షను ముగించి, ప్రదేశమును వదలిపోవుచున్నవారై, సాక్షాద్భగవతా=నేరుగా శ్రీమన్నారాయణునిచేత, ఉదితం=చెప్పఁబడినదియు, గుహ్యతమం=సర్వోత్తమరహస్యమైన, జ్ఞానం=జ్ఞానమును, అన్వవోచన్=ఉపదేశించిరి.

నాకు భగవంతునందు విపరీతమైన రక్తి యుండెను. దానిని వారు గమనించిరి. నా వినయము వారి నాకట్టుకొనెను. నిరంతర కథాశ్రవణ మాహాత్మ్యముతో నా పాపము లన్నియు నశించినవి. మహాశ్రద్ధావంతుఁడనై యుంటిని. ఇంద్రియచాపల్యము లెన్నఁడో వీడిపోయినవి. ఆ పరమహంసల శుశ్రూషయందే నా మనస్సు సర్వదా లగ్నమై యుండినది. వారికి నాపై దయ జనించెను. స్వాభావికముగనే వారు దీనులయందు కారుణ్యము గలవారు. చాతుర్మాస్యము ముగించిపోవుచున్న యా పరమహంసలు సాక్షాద్భగవంతునిచే నుపదిష్టమైనదియు, పరమగుహ్యమైనదియునైన భాగవత ధర్మమును నా కుపదేశించిరి. 29-30

**శ్రీధరీయము:**

ఈ రీతిగా త్వం పదార్థజ్ఞానము గలిగినట్టియు, దృఢభక్తిని గల్గినట్టియు, పరమ వినయవంతుఁడవైన నన్ను గూర్చి-

గుహ్యతమం=సాధనభూతమైన ధర్మతత్త్వజ్ఞానము గుహ్యము, దానిచే సాధింపఁదగిన దేహద్వయ వివిక్తాత్మజ్ఞానము గుహ్యతరము. దానిచే ప్రాప్యమైన యీశ్వరతత్త్వజ్ఞానము గుహ్యతమము. అట్టి దైన భగవతోదితం=భగవంతునిచేఁ బ్రతిపాదితమైన భాగవతశాస్త్రమును, అన్వవోచన్=ఉపదేశించిరి.

**వంశీధర భావార్థదీపిక:**

సద్గురూపదేశము లేకయే కేవల యశ శ్రవణమాత్రముతో జ్ఞానోదయ మెట్లైనది? తత్ప్రకారమును జెప్పుచున్నాఁడు-

ఏవం=ఈ రీతిగ నున్నట్టి, మే=నాకు, ప్రేమభక్తి తీవ్రముగ నేర్పడిన నాకని తాత్పర్యము. సాక్షాద్భగవతా=నేరుగా దేవకినందనుఁ డగు కృష్ణపరమాత్మచేత, 'జ్ఞాయతే అనేనేతి జ్ఞానం'-దీనిచే భగవంతుఁడు తెలిసికొనఁ బడుచున్నాఁడు. కనుక, జ్ఞాన మనఁగా జ్ఞాన శాస్త్రమనుట. కేవల జ్ఞానమునకంటెను భక్తిమిశ్ర జ్ఞానప్రధానమైన శాస్త్రము గుహ్యము. జ్ఞానమిశ్ర భక్తిప్రధానము గుహ్యతరము. కేవల భక్తిప్రధానము గుహ్యతమము. దీనినే భగవంతుఁ డుద్ధవున కుపదేశించెను. చతుర్ముఖబ్రహ్మను గూర్చి పలికెను. యుద్ధరంగమున నర్జునుని గూర్చి గీతావ్యాజముతో నీ భాగవత ధర్మమునే యుపదేశించినాఁడు. గమిష్యంతః=రేపు మేము బయలుదేరఁ బోవుచున్నామని నిశ్చయించుకొన్నవారై, భగవంతుఁడు, జ్ఞాన విజ్ఞాన సారమైన చతుశ్శ్లోకిని, బ్రహ్మ కుపదేశించినాఁడు. ఆ చతుశ్శ్లోకి సారము పరమ హంసలు నారదున కుపదేశించిరి. ఆ చతుశ్శ్లోకియందు గుహ్యతమమైన భక్తియే చెప్పఁబడినది. సాక్షాద్భగవతోదితం = భగవంతుఁడు సాక్షా

త్తుగా బ్రహ్మదేవున కుపదేశించిన విషయమును భాగవతమే చెప్పు చున్నది.

పురా మయా ప్రోక్త మజాయనాభ్యే.

ఇత్యాదిగా పైన వచ్చును. గుహ్యతమం — బ్రహ్మజ్ఞానమున కంటెను రహస్యతమ మైనది.

**విజయధ్వజము :**

అవ : సద్గురువుల యుపదేశములేనిదే కేవలము వాసుదేవుని చరిత్ర శ్రవణమాత్రమే మోక్షకారణమైన జ్ఞానము నొసఁగదని చెప్పు చున్నాఁడు–

ఏవం—పైని చెప్పినట్లుగా, అనురక్తస్య—శ్రీహరికథాశ్రవణము నందాసక్తిగల, ప్రశ్రితస్య—అతిశయముగా వారినే యాశ్రయించి యున్న హతైనసః—సమస్తపాప నివృత్తియైన, దాంతస్య—ఇంద్రియ ములను నిగ్రహించిన, అనుచరస్య—అనుచరుఁడునైన, బాలస్య తస్య, గమిష్యంతః—పోవుచున్న, దీనవత్సలాః—దీనులైన జనులయందుఁ బ్రీతిని గనుపఱచు నా యోగులు, యత్—ఏది, సాక్షాద్భగవతోదితం —భగవంతుడు తానే బ్రహ్మదేవున కుపదేశించియుండెనో, తత్—అట్టి, గుహ్యతమం—అత్యంత నిగూఢమైన, జ్ఞానం—భగవంతునకు సంబం ధించిన జ్ఞానము అన్వవోచన్.

తాత్పర్యము : శ్రీహరి మాహాత్మ్యమును, శ్రవణ మొనర్చినను సద్గురువుల యుపదేశములేనిదే నా శ్రవణమాత్రము మోక్షకారి కాఁ జాలదు. ఈ విషయము నెఱిఁగిన యా పరమహంసలు దీనుఁడనైన నాయందు వాత్సల్యమును గన్పఱచిరి. 'వీఁడు మమ్మతిశయముగ నాశ్రయించినాఁడు, శ్రీహరికి సంబంధించిన కథలను వినుటయం దనురక్తుఁడు. అట్టి శుద్ధవృత్తితో వీని సమస్తపాపములును నాశితము

లైనవి. ఇంద్రియములను నిగ్రహించెను. హరిభక్తుల వ్రతములనే యాచరించుచున్నాఁడు. శ్రద్ధగూడ వీనియందుఁ గన్పించుచున్నది. పాలకుఁడైన మాత్రమున నేమి? బ్రహ్మజ్ఞానోపదేశమునకు వీఁ డధికారి' ఈ రీతిగా నా యోగ్యులు దలఁచిరి. వారు చాతుర్మాస్యమును ముగించి వేఱుచోటికిఁ బయనమై పోవునప్పుడు నన్నుఁ బిలిచి యనుగ్రహ పూర్వకముగా ప్రసన్నమగు మనస్సుతో గూఢమైన భగవత్తత్త్వ జ్ఞానము నుపదేశించినారు. దీనినే బ్రహ్మకు సాక్షాత్తుగా హ్నాపికేశుఁ డుపదేశించినది. ఇట్టి గుహ్యతమమైన జ్ఞానమును వారు నా కుపదేశించినది కేవల కారుణ్యముచేతనే. మఱి యేకారణమునుబట్టి కాదు.

యేనైవాహం భగవతో వాసుదేవస్య వేధసః.
మాయాఽనుభావ మవిదం యేన గచ్ఛంతి తత్పదమ్. 31

ఏతత్సంసూచితం బ్రహ్మం స్తాపత్రయ చికిత్సితమ్,
యదీశ్వరే భగవతి కర్మబ్రహ్మణి భావితమ్. 32

ఆమయో యశ్చ భూతానాం జాయతే యేన సువ్రత,
త దేవహ్యామయ ద్రవ్యం న పునాతి చికిత్సితమ్. 33

ఏవం నృణాం క్రియాయోగాః పరే సంసృతిహేతవః,
త ఏవాత్మ వినాశాయ కల్పంతే కల్పితాః పరే. 34

యదత్ర క్రియతే కర్మ భగవత్పరితోషణమ్,
జ్ఞానం యత్తదధీనం హి భక్తియోగ సమన్వితమ్. 35

యేన ఏవ—ఏ గుహ్యతమమైన జ్ఞానముచేత, అహం—నేను, భగవతః—షడ్గుణైశ్వర్యసంపన్నుఁడును, వేధసః—సర్వలోక స్రష్టయునైన, వాసుదేవస్య—వాసుదేవునియొక్క, మాయానుభావం—మాయయొక్క వైభవమును, అవిదం—తెలిసితిని, యేన—దేనిచేత, తత్పదం—ఆ బ్రహ్మభూతమైన స్థానమును, గచ్ఛంతి—పొందుచున్నారో।

ఆ మహాత్ములు నా కుపదేశించిన జ్ఞానమే గుహ్యతమమంటిని. దానితో నేను, లోకముల సృష్ట్యాదులనొనర్చువాఁడును, షడ్గుణైశ్వర్య వంతుఁడైన, వాసుదేవునియొక్క, మాయా వైభవమును గ్రహించి తిని. ఈశ్వరుని తత్త్వజ్ఞానమే మహావాక్యమందున తత్పదార్థజ్ఞానము. ఇంతకుముందు 'త్వం' పదార్థజ్ఞాన మేర్పడినదని చెప్పియుంటిని. ఇప్పుడు తత్పదార్థజ్ఞానముతో బ్రహ్మకును దనకు నున్న వైరూప్య సారూప్యములు స్పష్టముగాఁ దెలియ వచ్చినవి. ఈ జ్ఞాన మెవరి కబ్బునో వారు వాసుదేవుని దివ్యధామము నందెదరు. 31

**ఈశ్వరే — సర్వనియంతయు, భగవతి — భగవంతుఁడునైన, బ్రహ్మణి — బ్రహ్మయందు, భావితం—సమర్పింపఁబడిన, కర్మ=కర్మము, యత్—ఏది కలదో, ఏ తత్—అది, బ్రహ్మన్=ఓ వ్యాసమునీ!, తాపత్రయచికిత్సితం—మూఁడు విధము లైన తాపములకుఁ జికిత్స యగునవి, సంసూచితం — స్పష్టముగా నుపదేశింపఁ బడినది.**

ఓ వేదవ్యాసమునీ! సర్వభూత హృదయము లందును నుండి వారిని స్వస్వ వ్యాపారముల యందుఁ బ్రవర్తింపఁ జేసెడు నియంతయు, సర్వైశ్వర్య పరిపూర్ణుఁడును, సర్వత్ర వ్యాపించియున్న వాఁడునునైన సర్వేశ్వరునియందు సమస్త కర్మలను సమర్పించుటయే యుత్తమోత్తమమైన భాగవతధర్మము దీనితో త్రివిధ తాపములును హరింపఁబడును. ఇది సమస్తక్లేశములకును దివ్యౌషధము. ఈ విషయమును నా కా పరమహంసలు విస్పష్టముగా నుపదేశించిరి. 32

**సువ్రత!—శోభనవ్రతముచేఁ గూడినవాఁడా! యేన—దేనిచేత, భూతానాం—ప్రాణులకు, యః ఆమయః—ఏ రోగము, జాయతే—ఏర్పడుచున్నదో, తత్ ద్రవ్యం ఏవ—ఆ ద్రవ్యమే, ఆమయం—రోగమునుండి, న పునాతి—విముక్తుని గావించి శుద్ధమైన వానినిగా నొనర్పదు, చికిత్సితం—చికిత్సచేఁ గూడికొన్నదై తనో, పునాతి—విముక్తునిఁ జేయును.**

అవ: సంసారమును గల్గించెడు కర్మము, తాపత్రయాదులను నశింపఁ జేయునంటివి. ఇదెట్లు సాధ్యమగును? ఈ విషయమునే దృష్టాంత పూర్వముగఁ జెప్పుచున్నాఁడు-

ఓయీ సువ్రతా! నేయి మొదలగు ద్రవ్యముల నుపయోగించుటచే నొకప్పుడు జనులకుఁ గొన్ని రోగములు ప్రాప్తించును. మఱల నా పదార్థములనే పైపైని స్వీకరించినచో రోగనివృత్తి యగుట లేదు. ఇంకను నధికముగాఁ బెరుగుచుఁ బోవును. కాని యా నేయి తోడనే మఱికొన్ని యౌషధములు చేర్చి కొన్నిదినములు సేవించిన నది రోగనివృత్తి నొనర్చి సుఖమును గల్గించును గదా! 33

**ఏవం—ఈ ప్రకారము, సర్వక్రియాయోగాః = సమస్త వ్యాపారములును, నృణాం=మనుష్యులకు, సంసృతి హేతవః—లేని సంసారమును సృష్టించునవి, ఉన్న సంసారమును పెంపొందించు నవియు, త ఏవ—అవియే, పరే—ఈశ్వరు నందు, కల్పితాః—సమర్పింపఁబడినవై, ఆత్మవినాశాయ=తమ వినాశముకొఱకు, కల్పంతే—కల్పింపఁబడుచున్నవి.**

ఈ ప్రకారము సమస్త ప్రవృత్తులును పుణ్యపాప రూపములైనవి అగుటచే సుఖదుఃఖరూపములైన ఫలములను జనింపఁ జేయును. ఇవి మనుష్యులకు సంసార కారణములు. కాని వీనినే పరమేశ్వరునం దర్పించినపుడు వానికి సుఖదుఃఖరూప ఫలములను గల్గించుశక్తి నశించును. అట్టి కర్మములు వానినే నశింపఁ జేసికొనును. 34

**అత్ర — ఇక్కడ, భగవత్పరితోషణం — భగవంతుని సంతోషమునకై, యత్కార్యము, క్రియతే—చేయఁ బడుచున్నదో, భక్తియోగ సమన్వితం—భక్తి యోగముచేఁ గూడినదైన, తదధీనం—దాని కధీనమయియే, జ్ఞానం—జ్ఞానము.**

అవ: అజ్ఞానముచే నొనర్పఁబడు కర్మయొక్క నాశము జ్ఞాన ప్రాప్తిచే నేర్పడును. ఆ జ్ఞానము భక్తిచేఁగల్గును. ఇది సంప్రదాయము. కర్మముతోఁ గర్మనాశ మెట్లేర్పడును? అను విషయమునే యింకను వివరించుచున్నాఁడు-

భగవంతుని సంతోషమునకై చేయఁబడు కర్మము భగవదను గ్రహమును సూచించెడి భక్తిని జనింపఁజేయును. కర్మయోగముచేఁ గూడిన భక్తిచేత జ్ఞాన మేర్పడును. దీనిచే నేర్పడిన సార మేమనఁగా, భగవంతునందు సమర్పింపఁబడిన కర్మకు ఫలము భక్తిని జనింపఁ జేయుటయే. దాని కితరఫలము లేదు. అప్పుడు కర్మమును నశింపఁ జేయునదియు జ్ఞానమును జనింపఁ జేయునదియు నైనది. భక్తిని జన్మింపఁ జేసెడి కర్మము జ్ఞానమునకుఁ బరంపరగాఁ గారణమైనది. జ్ఞానము కర్మమును నిశ్శేషముగ నశింపఁజేయును. ఇట్లు కర్మ కర్మను నశింపఁ జేయుటలోఁ గారణ మగునని తెలియవలెను. 35

**శ్రీధరీయము :**

తాపత్రయ చికిత్సితం = అధ్యాత్మికాది తాపత్రయములకు, చికిత్సితం=భేషజము అనఁగా నివర్తము. ఎట్లగుచున్నది? బ్రహ్మణి భావితం=బ్రహ్మకొఱకు సమర్పింపఁబడినది. బ్రహ్మ మెట్టివాఁడు? భగవతి ఈశ్వరే = అతఁడు సర్వనియంత యైనవాఁడు. అట్టైనను, బ్రహ్మణి–అప్రచ్యుత పూర్ణ రూపుఁడైన వాఁడు.

అవ : సంసారహేతువైనది కర్మ. అది తాపత్రయ నివర్తక మెట్లగును? సామగ్రిభేదముతో నగును. దీనినే సదృష్టాంతముగా రెండు శ్లోకములతో నిరూపించుచున్నాఁడు-

ఆమయః ఇతి–ఆమయ మనఁగా రోగము. ఏ ఘృతాదులతో రోగ మేర్పడుచున్నదో ఆమయకారభూతమైన యా ద్రవ్యమే, యా రోగమును, న పునాతి=నివర్తింపఁ జేయనేరదు. కాని చికిత్సితం = ద్రవ్యాంతరభావితమై, పునాత్యేవ = తప్పక యా రోగమును బోఁగొట్టును.

ఆత్మవినాశాయ=కర్మనివృత్తికొఱకు, కల్పంతే–సమర్థములుగా నగుచున్నవి. ఎట్లు? పరే కల్పితాః=పరుఁడగు ఈశ్వరునియందు సమ

ర్శింపఁబడినవై, ఈ సందర్భములో భగవద్గుణా విర్భావమున కొక క్రమము ప్రదర్శింపఁబడినది. మొదట మహాత్ముల సేవ తర్వాత వారి కారుణ్యము. పిదప వారి ధర్మమునందు శ్రద్ధ, అపై భగవత్కథాశ్రవణము. తదుపరి భగవంతునియందు రతిరూపమగు పరమానురాగము. దానితో దేహద్వయ వివిక్తాత్మజ్ఞానము, తత్కృతమైన దృఢభక్తి, అ భక్తి కారణముగా భగవతత్త్వ విజ్ఞానము. ఆ మీఁద నాతని కృపతో సర్వజ్ఞత్వాది భగవద్గుణా విర్భావము.

అవ: జ్ఞానముతో నజ్ఞానప్రాప్తకర్మనాశ మేర్పడుచున్నది. ఆ జ్ఞానమునకు భక్తియోగము కారణము. మఱి కర్మతోఁ గర్మ నాశ మెట్లేర్పడును? ఈ విషయమునే చెప్పుచున్నాఁడు-

భగవదర్పణముగా నొనర్పఁబడు కర్మ భక్తియోగమును జనింపఁ జేయును.

**వీరరాఘవీయము:**

అవ: వారు చెప్పిపోయిన జ్ఞానస్వరూపమును వివరించుచున్నాఁడు-

యేన=ఏ జ్ఞానముచేత, అహం భగవతః వేధసః=విశ్వవిధాతయైన, వాసుదేవస్య-మాయానుభావం =త్రిగుణాత్మకమైన ప్రకృతి మహిమను, దీనిచేత విరోధిస్వరూపమని చెప్పఁబడినది. యేన= ఏ జ్ఞానముచేత, తత్పరం-వాసుదేవుని పరమైన స్థానమును, గచ్ఛంతి-పొందుచున్నారో, దీనిచేత ప్రాప్యప్రాపక విషయజ్ఞానము చెప్పఁబడినది. అర్థపంచకజ్ఞానము నుపదేశించెనని ఫలితార్థము. అర్థపంచక మనఁగా నేమి?

ప్రాప్యస్య బ్రహ్మణోరూపం ప్రాప్తుశ్చ ప్రత్యగాత్మనః,
ప్రాప్త్యుపాయఫలం చైవ తథా ప్రాప్తి విరోధి చ.
వదంతి సకలా వేదా స్సేతిహాస పురాణకాః

ప్రాప్యమైన బ్రహ్మస్వరూపము, ప్రాప్తయైన ప్రత్యగాత్మ స్వరూపము, ప్రాప్తి కనుసరించెడు ఉపాయస్వరూపము, ప్రాప్తిఫల స్వరూపము, ప్రాప్తివిషయమునకు విరోధిస్వరూపము—వీనికే అర్థ పంచక మని పేరు. వైష్ణవగ్రంథములందు యీ యర్థపంచక నిర్ణ యము బహుధా వర్ణితము. దీనికే 'ప్రతితంత్ర' మనియును పేరు. ప్రతితంత్ర మనఁగా తక్కిన సిద్ధాంతు లెవ్వరును నంగికరింపక కేవ లము తన సిద్ధాంతమందే యొప్పుకొనఁబడినదైన యొక యర్థము. పరబ్రహ్మ స్వరూపమును తిరుమంత్రము మొదటి యక్షరమైన 'ఓం' కారము నందును, నారాయణ శబ్దమందును, ద్వయము నందలి 'శ్రీమత్' అను విశేషణముతోఁ గూడియున్న నారాయణ శబ్దమం దును చరమశ్లోకము నందలి 'మాం' 'అహం' అను పదములందును అనుసంధించు కొనవలెను. అనఁగా నీ తావులందు ప్రాప్యమగు బ్రహ్మమును మనన మొనర్చికొనునప్పుడు ఈ క్రింది శ్లోకముల కనుగుణముగా ననుసంధించుకొన వలెను.

'శ్రియాసార్థం జగత్పతిః'
'ఏష నారాయణ శ్శ్రీమాన్'
'శ్రీమాన్ చక్రాయుధో విభుః'
'శ్రీవత్సవక్షా నిత్యశ్రీః'
'విష్ణోశ్శ్రీ రనపాయినీ'
'సీతా సమక్షం కాకుత్స్థమిదం వచన మబ్రవీత్'
'సీతా మువాచాతియశాః; రాఘవం చ మహావ్రతం'
'అలమేషా పరిత్రాతుం. రాఘవా ద్రాక్షసీగణం'
'భవేయం శరణం హి వః'
'తయాసహాసీన మనంతభోగిని'
'కాంతస్తే పురుషోత్తమః'
'స్వవరిచరణ భోగైః శ్రీమతి ప్రీయమాణే'

'శ్రీమతే నిర్మలానందో దన్వతే విష్ణవే నమః'

'శ్రియః కాంతో౽నంతో వరగుణ గుణైకాస్పద వపుః'

'బ్రహ్మణి శ్రీనివాసే'

శ్రియఃపతిః'

'నిఖిలహేయ ప్రత్యనీక కల్యాణైక శానంత జ్ఞానానందైక స్వరూపః'

ఇ వేమని తెలుపుచున్నవి? శ్రీనివాసుఁడు నిరంతరము లక్ష్మీదేవితోఁ గూడియేయుండును. అతనికి 'శ్రీమాన్' అనియేపేరు. నిత్యానపాయినియైన లక్ష్మి శ్రీనివాసుని వక్షఃస్థలమందే సదా కొలువుదీరునది. ఆయా యవతారములందామె యతని కనుగుణముగా రూపములను దీర్చికొని వర్తించుచుండును. రామావతారమందు సీతగా వర్తించెను. కృష్ణావతారమున రుక్మిణియై యుండెను. ఆ యవతారములలోఁ గూడ నామె తన స్వభావమైన కారుణ్యమును పురుషకారమును నెఱపుచునేయుండును. రామావతారమున త్రిజటాది రాక్షసస్త్రీలామెను శరణుఁజొచ్చిరి. వాసుదేవుఁడై యున్నపుడు లక్ష్మి యాతనితోఁ గూడ శేషశయనమందే కాంతసుఖము ననుభవించుచుండును. శ్రియః పతియైన స్వామి సమస్త కల్యాణగుణముల కాస్పదుఁడు. నిఖిలహేయ ప్రత్యనీకము లా గుణములు.

సమస్త హేయరహితం విష్ణ్వాఖ్యం పరమం పదమ్,
పరః పరాణాం సకలా న యత్ర క్లేశాదయ స్సంతి పరావరేశే.

హేయగుణ రహితుఁడైన విష్ణు వనఁబడు పరాత్పరుని కే విధములైన దుఃఖములును లేవు అని శాసించినట్లు హేయగుణము లేమాత్రము లేనివానినిగా భగవంతు ననుసంధించుకొన వలెను.

'త్రైలోక్యత్రాయతాం వరః'

'తమేవం గుణసంపన్న మప్రధృష్య పరాక్రమమ్'

'జ్యేష్ఠం శ్రేష్ఠగుణైర్యుక్తం'

'గుణైర్విరురుచే రామః'

'బహవో తవ కల్యాణగుణాః పుత్రస్య సంతి తే'
'అనృశంస మనుక్రోశః శ్రుతం శీలం దమశ్శమః,
రాఘవం శోభయంత్యేతే షడ్గుణాః పురుషోత్తమమ్'
'విదిత స్సహి ధర్మజ్ఞః శరణాగతవత్సలః'
శరణ్యం శరణం చ త్వా మాహు ర్దివ్యా మహర్షయః'
'నివాసవృక్ష స్సాధూనాం'
'తేజో బలైశ్వర్య మహావబోధ స్సువీర్యశక్త్యాది గుణైకరాశిః'
'సర్వభూతాత్మ భూతస్య విష్ణోః కో వేదితుం గుణాన్'
'యథా రత్నాని జలధే రసంఖ్యేయాని పుత్రక!'
తథా గుణాశ్చ దేవస్య త్వసంఖ్యేయా హి చక్రిణః'
'వర్షాయుతై రస్యగుణా వశక్యా వక్తు స్సమేతై రపి సర్వదేవైః'
'చతుర్ముఖాయుర్యది కోటివక్త్రో భవేన్నరః క్వాపి విశుద్ధచేతాః'
'స తే గుణానా మయుతైకమంశం వదేన్నవా దేవవరప్రసీద'
'తవానంత గుణస్యాపి షడేవ ప్రథమే గుణాః,
యైస్త్వయైవ జగత్కుక్షా వన్యేప్యంత ర్నివేశితాః,
ఇషుక్షయా న్నివర్తంతే నాంతరిక్ష క్షితిక్షయాః
మతిక్షయా న్నివర్తంతే న గోవింద గుణక్షయాః'

ఈ పైఁ జెప్పిన ప్రమాణముల ప్రకారము ప్రాప్యమగుటకును ప్రాపక మగుటకును నుపయుక్తములగు గుణములతోఁ గూడియున్న వానినిగా ననుసంధించికొన వలెను.

'షడైశరూపాయ నిత్యసిద్ధే తదాకరే'
'తత్పరస్యే చ పౌష్కర'
'యస్యాస్తి సత్తా హృదయే తస్యాసౌ సన్నిధిం వ్రజేత్'
'సమస్తాశ్శక్త యశ్చైతా నృప! యత్ర ప్రతిష్ఠితాః,
తద్విశ్వరూప వైరూప్యం రూపమన్యద్ధరే న్మహత్.'
ఇచ్ఛా గృహీతాభిమతోరు దేహః'

'న భూతసంఘ సంస్థానో దేహోఽస్య పరమాత్మనః'
న తస్య ప్రాకృతామూర్తి ర్మాంసమేదోఽస్థి సంభవా'
'రక్షార్థం స్వేచ్ఛయాధిగమ్యం తత్రైవస్థం జగత్కృత్స్నం'
'పశ్యామి దేవాం స్తవదేవః దేహే'
'అస్త్రభూషణ సంస్థానస్వరూపం'
'భూషణాస్త్ర స్వరూపస్థం యథైవ మఖిలం జగత్'
'శమనః పరమోదారా శంఖచక్ర గదాధరః'

ఇత్యాదులందుఁ జెప్పఁబడినట్లు సమస్తప్రపంచములకు నాధార హేతువైనవాఁడు అప్రాకృత దివ్యమంగళ విగ్రహముతోఁ గూడిన గాఁడు ఇట్టి వానినిగా ననుసంధించి కొనవలెను. ఈ శరీరము ర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చావతారములుగా నైదు తులు, వీని విశేషములను, పాంచరాత్రోక్త ప్రకారమునఁ దెలియ లెను. 'విష్ణోరేతా విభూతయః' 'మహావిభూతి సంస్థానః' 'నాం స్తి మమదివ్యానాం విభూతీనాం పరంతప!' మొదలగువాని యర్థ మను, సంగ్రహముగాఁ దెల్పునట్టి 'యదండ మండాంతరగోచరంచ యత్' అను శ్లోకమునఁ జెప్పినట్లు, అనంతములగు విభూతులతోఁ డి యున్నవానినిగా ననుసంధించికొనవలెను. ఈ విభూతులు ండురీతులు; చేతనములు అచేతనములు. చేతనములు క్రీడార్థములు. చేతనములు భోగార్థములు. క్రీడయన్నను భోగమన్నను సుఖప్రద గు విషయమున నొకటే. కాని వీనిలో నొక్కొక్కదానికి గల రుచి దమును బట్టి క్రీడ, భోగ మన్న విభాగ మేర్పడినది.

'జన్మాద్యస్య యతః' 'క్రీడాహరేరిదం సర్వం' క్రీడతో బాలక ్యవ' 'బాలః క్రీడన కైరివ' 'హరే! విహరసి క్రీడాకందుకై రివజంతు ః' 'లోకవత్తు లీలాకైవల్యం' అను ప్రమాణములవలె, క్రీడార్థమైన గత్తును సృష్టించినవానినిగా గ్రహింపవలెను. ఇట్లు లక్ష్మీసహచరుఁడై, రుపరిమిత జ్ఞానానందమయుఁడై, హేయగుణప్రతిభటుఁడై, జ్ఞాన క్త్యాద్యనంత మంగళగుణవిశిష్టుఁడై, దివ్యమంగళ విగ్రహోపేతుఁడై,

శరీరభూత నిత్యవిభూతి లీలావిభూతులతోఁ గూడినవాఁడై, జగత్సృష్ట్యాది వ్యాపారములను క్రీడార్థమొనర్చువాఁడై, వ్యాప్యవస్తువైన పరబ్రహ్మమును బొందఁగోరునట్టి జీవుఁడు, నిత్య ముక్త బద్ధులతో సమానముగా నుండునట్టి రూపమును, ఉపాయాధికారియగు తనకు ప్రస్తుతముందు విశేషరూపమును స్పష్టముగఁ దెలిసికొనవలెను. బద్ధు లనఁగా ననాదికర్మపరంపరవలన నెడతెగకుండునట్టి సంసారబంధం గలవారై, బ్రహ్మాదిస్తంబపర్యంతము పదార్థములుగా విభజింపఁబడియున్న జీవులు. శాస్త్రవిహితములైన యుపాయానుష్ఠానములతో భగవదనుగ్రహము వడసి నిరతిశయానంద యుక్తులైన వారు ముక్తులు. నిత్యులుగా సర్వేశ్వరునివలెనే యనాదికాలముగా జ్ఞానసంకోచములేని వారగుట సంసారబంధరహితులై నిత్యకైంకర్య మొనర్చుచుండు ననంత గరుడ విష్వక్సేనాదులు వీ రంటికిని సర్వసాధారణములైన గుణములు అణుత్వ జ్ఞానత్వ ఆనందత్వ అమలత్వాదులు. భగవచ్ఛేషత్వ పారతంత్ర్యాదులు. ముముక్షువైన జీవునకు భగవచ్ఛేషత్వ పారతంత్ర్యాదులతోఁ బాటు నిత్యశరణాగతి ప్రధానలక్షణము. ఈ జీవుని స్వరూపము ప్రణవమందున్న అ-ఉ-మ అను వానిలోని మకారమందు 'నమ'శ్శబ్ద మకారశబ్దమందు నారశబ్దమందు, 'ప్రపద్యే' అను ఉత్తమ పదక్రియాపదమందు, 'వ్రజ' యనెడు మధ్యమపురుషమందు, 'త్వా' పదమందు 'మాశుచః' అను వాక్యమందు ననుసంధించికొన వలెను. ఉపాయము తిరుమంత్రమందలి 'నమః' పదములో 'అయన' శబ్దములో, ద్వయమందలి పూర్వఖండములో, చరమశ్లోకము నందలి పూర్వార్ధములో ననుసంధానము. ఫలస్వరూపమును చతుర్థ్యంత పదములు, ద్వయమునందలి నమశ్శబ్దము, 'సర్వపాపేభ్యో మోక్షయిష్యామి' అను వాక్యమును ప్రతిపాదించినవి. భగవత్ప్రాప్తికి విరోధులు అవిద్యా కర్మవాసనాది రూపములు. వీనిలోఁ బ్రధానము అనాదికాలముగా నొనర్పఁబడునట్టి భగవదాజ్ఞాతిక్రమణము. దానితో భగవన్నిగ్రహ మేర్పడును. ఇవి జీవులకు జ్ఞానసంకోచకరము. సత్త్వ రజ

స్తమోగుణాత్మకమగు ప్రకృతితో సంబంధము గల్గజేయును. ప్రకృతి పరిణామరూపములగు దేహేంద్రియాదులతో సంబంధ మేర్పఱచును. తిర్యగ్జంతువులు మొదలైన వ్యవస్థలను గల్గించును. మనుష్యజన్మ యందును వేదబాహ్యులగు కుదృష్టులతో సంబంధము నేర్పఱచును. మనస్సును గలవరపెట్టి భగవద్రామానుజులు 'భగవత్స్వరూప తిరోధానకరీం విపరీతజ్ఞాన జననీం స్వవిషయాయాశ్చ భోగ్యబుద్ధేర్జననీం' అన్నట్లు మూలప్రకృతి రూపమైన మోహనపింఛముచే నజ్ఞాన విపరీత జ్ఞాన విషయప్రావణ్యములలో ముంచును. అల్పసుఖములకై అకృత్యకరణ కృత్యాకరణరూపమైన యాజ్ఞాతిలంఘన మొనర్పం జేయును.

**పాపః ప్రజ్ఞాం నాశయతి క్రియమాణః పునః పునః,**
**నష్టప్రజ్ఞః పాపమేవ పునరారభతే ఽర్జునః ।** (గీత)

అన్నట్లు అపరాధ పరంపరలు బెరుగుచు బోవును. దానితో 'క్షిపామ్యజస్రం' అన్న భగవంతునికివలె గర్భ జన్మ జరామరణ నరకాది సంసార చక్రము పునఃపునః ప్రాప్తించును. క్షుద్రభోగసాధనములకు రాజస తామస శాస్త్రార్థముల నాశ్రయించి 'యక్షరక్షాంసి రాజసాః, ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజంతే తామసా జనాః' అన్నట్లు క్షుద్ర పురుషార్థములకై భూతప్రేతాద్యుపాసనలలో ప్రాఁకులాడునట్లు జేయును. ఇట్టి యెన్నియో యనర్థములను గల్గించును. దీనికి నిష్కృతి ఎట్లు? 'తస్యచ వశీకరణం తచ్ఛరణాగతి రేవ' కనుక సమస్తములకును శరణాగతియే ప్రధానోపాయము. ఇట్లు దెలియుటయే యర్థపంచకజ్ఞానము. ఈ సమస్త విషయములను నారదున కుపదేశించిరని తాత్పర్యము.

అవ: పూర్వజన్మ వృత్తాంత దృష్టాంతముతో భగవచ్ఛ్రవణాదులు భక్తియోగ సాధనములని నిరూపింపఁబడినవి. భక్తియోగము సమస్త మంగళగర్భక మని ముందే ప్రతిపాదితము. 'ధర్మకృతేఽనుశాసతః' 'స్వభావరక్తస్య' అను దానిచేత త్రైవర్గిక కర్మమూలకమైన తాపత్రయాభిహితుఁడైన మానవు నుద్దేశించి, మఱల త్రైవర్గికధర్మాను

శాసనము పొరపాటని చెప్పఁబడినది. ఎందువలన? మఱల నా ధర్మా నుష్ఠానము తాపత్రయములనే వర్ధించుచున్నవి. 'ఈశ్వరేన చార్పితం కర్మ' ఇత్యాదులతో ననభిసంహిత ఫలమైన కర్మము భక్తియోగమును గల్గించుననియు దానితోఁ దాపత్రయ నివారణమగుననియుఁ జెప్పఁ బోవుచు, త్రైవర్గికమైన కర్మము మఱల మఱల తాపత్రయములనే గల్గించుననియు సదృష్టాంతముగ మూఁడు శ్లోకములతో వివరింపఁ బోవుచున్నాఁడు–

హే బ్రహ్మన్! తాపత్రయ చికిత్సితం–తాపత్రయ ప్రతీకారము ఏ తత్ ఏవ–ఇది యనియే, సంసూచితం = శ్రుతి స్మృత్యాదులతో నిర్ణయింపఁ బడినది. ఈశ్వరార్పితమైన కర్మయే తాపత్రయ చికిత్సిత మని పిండితార్థము 'ధర్మేణ పాపమపనుదతి' 'అవిద్యయా మృత్యుం తీర్త్వా' ఇత్యాదులు శ్రుతిప్రమాణములు. 'యజ్ఞదాన తపః కర్మ పావ నాని మనీషిణాం' అనునట్టివి స్మృతులు. తాపత్రయము పాపమూల కము. అనభిసంహిత ఫలమైన ఫలకర్మ పాపనివృత్తి భక్తియోగ నిష్పత్తి ద్వారా తాపత్రయమును బోఁగొట్టుచున్నది.

**విజయధ్వజము :**

అహం వేదనః భగవతః వాసుదేవస్య మాయానుభావం = ఇచ్ఛయొక్క సామర్థ్యమును, యేనైవ – ఏ యోగు లుపదేశించిన జ్ఞానముచేతనే, అవిదం–తెలిసికొంటినో, ఏన–ఏ జ్ఞానముతో జ్ఞానులు తత్పదం–శ్రీహరి స్థానమైన మోక్షమును, గచ్ఛంతి–పొందెదరో అట్టి రహస్యమైన జ్ఞానమును నాకు వా రుపదేశించిరి.

తాత్పర్యము : అపరోక్షులైన యా యతులు పరమానుగ్రహ మొనర్చి నా కుపదేశించినదాని వలన సర్వజగత్తునకును సృష్ట్యాది కర్తయై పరమపూజ్యుఁడైన శ్రీహరి సామర్థ్య మెట్టిదను విషయమును నా యోగ్యతకుఁ దగినట్లుగా నేను దెలిసికొంటిని. జ్ఞానులందరును

పునరావృత్తి లేని వైకుంఠమును జేరి ముక్తులై స్వరూపానందమును శాశ్వతముగా ననుభవించుట ఈ జ్ఞానము వలననే. వేఱు జ్ఞానములతో మోక్ష మెప్పటికిని దొరుకదు.

ఏతత్=నేను చెప్పిన ఈ జ్ఞానము, బ్రహ్మన్!=పరిపూర్ణుడగు వైకుంఠు నెఱిఁగిన వేదవ్యాసమునీ!. తాపత్రయ చికిత్సితం=తాప త్రయాత్మకమైన సంసారమును బోఁగొట్టు నౌషధమని, యధికారి చేతనులకు, సంసూచితం=చక్కగా సూచింపఁబడినది. కనుక నట్టి జ్ఞానమును గూర్చియే దెలుపవలెను. మఱి కర్మానుష్ఠానము వ్యర్థమేనా! కాదు. కర్మ, యజ్ఞ యాగాదుల నొనర్చు జనులు సేయఁదగిన యగ్నిష్టోమాది కర్మలు, బ్రహ్మణి=పరిచ్ఛిన్నము గాని గుణ విశిష్టుఁడైన, ఈశ్వరే=ఈశ్వరునికంటే శ్రేష్ఠుఁడైన, భగవతి=శ్రీహరి యందు, భావితం యది=సమర్పింపఁబడినచో దానితో నీ జ్ఞానమేర్పడును. అట్టిజ్ఞానము, తాపత్రయమును బోఁగొట్టును బ్రహ్మార్పణ బుద్ధితో నొనర్చెడి కర్మతో నంతఃకరణము శుద్ధమగును. దానితో వైరాగ్య మేర్పడును. కేశవునియందుఁ దీవ్రమైన భక్తి జనించును. అపరోక్ష జ్ఞానమై తాపత్రయాత్మకమైన సంసారము నశించును. బ్రహ్మణిభావితం యత్కర్మ=శ్రీహరి సమర్పితమైన యే కర్మ గలదో యది, ఏతత్=సంసారౌషధమని సూచితమైనది.

తాత్పర్యము: శ్రీహరి యవతారమైన వ్యాసమునీ! నీవు ప్రత్యక్షజ్ఞానివి. 'హరి సర్వోత్తముఁడను' జ్ఞానమే యధికారిచేతనుల సంసారనివృత్తికిఁ బరమౌషధము. సంసార మనఁగాఁ దాపత్రయములే. దానిని నశింపఁ జేసికొనవలెనను నిచ్ఛ ముముక్షువైన వానికెవ్వనికి నుండదు? అట్టి ముముక్షువులపై ననుగ్రహముంచి నీవు పైఁ జెప్పిన జ్ఞానము నుపదేశించెడి రచనమునే యుపదేశింపవలెను. ఈ జ్ఞానము గల్గవలెనన్నచో వేదోక్త కర్మజ్ఞాన మావశ్యకము. విహితములైన సమస్త యజ్ఞయాగాది కర్మములను బరిపూర్ణుఁడు, నియామకులలో శ్రేష్ఠుఁడు నైన హృషీకేశునందు సమర్పింపవలెను. అప్పుడే

యంతఃకరణము శుద్ధమై వైరాగ్యము జనించును. కేశవునం దతిశయ మైన భక్తియై యపరోక్షజ్ఞాన ముదయమగును. హరి ప్రసన్నుఁడయె ననుటకే యపరోక్షజ్ఞానమే గుర్తు. అతని ప్రసాదముచేతనే సంసా నివృత్తి. కనుక బ్రహ్మార్పణబుద్ధితో నొనర్పఁబడు కర్మ నివృత్తికర మనియే యనిపించికొనును, ఇది సంసారమున కౌషధము.

అవ: కర్మముల స్వభావమే బంధనము. మఱి తాపత్రయ రూప బంధన కారణములైన కర్మలు తాపపరిహార కౌషధములు నెట్లగును? దానినే వివరించుచున్నాఁడు-

సువ్రత! = 1. సుఖమే వ్రతముగాఁ గలిగిన, 2. సత్యసం ల్పము మొదలైన చక్కని వ్రతములచేఁ గూడిన మహాముని! ఏవ భూతానాం, అయం ఆమయః = శ్లేష్మము మొదలగు రోగముల జాయతే=తదేవ, ఆమయద్రవ్యం = రోగకారణమైన యా పదార్థవే చికిత్సితం=వేఱు పదార్థములతోఁ జేర్చి, యౌషధముగా నుపయోగ చినపుడు, తత్ = ఆ రోగమును, పునాతి = పరిహరించును, హి = ఇ లోకమున ననుభవసిద్ధము, చ=ఇట్లే కర్మలు గూడ.

'అమయో ఽయం చ భూతానాం' 'తత్పునాతి చికిత్సితం' రెండును విజయధ్వజుల పాఠము. తదేవ అనుచోటునున్న ఏవ క ముతో రోగకారణమైన అన్నము మొదలగు ద్రవ్యము, ప్రధానము రోగమును హరించునని చెప్పఁబడినది. ఇతరద్రవ్యము రోగహరవ చెప్పుటను నిషేధింపలేదు. కనుక దానినే యౌషధముగా నొనర టకు వేఱు ద్రవ్యమును గలిపికొనుట లోకప్రసిద్ధమైనది.

తాత్పర్యము: బంధకమైన కర్మము బంధనివృత్తి కెట్లు తో డును? ఇట్లు శంకింపవలసిన పనిలేదు. సత్యసంకల్పుఁడవైన వా ముని! లోకమందు శ్లేష్మ వాత పిత్తము లనెడు ధాతువుల ప్రకో ముతో ప్రాణులకు రోగ మేర్పడుచున్నది. ఈ ప్రకోప మెట్లు గల్గున

వాఁడు దినెడు నాహారములతో తన్నివృత్తికై యొనర్పఁబడు నౌషధము గూడ నా యాహారపదార్థములతోనే చేయఁబడుచున్నది. ఆ పదార్థములతో మఱికొన్నింటిని జేర్చి యుపయోగించినపుడు రోగ కారణములైన యా పదార్థములే రోగమును నిర్మూలించును. అట్లే బంధకములైన కర్మములు శ్రీహరియందు సమర్పింపఁబడినచో మోక్ష కారణము లగును.

ఏవం=పైనిఁ జెప్పిన దృష్టాంతమువలె, క్రియాయోగాః=కర్మ రూపములైన యుపాయములు, సర్వే, నృణాం సంసృతిహేతవః త ఏవ పరే=పరిపూర్ణుఁడైన బ్రహ్మయందు వైకుంఠునందు, కల్పితాః, ఆత్మవినాశాయ=1. అనేక జన్మలందు సంగ్రహింపఁబడిన దుష్కర్మ ముల స్వరూపనాశనమునకై, 2. దేహనాశరూపమైన మోక్షమునకై, కల్పంతే=కేవల కర్మము బంధకము. అదే హరియందు సమర్పింపఁ బడినచో నా యర్పణతోఁ జేరి యది యౌషధ మగును. భక్తి జ్ఞానము కల్పించుటద్వారా సంసార మనెడు రోగమును నాశ మొనర్చును.

తాత్పర్యము: చేతనుల కర్మలన్నియు సంసార కారణములే. ఇది స్వాభావికము. కాని వీనినే శ్రీహరియందు సమర్పించినపుడు అది నైకజన్మ సంపాదిత దుష్కర్మల హరించును. ఆత్యంతికదేహనాశ కారణమగును. మోక్షము లభించును. కనుక కర్మము బంధమోచకము కావలెనన్నచో దానితోఁ జేర్పవలసిన ద్రవ్యాంతరము-భగవదర్పణ బుద్ధి. అప్పు డది యౌషధమై సంసారతారక మగును. జ్ఞాన భక్తులను బుట్టించును.

అవ: జ్ఞానమును గల్గించుటతోఁ గర్మము సంసారమోచక మగునని తెల్పుచున్నాఁడు-

**అత్ర=ఈ కర్మభూమియందు, భగవత్పరితోషణం=భగవదర్పణ ముగా నొనర్చుటలో భగవంతునకుఁ బ్రీతికరమైన, యత్=ఏ కర్మ,**

క్రియతే, యత్ = ఏది, భక్తియోగ సమన్వితం = వైకుంఠునందు భక్తితో గూడిన పరోక్షము నపరోక్షము నను రెండు విధములైన, జ్ఞానం = జ్ఞానము, తదధీనం = పైనిఁ జెప్పిన నివృత్తికర్మ కధీనమైనది. 'కర్మణా జ్ఞాన మాతనోతి' కర్మతో జ్ఞానవిస్తృతిని బొందును. 'జ్ఞానేనాఽమృ భవతి' జ్ఞానమున నమృతుఁ డగును. 'అథా ఽమృతాని కర్మాణి అందుచేఁ గర్మలు మోక్షకారణములు- ఇత్యాది శ్రుతులందుఁ జెప్పఁబ నట్లు కర్మాచరణముతో జ్ఞాన మేర్పడును. దానితో మోక్షము. కను కర్మ జ్ఞానజనకమై బంధనివర్తక మగును. చేయఁబడెడు నగ్నిష్టో మాది కర్మలందు, యత్ = ఏ కర్మ, భగవత్పరితోషణం = శ్రీహరికిఁ ప్రీ కరమో అట్టి కర్మచే జ్ఞానోదయమగునని యైనను నన్వయించికొ వచ్చును.

తాత్పర్యము : ఈ కర్మభూమియందు జీవులు కర్మసేయకుండ జాలరు. కాని దానిని భగవదర్పణబుద్ధితో నొనర్చినచో నది తత్ప్రీ కారణ మగును. ఇట్టి కర్మయే పరోక్ష మపరోక్ష మనెడు వివిధములఁ జ్ఞానములను గల్గించును. కనుక భగవంతునకు సంబంధించిన జ్ఞానమ నివృత్తి కర్మాధీనమైనది. ఈ యభిప్రాయముతోనే 'కర్మణా జ్ఞా మాతనోతి' 'జ్ఞానేనా మృతీ భవతి' ఇత్యాదులు వెలువడినవి. అమృ రూపమైన మోక్షకారణ మగుటతోఁ గర్మకును నమృత మనియే పేర ఇదియే నివృత్తికర్మ.

కుర్వాణా యత్ర కర్మాణి భగవచ్ఛిక్షయా ఽసకృత్,
గృణంతి గుణనామాని కృష్ణస్యాఽనుస్మరంతి చ.

నమో భగవతే తుభ్యం వాసుదేవాయ ధీమహి,
ప్రద్యుమ్నాయాఽనిరుద్ధాయ నమ స్సంకర్షణాయ చ.

ఇతి మూర్త్యభిధానేన మంత్రమూర్తి మమూర్తికమ్,
యజతే యజ్ఞపురుషం స సమ్యగ్దర్శనః పుమాన్.

ఇమం స్వనిగమం బ్రహ్మన్నవేత్య మదనుష్ఠితమ్,
అదాన్మే జ్ఞానమైశ్వర్యం స్వస్మిన్ భావం చ కేశవః. 39

త్వ మప్యదభ్రశ్రుతవిశ్రుతం విభోః
సమాప్యతే యేన విదాం బుభుత్సితమ్,
ప్రఖ్యాహి దుఃఖై ర్ముహు రర్దితాత్మనాం
సంక్లేశ నిర్వాణ ముశంతి నాన్యథా. 40

యత్ర=ఎప్పుడు, భగవచ్ఛిక్షయా=భగవంతుని యుపదేశము ననుసరించి, అసకృత్=ఎల్లప్పుడును, కర్మాణి=కర్మములను, కుర్వాణాః=చేయుచున్నవారై, కృష్ణస్య=కృష్ణునియొక్క, గుణనామాని=గుణములను, నామములను, గృణంతి=ఉచ్చరింతురు, అనుస్మరంతి చ=ఇతరులను స్మరించునట్లును చేయుదురు.

అవ: భగవంతునియందు సమర్పితమైన కర్మము భక్తియోగమును జనింపఁజేయును. ఈ విషయమునే సదాచార రూపముతో నిరూపించుచున్నాఁడు-

తాత్పర్యము: ఎప్పుడు భగవంతుఁ డుపదేశించిన పద్ధతి ననుసరించి కర్మ లొనర్తురో, అప్పుడా కర్మలొనర్చెడువారు శ్రీకృష్ణుని భక్తవాత్సల్యాది కల్యాణగుణములఁ గీర్తింతురు. కృష్ణుని తాము స్మరించి యితరులను స్మరించునట్లు చేయుదురు. కర్మాచరణములో భగవంతుని యుపదేశ మెట్టిది?

యత్కరోషి యదశ్నాసి య జ్జుహోషి దదాసియత్,
యత్తపస్యసి కౌంతేయ! తత్కురుష్వ మదర్పణమ్.

ఇదే భగవంతుని యుపదేశము. ఈ పద్ధతి ననుసరించి కర్మ నొనర్చుటయే భగవదర్పిత కర్మ యనఁబడును. దీనికే వృత్తికర్మ యనిపేరు. 36

సర్వైశ్వర్యపరిపూర్ణుఁడు సర్వవ్యాపకుఁడునైన నీ పాదములకు నమస్కారము. వాసుదేవుఁడు, ప్రద్యుమ్నుఁడు, అనిరుద్ధుఁడు, సంకర్షణుఁడను నాల్గురూపములతోఁగూడిన నీ దివ్యాంఘ్రులకు నమస్కారము.

**ఇతి మూర్త్యభిధానేన**—ఈ రీతిగా మూర్తులకు సంబంధించిన నామముల **నుచ్చరించుచు, అమూర్తికం**—స్వరూపముతోఁ గూడనివాఁడును, **మంత్రమూర్తిం**—మంత్రమయమైన స్వరూపయుక్తుఁడును, **యజ్ఞపురుషం** — యజ్ఞస్వరూపుఁడైన **పురుషుని, యజతే**—ఆరాధించునో, **సః**—వాఁడు, **సమ్యగ్దర్శనః పుమాన్**—సరియైన **జ్ఞానముతోఁగూడిన మనుష్యుఁడు.**

వాసుదేవుఁడమూర్తికుఁడు. మంత్రమే యాతని స్వరూపము. దానికన్న భిన్నమైన స్వరూపము లేదు. భక్తవాత్సల్యముతో నాతఁడు స్వేచ్ఛగాఁ గల్పించికొన్న నామములను బొగడుచు యజ్ఞపురుషునిగాఁ బూజించెడి మనుష్యుఁడు యథార్థజ్ఞానమును బొందినవాఁడై తేజరిల్లును. 38

**బ్రహ్మన్**—ఓ వ్యాసమునీ!, **మదనుష్ఠితం**—నాచే ననుష్ఠింపఁబడిన, **స్వనిగమం**—తన నిశ్చయమును, తనకుఁ సంబంధించిన నిశ్చయమును, **స్వస్మిన్ భావం చ**—తనయందున్న గాఢానురాగమును, **అవేత్య**—తెలిసికొని, **కేశవః**—భగవంతుఁడు, **మే**—నాకు, **జ్ఞానం ఐశ్వర్యం చ**—జ్ఞానము నైశ్వర్యమును, **అదాత్**—**దయచేసెను.**

ఓ వ్యాసమునీ! భగవంతు నుపదేశము ననుసరించి నేను బ్రవర్తించితిని. నా నిశ్చయము నాతఁడెఱిఁగెను. నా పరమానురాగమును గమనించెను. గమనించి నాకు శుద్ధమైన జ్ఞానమును, ఐశ్వర్యము ననుగ్రహించినాఁడు. 39

**అదభ్రశ్రుతః**=అధికమైన శాస్త్రజ్ఞానముతోఁ గూడిన వాఁడా!, **త్వమపి**—**నీవుగూడ, విభోః**=వాసుదేవునియొక్క, **విశ్రుతం**=యశస్సును, **ప్రఖ్యాహి**=**ప్రసిద్ధి సలుపుము, యేన**—దేనిచేత, **విదాం**—విద్వాంసులయొక్క, **బుభుత్సితం**—**జ్ఞానేచ్ఛ, సమాప్యతే**—పరిపూర్ణత్వమునందునో, **యత్**—దేనినుండి, **దుఃఖైః**=**దుఃఖములచేత, ముహుః**—మాటిమాటికిని, **అర్దితాత్మనాం**=పీడింపఁబడిన మనస్సు **గలవారియొక్క, క్లేశనిర్వాణం**—దుఃఖశాంతి యేర్పడునని, **శశంతి**—పెద్దలందురు **న అన్యథా**=ఇతర పద్ధతులతో నేర్పడదు.

విస్తృతమైన శాస్త్రజ్ఞానము గలిగిన మహాముని! సర్వతో వ్యాపకుఁడైన భగవంతునియొక్క పరిశుద్ధమైనకీర్తి సర్వులకుఁదెలియు నట్లుగాఁ గీర్తింపవలెను. దానితో విద్వాంసులయొక్క జ్ఞానేచ్ఛపర్యాప్తి నందును. దీనిపైఁ దెలియవలసిన దేదియు లేదని వారు పరమతృప్తి నందెదరు. ఇఁక సామాన్యులు— వారి మనస్సుల నెప్పుడును తాపత్రయములు పీడించుచుండును. వారికి నీ రచనతో మనశ్శాంతి యేర్పడును. వారు గొప్పగా సంతోషింతురు. ఈ మార్గముతోఁ దప్ప వేఱు పద్ధతితో జగత్కల్యాణ మేర్పడదు. 40

**శ్రీధరీయము:**

యదా=ఎప్పుడు, భగవచ్ఛిక్షయా=భగవంతుని యుపదేశము ననుసరించి, కర్మాణి కుర్వాణా భవంతి=కార్యములుచేయు వారుగా నగుచున్నారో, తదా=అప్పుడు, కృష్ణస్యగుణ నామాని గృణంతి= అనుస్మరంతిచ కృష్ణః=కృష్ణుని స్మరించు వారినిగా నితరులను రూపొందించుచున్నారు. భగవదాదేశ మేది? గీతలోని 'యత్కరోషి యదశ్నాసి' అను శ్లోకము— 'అర్జునా! దేని నాచరించుచున్నావో అనుభవించుచున్నావో, హోమ మొనర్తువో, దాన మొసఁగెదవో, ఏ తపస్సు తపింతువో, దాని నంతయు నా కర్పింపుము' అని ఆ శ్లోకమున కర్థము.

అవ: కీర్తన స్మరణములు భక్తిహేతువులని ముందుఁజెప్పినాఁడు. జ్ఞానమునకుఁగూడ హేతువులని పైరెండు శ్లోకములతోఁ బ్రతిపాదింపఁ బోవుచున్నాఁడు—

నమో ధీమహి=మనస్సుతో నమస్కరించుచున్నాము.

ఈ మంత్రముచేత, అమూర్తికం=మంత్రోక్తమైన మూర్తికంటెను భిన్నమూర్తి లేని వానినిగూర్చి, యజతే=పూజించుచున్నారో, సపుమాన్=ఆ పురుషుఁడు, సమ్యగ్దర్శనః=విశుద్ధమైన జ్ఞానము గలవాఁడు.

అవ: ఈ రీతిగా నే ననుష్ఠింపఁగా వాసుదేవుఁడు తనతో సవ నమైన జ్ఞానాదికము నొసఁగెనని చెప్పుచున్నాఁడు-

ఇమం స్వనిగమం=ఈ విధమైన తన యుపదేశమును, మదః ష్ఠితం-మయా=నాచేత, అనుష్ఠితం=అనుష్ఠింపఁ బడిన దానిని, అవేక =తెలిసికొని, భావం = తనయందు ప్రీతిని, అదాత్ = ఇచ్చినవా డయ్యెను.

అవ: నీవుగూడ నట్లే యొనర్పవలెనని చెప్పుచున్నాఁడు-

అదభ్ర=అనల్పమైన, శ్రుత!=శాస్త్రజన్య జ్ఞానముగలవాఁడా విభోః=సర్వజగత్స్వామియైన హృషీకేశుని యొక్క, విశ్రుతిం=ఖ్యాతమైన కీర్తిని, ప్రఖ్యాహి=ప్రకటింపుము, యేన విశ్రుతేన= కీర్తిచేత, విదాం = విద్వాంసులయొక్క, బుభుక్షితం = బోధించున యిచ్ఛ, సమాప్యతే=చక్కఁగాఁ బొందఁబడిన దగుచున్నదో, యత్: దేనినుండి, దుఃఖైః = దుఃఖములచేత, ముహు రర్దితాత్మనాం=పీడి లకు, సంక్లేశనిర్వాణం=దుఃఖశాంతి, ఉశంతి=చెప్పెదరు, న అన్యథ వేఱు కాదు.

**వంశీధరుఁడు:**

అవ: కర్మతో జ్ఞాన మేర్పడుచున్నది. దానిద్వారా బం నివృత్తి. ఎట్టి జ్ఞానము? భక్తియోగ సమన్వితమైన జ్ఞానము. భక్తి రహిత జ్ఞానమునకు మోక్షసాధకత్వశక్తి లేదు. ఈ విషయమ 'నైష్కర్మ్య మప్యచ్యుత భావవర్జితం' అను శ్లోకములో భాగవతమం ప్రతిపాదిత మైనది. ఇక్కడ భక్తియోగ మనఁగా శ్రవణ కీర్తనా రూపము. భక్తిమిశ్రితమగు కర్మచేత, జ్ఞాన మేర్పడి అది మోక్షసాధ మగుచున్నది. ఇప్పుడు భక్తిమిశ్రితమైన నిష్కామకర్మ గలవాని తాదృశసంగ భాగ్యముతో కర్మమిశ్రమైన భక్తి యేర్పడుచున్నద చెప్పుచున్నాఁడు-

యత్ర–భక్తిచేఁ గూడికొన్న కర్మము ననుష్ఠించువారు అతస్తొత్తుగాఁ గలిగిన భక్తిసంగ భాగ్యముతో, భగవత్ప్రేక్షయా – భగవంతుని యుపదేశానుసారము, కర్మాణి కుర్వాణాస్సంతః – కర్మల నొనర్చుచున్నవారై, కృష్ణస్య గుణాని నామాని గృణంతి స్మరంతి చ – కీర్తన స్మరణాదికమైన భక్తి నొనర్చుచున్నారని తాత్పర్యము. గీతయందు 'యత్కరోషి యదశ్నాసి' అను శ్లోకము భక్తిప్రకరణమందు పఠితమైనది. దానిని కర్మవిషయకముగా నన్వయించు టంత నముచితము గాదు. కర్మనిష్ఠులు కర్మవైఫల్య పరిహారమునకై తా మొనర్చు వైదిక కర్మనే భగవంతునం దర్పింతురు. భక్తు లట్లు గాదు. వారు తమ కేకైకస్వామి భగవంతుఁడే యని నమ్మెదరు. నమ్మి తమ వైదిక లౌకిక దైహికములైన నమస్త కర్మలును భగవంతుఁడే చేయించుచున్నాఁడని విశ్వసింతురు. ఆ బుద్ధితో సర్వమును వానికే యర్పింతురు. ఈ యభిప్రాయముతోనే గీతలో 'యదశ్నాసి' అన్నారు. అనఁగా భుజింతువో అని యర్థము గాదు. దేని దేని ననుభవింతువో యని వ్యాఖ్యానము.

భగవద్రామానుజులు గూడ నీ యభిప్రాయమునే వెలువరించిరి. 'యత్కరోషి యదశ్నాసి' అను శ్లోకమునకు వారి వ్యాఖ్యాన మీ క్రిందిది–

'యత్ దేహయాత్రాది శేషభూతం లౌకికం కర్మకరోషియచ్చ దేహధారణయా అశ్నాసి, యచ్చ వైదికం హోమదాన తపః ప్రభృతి నిత్యనైమిత్తికం కర్మ కరోషి తత్సర్వం మదర్పణం కురుష్వ, అర్ప్యతే ఇత్యర్పణం సర్వస్య వైదికస్య లౌకికస్యచ, కర్మణః కర్తృత్వం భోక్తృత్వం ఆరాధ్యత్వంచ, యథామయి సర్వం సమర్పితం భవతి, తథా కురు ఏ తదుక్తం భవతి యాగ దానాదిషు, ఆరాధ్యతయా ప్రతీయమానానాం దేవాదీనాం కర్మకర్తుః భోక్తుః తవచ, మదీయతయా మత్సంకల్పాయత్త స్వరూపస్థితి ప్రవృత్తితయాచ, మయ్యేవ పరమశేషిణి పరమకర్తరి, త్వాంచ కర్తారం భోక్తారం ఆరాధకం ఆరా

ధ్యంచ, దేవతాజాతం ఆరాధనం చ క్రియాజాతం సర్వం సమర్పయ త్వ, మన్నియామ్యతాపూర్వక మచ్ఛేషత్త్వైకరసతాం ఆరాధ్యాదేశ్చ, ఏతత్స్వభావక గర్భతాం అత్యర్థప్రీతియుక్తః అనుసంధత్స్వ'.

శరీరయాత్రా నిర్వాహమునకు నావశ్యకమైన లౌకికకర్మ లొన ర్తువు. శరీరధారణమునకై భుజింతువు. హోమ దాన తప అదికము లగు వైదిక నిత్య నైమిత్తిక కర్మ లొనర్తువు. వీని నన్నిటిని నా కర్పిం పుము. ఏది యర్పింపఁ బడుచున్నదో దానికే యర్పణ మనిపేరు. కనుక లౌకిక వైదిక కర్మములయొక్క కర్తృత్వము, భోక్తృత్వము, ఆరాధనత్వము సమస్తము నా కే రీతి నర్పింపఁబడుచున్నదో అట్లుగా వాని నొనర్పుము. దీని యభిప్రాయము యజ్ఞ దానాదులందు ఆరాధ్యదైవతములుగా ప్రతీయమానము లయ్యెడు దేవతలు కర్మ యొక్క కర్తయు భోక్తయు నైన నీవు వీరందఱును మదీయులే. వీ రందరి స్వరూపస్థితి, ప్రవృత్తి నా సంకల్పముపైననే యాధారపడి యున్నది. అందుచే నీ కర్తృత్వ భోక్తృత్వాదులను, ఆరాధకత్వ మును ఆరాధ్యులైన నమస్త దేవతాదులను, ఆరాధనారూప క్రియలును వీని నన్నిటిని నాయం దర్పింపుము. ఎందుకనఁగా నేనే పరమశేషిని, పరమకర్తను. నాయం దత్యంతప్రీతియుక్తుఁడవై 'భగవంతుఁ డెవ్వ రికి నియామకుఁడో, శేషియైనవాఁడో అట్టి వాఁడను నేనే, నేను సర్వదా అతని కధీనుఁడను. నాచే నర్చింపఁ బడుచున్న దేవతలు గూడ నీ స్వభావముతోఁ గూడినవారే' అనెడు నీ భావము నెప్పుడు ననుభ వించుచుందుము.

'యత్కరోషి' యను శ్లోకమునందు వర్తమాన నిర్దేశమున్నది. దానివలన 'భక్తిం కుర్వంతి' అనియెడు అఖ్యాతక్రియకు ముఖ్యత్వ మేర్పడుచున్నది. కర్మయోగ సహితమైన భక్తియని యర్థసిద్ధి. కర్మ మిశ్రభక్తి యని యర్థము. కర్మమిశ్రితమైన భక్తిచేత తన్మిశ్రమగు జ్ఞానము సాధింపఁబడుచున్నది. దానితో ముక్తిసహితమగు భగవ

ప్రదతి. అట్టి రతికి 'శాంతభక్తి' యని పేరు. 'ఆత్మారామాశ్చ మున యః' అనుచోట ప్రతిపాదింపఁ బోవుచున్నాఁడు—

భక్తిరహితములైన జ్ఞానకర్మాదులను 'నైష్కర్మ్య మప్యచ్యుత భావవర్జితం' ఇత్యాదులతో నిరాకరించుట జరగినది. 'త్యక్త్వాస్వ ధర్మం' మొదలుకొని మూఁడుశ్లోకములతో పరమఉపాదేయమైన శుద్ధ నిర్గుణభక్తినిఁ బ్రశంసించుటయుఁ గడచినది. 'అహం పురాతీతభవే' ఇత్యాదిగా నాలుశ్లోకములతో భక్తియొక్క యావిర్భావప్రకారము, దాని ప్రేమపర్యంతమైన వృద్ధి చూపింపఁబడినది. మఱల నధికారి విశేషమందు ఉపాదేయమైన భక్తిమిశ్రజ్ఞానమును దానికంటె నధిక మైన కర్మమిశ్రభక్తిని నిరూపించినాఁడు. ఇప్పుడు 'బ్రూయు స్స్నిగ్ధస్య శిష్యస్య గురవో గుహ్య మప్యుత' అని చెప్పిన ప్రకారము గురువుల నుండి సంక్రమించిన స్వతంత్రభక్తిని వివరింపఁబోవుచు దానియందలి శ్రద్ధను రెండుశ్లోకములతో నుత్పాదింపఁ బోవుచున్నాఁడు.

ఇది ఓంకారాద్యము అగుటచే ముప్పదిమూఁడక్షరములు గల మంత్రము. చతుర్వ్యూహాత్మకుఁడైన భగవంతుఁడు దీనికి దేవత. ఈ చెప్పుటలో సంకర్షణాదిక్రమ విపర్యయ మేర్పడినది. ఇట్లుచెప్పుట కృష్ణచతుర్వ్యూహత్వ బోధనార్థము. ప్రద్యుమ్నానిరుద్ధులు తత్పుత్ర పౌత్రులు. అందుచే వారిని ముందుఁ జెప్పుట లేక ప్రద్యుమ్న అనిరుద్ధ సంకర్షణ రూపములు క్రమముగా సృష్టిస్థితిసంహార కారణములు. అందుచే నట్లుచెప్పుట యైనది. వాసుదేవాయ—సర్వత్ర వసతి దీవ్యతిచ ఇతివాసుదేవః. సమస్తమునందు నుండి సమస్తమును ప్రకాశింపఁ జేయువాఁడు. ప్రకృష్టం ద్యుమ్నం విత్తం హిరణ్యం యస్యసః అనఁగా ప్రకృష్ట విత్తరూపమైన హిరణ్య స్వరూపుడు—బంగారుఛాయ గల వాఁడన్నమాట. 'హిరణ్యశ్మశ్రు ర్హిరణ్యకేశ ఆప్రణఖాత్సర్వ ఏవ సువర్ణః' అనిశ్రుతి. లేక ప్రకృష్టం ద్యుమ్నం బలం యస్యసః— ప్రకృష్ట మైన బలముగలవాఁడు. 'కామో హి బలవత్తమః' అని అభియుక్తోక్తి.

ద్యుమ్నం విత్తేబలే పిచ అని మేదినీ నిఘంటువు. న కేనాఽపి స్వేచ్ఛాం వినాఽనిరుద్ధో అనిరుద్ధః'-తన యిచ్ఛలేనిది యెవ్వనిచేతను బంధింప శక్యుఁడు గాఁడు. లేక 'అనో ముఖ్యప్రాణః సోఽస్తి జితత్వేన అస్య ఇత్యనీ; తేన ముఖ్యప్రాణ జయవతా రుద్ధో వశీకృతః'- ముఖ్యప్రాణ దేవుఁడైన వాయువు నుపాసించుచున్న వానికి వశుఁ డయ్యెడువాఁడు లేక న నిరుధ్యంతే విషయై ర్యాప్రియంతే ఇత్యనిరుద్ధః వివేకినః తాన్ దధాతీ త్యనిరుద్ధః-విషయములను జయించిన వివేకుల వెంటనుండెడు వాఁడు. పాపకర్షణ శీలత్వా త్సంకర్షణః- పాపములను హరించు వాఁడు. లేక 'సమ్యక్కరం హస్తం దదాతి నిజప్రియ గోపేభ్య ఇతి వా సంకర్షణః'- హేలగాఁ దనకుఁ బ్రియులైన గోపకులకుఁ జేయి యందించువాఁడు, కర శబ్దమునందలి అకారలోపము వృషోదరాదు లతో నేర్పడినది. పంచరాత్రవక్తయైన శ్రీనారాయణమూర్తిచేత నీ మంత్రము నారదునకు సిద్ధించినది.

మూర్త్యభిధానేన=వాసుదేవాది మూర్తులను స్మరించి యీ నామచతుష్టయముతో యజతే=పంచరాత్రోక్త ప్రకారమున యజించు వాఁడు. వాసుదేవాయ నమః ప్రద్యుమ్నాయ నమః ఇత్యాదులుగా షోడశోపచారములతోఁ బూజింపవలెనని తాత్పర్యము. ఇట్లు యజిం చుటవలన సాధకుని మనస్సునం దొక మూర్తి యేర్పడుచున్నది. ఆ స్వరూపమే యీ దైవము. లేక 'యజ్ఞో వై విష్ణుః' అని చెప్పుటచేత చత్వారి శృంగాః త్రయో అస్యపాదాః' అని చెప్పినట్లుగా యజ్ఞ స్వరూపుఁడైన వానిని యజించునో స సమ్యగ్దర్శనః.

స్వనిగమం = నిజాంతరంగ వేదోక్తమైన జ్ఞానమును; మొట్ట మొదట స్వానుభవమును తరువాత అణిమాదిరూపైశ్వర్యములును బ్రాప్తించినవి. నారదుని యనాసక్తభావమును గమనించి భగవంతుఁ డాతని కణిమాదుల నన్రగహించినాఁడు. నారదుఁడు వ్యాసముని

కీ మంత్రము నుపదేశించెనని సందర్భమును బట్టి మన మూహింపవలెను.

**విజయధ్వజము :**

కర్మనుండి జ్ఞానోత్పత్తి యెట్లు? ఆ విషయమునే వివరించుచున్నాఁడు—

యత్ర=ఏ యజమానుని కొఱకై యే యజ్ఞమందు, కర్మాణి=హవనము మొదలైన కర్మములను, కుర్వాణాః=చేయుచున్న వేదజ్ఞులైన ఋత్విక్కు మొదలగు పురోహితులు, భగవచ్ఛిక్షయా=‘ స్మర్తవ్య స్సతతం విష్ణు ర్విస్మర్తవ్యో న జాతు చిత్ ’ నిరంతరమును విష్ణువును స్మరించుచుండవలెను. ఎప్పుడుగూడ నాతని మఱవరాదు. ఈ రీతి భగవంతుఁడు తన యాజ్ఞారూపములైన శాస్త్రములందుఁ జెప్పుటచేత, అసకృత్ = 1. నిరంతరమును, 2. కర్మయొక్క మొదలు, మధ్య, అంతములందు, కృష్ణస్య=సర్వోత్తముఁడైన శ్రీహరియొక్క, గుణాన్=కరుణ మొదలైన పూర్ణగుణములు, అనుస్మరంతి=మరల మరల స్మరించుచున్నారు, చ=ఇంకను, నామాని=తద్వాచకములైన శబ్దములను, గృణంతి=ఉచ్చరింతురు. ఇట్లు పురోహితులు హరిస్మరణ సేయుటతో యజమానునకుఁగూడ వాసుదేవునియొక్క సంస్మరణ మభ్యాసమగునని తాత్పర్యము.

పురోహితులు జ్ఞానులై యుండవలెను. అట్టివారు దీక్షితుఁడైన యజమానునికొఱకై యజ్ఞయాగాది కర్మములందు హవనము మొదలగు కార్యము లొనర్తురు గదా! అప్పుడు వారు జ్ఞానులగుటచేత శ్రీహరిని సదా స్మరింతురు. పుండరీకాక్షుని దివ్యసంస్మరణము సర్వకాలములందును నొనర్పఁదగునది యని శాస్త్రములు విధించుచున్నవి. శాస్త్రము లనఁగా భగవంతుని యాజ్ఞారూపములే. ఇట్లు శాస్త్రములాజ్ఞాపించుటతో జ్ఞానులైనవారు కర్మలయొక్క యాదిమధ్యాంతము

లందు శ్రీహరిని భక్తితో స్మరింతురు. వాని కల్యాణగుణములన
మనన మొనర్తురు. ఆ గుణములను దెలుపునట్టి నామములఁ గూ
నుచ్చరింతురు. వా రట్లొనర్చుటతో నా పురోహితులవలెనే యజమ
నుఁడుగూడ నిరంతరము హరిస్మరణయొనర్చుట కభ్యాసమొనర్చున

యః=ఏ యజమానుఁడు తానుగూడ నిరంతరమును, ఓం
1. సర్వగుణ పరిపూర్ణుఁడవైన వాఁడా!, 2. సర్వజనులను రంజిం
జేయువాఁడా!, 3. ఓంకారరూపమైన ప్రణవమంత్ర ప్రతిపాద్యుఁడ
ఓంకారనామకుఁడవైన వాఁడా! భగవతే=సమగ్రైశ్వర్యము మొదలై
గుణములచేత పూర్ణుఁడవై, పూజ్యుఁడవైన, తుభ్యం=నీ కొఱక
నమః=నమస్కారము, వాసుదేవాయ=సర్వత్రవసించెడు స్వభావమ
గలవాఁడును, లేక సర్వత్ర ప్రకాశమానుఁడగు వాఁడును (శ్రీహ
బలజ్ఞానరూపి; దైత్యులను నిరసించెడు స్వభావము గలవాఁడ
క్రీడాస్వభావ మున్నవాఁడు. అందుచే సర్వత్ర ప్రకాశించుటఁ
యాతని ధర్మము) నిన్ను, ధీమహి=స్మరింతుము, ప్రద్యుమ్నాయ
అతిశయమైన హిరణ్యమే రూపము గాఁగల, 'హిరణ్య శ్మశ్రుః హిర
కేశః ఆప్రణఖాత్సర్వ ఏవ సువర్ణః' అనెడు శ్రుతి యుండుటచే వా
దేవుని హిరణ్యరూపుఁడని పిలుచుచుందురు. అట్టి యత్యంత ప్రక
మాన రూపుఁడవైన నీకు నమస్కారము. అనిరుద్ధాయ= 1. ఎ
చేతను, ఏ కాలమందును, ఏ దేశమందును, ఏ విషయమందు
అడ్డగించుటకు సాధ్యము గానట్టివాఁడు, 2. అన=అనఁగా ము
ప్రాణదేవుఁడు, అతనిని భక్తిపూర్వకముగా స్వాధీనపఱచి కొ
వాఁడు అని, అట్టి ముఖ్యప్రాణదేవుని భక్తునిచేత స్వాధీన పఁ
కొనఁబడువాఁడు, 3. సంసారమునుండి ముక్తినందినవారికి అనిరు
లనిపేరు. వారిని ధారణ మొనర్చువాఁడు అనఁగా పోషించువాఁ
4. ఉత్=అని శ్రీమన్నారాయణునకు పేరు. ఎందు కనఁగా ఆ
డన్నిరీతులను సర్వోత్కృష్టుఁడు. నిరస్తముకాని ఉత్ అనెడు పేరు

గూడినవాఁడు, అనఁగా ఏ సమయమందును వీడిపోని సర్వోత్కృష్టుఁడను పేరుతోఁ గూడినవాఁడు. అట్టి నీకు, నమః=నమస్కారము, చ=ఇంకను, సంకర్షణాయ=1. పాపములను సంపూర్ణముగా నాశ మొనర్చెడు స్వభావముగల, 2 ఉత్తమమైన హస్తాలంబము నొనఁగి రక్షించెడు స్వభావముగల నీకొఱకు నమస్కారము, ఇతి=ఈ మొదలైన మంత్రములచేత, మూర్త్యభిధానేన=గుణాత్మకమైన స్వరూపమును జెప్పెడు మంత్రములచేత, అమూర్తికం=ప్రాకృతరూపరహితుఁడైన, మంత్రమూర్తిం=మంత్రప్రతిపాద్యమైన యాకారముగల యజ్ఞపురుష స్వరూపుఁడైన శ్రీహరిని, చత్వారి శృంగాః= 1. మొదలైన వేద ఋక్కులయందు ప్రతిపాదింపఁబడిన యాకారము గలవాఁడు వాసుదేవుఁడు. వాఁడు యగ్నియందున్నవాఁడై యజ్ఞపురుషుఁ డనఁ బడును. అతఁడు హృషికేశాది రూపములకంటె భిన్నుఁడు కాఁడు. అట్టి శ్రీహరి నుద్దేశించి, యజతే=యాగాదికర్మముల నొనర్చునో, సః పుమాన్=ఆ భగవద్భక్తుఁడైన యజమానుఁడు, సమ్యగ్దర్శనః=శ్రీహరి యొక్క పరోక్షాపరోక్ష జ్ఞానములు గలవాఁడుగా, భవతి=అగును. ఇట్లు వైకుంఠు నుద్దేశించి యజ్ఞమొనర్చు పురోహితులు సమీచీనమైన శాస్త్రజ్ఞానము గలవారు. యోగ్యతానుగుణముగా సర్వజ్ఞులు. అధికారిచేతనులకు శ్రీహరికి సంబంధించిన జ్ఞానమును గల్పించువారు నగుదురు. ఈ శ్లోకమందు చ అని నిర్దేశించుటతో నాల్గు నామములును నాల్గు ప్రత్యేక మంత్రములని సూచించి యున్నాఁడు. ఇట్లు వైష్ణవులైన పురోహితులతో శ్రీహరి నుద్దేశించి యజ్ఞ యాగాది కర్మల నొనర్పఁజేయు యజమానుఁడు జ్ఞాని యగుచున్నాఁడు.

తాత్పర్యము: ఓ స్వామీ! నీవు సకల గుణ పరిపూర్ణుఁడవు. సమస్త జీవరాసులను సంతోషపఱచువాఁడవు. ఓంకారమంత్ర ప్రతిపాద్యుఁడవై ఓంకార మని పిలువఁబడెడు వాఁడవు. సంపూర్ణమైన యైశ్వర్యము మొదలైన గుణములతో విరాజితుఁడవు నీవు. పరమ

పూజ్యుఁడవు. జగత్తున నీవు వసించని చోటులేదు. అందుచే వా
దేవుఁడ వనిపించుకొంటివి. సర్వకాలములందును ప్రకాశించుచుం
వాఁడవు నీవు, అందుచేతనే దేవుఁడవు బలజ్ఞానాదులు నీ స్వరు
ములు. దైత్యశిక్ష నీ స్వభావము. జగత్సృష్ట్యాదులు నీకు క్రీ
మాత్రములే గాని యాయాసకరములు గావు. అందుచే, నిత్యక్రీ
మయుఁడవు. నీ రూపము హిరణ్మయము. శ్రుతి నిన్ను హిర
శ్మశ్రువనుచున్నది. హిరణ్యకేశుఁడన్నది. నఖశిఖాంతము హిరణ్మ
ముడవని వాకొన్నది. మహాప్రకాశమానుఁడవైన నీకు 'ప్రద్యుమ్నుఁ
అని పేరు, ని న్నెవ్వరును నిరోధింపలేరు. సర్వకాల సర్వదేశ 
విషయములందును నీవనిరుద్ధుఁడవు. అన యనిపిలువఁబడు ము
ప్రాణదేవు నుపాసించువారు నీ దయకు పాత్రులౌదురు. సంసార
నుండి విముక్తివడసిన వారిని రక్షించు దైవము నీవే. నీవు స
త్కృష్టుఁడవు. అందుకే, 'ఉత్' అని నీకు సార్థకనామము, ఈ
నీ నుండి యెప్పుడును నిరస్తముగాదు. భక్తపాప సంహారమూర్తి
భక్తులకు కరాలంబమిచ్చి రక్షింతువు. వాసుదేవ ప్రద్యుమ్న సం
ణానిరుద్ధ స్వరూపములుగల నీకు నమస్కారము' యజ్ఞదీక్షితుఁ
యజమానుఁడు భగవత్స్మరణ పూర్వకముగా వైదికకర్మ లొ
వలెను. అప్పుడే శ్రీహరి వానికిఁ దన పరోక్షజ్ఞాన మిచ్చును. 
నపరోక్షజ్ఞానమును దయచేయును. యజమానునితో హరినామస్మ
పూర్వకముగాఁ గర్మల నొనర్పఁజేయు పురోహితులకును, వరమాత
యనుగ్రహము లభించును. వారి వారి యోగ్యతకుఁ దగిన
సర్వజ్ఞత్వ మేర్పడును. ముముక్షువులకు వాసుదేవుని జ్ఞానము
దేశించు సామర్థ్యముగూడ గల్గును. కనుక, విష్ణుభక్తుఁడైన 
మానుఁడు హృషీకేశ భక్తులైన పురోహితుల సహకారముతో వి
నుద్దేశించి చేసిన కర్మమే సత్కర్మము. ఇదే మోక్షకారణమైన జ్ఞాన
నకు జనక మగును.

ఇది నా అనుభవసిద్ధమని నారదుఁడు వచించుచున్నాఁడు. కేశవః=బ్రహ్మరుద్రాదులకు నియామకుఁడైన శ్రీహరి, మదనుష్ఠితం= నాచే ననుష్ఠింపఁబడిన, ఇమం=ఈ, స్వధర్మనియమం=1. నా వర్ణమునకుఁ దగిన ధర్మమునే, యాచరించుచుండుటను, 2. శ్రీహరియొక్క కథాశ్రవణాది ధర్మములందుఁ గల ఆసక్తిని, అవేత్య=తెలిసికొని, ఐశ్వర్యం=నియామకులయందు సర్వశ్రేష్ఠుఁడైన వాఁడును, స్వతంత్ర నియామకుఁడైనవాఁడే శ్రీహరి యనెడు, జ్ఞానం = జ్ఞానమును, స్వస్మిన్=స్వతంత్రుడైన తనయందలి, భావం చ=అపరోక్షజ్ఞానకారణమైన యుత్తమభక్తిని, మే=నాకు, అదాత్=ఇచ్చెను.

తాత్పర్యము: నివృత్తి కర్మజ్ఞానజనక మగుటకు నేనే సాక్షి. జగన్నియామకులైన బ్రహ్మరుద్రాదులకుఁగూడ వాసుదేవుఁడే నియామకుఁడు. అతని ప్రీత్యర్థముగ నేను నా వర్ణమునకుఁ దగిన ధర్మము నాచరించుచు వచ్చితిని. తత్కథాశ్రవణాది ధర్మములందే యాసక్తుఁడనైతిని. ఇట్లు నిర్వ్యాజముగ ననుష్ఠింపఁబడుచున్న నా ధర్మానుష్ఠానమును శ్రీహరి స్వీకరించి నాకుఁ దనయందలి జ్ఞానము నొసఁగెను. అప్పుడు నాకు 'నియామకులలో సర్వశ్రేష్ఠుఁడైనవాఁడు శ్రీహరియే, అతఁడే స్వతంత్ర నియామకుఁడు' అను జ్ఞాన మేర్పడినది. అట్టి జ్ఞానముతో వానియందు నిశ్చలభక్తి ఏర్పడెను. ఈ భక్తి వాని యపరోక్ష జ్ఞానమునకుఁ గారణమైనది. 'స్వధర్మ నియమం' అని వీరి పాఠము.

అద్భుత!=‘శ్రోతా మంతా’ యనెడు శ్రుతుల కనుగుణమైన సంపూర్ణశ్రోతృత్వాది గుణములతోఁ గూడిన వాసుదేవావతారుఁడవైన వాఁడా!, త్వం=ఈశ్వరుఁడ వగుటచే నైశ్వర్యాది గుణపూర్ణుఁడవు. నీకుఁ గ్రొత్తగాఁ బొందఁదగిన గుణ మేదియు లేదు. అపి=ఐనను, నీవు సజ్జనులయందలి యనుగ్రహ బుద్ధిచేత, యేన=ఏ విష్ణుమాహాత్మ్య ప్రతిపాదకమైన శ్రీమద్భాగవత గ్రంథమును రచించుటతో, విదాం=1. జ్ఞానమును సంపాదించికొనవలె ననెడు నిచ్ఛ

గల, 2. విచారము నొనర్చెడివారియొక్క, బుభుత్సితం=తెలిసికొ
నపేక్షించెడు నిచ్ఛ, సమాప్యతే=సంపూర్ణముగా నగుచున్నదో ఆ
విభోః=సర్వసమర్థుఁడైన హరియొక్క, విశ్రుతిం=మాహాత్మ్యరూపమ
కీర్తిని, ప్రఖ్యాహి=ప్రసిద్ధపఱుపుము. భాగవతమును రచించుటకు
యర్హుఁడవు. ఈ కార్యముతో నీ మనస్సునకుఁ దృప్తి యేర్పడి తీరు
ఈ గ్రంథ రచనచేత, దుఃఖైః=త్రివిధ తాపములతో, ముహుః=మ
మారు, అర్దితాత్మనాం=దుఃఖము గొన్న మనస్సుగల సత్పురుష
యొక్క, సంక్లేశనిర్వాణం, ఉశంతి=అగునని జ్ఞానులు చెప్పుదు
అన్యథా న.

తాత్పర్యము: వ్యాసమునీ! శ్రుతియందుఁ జెప్పిన పరిప
శ్రోతవు నీవే. మహామననశాలివి, సర్వనియామకుఁడవైన నీ కే కొ
తయు లేదు. సాధించికొనఁదగిన ప్రయోజనమును లేదు. కాని
యవతారము కేవల సజ్జనానుగ్రహము కొఱకు. సత్పురుష స
చీన జ్ఞానోపదేశమే నీ యవతార ప్రయోజనము. ఏ గ్రంథరచ
నధికారిచేతనులకు జ్ఞానమును సంపాదించుకొనవలెనను నిచ్ఛ
పూర్ణ మగునో అట్టి గ్రంథము నొనర్పుము. వివేకవంతులయొ
విచారమున కది పరాకాష్ఠ గావలెను. ఈ పనికి నీవే సమర్థుఁడ
ఆ గ్రంథము త్రివిధతాపార్దితులైన ముక్తియోగ్యజీవుల దుఃఖ
హారకమై మోక్షకారణ మగును. ఇతర గ్రంథ మేది యొనర్చినను
ప్రయోజనము సిద్ధింపదు. నీ మనస్సునకుఁ దృప్తి యేర్పడదు.
యవతార ప్రయోజనమే మహాభాగవత రచన. ఇదే నా విజ్ఞాప

**పోతన్నగారు:**

**అపచారంబులు లేక నిత్యపరిచర్యా భక్తియుక్తుండనై**
**చపలత్వంబును మాని నేఁ గొలువఁగా సంప్రీతులై వారు వి**
**ష్కపటత్వంబున దీనవత్సలతతోఁ గారుణ్యసంయుక్తులై**
**యుపదేశించిరి నాకు నీశ్వర రహస్యోదార విజ్ఞానమున్.**

వచ: ఏనును వారి యుపదేశంబున వాసుదేవుని మాయాను భావంబు దెలిసితి. ఈశ్వరునియందు సమర్పితంబయిన కర్మంబు తాపత్రయంబు మాన్ప నౌషధంబగు. ఏ ద్రవ్యంబువలన నే రోగంబు జనియించె నా ద్రవ్య మా రోగంబు మానుపనేరదు. ద్రవ్యాంతరం బులచేత నైన చికిత్సితంబు మానుపనోపు. ఇవ్విధంబునఁ గర్మంబులు సంసార హేతుకంబులయ్యు నీశ్వరార్పితంబులై తాము తమ్ముఁ జెఱుపు కొన నోపియుండు. ఈశ్వరునియందుఁ జేయఁబడు కర్మంబు విజ్ఞాన హేతుకంబై ఈశ్వరసంతోషణంబును భక్తియోగంబునుం బుట్టించు. ఈశ్వరశిక్షం జేసి కర్మంబులు సేయు వారలు కృష్ణ గుణ నామవర్ణన స్మరణంబులు సేయుదురు. ప్రణవ పూర్వకంబులుగా వాసుదేవ ప్రద్యుమ్న సంకర్షణానిరుద్ధమూర్తి నామంబులు నాలుగు భక్తిం బలికి నమస్కారంబులుసేసి మంత్రమూర్తియు మూర్తిశూన్యుండును నయిన యజ్ఞపురుషుం బూజించు పురుషుండు సమ్యగ్దర్శనుండగు.

**ఏ నివ్విధమునఁ జేయఁగ**
**దానవకులవైరి నాకుఁ దయయందలి వి**
**జ్ఞానము నిచ్చెను మదను**
**ష్ఠానము నతఁ డెఱుఁగు నీవు సలుపుము దీనిన్.**

**మునికులములోన మిక్కిలి**
**వినుకులుగల వాఁడ వీవు విభుకీర్తులు నీ**
**వనుదినము వొగడ వినియెడి**
**జనములకును దుఃఖమెల్ల శాంతిం బొందున్.**

అర్థము: అపచారంబులు లేక=దోషములులేకుండ. సాధారణముగా దోషములు మూఁడు రీతులు. 1. అకృత్యకరణము– దేనిని చేయుట పనికిరాదో యట్టి దానినిఁ జేయుట. నారదునితోఁ బరిచర్యలు దీసికొనుచున్న పరమహంసలు, వా రనుష్ఠించుచున్నది

చాతుర్మాస్యవ్రతము. ఆ వ్రతములో నాహారవిహార నియమములు చాలఁ గలవు. తదనుగుణముగ వారొనర్చు నాజ్ఞలను సక్రమముగఁ బాటించుచు, వారి నియమమునకు భంగము రాకుండునట్లు వర్తింప వలెను. అట్లు చేయక నియమభంగ మొనర్చెడి పనులు సేయుట అకృత్యకరణము. 2. కృత్యాకరణము–ఏది చేయఁదగునో అది చేయకుండుట, 3. అన్యథాకరణము–ఇచ్చిన యాజ్ఞకు భిన్నమైనకార్యము నొనర్చుట. ఇట్టి దోషములను వర్జించి అని తాత్పర్యము. నిత్య .... యుక్తుండనై = నిరంతరమును వారిని బరిచరించుటయందే భక్తిగల వాఁడనై, చపలత్వంబులు మాని = బాల్యమునకు స్వభావమైన చంచలత్వము మొదలగు గుణములుమాని, నేన కొలువఁగాన్ = నేను వారిని సేవింపఁగా, వారు సంప్రీతులై = వారు నా సేవచే ప్రీతిగొన్న మనస్సు గలవారై, నిష్కపటత్వంబునన్ = వీని నభివృద్ధికిఁ దేవలె ననెడు భావముతో నే మాత్రమును వంచనలేనివారై, దీనవత్సలతతోన్ = దీనుఁడైన నా యందు వాత్సల్యభావము వహించి, పెద్దవారికిఁ జిన్నవారియందుండు సార్ద్రభావమునకు వాత్సల్య మనిపేరు. కారుణ్యసంయుక్తులై = దయచేఁ గూడినవారై, నాకున్ = నాకు, ఈశ్వరరహస్యోదార విజ్ఞానమున్ = పరమాత్మకు సంబంధించిన అతిరహస్యమై గొప్పదైనజ్ఞానము, ఉపదేశించిరి = బోధించిరి. 'కారుణ్యం కరుణాఘృణా' అని యమరము.

తాత్పర్యము: నా దృష్టియంతయు వారి నిరంతర పరిచర్య యందే యుండెడిది. వానిలో నే లోపమును రారాదు. వారి విషయమునఁ దీవ్రమైన యనురక్తి నాకు. నా యొనర్చు నుపచారములలో నడుగడుగునను భక్తివినయములు తొంగలించుచుండెను. నా శ్రద్ధ యంతయు వారి యవసరములు దీర్చుటందే. నీడవలె వారి ననుసరించుచుంటిని. నా సమస్తేంద్రియములును దమ చాపల్యమునంతయు వారి సేవయందే కేంద్రీకరించికొని యుండెను. వారు సహజముగ భూతదయాపరులు. నా సేవ వారిని మఱికొంత లోఁగొన్నది. వారు

గాత్సల్యభావముతో నతిరహస్యమై గొప్పదైన ఈశ్వర విజ్ఞానమును ంకు బోధించిరి. గుహ్యతమం అను నర్థమందు పోతన్న 'రహస్యం' ను నర్థము నుపయోగించెను. సాధనభూతమైన ధర్మతత్త్వజ్ఞానము హ్యము. దానిచే సాధింపఁదగిన దేహద్వయ వివిక్తమైన ఆత్మ జ్ఞానము గుహ్యతరము. అనఁగా నాత్మస్వరూపము స్థూలసూక్ష్మముల ంటెను భిన్నమైనదని తెలియుట. దానిచేఁ బ్రాప్తమైన ఈశ్వరతత్త్వ జ్ఞానము భగవంతుఁడైన నారాయణునిచేతఁ దొల్లి చతుర్ముఖబ్రహ్మకు పదేశింపఁబడెను. అది క్రమముగా నారదునకుఁ బ్రాప్తించినది.

ఏనున్=నేను గూడ, వారి యుపదేశంబునన్=ఆ మహర్షుల యుపదేశమూలమున, వాసుదేవునియొక్క, మాయానుభావంబున్= మాయయొక్క మాహాత్మ్యమును, తెలిసితిన్ = తెలిసికొన్నాను. వాసుదేవ' శబ్దము మూలములోనిదే. సర్వవస్తువుల కాధారభూతుఁడై ర్వాంతర్యామియగుటచే స్వామికి వాసుదేవుఁడని పేరు. ఈశ్వరుని యందున్ = పరమాత్మయందు, సమర్పితంబైన కర్మంబు = కర్మఫల మును భగవంతున కర్పించి చేయు కార్యము, తాపత్రయంబున్ మాన్పన్ ఔషధంబగున్=మూఁడు విధములైన తాపములను బోకార్చు టకు మందుగా నుపయోగపడును. ఫలేచ్ఛతో నొనర్పఁబడిన యజ్ఞాదు లైన సమస్త కర్మలును సంసారమునే యభివృద్ధి నొందించుచున్నవి. ఫలేచ్ఛచేఁ జేయఁబడిన కర్మలయొక్క ఫలానుభవార్థము శరీర మావశ్యక మగుచున్నది. శరీరప్రాప్తితో సంసార విమోక్షప్రసంగము దూరమై పోవును. ఋషుల మునుల వాఁడల్లే సకామకర్మ లొనర్చుచు తత్ఫలానుభూతికై యనేక శరీరముల నందుచుండును. ఏ ద్రవ్యంబు వలనన్=ఏ యన్నాదులచేత, ఏ రోగంబు జనియించెన్=ఏ రోగమేర్పడు చున్నదో, ఆ ద్రవ్యంబు=ఆ యన్నాది ద్రవ్యము, ఆరోగంబు మాన్పన నేరదు=ఆ యామయమును, బోఁగొట్టలేదు. ద్రవ్యాంతరంబులచేత నైనన్ = ఇతరద్రవ్యముల సంయోగముచేత, చికిత్సితము = చికిత్స

యొనర్చుట, మానుపనోపున్–ఆ రోగమును బోఁగొట్టఁజాలును. ఏ యన్నాదులచే నే రోగము లేర్పడుచున్నవో, అవి కేవలము తదన్న సంసేవనము వలననే పోవు. ఆ యన్నముతో నితర పదార్థములను జేర్చినప్పు డది ఔషధ మగును. అట్లే కర్మములతో సంసార మేర్పడు చున్నది. ఫలాభిసంధి పూర్వకముగా నొనర్చు కర్మలనెడు వస్తువుల చేత సంసార మనెడు రోగ మేర్పడును. తన్నివృత్తికేమి చేయవలెను? ఆ కర్మలలో నీశ్వరార్పణబుద్ధియనెడు ద్రవ్యాంతరమును జేర్పవలెను. అప్పు డా కర్మలు మందువలె సంసార మనెడు రోగమును రాకుండఁ జేయును. సంసార హేతుకములైన కర్మలు సంసారనివృత్తికే కారణము లగునని భావము. ఈశ్వరునియందుఁ జేయఁబడు కర్మ ఈశ్వరుని యందు ఫలమును సమర్పించి యనుష్ఠింపఁబడు కర్మలు. విజ్ఞాన హేతుకంబై–జ్ఞానప్రాప్తికిఁ గారణమై, ఈశ్వర సంతోషణంబును–భగ వంతునికి సంతోషమును–భక్తియోగమును జనింపఁజేయును. జ్ఞానము చేత నజ్ఞానప్రాప్త కర్మనాశము. ఆ జ్ఞానము భక్తియోగముతో లభిం చుచున్నది. కర్మచేఁ గర్మ మెట్లు నశించును? దానినే వివరించు చున్నాఁడు. భగవదర్పణముగా సేయఁబడు కర్మ భక్తియోగమును గలిగించును. ఆ భక్తియుక్తమైన జ్ఞానము ఫలాభిసంధిరహితమైన కర్మను సేయించును. ఆ కర్మలు గర్మనాశ మొనర్చికొనును. ఈశ్వర శిక్షం జేసి–

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ! తత్కురుష్వ మదర్పణమ్.

ఇదియే భగవంతుఁ డొసఁగిన శిక్ష. ఈ శిక్ష ననుసరించి కార్యము లొనర్చువారు కృష్ణ గుణ నామవర్ణన స్మరణంబులు సేయుదురు. కృష్ణునికి సంబంధించిన గుణములు తన్నామములు వానియొక్క వర్ణనమును స్మరణమును జేయుదురని తాత్పర్యము. కృష్ణుఁడు పూర్ణ పురుషుఁడైన దానివలన తన్నామమునే యిక్కడ చెప్పినాఁడు.

మూలమందును 'కృష్ణస్యానుస్మరంతి చ' అనియే గలదు. ప్రణవ పూర్వకంబులుగా .... నమస్కారంబుసేసి—ఇందు నాల్గుమంత్రములు చెప్పినాఁడు. ఓం వాసుదేవాయ నమః, ఓం ప్రద్యుమ్నాయ నమః, ఓం సంకర్షణాయ నమః, ఓం అనిరుద్ధాయ నమః అని వాని స్వరూపము. మంత్రమూర్తియు—నీ నాల్గుమంత్రములే స్వరూపములుగాఁ గలవాఁడు. మూర్తిశూన్యుఁడు—పరమార్థముగా మూర్తిశూన్యుఁడయ్యును భక్తానుగ్రహము కొఱకు వివిధమూర్తులను ధరించువాఁడు; యజ్ఞపురుషున్—యజ్ఞస్వరూపుఁడైన శ్రీమహావిష్ణువును, 'యజ్ఞో వై విష్ణుః' అని శ్రుతి. సమ్యగ్దర్శనుఁడు—ఆత్మజ్ఞానము గలవాఁడు.

తాత్పర్యము: ఆ మహర్షుల యుపదేశముచే వాసుదేవుని మాయాస్వభావము నే నెఱిగితిని. ఫలముల నీశ్వరునియం దర్పించి చేయఁబడు కర్మ తాపత్రయములను నాశన మొనర్చును. ఏ ద్రవ్యముచే నే రోగము సంభవించునో యా రోగమును బోఁగొట్టుట కా ద్రవ్యమే పనికిరాదు. ద్రవ్యాంతరములతో దానినిఁ జేర్చినప్పుడు అదియే యౌషధముగాఁ బనిచేయును. అట్లే, కర్మసంసార వర్ధకము అని దానినే భగవంతునందు సమర్పించినపుడు అది సంసారకారణము కానేరదు. తన స్వరూపమునే యది చెఱచికొనును. ఈశ్వరార్పితముగఁ జేయఁబడు కర్మ విజ్ఞానకారణ మగును. భగవత్ప్రీతిజనక మగును. భక్తియోగమును గల్గించును. ఈశ్వరాదేశము ననుసరించి కర్మల ననుసరించి కర్మల నొనర్చువారు కృష్ణనామస్మరణ మొనర్తురు. వాసుదేవ ప్రద్యుమ్న సంకర్షణ అనిరుద్ధు లనెడు నామ చతుష్టయముతో యజ్ఞస్వరూపుఁడైన శ్రీమహావిష్ణువును యజించు పురుషుఁ డాత్మజ్ఞాని యగును.

ఏను = నేను, ఇవ్విధమునన్ చేయఁగన్—ఈ రీతి నాచరింపఁగా, దానవకులవైరి—దానవాంతకుఁడైన కృష్ణుఁడు, తనయందలి విజ్ఞానమున్ = తన స్వరూపమును గూర్చిన భక్తియుక్తమైన జ్ఞాన

మును, నాకున్ ఒసఁగెన్—నాకు నిచ్చెను. మదనుష్ఠానమున్—నాయను ష్ఠాన ప్రకారమును, అతఁ డెఱుఁగున్ = అతనికిఁ దెలియును; నీవున్ దీనిన్ సలుపుము = నీవుగూడ నా యనుష్ఠాన పద్ధతి ననుసరించి భగ వంతు నుపాసింపుము.

తాత్పర్యము: వ్యాసముని! నేనీ మార్గముతో నాతని నుపా సించితిని. భగవంతుఁడు దానితో సంతోషించి తనకు సంబంధించిన భక్తిజ్ఞానములను నాకొసఁగెను. నా యనుష్ఠానము నతఁడెఱుఁగును. నీవుగూడ నీ మార్గమున భగవంతు నుపాసింపుము.

ఈవు—నీవు, మునికులములోనన్—మహర్షులలో, మిక్కిలి విను కులు గలవాఁడవు = గొప్ప శ్రవణ భాగ్యము గలవాఁడవు, అదభ్ర శ్రుత! = అనుట కిది తెనుఁగు. నీవు విభుకీర్తులు—భగవంతుని కీర్తులు, అనుదినమున్—ప్రతిదినమును, పొగడన్ వినియెడి జనములకున్—పొగ డగా వినెడి మనుజులకు, దుఃఖమెల్లన్=సమస్త దుఃఖమును, శాంతిం బొందున్—నాశమైపోవును.

తాత్పర్యము: వ్యాసముని! నీవు మహర్షులలో గొప్పవాఁడవు. అనేక విషయములు నీ కవగతములు. పరమాత్ముని కీర్తిని చక్కగా గానము చేయుము. దానిని విన్న జనముల తాపత్రయములు దీఱి పోవును.

పుట్టపర్తి నారాయణాచార్యదాసునిచే విరచింపఁబడిన
'భాగవతసుధాలహరి' యందు ప్రథమ
స్కంధమున పంచమాధ్యాయము
వ్యాఖ్య ముగిసినది.

—

సాఽస్వతంత్రా న కల్పాఽఽసీత్ యోగక్షేమం మమేచ్ఛతీ,
ఈశస్య హి వశే లోకో యోషా దారుమయీ యథా. 7

అహం చ తద్బ్రహ్మకుల ఉషివాం స్తదపేక్షయా,
దిగ్దేశకాలా ఽవ్యుత్పన్నో బాలకః పంచహాయనః. 8

ఏకదా నిర్గతాం గేహాద్దుహంతీం నిశి గాంపథి,
సర్పోఽదశత్ పదా స్పృష్టః కృపణాం కాలచోదితః. 9

తదా తదహమీశస్య భక్తానాం శమభీప్సతః,
అనుగ్రహం మన్యమానః ప్రాతిష్ఠం దిశముత్తరామ్. 10

సూత ఉవాచ–సూతుఁ డనెను.

బ్రహ్మన్–ఓ బ్రాహ్మణుఁడా!, దేవర్షేః–దేవర్షియైన నారదునియొక్క, జన్మకర్మచ–జన్మమును కర్మమును గూర్చి, ఏవం–ఇట్లు, నిశమ్య–విని, సత్య వతీసుతః–సత్యవతీ దేవియొక్క కుమారుఁడును, భగవాన్–భగవంతుఁడైన, వ్యాసః–వ్యాసుఁడు, భూయః–మఱల, తం–నారదునిగూర్చి, పప్రచ్ఛ–ఇట్లు ప్రశ్నించెను.

సూతుఁ డనెను: ఓయీ! శౌనకముని! దేవర్షియైన నారదుని యొక్క పూర్వజన్మమును గూర్చి వ్యాసమహాముని వినెను. తజ్జన్మ సంబంధమైన కర్మను గూర్చియు నాలకించినాఁడు. సత్యవతీ సుతుఁ డును భగవంతుఁడును నైన వ్యాసముని, మఱల నిట్లు ప్రశ్నించెను.

వ్యాస ఉవాచ–వ్యాసుఁ డనెను.

తవ–నీకు, విజ్ఞానాదేష్టృభిః–భగవత్సంబంధమైన విజ్ఞానమును బోధించి వట్టి, భిక్షుభిః–భిక్షువులైన పరమహంసలచేత, విప్రవసితే–అస్థావ ముపే క్షింపఁ బడినప్పుడు, ఆద్యేవయసి–మొదటి వయస్సైన బాల్యమందు, వర్త మానః–వర్తించుచున్న, భవాన్–నీవు, కి మకరోత్–ఏమి యొనర్చితివి?

వ్యాసుఁ డనెను: భగవన్! నీకు ఈశ్వరరహస్యోదార విజ్ఞానమును బోధించిన పరమహంసలైన భిక్షువులు ఆ స్థలమును వదలి పోయిన పిదప బాల్యావస్థ యందున్న నీ వేమి యొనర్చితివి? 2

**స్వాయంభువ = స్వయంభువగు బ్రహ్మదేవుని కుమారుఁడవైన నారద మునీ!, తే పరం వయః = నీ తరువాతి కాలము, కయావృత్త్యా = ఏ వ్యవహారము నాశ్రయించి, వర్తితం = వర్తింపఁబడినది?, ఇదం కళేబరమ్ = ఈ శరీరమును, కాలేప్రాప్తే = కాలము సమీపింపఁగా, కథం = ఎట్లు, ఉదస్రాక్షీః చ = విసర్జించితివి?**

బ్రహ్మపుత్త్రుఁడవైన నారదమునీ! ఆ జన్మయందలి బాల్యోత్తరమైన వయస్సును ఏ వ్యవహారములతో నిర్వహించితివి? దాసీపుత్త్ర జన్మమునకు సంబంధించిన శరీరము వదలవలసిన కాలము సమీపించినపుడు ఆ శరీరము నెట్లు వదలితివి? 3

**సురసత్తమ = ఓ దేవశ్రేష్ఠుఁడవైన వాఁడా!, తే = నీయొక్క, ప్రాక్కల్ప విషయాం = పూర్వకల్పము నాశ్రయించి యున్నదైన, ఏతాం స్మృతిం = ఈ జ్ఞాపకమును, సర్వనిరాకృతిః = సర్వమును నిరాకరించి నాశమొనర్చు, ఏషః కాలః = ఈ కాలము, నహి వ్యవధాత్ = మఱుగుపడఁ జేయలేదుగదా!**

దేవమునీ! నీ దాసీపుత్త్ర జన్మ అతీతమైన కల్పమునకు సంబంధించినదిగదా! ఇంతకాలము గడచినను తజ్జన్మగతమైన స్మృతి నీకు నశింపలేదు. దీనికిఁ గారణమేమి? కాలస్వభావము సర్వమును నశింప చేయుటయేగదా! అట్టి కాలప్రభావము నీయం దెందుకుఁ బ్రసరింప లేదు? 4

**నారద ఉవాచ: నారదుఁ డన్నాఁడు.**

**మమ = నాకు, విజ్ఞానాదేష్టృభిః = పరమేశ్వరునకు సంబంధించిన విజ్ఞానమును బోధించిన మహర్షులచేత, విప్రవసితే = ఆ స్థలము వదలిపెట్టఁబడిన దగుచుండఁగా, ఆద్యేవయసి వర్తమానః = ప్రథమ వయస్సున బాల్యమునందు వర్తించుచున్న నేను, తతః = అనంతరము, ఏ తత్ = ఇట్లు, అకారిషం = చేసితిని.**

నారదుఁ డనెను: నా కీశ్వరసంబంధమైన జ్ఞానము నుపదేశించిన భిక్షువులు అటునుండి తరలిపోయిరి. అప్పుడు అద్యావయస్సునందున్న నేను త్లొనర్చితిని. 5

**కింకరీ=వారివీరి ఇండ్లయందుఁబనులొనర్చి బ్రదుకునదియు, మూఢా=జ్ఞానహీనురాలును, యోషిత్=స్త్రీయును, ఏకాత్మజా = నే నొకఁడే కుమారుఁడు గలదియు నైన, మే జననీ=నా తల్లి, ఆత్మజే=తన కుమారుఁడును, అనన్యగతౌ=ఇతరమైన రక్షణ మేదియు లేనివాఁడనైన, మయి=నాయందు, స్నేహానుబంధనం=తీవ్రమైన స్నేహబంధమును, చక్రే=చేసెను.**

అవ: కొంతకాలము మాతృస్నేహ నిమిత్తముగాఁ దల్లితోఁ గూడ నక్కడే యుండవలసివచ్చె నని మూఁడుశ్లోకములతో వివరించుచున్నాఁడు—

నాతల్లికి నే నొక్కఁడనే కుమారుఁడను. ఆమె జ్ఞానవంతురాలు గాదు. పైఁగా స్త్రీ. వృత్తి యందమా? ఆ ఇంటి నీయింటఁ బనిచేసి జీవించుట. అన్యగతిలేని నాయం దామె తన వాత్సల్యమును విపరీతముగాఁ బెంచికొన్నది. ఆత్మజులయందు స్నేహము విద్వాంసుల మనస్సులనుగూడ లోఁగొనును. ఆమె విషయ మేమని చెప్పవలెను? 6

**మమ=నాయొక్క, యోగక్షేమం=క్షేమసమాచారములను, ఇచ్ఛతీ=కోరుచున్నట్టి, అస్వతంత్రా సా=స్వాతంత్ర్యములేని జీవనముగల యామె, కల్పా న ఆసీత్=నా యోగక్షేమ విచారవిషయమందు సమర్థురాలు గాకపోయెను, లోకః=లోకము, దారుమయీ యోషా యథా=కఱ్ఱతోఁ జేయఁబడిన స్త్రీరూపమును వలె, శాసకస్య వశే హి=అన్నివిధముల నీశ్వరునకు లోఁబడినది గదా!**

అవ: 'కింకరీ' అని చెప్పుటలోని విశేషమును వివరించుచున్నాఁడు—

ఆమె బ్రదుకు పరాధీన మైనది. నా యోగక్షేమము లామె సవ్యగముగ నేమి చూచును? ఇది యామె మనస్సునకు పెద్దదుఃఖమై

యుండెను. ఆమె యొక్కతే గాదు. ప్రపంచమం దెవ్వరును స్వతంత్రులు గారు. లోకమంతయు నీశ్వరేచ్ఛకు లోఁబడినదే. ఈ విషయమును గమనించునంతటి విజ్ఞాన మామెకు లేదు. సమస్త ప్రపంచము నొక దారుమయమగు స్త్రీబొమ్మ వంటిది. దాని నాడించెడువాఁడు పరమేశ్వరుఁడు. వాని ఇచ్ఛ ననుసరించి యది యాడును. ఈ సూత్రమునుబట్టి మా తల్లికిఁగూడ దాసిత్వము సిద్ధించినది. కాని యి ట్లామె యన్వయించికొన లేదు. 7

**దిగ్దేశకాలా వ్యుత్పన్నః — దిక్కు దేశము కాలము వీనికి సంబంధించిన పరిపూర్ణజ్ఞానములేని, పంచహాయనః — ఐదేండ్ల వయస్సులో నున్న, బాలకః — చిన్నవాఁడనైన, అహం చ — నేనుగూడ, తదపేక్షయా — ఆ మాతృస్నేహము గోరువాఁడనై, తద్బ్రహ్మకులే — ఆ వేదవాదులసమాజమందు, ఉషివాన్ — కొంతకాలము వసించితిని.**

నాకు దిగ్దేశకాలవ్యుత్పత్తిలేని వయ స్సది. ఐదు సంవత్సరములు. నేను నా తల్లి వాత్సల్యమునకు వశుఁడనై కొంతకాల మా బ్రహ్మకులమందే వసించితిని. 8

**ఏకదా — ఒకానొకనాఁడు, గేహాత్ — ఇంటినుండి, నిర్గతాం — బయలుదేఱినదియు, కృపణాం — దుఃఖితయు, గాం — గోవును, దుహంతీం — పిదుకుచున్నదియునైన నా తల్లిని, నిశి — రాత్రియందు, పథి — త్రోవలో, పదా — కాలిచేత, అస్పృష్టః — కొద్దిగా తాకఁబడినదై, కాలచోదితః — కాలముచేఁ బ్రేరేపింపఁబడిన, సర్పః — ఒక పాము, అదశత్ — కఱచెను.**

నా తల్లికి నన్ను గూర్చిన దుఃఖమే నిరంతర ముండెను. ఒకానొకరాత్రి యామె పాలను బిదుకుటకై యావువద్దకు బయలుదేరెను. త్రోవలో నొకపాము. దాని నామె గమనింపలేదు. కాలితోఁ దిన్నగా సర్పమును దాఁకినది. కాలచోదితమై యా సర్ప మామెను గఱచెను. 9

**తదా — అప్పుడు, అహం — నేను, తత్ — ఆ సంఘటనను, భక్తానాం — భక్తులకు, శం — మంగళమును, అభీప్సతః — ఇచ్చింపనట్టి, ఈశస్య — భగవంతునియొక్క**

అనుగ్రహం=అనుగ్రహముగా, మన్యమానః=తలంచుచున్నవాఁడనై, ఉత్తరాం దిశం=ఉత్తరదిశను గూర్చి, ప్రాతిష్ఠం=పయనించితిని.

ఈ మాతృమరణమును నేను తప్పుగా నర్థము చేసికొనలేదు. దానిని, భగవదనుగ్రహముగనే యెంచితిని. అతఁ డెప్పుడును భక్తుల మంగళమును గోరువాఁడుగదా! ఈ సన్నివేశము తరువాత నే నుత్తర దిశను గుఱించి ప్రయాణించితిని. 10

**శ్రీధరీయము :**

ఒకటవ శ్లోకమునకు విశేషము లేదు.

విప్రవసితే=దూరదేశమును బొందిన వా రగుచుండఁగా, విజ్ఞానాదేష్టృభిః=బ్రహ్మతత్త్వోపదేశ మొనర్చిన వారిచేత.

పరం వయః=దానిపైఁ బ్రాప్తించిన ఆయుష్కాలము, కథం వర్తితం=ఏ రీతిగాఁ గడుపఁబడినది?, ఇదం=దాసీపుత్త్రభూతమైన ఈ కళేబరమును.

ఏషః=కల్పాంతర లక్షణమైన కాలము, నవ్యవదాత్=అర్హమైన దానివలన అడాగమము రాలేదు. సర్వానిరాకృతిః=సర్వస్యనిరాకృతిః ప్రలోపః, యస్మాత్సః=కాలమునకు విశేషణము. సర్వమును నశింపఁ జేయునది యని యర్థము.

వీతదకారిషం = అకార్షం అనుటకు బదులు అకారిషం అని ప్రయోగము. రేఫషకార విశ్లేషము ఛందోనురోధముతో నేర్పడినది. 'అపిమాషం మషం కుర్యాత్ ఛందోభంగం నకారయేత్' అని ఛందశ్శాస్త్రకర్తలు.

ఏకాత్మజా=ఏకఏవ ఆత్మజః యస్యాస్సా=నేనొక్కఁడే కుమారుఁడుగాఁ గలిగినది. యోషిత్ మూఢా చ=ఈ రెండును నామెకు పుత్త్రస్నేహ మెక్కువగానుండుటకుఁ గారణములు. స్నేహస్య అనుబంధనం=స్నేహానుబంధనం=స్నేహముయొక్క సంబంధమును.

అవ: కింకరి అని చెప్పినదానికిఁ బ్రయోజనమును వివరించు చున్నాఁడు-

అస్వతంత్రా = జీవితమందు స్వాతంత్ర్యము లేనిది, న కల్పా ఆసీత్ = నా యోగక్షేమములను విచారించుటయందు సమర్థురాలు గాలేదు. దారుమయీ యోషా=చెక్కతో నిర్మింపఁబడిన ఆఁడుబొమ్మ -పారవశ్యమున కిది దృష్టాంతము.

తదపేక్షయా = తల్లి స్నేహానుబంధముయొక్క అపేక్షతో. ఈమెకు నాయందలి స్నేహబంధ మెప్పుడు విడివడునోయని కాలము నెదురు చూచుచున్నవాఁడనై, దిగ్దేశకాలా వ్యుత్పన్నః-ఇది తూర్పు ఇదిపడమర అనుట దిక్కులను గూర్చిన జ్ఞానము. ఇది కంచి, ఇది కాశి యనుట దేశజ్ఞానము. ఇది చైత్రము, ఇది వైశాఖము అనుట కాలజ్ఞానము-ఈ మూఁడును సరిగాఁ దెలియనివాఁడనై.

గాం దుహంతీం=హేత్వర్థమందు శతృప్రత్యయము. 'పాలు పిండుటకై బయలుదేఱిన దానిని' అని యర్థము.

**వంశీధరుఁడు:**

హే బ్రహ్మన్-ఓ శౌనకా! నీకు విషయ మంతయు నవగతమే కాని, బ్రాహ్మణులు పరోపకృతి పరాయణులు. అందుచే, నితఁడు గూడ, హరి యశోవర్ణనముతోఁ బరిశుద్ధుఁ డగును గాక!' యని కరుణతో న న్నడుగుచున్నావని భావము.

భిక్షుభి ర్విప్రవసితే=భిక్షువు లనఁగా నిచట గృహస్థేతర మగు నాశ్రమమునకుఁజెందిన వారని యర్థము. స్వాయంభువ!=స్వయం భువుని కుమారుఁడవైన వాఁడా! అనఁగా మాతృసంబంధము లేక జన్మించిన వాఁడని యర్థము.

**విజయధ్వజము :**

అవ: వ్యాస నారద సంవాదరూపమైన యుపాఖ్యానముః సూతుఁడు శౌనకాదులకుఁ జెప్పెనని గ్రంథకర్త వివరించుచున్నాఁడు

బ్రహ్మన్ = బ్రహ్మజ్ఞానియైన శౌనకుఁడా!, సత్యవతీ సుతః సత్యవతీదేవియం దభివ్యక్తిని బొందిన, వ్యాసః = వ్యాసరూపుఁడై శ్రీహరి, భగవాన్=త్రికాలజ్ఞానియు, పరమపూజ్యుఁడును నైన తాను ఏవం=గడచిన యధ్యాయమందుఁ జెప్పఁబడినట్లుగా, దేవర్షేః జన్మ=పూర్వకల్పమందలి పుట్టుకను, చ=ఇంకను, కర్మ=ఆ జన్మమ దాతఁడొనర్చిన కర్మను, నిశమ్య=విని, తం=భూయః పప్రచ్ఛ.

అవ: బ్రహ్మజ్ఞానియైన శౌనకు నుద్దేశించి సూతుఁడు కథన ముందుకు నడపుచున్నాఁడు-

శౌనకమునీ! వేదవ్యాసరూపియైన శ్రీహరికి నారదునియం దనుగ్రహము గొప్పగా నుండెను. అతని కీర్తిని జగత్తునందు వా పింపఁ జేయవలెనని వ్యాసుని కోరిక. అందుచేఁ దాను సర్వజ్ఞుఁడై నను దెలియని వానివలె నారదుని పూర్వజన్మ వృత్తాంతమును అతః నుండి తెలిసికొనెను. పూర్వకల్పమందు దేవర్షియైన నారదుఁ డేమిగ జన్మించెను. ఏమి యొనర్చె నన్నది తెలిసికొన్నాఁడు. ఆ జన్మలో నతఁ డొనర్చిన తరువాతి వృత్తాంతమును బ్రజలకుఁ దెల్పఁగోరిః వాఁడై మఱల నిట్లు ప్రశ్నించెను.

అవ: నారదునిపై వ్యాసునకు గొప్ప యభిమాన ముండెను అతని కీర్తిని సమస్త జనులకును దెలుపవలెనని యాతని తలఁపు అందుచేఁ దాను సర్వజ్ఞుఁడైనను ఆ జన్మమందలి తక్కిన వయస్సు యొక్క వ్యాపారమును బ్రశ్నించుచున్నాఁడు-

**తవ విజ్ఞానా దేష్టృభిః = విశిష్టమైన జ్ఞానము నుపదేశించిన, భిక్షుభిః=జ్ఞానభిక్షను సదా యొసఁగు స్వభావముగల యా యతుల**

విప్రవసితే=అద్యేవయసి వర్తమానః భవాన్ తతః కిం అకరోత్ = భవచ్ఛబ్ద ప్రయోగమందు ప్రథమపురుష ప్రయోగము.

తాత్పర్యము : నారదా! చాతుర్మాస్యమును ముగించి, యా జ్ఞానులు నీకు విశిష్టమగు జ్ఞానోపదేశ మొనర్చిరి. తర్వాత వా రా చోటును వదలిపోయిరి. జ్ఞానభిక్ష నొసఁగుటయే వారి స్వభావము అగుటచే వా రేమో నీకు జ్ఞానోపదేశ మొనర్చి వారి త్రోవను వారు పోయిరి. నీ కాఁ చిన్నవయసు. నీ వప్పు డేమి యొనర్చితివి? వారినే యనుసరించితివా? లేక నీ తల్లితో నా వేదవాదుల యిండ్లయందే యుంటివా? ఎంతకాల ముంటివి? తర్వాత నీ వయోనిర్వాహ మెట్లు చెల్లెను? నీ జీవనవృత్తి యేది?

స్వాయంభువ! తే పరం వయః కయా వృత్త్యా వర్తితం? కాలే ప్రాప్తే ఇదం కలేబరం కథం ఉదస్రాక్షీః?

సురసత్తమ! ఏషః సర్వనిరాకృతిః = అందటికిని పూర్వజన్మ జ్ఞానమును నాశ మొనరించునట్టి, కాలః=ఈ కాలము, తే=నీయొక్క ప్రాక్కల్ప విషయాం = గడచిన కల్పమునకు సంబంధించిన, ఏతాం స్మృతిం=నవ్యవదాత్ హి=ఇది యాశ్చర్యకరమైన విషయము.

తాత్పర్యము : నీ మరణకాలము ప్రాప్తించినపుడు దేహము నెట్లు త్యజించితివి? సర్వమును నాశ మొందించుటయే కాలమునకు స్వభావము. గడచిన ఏ వృత్తాంతమును జ్ఞాపక ముండనీయదు. కాఁగా గతించిన బ్రహ్మకల్పమునకు సంబంధించిన నీ స్మృతి ఏమాత్రము చెక్కుచెదరలేదు. ఇది యాశ్చర్యకరమైన సంఘటన. ఆ పై వృత్తాంతమును గూడ దెలిసికొనఁ గోరుచున్నాను.

అవ: తన కీర్తిని గడ్డకుఁ దెచ్చుటకై ప్రయత్నించుచున్న **వ్యాసుని యభిప్రాయము నెఱిఁగిన నారదుఁడు అతనిప్రశ్న కుత్తర** మిచ్చుచున్నాఁడు—

మమ విజ్ఞానాదేష్ట్రభిః భిక్షుభిః విప్రవసితే అద్యేవయసి వర్తమానః తతః=అటు పిమ్మట జ్ఞానోపదేశమునుబొంది పైఁ జెప్పఁబోవు కార్యమును, అకార్షం=చేసితిని.

అవ: తా నా సన్న్యాసులవెంటఁ బోవనందులకుఁ గారణము జెప్పుచున్నాఁడు–

ఏకాత్మజా,యోషిన్మూఢా=వివేకజ్ఞానములేని స్త్రీయైన, కింకరీమే జననీ, అనన్యగతౌ=ఆత్మజే మయి, స్నేహానుబంధనం=వాత్సల్యభావమును, నిరంతరముగా, చక్రే=చేసెను.

అవ: కేవలము నన్నుఁ బ్రేమించుటయే కాని నాకు కావలసిన తిండి గుడ్డ మొదలైన వానినిచ్చు సామర్థ్య మామె కుండలేదనుచున్నాఁడు–

మమ యోగక్షేమం=రావలసిన దానిని వచ్చునట్లొనర్చునుపాయమును, ప్రాప్తించిన దానిని జాగ్రత్తగా రక్షించు నుపాయమును, ఇచ్ఛతీ=కోరుచున్నదైనను, అస్వతంత్రా=పరాధీనురాలైన, సా=ఆమె, కల్యా=యోగక్షేమమును జూచికొనుటయందు సమర్థురాలుగా, నాऽసీత్=ఉండలేదు. లోకః=సేవకజనులు, దారుమయీ=కట్టెతోఁ జేసిన, యోషా యథా=ఱఁడుదాని బొమ్మవలె ఆడించువాని కధీనురా లెట్లో, తథా = ఈశస్య = 1. యజమానునియొక్క, 2. సర్వేశ్వరునియొక్క, వశేహి=అధీనమం దుందురు గదా!

అవ: మఱి యిచట నేలయుంటివి? దానికి సమాధానము–

దిగ్దేశ కాలావ్యుత్పన్నః పంచహాయనః బాలకః అహం చ=నేను గూడ, తదపేక్షయా=ఆ నా తల్లి కోర్కి ననుసరించియే, బ్రహ్మకులే=ఆ బ్రహ్మజ్ఞానులగు వేదవాదుల ఇంటియందే, ఉషివాన్=నివసించితిని.

తాత్పర్యము: సర్వజ్ఞుఁడవైన వ్యాసమునీ! నీకుఁ దెలియని విషయమేది? కాని నాకీర్తిని వ్యాపింపఁజేయుటకే నీవిట్లు ప్రశ్నించు చున్నావు. నాకు శ్రీహరి విషయమైన విశిష్టజ్ఞానము నుపదేశించి ఆ యతులు వేరొక్కచోటికిఁ బ్రయాణమైరి. నా కపుడు చాల చిన్న వయసు. నేను వారిని వెంబడించి పోలేదు. నా తల్లికి నే నొక్కఁడనే కుమారుఁడను. ఆమె సర్వస్వము నేనే. ఆమె స్త్రీ, అందునను వివేక శక్తి చాలనిది. సేవా వృత్తిచే జీవించుచుండెను. నే నన్న నామెకుఁ బంచప్రాణములు. నాకుఁ దాను తప్ప వేఱు దిక్కులేదని యామెకు బాగుగాఁ దెలియును. అందుచే నామె తీవ్రమైన ప్రేమను నాపైఁబెంచి కొని యుండెను. కాని ఆమె వాత్సల్యము కేవల నామమాత్రముగనే యుండెను. నాకు రుచికరమైన యాహారము పెట్టలేదు. చక్కని గుడ్డ నివ్వలేదు. అస్వతంత్రురాలైన యామె ఏమిచేయఁగలదు? నా యోగక్షేమములను గూర్చియే యామె తీవ్రచింత. ప్రపంచ మొక చెక్క బొమ్మవంటిది. దాని నాడించు వాఁడు వేఱుగా నుండును. వా డాడించి నట్లది యాడును. వాని యిచ్ఛకు విరుద్ధముగ నది యాడనేరదు గదా! లోకమందు సమస్తజీవరాసులును నియామకుఁ డగు శ్రీహరి కధీనములు. వాని యిచ్ఛకు విరుద్ధముగ నెవ్వరును బ్రవర్తింపలేరు. నా తల్లిగూడ నంతే. నే నామెతో బ్రహ్మజ్ఞానులైన యా విప్రుల యిండ్లయందే యుంటిని. అదియే యామె యపేక్ష. దాని ననుసరించుటయే కుమారుఁడనైన నా కర్తవ్యమై యుండెను. అంత మాత్రమే గాదు. నా కప్పు డైదేండ్ల వయస్సు. దిగ్దేశకాల జ్ఞానము గూడ నాకు సరిగాలేదు. నా తల్లితోఁ గొంతకాల ముంటిని.

అవ: తన తల్లి మరణ పర్యంత మా బ్రాహ్మణుల యింటి యందే యుంటినని చెప్పుచున్నాఁడు—

ఏకదా=ఒకనాఁడు, గేహాత్, నిర్గతాం, నిశి, గాం దుహంతీం కృపణాం=మృత్యువును సమీపించియున్న నా తల్లిని, పదాస్పృష్టః

=కాలుపైఁ బెట్టుటచేత కోపించిన, కాలచోదితః=మృత్యురూపుఁడైన శ్రీహరినుండి, ప్రేరేపింపఁబడిన, సర్పః=పాము, అదశత్=కాటు వేసెను. ఆ పాము కాటుతో నా తల్లి మరణించెను.

తదా, అహం=తల్లి అంత్యక్రియలను ముగించిన నేను, తత్ =ఆ తల్లి మరణము, భక్తానాం=భక్తులకు, శమభీప్సితం=ఎక్కువ యిష్టమైన, ఈశస్య, అనుగ్రహం మన్యమానః, ఉత్తరాం దిశం ప్రాపిష్ఠం, భక్తానాం సమభీప్సితం అనుగ్రహం మన్యమానః – అని విజయధ్వజుల పాఠము.

తాత్పర్యము: ఒకనాటిరాత్రి నా తల్లి యింటినుండి బయలుదేరెను. ఆమె గోవుపాలు పితుకుటకై వెడలియుండెను. త్రోవలో పాము పండుకొని యున్నది. దానిని నాతల్లి చూడలేదు. కాలితోఁ ద్రొక్కినది. ఆ పాము కాలచోదితమై యామెను గఱచెను. నాతల్లి యిహలోకమును చాలించినది. కుమారుఁడనైన నేను నాకర్తవ్యమైన యంత్యక్రియలను నెరవేర్చితిని. నాకున్న యొక్క బంధనము దొలఁగినది. శ్రీహరిభక్తులు బంధవిముక్తినే యాశింతురు. వాసుదేవుఁడు భక్తుల నెప్పుడు ననుగ్రహించుటకే కాచుకొని యుండును. వారిని తననుండి దూరమొనర్చ నంగికరింపఁడు. అందుచే వారికభిమాన వస్తువులనెల్ల నొక్క టొక్కటిగా నతఁడు నడలించును. 'యస్యానుగ్రహ మిచ్ఛామి తస్య విత్తం హరామ్యహం' ఇదే వాని సంకల్పము. కనుక నాతల్లి మరణము శ్రీహరి యనుగ్రహమనియే నేను భావించితిని. బ్రాహ్మణుల యిండ్లు వదలి ఉత్తర దిక్కుగాఁ బయనించితిని.

**పోతనగారు:**

**వ:** ఇట్లు నారదు జన్మకర్మంబులు విని క్రమ్మఱ వ్యాసుం డిట్లనియె–

విను మా భిక్షులు నీకు నిట్లు కరుణన్ విజ్ఞానముం దెల్పి పో
యిన బాల్యంబున, వృద్ధభావమున నీ కేరీతి సంచారముల్
చనె? నీ కిప్పుడు, పూర్వకల్పమతి, యే జాడం బ్రదీపించెఁ, ద
త్తనువుం బాసిన చందమెట్లు? చెపుమా! దాసీసుతత్వంబుతోన్.

వచ: అని యిట్లు వ్యాసుం డడిగిన, నారదుం డిట్లనియె. దాసీపుత్త్రుండ నయిన యేను, భిక్షులవలన హరి విజ్ఞానంబు గలిగి యున్నంత-

మమ్మునేలిన వారి మందిరంబునఁగల
పనులెల్లఁ గ్రమమున భక్తిఁజేసి
తన పరాధీనతఁ దలఁపదు సొలసితి
నలసితి నాఁకొంటి ననుచువచ్చి
మాపును, రేపును మాతల్లి మోహంబు
సొంపార ముద్దాడు చుంచుదువ్వ
దేహంబు నివురు మోదించుఁ గౌఁగిటఁ జేర్చు
నర్మిలి నన్నిట్టు లరసి మనువ
నేను విడచిపోక యింటనుండితినయ్య
మోహిగాక యెఱుక మోసపోక
మాఱుచింత లేక మౌనినై యేనేండ్ల
వాఁడ నగుచుఁ గొన్ని వాసరములు.

సదనము వెలువడి తెరువునఁ
బెదరక మాతల్లి రాత్రిఁ జీఁకటివేళన్
మొదవుం బిదుకఁగ నొక్కఫణి
పదభాగముఁ గఱచెఁ ద్రొక్కఁబడి మునినాథా.

నీలాయత భోగఫణా
వ్యాళానల విషమహోగ్రవహ్నిజ్వాలా
మాలా వినిపాతితయై
వ్రాలెన్ నను గన్నతల్లి వసుమతి మీఁదన్.

తల్లి ధరిత్రిపైనొఱఁగి, తల్లడపాటును జెంది, చిత్తమున్
బల్లటిలంగఁ బ్రాణములు వాసిన, జూచి కలంగకేను, నా
యుల్లములోన మోహరుచి నొందక, సంగమువాసె, మేలు రా
జిల్లెనటంచు, విష్ణుపదచింత యొనర్చుచు బుద్ధిఁ, దేర్చుచున్.

జన్మకర్మంబులు=ద్వంద్వసమాసము, జన్మమును, కర్మమును నని యర్థము. దాసీపుత్రుఁడుగా, నారదుఁ డుద్భవించిన తెఱఁగును, ఆ జన్మమున నాతఁడొనర్చిన పనులను, విని=ఆలకించి, క్రమ్మఱన్=మరల. నారదుఁ డీ జన్మయందు దేవర్షియైనాఁడు. నారదుఁడను నామధేయమును నీ జన్మకృతమైనదే.

వినుమా !=ఆలకించుము, భిక్షులు=చాతుర్మాస్యమును గడపుచున్న యీ యతులు, నీకున్ ఇట్లు=నీ కీ ప్రకారముగా, కరుణన్=కారుణ్యభావముతో, విజ్ఞానమున్ దెల్పిపోయినన్=శ్రీహరికి సంబంధించిన తత్త్వజ్ఞానమును బోధించిపోఁగా, ఆ జన్మమునందు, బాల్యంబుననన్=బాల్యావస్థయందు, వృద్ధభావముననన్=ముసలితనమందును, నీకున్ ఏ రీతిన్ సంచారముల్ సనెన్=ఏ రీతిగా సంచరించితివి. కాలక్షేప మొనర్చితివి, నీకు, ఈ జన్మమందు, పూర్వకల్పమతి=పోయిన బ్రహ్మకల్పమునకు సంబంధించిన స్మృతి, ఏ జాడన్ ప్రదీపించెన్=ఏ క్రమముతోఁ గాలనిరాకృతముగాక భాసించుచున్నది, దాసీసుతత్వంబుతోన్=దాసీసుతుఁడుగాఁ బుట్టిన జన్మమందు, తత్తనువున్=ఆ జన్మకు సంబంధించిన శరీరమును, పాసిన చందము ఎట్లు - వదలి పెట్టిన పద్ధతి యేది?

ఇక్కడ భిక్షు లనఁగా కేవలము భిక్షావృత్తితో జీవించువారని యర్థము గాదు. గృహస్థేతరమైన యాశ్రమమందున్నవారు అనఁగా సన్న్యాసులు, సన్న్యాసధర్మము ననుసరించి భిక్షను స్వీకరింతురే గాని కేవలము పొట్టఁబోసికొనుటకుఁ గాదు. భిక్షు లనుటకు వే రర్థమును గూడ జెప్పవచ్చును. ఇతరులకు జ్ఞానభిక్ష యొసగుటయే వృత్తిగా గలవారు, కరుణన్=నారదునకు హరిభక్తి నుపదేశించినది. సహజ

ముగా వారికి సకలజీవు లందున్న కారుణ్యభావముతోనే. అతని సేవావృత్తి యీ కారుణ్యమును మఱికొంత యభివృద్ధిపఱచెను. విజ్ఞానమున్=జ్ఞానము లెన్నియో యున్నవి. నారదునకు వా రుపదేశించినది హరికి సంబంధించిన తత్త్వజ్ఞానము. ఇతర ప్రాపంచిక విజ్ఞానములు గావు. ఈ విషయము నాతఁ డీ క్రింది వచనములో "హరివిజ్ఞానంబు గలిగియున్నంత" అని చెప్పఁబోవుచున్నాఁడు.

బాల్యంబున్ వృద్ధభావంబునన్=ఆ దాసీపుత్త్ర భావమునకు సంబంధించిన బాల్యమునందును, ముసలితనమునందును అని యర్థము. దాసీపుత్త్రుఁడుగా నున్నపుడు నారదుఁడు పూర్ణాయుష్కుఁడై జీవించెను. "ఈ జన్మమునందు హరిప్రాప్తి లేకపోయెనే" యని తొందరగా శరీరమును వదలినవాఁడు గాఁడు. మృత్యువు తానై ప్రాప్తించువఱకును, కాలమున కెదురుచూచుచు, భూమిం దిరుగుచుండె"నఁట. మానవుఁడు దా నెట్టి పరిస్థితియం దున్నను, భగవంతుని నియమనము ననుసరించి సంపూర్ణప్రారబ్ధక్షయ మగువఱకును వేచియుండవలెనే గాని, తొందరపడి తన ఇష్టానిష్టముల ననుసరించి నిర్ణయము దీసికొనుటకు వీలులేదు. దాసీసుతుఁడుగా నారదుఁ డున్నపుడు భగవంతుఁడు శబ్దరూప మహాభూతముగా దర్శనమొసఁగి "రాబోవు బ్రహ్మకల్పమున నీవు శుద్ధసాత్త్వికుఁడవై జన్మించెద"వని చెప్పెను. ఈ మధ్య నారదున కెన్ని జన్మములు గడచినవో: అవి యన్నియు నాతఁ డోర్పుతో గ్రహించెను. ఆ యా సుఖదుఃఖానుభవముల విసుగక యనుభవించెను. పూర్వకల్పమతి=కాలము సమస్తమును నాశన మొందించును. దాని స్వభావమే యట్టిది. దాసీసుతుఁడుగా జన్మించినది యతఁ డీ బ్రహ్మకల్పమున వ్యాసునితో సంభాషించుచున్నది నారదుఁడు దేవర్షిగా జన్మించిన బ్రహ్మకల్పమున; నడుమ గొన్ని యుగముల కాలము గడచినది. దాసీపుత్త్ర జన్మకు సంబంధించిన స్మృతి ఇంతకాలము మఱుఁగుపడక ఎట్లున్నది?

'భగవంతుని యనుగ్రహముతో నున్నదని' పైని నారదుఁడే చెప్పఁబోవుచున్నాఁడు. తత్తనువున్ = ఆ దాసీపుత్త్ర జన్మకు సంబంధించి తనువును.

తాత్పర్యము: నారదా! నీకు భిక్షులు భగవద్విజ్ఞానమును గూర్చి తెలిపిపోయిరి. తర్వాత నీ వెంతకాలము జీవించితివి? జన్మలో నీ వృత్తి యెట్టిది? బాల్యమును, వార్ధక్యమును నే వ్యాపారములతోఁ గడపితివి? పూర్వకల్పమునకు సంబంధించిన స్మృతి నీ మాత్రమును మాసిపోలేదు. ఆ విషయమంతయు నేఁడే జరగినట్లు స్పష్టముగాఁ జెప్పుచున్నావు. నీ కీ శక్తి యెట్లేర్పడినది? దాసీపుత్త్రుడుగా నున్న యీ జన్మ నెట్లు వదలితివి?

ఏను = నేను, భిక్షులవలనన్ = ఆ యతుల దయావిశేషమువలన హరి విజ్ఞానంబున్ = శ్రీమహావిష్ణువునకు సంబంధించిన జ్ఞానమును.

తాత్పర్యము: అప్పుడు నారదుఁ డిట్లున్నాఁడు: 'దాసీ పుత్త్రుఁడైన నాకు పరమహంసలు హరివిజ్ఞానమును బోధించిరి. కాలము క్రమముగాఁ గడచిపోవుచుండెను.

మమ్ముఁన్ ఏలినవారు = మమ్ము పోషించుచుండెడి యజమానులు, వారియొక్క, మందిరంబునన్ గల పనులు = ఇంటియందలి సమస్తములైన కార్యములును, క్రమముగా = వరుసగా, భక్తిం జేసి = భక్తితో నెఱవేర్చి, తన పరాధీనతం దలఁపదు = 'తాను కింకరి గదా! తనకు స్వాతంత్ర్యము లేదు' అను విషయమును గమనింపదు. సొలసితిన్ = మూర్ఛ పొందితిని, అలసితిన్ = అలఁత నొందితిని. ఆఁకొంటిని అనుచున్ = ఆఁకలి గొన్నా నని తలఁచి, మాపునున్ రేపునున్ = ఉదయాస్తమయములందు, మోహంబు సొంపారన్ = మోహ మెక్కువ కాఁగా, ముద్దాడున్ చుంచుదువ్వున్ = కురులను దువ్వును, దేహంబున్ నిమురున్ = దేహమునంతయు తారాడి నిమురును, మోదించున్ =

సంతోషపడును, కౌఁగిటం జేర్చున్ = కౌఁగిలించుకొనును, అర్మిలిన్ = ప్రేమతో, నన్నున్ ఇట్టులు = ఈ విధమైన రీతిగా, అరసి మనుపన్ = విచారించుచు పెంపగా, నేను, విడచిపోక యింటనుండితిన్, మోహిగాక = తల్లిప్రేమలో నా యాత్మజ్ఞానమును మఱచి మోహమునందినవాఁడను గాక, ఎఱుక మోసపోక = కలిగిన జ్ఞానమును జాఱవిడిచికొనక, మాఱు చింతలేక = భగవత్ప్రసాదముఁ బొందెడు కోర్కి దప్ప వేఱు చింతలేక, మౌనినై = మౌనము వహించినవాఁడనై, ఏనేండ్లవాఁడనగుచున్ = పంచవర్షప్రాయుఁడనై, కొన్ని వాసరములు = కొన్ని దినములు.

తాత్పర్యము : నా తల్లికి నాపై నెక్కువ ప్రీతి. ఆమె దాసి యంటిని. మా యజమానుల ఇంటిపనులన్నియుఁ గ్రమముగా భయభక్తులతో నిర్వహించును. తన జీవితము పరాధీనమైనది. నేను ఎండవానల కెక్కడ మూర్ఛపోదునో, అలసి ఎక్కడ పడిపోదునో, ఆఁకలికి తపించుచుందునో యిదియే నిరంతర మామెచింత. ఆమెకుఁ గొంత తీరికయున్న దుదయాస్తమయములందే. తక్కిన వేళలందంతయుఁ బనియే. ఆ యింతకాలములోనే నా తల్లి నన్ను జాగ్రత్తగా విచారించికొనెడిది. నే ననన్యగతికుఁడను. ఆమె నా చుంబు దువ్వెడిది, పలుమాఱు ముద్దాడెడిది. శరీరమంతయు నిమిరెడిది. సంతోషముతోఁ గౌఁగిటఁ జేర్చికొనెడిది. నా ప్రవర్తన మెట్లుండెను! ఆమె ప్రేమవ్యాపారములను నిమ్మళముగా నంగీకరించుటయే నా పని నే నామె ప్రేమలో మునిఁగి నా యాత్మజ్ఞానమును మఱచి మోహము నందలేదు. యతు లుపదేశించిన యా విజ్ఞానము నివాతదీపమువలె నాయందు నిలుకడగా వెలుఁగుచునే యుండును. భగవంతునియనుగ్రహమును సంపాదించుకొనుట ఎట్లు? ఇదియే నా నిరంతరచింత. నే నెవ్వరితోడను బలుకుట లేదు. తీవ్రమైన ఏకాగ్రతయే జీవితమై యుండెను. కాని, తల్లిప్రేమను గాదనలేక గొన్నిదినములు నే నట్లే యచటనే యుంటిని.

పై పద్యమునందలి మాతృప్రేమయొక్క వర్ణనావైశద్యమంతయుఁ బోతన్న స్వకపోల కల్పనమే. 'చక్రే స్నేహానుబంధనమ్' అను మూలములోని యొక మాటనుగొని ఈ పెంపక మొనర్చినాఁడు. 'అస్వతంత్రా' 'నకల్యా' అను వీనిలోని భావమును గూడ 'తన పరాధీనతఁ దలఁపదు, మాపును రేపును' ఇత్యాదులతోఁ గ్రోడీకరించి కొనుచు వచ్చినాఁడు. ముద్దాడుట, చుంచుదువ్వుట, కౌఁగిటఁ జేర్చి కొనుట-ఈ మొదలైన వ్యాపారములన్నియు ప్రేమవ్యంజకములుగా లోకమున మనము చూచుచున్నవే. వీనికి లోఁబడి నారదుఁడు తన ధ్యేయమును మఱచినవాఁడు గాడు. 'మోహింగాక' 'యెఱుక మోస పోక' 'మాఱుచింతలేక' 'మౌనినై' ఇత్యాదులతో నారదుని ఏకాగ్రత యెంతటిదో అమాత్యుఁడు విశదీకరించుచున్నాఁడు. ఈ స్థితిలో నారదుఁడు గడపినది గొన్నిదినములు మాత్రమే. ఇంతలో నా బంధమును దొలఁగించు భగవదనుగ్రహము రంగమునఁ బ్రవేశించినది.

సదనమున్ వెలువడి=ఇంటినుండి బయలుదేరి, తెరువునన్=దారియందు, చెదరక=త్రోవతప్పిపోక, రాత్రి చీఁకటివేళన్=ఒకానొక రాత్రి చీఁకటివేళలో, మొదవున్ పిదుకఁగన్=ఆవును బిండుచుండఁగా, ఒకఫణి=ఒకపాము, త్రొక్కఁబడి పదభాగమున్ కఱచెన్.

తాత్పర్యము: ఒకానొకనాఁడు సంధ్యాసమయము. చీఁకటి దట్టముగ వ్యాపించియుండెను. మాతల్లి గోవునుబిండుట కింటినుండి బయలుదేరినది. త్రోవలో నొకపాము పండుకొనియున్నది. అది ఒక విషనాగము. చీఁకటి యగుటచేఁ దెలియక దానిపై మా యమ్మ యడుగువేసెను. అది యామె పాదమును గఱచినది.

నీల=నల్లని, అయత=పొడవైన, భోగ=శరీరము, ఫణ=పడగయుఁ గల, వ్యాళ=సర్పముయొక్క, అనన=ముఖమునందలి, విష=విషముయొక్క, మహా+ఉగ్ర=మిక్కిలి భయంకరమైన, వహ్ని

జ్వాలా-నిప్పుమంటులయొక్క, మాలా=వరుసలచేత, వినిపాతితయై= పడగొట్టఁబడినదైననుఁ గన్నతల్లి, వసుమతిమీఁదన వ్రాలెన్=ధరపై వ్రాలెను.

తాత్పర్యము : ఆ నాగుబాము చాల పెద్దది. దాని శరీరము పడగయు దీర్ఘవిస్తృతములై యుండెను. ముఖమునందు భయంకరమైన విషము, ఆ విషము వెలిగ్రక్కు మంటలు, అట్టి విషముచే దహింపఁబడి నా తల్లి నేల కొఱఁగినది. ఇక్కడ పోతనామాత్యుఁడు వాడిన పెద్దసమాసము, ఆ కాలసర్పమువలెనే పొడవై దాని భీకరాకారమును స్ఫురింపఁ జేయుచున్నది.

తల్లి ధరిత్రిపై నొఱఁగి=నా తల్లి భూమిపైఁ బడినదై, తల్లడపాటును జెంది=ప్రాణములుపోక గొంతసేపు గింజుకొనుచు, చిత్తమున్ పల్లటిలంగన్-బుద్ధి తప్పిపోఁగా, ప్రాణములు వాసినన్=మరణింపఁగా, చూచి, ఏను కలంగక=నేను గమనించి, మనోవైకల్యమును జెందక, నా యుల్లములోనన్=నా మనస్సునందు, మోహారుచిన పొందక-మోహమునకు స్వాధీనుఁడను గాక, సంగము వాసెన్=ఒకానొక సంబంధముగూడ తొలఁగినది, మేలు రాజిల్లెన్ = భగవదనుగ్రహము సంపూర్ణముగా నేర్పడినదని, అటుంచు, విష్ణుపదచింత యొనర్చుచున్ =శ్రీమహావిష్ణువు పదచింతన సేయుచు, బుద్ధిం దేర్చుచున్ - బుద్ధిని మోహము నందనీయక, విజ్ఞానబలముతో పట్టువఱచుచు.

తాత్పర్యము : నా తల్లి భూమిపై వ్రాలి కొట్టుకొన నారంభించినది. ఆమెకు మూర్ఛ గ్రమ్మెను. ఆ మూర్ఛలోనే ప్రాణములు పోయినవి. ఈ సన్నివేశమునంతయు స్వయముగాఁ గన్నులతోఁ జూచితిని. నా చిత్తమే వికారమును జెందలేదు. నా మనస్సు మోహమునకు వశమైనదియు లేదు. నా ప్రయత్నమునకు బాధకముగాఁ దల్లిప్రేమ యను నొక బంధముండెను. దానిని భగవంతుఁడు దొలఁగించినాఁడు. అతని యనుగ్రహముతో నాకు మేలు గలిగినదని

నిశ్చయించికొంటిని. బుద్ధిని వివేకబలముతో నిగ్రహించితిని. విష్ణు పద ధ్యానమందుఁ జిత్తమును జేర్చితిని.

ఈ సందర్భములోఁ బోతన్న 'యోషా దారుమయీ యథా' అను నుపమానమును వదలిపెట్టినాఁడు. అట్లే నారదుని తల్లిపాత్రను జిత్రించుటలో మూలమునకంటెను గొంత భేదించెను.

స్ఫీతాన్ జనపదాం స్తత్ర పురగ్రామ వ్రజాకరాన్,
ఖేటఖర్వటవాటీశ్చ వనాన్యుప వనానిచ. 11

చిత్రధాతు విచిత్రాద్రీ నిభభగ్నభుజ ద్రుమాన్,
జలాశయాన్ శివజలాన్ నలినీ స్సురసేవితాః. 12

చిత్రస్వనైః పత్రరథై ర్విభ్రమద్భ్రమర శ్రియః,
నలవేణు శరస్తంబ కుశకీచక గహ్వరమ్. 13

ఏక ఏవాతియాతో௨హమద్రాక్షం విపినం మహత్,
ఘోరం ప్రతిభయాకారం వ్యాళోలూక శివాజిరమ్. 14

తత్ర=అక్కడ, స్ఫీతాన్=సమృద్ధములైన, జనపదాన్=జనాకీర్ణములైన దేశములను, పురగ్రామవ్రజాకరాన్, పుర=పట్టణములు, గ్రామ=బ్రాహ్మణబహుళములైన గ్రామములు, వ్రజ=గోకులములు, ఆకరాన్=రత్నములు మొదలైనవి త్రవ్వితీసెడు చోటులను, ఖేటకర్వటవాటీః, ఖేట=కర్షకులు నివసించెడు గ్రామములు, కర్వట=కొండలక్రిందనున్న పల్లెలు, వాటీశ్చ=పెద్దవృక్షములు పుష్ప వృక్షములు మొదలగునవి యున్న చోటులు, వనాని=ఫలవృక్షములు ఛాయావృక్షములు మొదలైనవి యున్నచోటులు, పెద్దయడవులు, ఉపవనానిచ=ఉద్యానములు చిత్రధాతు విచిత్రాద్రీన్, చిత్ర=అనేక వర్ణములు గలిగిన, ధాతు=గైరికాది ధాతువులచేత, విచిత్ర=వింతవింతలైన, అద్రీన్=పర్వతములను, ఇభభగ్నభుజద్రుమాన్, ఇభ=ఏనుఁగులచేత, భగ్న=విఱువఁబడిన, భుజ=భుజములవంటి పెద్ద కొమ్మలుగల, ద్రుమాన్=చెట్లను, శివజలాన్=సంతోషమును గూర్చెడు జల

ములు గల, జలాశయాన్ = బావులు, చెఱువులు మొదలైనవానిని, సురసేవితాః = దేవతలచేత విహారార్థమై సేవింపఁబడినట్టియు, చిత్రస్వనైః = చిత్రవిచిత్రములైన కంఠధ్వనులచేఁగూడిన, పత్రరథైః = పక్షులచేతఁ గూఁడినవియు, విభ్రమత్ భ్రమర శ్రియః, విభ్రమత్ = అటునిటు దిరుగుచున్న, భ్రమర = తుమ్మెదలయొక్క, శ్రియః = శోభావిశేషము గలిగినవియు నైన, నళినీః = పద్మాకరములను, ఏకఏవ = ఒంటిగా అతియాతః = అతిక్రమించిపోయిన, అహం = నేను, నలవేణుశరస్తంబ కుశకీచక గహ్వరం, నల = దట్టముగా వల్లుకొన్నగడ్డియు, వేణు = వెదురుపొదలు, శరస్తంబ = స్తంబములవలె లావుగా వల్లుకొన్న రెల్లుగడ్డియు, కుశ = దర్భలపొదలు, కీచక = గాలిచేనిండి ధ్వనించుచున్న వెదురుపొదలును వీనిచేత, గహ్వరం = దాటుట కళ క్యమైనట్టియు, ఘోరం = మనస్సునకును కన్నులకును భరింపరాని తఱచుదనము గలిగినదియు, ప్రతిభయాకారం = భయంకర స్వరూపముతోఁ గూడినదియు, వ్యాళో లూకశివాజిరం, వ్యాళ = గొప్పసర్పములు, ఉలూక = భయంకరములైన గ్రుడ్లగూబలు శివా = నక్కలు, వీనికి, అజిరం = ఆశ్రయభూతమైన, మహత్ = గొప్పదైన, విపినం = అరణ్యమును, అద్రాక్షం = చూచితిని.

ఉత్తరాభిముఖుఁడనై పోవుచున్న నాకు, త్రోవలో నెన్నియో ధనసమృద్ధములైన దేశములు తటస్థించెను. గొప్ప పట్టణములను దాఁటిపోయితిని. బ్రాహ్మణాగ్రహారములను గడచితిని. కర్షకప్రధానములైన పల్లెలను దాఁటితిని. రత్నములు, బంగారు, వెండి మొదలైన యనర్ఘ వస్తువులను ప్రవ్వితీసెడి గనులు, గొప్పవృక్షములచేఁ గూడుకొన్నయడవులు, సస్యశ్యామలములైన గ్రామములు, పర్వతతటము లందున్న పల్లెలు – వీనిని గడచిపోయితిని. ఫలవృక్షములు సమృద్ధములుగా నున్నవనము లెన్నియో యెదురైనవి. ప్రయత్నపూర్వకముగాఁ బెంచిన పుష్పిత ద్రుమములుగల యుపవనము లెదురైనవి. గైరికాదిధాతువులతో విచిత్రములైన పర్వతములు, మదించినయేన్గులు ఆ యేన్గుల తొండములచేఁ బెరికి వేయఁబడిన గొప్పశాఖలుగల వృక్షములు, స్వచ్ఛమైన జలములతోఁ బ్రకాశించు చెఱువులు, బావులు

దేవతలు విహరించునట్టి విచిత్ర చిత్రములైన కంఠధ్వనులు గల నానా విధములైన పక్షులుగలవి, అటునిటు మధుమత్తములై భ్రమించు చుండు తుమ్మెదలు గలవి, మనోహరములైనవియగు పద్మాకరములు- వీనినన్నింటిని గడచి పోయితిని. నే నొంటివాఁడను. నాతో నెవ్వరును లేరు. ఎవరో యీడ్చుకొని పోవునట్లు పోవుచుంటిని. త్రోవలో భయంకరమైన యడవి తటస్థించినది. ఎచ్చటఁజూచినను దట్టముగా నల్లుకొన్న గడ్డిపొదలు, దాఁటిపోవుట కశక్యములైన వెదురుగుంపులు స్తంభములవలె లావై విచ్చలవిడిగా నల్లిన రెల్లుగడ్డి, కనుచూపుమేరకుఁ గానవచ్చుచున్న దర్భలు. ఆ యడవిలో నడచిపోవుటయే కష్టముగా నుండెను. దానివైపు తేరిచూచుటయే భయంకరము. ఎటు జూచినను స్థూలములై విషాగ్నులను గ్రక్కుచున్న పాములు, భీకరములై చెట్టు తొఱ్ఱలలోఁ గన్పించుచున్న గ్రుడ్లగూబలు. విచ్చల విడిగాఁ బారాడుచున్న నక్కలు, వికంకటములై సంచరించుచున్న తోడేళ్లు.

పరిశ్రాంతేంద్రియాత్మాఽహం తృట్పరీతో బుభుక్షితః,
స్నాత్వాపీత్వాహ్రదే నద్యా ఉపస్పృష్టో గతశ్రమః. 15

తస్మిన్నిర్మనుజే ఽరణ్యే పిప్పలోపస్థ ఆశ్రితః,
ఆత్మ నాత్మాన మాత్మస్థం యథాశ్రుత మచింతయమ్.16

పరిశ్రాంతేంద్రియాత్మా=బాగుగానలసిపోయినట్టి ఇంద్రియములు, శరీరము వీనితోఁ గూడినవాఁడును, తృట్పరీతః=దాహముచే నాక్రమింపఁబడిన వాఁడును, బుభుక్షితః=ఆఁకలిచే క్షోభపడుచున్నవాఁడును నైన, అహం=నేను, నద్యాః=నది యొక్క, హ్రదే=ఒకానొక సరస్సునందు, స్నాత్వా=స్నాన మొనర్చి, ఉపస్పృష్టః=నీటి నాచమించినవాఁడనై, పీత్వా=జలపాన మొనర్చి, గతశ్రమః=తీరి పోయిన శ్రమగలవాఁడనైతిని.

నా యింద్రియములు బాగుగా నలసిపోయి యుండెను. శరీరము చాల దెబ్బ తిన్నది. ఆఁకలిదప్పులు బాధించుచుండినవి.

అక్కడఁ బాఱుచున్న యొకానొక నదికి సంబంధించిన హ్రదములో దిగి స్నాన మొనర్చితిని. ఆచమించి నిత్యకర్మముదీర్చితిని. జలపాన మొనర్పగా గొంత యాయాసము దీరెను. 15

నిర్మనుజే=మనుష్యులస్పర్శ లేని, తస్మిన్ అరణ్యే—ఆ యరణ్యమందు, పిప్పలోపస్థ—అశ్వత్థవృక్షమూలమున, ఆశ్రితః—ఉపవేశించినవాఁడనై, ఆత్మనా—బుద్ధితో, ఆత్మస్థం—మనస్సునందున్న, ఆత్మానం—ఆత్మను, యథాశ్రుతం—గురుముఖమునుండి వచ్చిన యుపదేశము ననుసరించి, అచింతయమ్=చింతించితిని,

ఆ యరణ్యమున నరసంచారమే లేదు. నే నొక యశ్వత్థము క్రిందఁ గూర్చుంటిని. గురూపదేశము ననుసరించి, హృదయకమల స్థితుఁడైన పరమాత్మను జింతించుట కారంభించితిని. 16

శ్రీధరీయము :

11 నుండి 16 శ్లో : అర్థాదులు.

స్ఫీతాన్ జనపదాన్ అతియాతస్సన్ మహద్వీపిన మద్రాక్షమ్.

అని యన్వయము. నానాగుణదోష యుక్తములైన జనపదాదుల యందు సమదృష్టిగల వాఁడనై పయనించితినని తాత్పర్యము. స్ఫీతాన్=సమృద్ధములైనట్టి, జనపదాన్=దేశములను, పుర=రాజధానులు, గ్రామాః=భృగ్వాది ప్రోక్తములైన లక్షణములు గలవి.

విప్రాశ్చ విప్రభృత్యాశ్చ యత్రచైవ వసంతి హి,
స తు గ్రామ ఇతిప్రోక్తః శూద్రాణాం వాస ఏవ వా.

లేక—

శూద్రాశ్చ శూద్ర భృత్యాశ్చ యత్ర సర్వే వసంతి హి,
స తు గ్రామ ఇతిప్రోక్తః ద్విజానాం వాస ఏవ వా. ॥ ఇతి ॥

ఖేటములు, కర్షక గ్రామములు, కర్వటములు, గిరితటగ్రామములు—

ఏకతో యత్ర తు గ్రామో నగరం చైకతస్థితమ్,
మిశ్రం తత్ కర్వటంనామ నదీ గిరి సమాశ్రయమ్.

స్వతస్సిద్ధములైన వృక్షములుగల ప్రదేశములు, వనములు, ఆరోపితములైన తరులతాదికములు గలవి ఉపవనములు-

చిత్రస్వనైః పత్రరథైః విభ్రమద్భ్రమరశ్రియః.

పక్షులు కలస్వనముతోఁ గూయుచున్నవి, వాని ధ్వనులచేఁ బ్రేరితములై తుమ్మెద లటునిటు సంచరించుచుండెను.

**విజయధ్వజ వ్యాఖ్య:**

ఆ యుత్తరదిశయందు సంపత్సమృద్ధములగు దేశముల దాఁటి పోతిని. రాజాశ్రయముగల యూళ్లను, జననిబిడములగు పల్లెలను, గోగోపాలప్రపూర్ణములగు గోకులములను అతిక్రమించిపోతిని. రత్నములు మొదలగు పదార్థములను ఉత్పన్నముచేయు గనులను, వేఁటగాండ్రతో నిండిన యూళ్లను వనోపవనములను ఇభభగ్నభుజద్రుమములు గల భూర్జవృక్షములచే నిండిన కొండలను, శుద్ధములైన జలములతోఁ గూడిన కొలఁకులను మధురములై పద్దులుగఁ బారాడు తుమ్మెదలు గల ప్రదేశములఁ గడచితిని.

పరిశ్రాంతేంద్రియాత్మాఽహం – తృట్పరీతః, బుభుక్షితః, అహం, నద్యాఃహ్రదే జల ముపస్పృశ్య, స్నాత్వా=స్నాన తర్పణాదులఁ దీర్చి జలముఁ ద్రావి, గతశ్రముఁడ నైతిని.

తస్మిన్ నిర్మనుజేఽరణ్యే, పిప్పలోపస్థే ఆశ్రితః = స్వస్తికాసనముసఁ గూర్చున్నవాఁడనై, ఆత్మనా=విషయబహిర్ముఖమైన మనస్సుతో ఆత్మస్థం=హృత్కమల మధ్యవాసియైన, ఆత్మానం=బింబరూపియైన శ్రీహరిని, యథాశ్రుతం=అపరోక్షజ్ఞానులైన యామ యతులచే నుపదేశమందిన పద్ధతితో, అచింతయమ్=ధ్యానించితిని.

ఈ సందర్భమందు విజయధ్వజ వ్యాఖ్యలో మూఁడు శ్లోకము లెక్కువగా నున్నవి. అవి యితరములలో లేవు. ఆ మూఁడు శ్లోకము లీ క్రిందివి—

స్వప్నో మాయాగ్రహాశ్శయ్యా జాగ్రదాభాస ఆత్మనః,
నామరూపక్రియా వృత్తిః సంవిచ్ఛాస్త్రం పరం పదమ్.

అవ: గురూపదిష్టమైన మార్గమున ధ్యానమొనర్చితి నన్నాఁడు. ఆ ధ్యానప్రకార వివరణ మిది—

మాయాగ్రహః—జీవుని మనస్సునందున్న, చూచిన, లేక విన్న పదార్థముల సంస్కారముచేత సృష్టింపఁబడిన, జాగ్రదవస్థ యందు విలోకించెడు పదార్థములకు సదృశమైన యేనుగు గుఱ్ఱము మొదలైన యనేక పదార్థములను వీక్షించెడు, స్వప్నః—స్వప్నా. వస్థయు, శయ్యా—ఇంద్రియములచేష్ట లేకుండుటచేత, స్వప్నము వలెఁ గాని, జాగ్రదవస్థవలెఁ గాని, విషయజ్ఞానమే లేని, శయ్య యని పిలువఁబడెడు సుషుప్త్యవస్థయు, నామరూపక్రియావృత్తిః—నామము, రూపము, క్రియ వీనియందుండెడు, ఆభాసః—నామము, ఆకారము, క్రియ, యివి విషయములుగానున్న జ్ఞానమనిపించికొనెడు, జాగ్రత్ జాగ్రదవస్థ, ఈ మూఁడును, ఆత్మనః—ఏ పరమాత్మునినుండి, ఆత్మనః —జీవునకు (ఉత్పద్యంతే) ఏర్పడుచున్నవో, అట్టి యీ మూఁడవస్థ లకును గారణమైన బ్రహ్మశబ్దవాచ్యుఁడైన శ్రీహరి, సంవిత్ — 1. ప్రకృతి, ప్రాకృత, మిశ్రము గాని జ్ఞానము గలవాఁడు, 2. తాను నిర్ధోషినని తన్ను చక్కఁగా నెఱిఁగినవాఁడు, శాస్త్రం—అంతర్యామి, సర్వనియామకుఁడు, పరంపదం—పొందఁదగిన యత్యుత్తమవస్తువు, ఇట్లు జాగ్రదాది యవస్థల నిచ్చి, జీవుల కుపకార మొనర్చు విశిష్ట జ్ఞానాత్మకుఁడును, సర్వాంతర్యామియు, అత్యుత్తమగతియు, నైన శ్రీహరికే తురీయ మనిపేరు. దానినే యాలోచించినాడని యర్థము. 'తదాత్మానమేవ వేదాహం బ్రహ్మాస్మీతి' అని శ్రుతి యుండుటచేఁ

దన్ను నిర్దోషి యని, పరిపూర్ణుఁడని శ్రీహరి యెఱుఁగునని సంవిత్పద మును వ్యాఖ్యానింపవలెను.

తాత్పర్యము: జీవున కేర్పడెడు, స్వప్న, సుషుప్తి, జాగ్ర దవస్థలకు ప్రేరకుఁడు వాసుదేవుఁడే. తాను జూచిన, లేక విన్న, పదార్థముయొక్క సంస్కారము జీవుని మనస్సు నందుండును. దీనికే మాయయనిపేరు. ఈ సంస్కారమును గారణముగా నుంచికొని, హృషీకేశుఁడు జాగ్రదవస్థయందుఁ జూచిన ఏనుఁగు గుఱ్ఱము మొద లైన పదార్థములను బోలిన పదార్థములను సృష్టించి చూపించును. దీనికే స్వప్నావస్థ యనిపేరు. ఇంద్రియము లేవియుఁ బనిసేయవు. జాగ్రదవస్థయందువలెఁ గాని, స్వప్నావస్థయందువలెఁ గాని, చూచి నట్లు విషయజ్ఞానమే బొత్తిగా లేకపోవును. ఈ యవస్థనే సుషుప్తి యందురు. దీనికే శయ్య యనియు నామాంతరము. పదార్థముల నామ, రూప, క్రియలకు సంబంధించిన జ్ఞానముండుటకు జాగ్ర దవస్థ యందురు. ఈ మూఁడవస్థలకును నియామకుఁడు శ్రీహరియే. ఈ హృషీకేశుఁడు మట్టి కుండయైనట్లు, తాను జగద్రూపుఁడుగా మార్పు చెందఁడు. వాఁడు జగద్విలక్షణుఁడు జ్ఞానస్వరూపుఁడు. వాని జ్ఞానము సమీచీన మైనది. దానియందు ప్రకృతి ప్రాకృత మిశ్రణ ములు లేవు. తాను నిర్దోషినని సర్వదా యెఱిఁగినవాఁడు. 'ఆత్మాన మేవ వేదాహం బ్రహ్మాస్మీతి' అని, శ్రుతిగూడ నీ యర్థమునే తెల్పు చున్నది. సర్వనియామకుఁ డగుటచే వీనికే శాస్త్రమనిపేరు. ప్రాప్తవ్య ములైన పదార్థములలో వీఁడే యత్యుత్తమ పదార్థము. వీనికే తుర్య బ్రహ్మ మనిపేరు. ఈ విధముగనే పరమహంసలు నా కుపదేశించిరి. వారి యుపదేశాను సారముగనే నేను ధ్యాన మొనర్చితిని.

నేంద్రియార్థం, నచస్వప్నం, న సుప్తం న మనోరథమ్,
న నిరోధం చానుగచ్ఛేత్ చిత్రం తద్భగవత్పదమ్.

ఆ ధ్యాన ప్రకారమునే వివరించుచున్నాఁడు_

చిత్రం = 1. ఆశ్చర్యకరమైన, 2. జ్ఞానాత్మకుఁడైన చేతనుని రక్షించెడు, 3. జ్ఞానము నొసఁగెడు, జ్ఞానులకు జ్ఞానమును విస్తరించెడు, తక్కిన వారికి గురుముఖముగా జ్ఞానమును దెలిపెడు, 4. మనస్సునందే రతుఁడైన, 5. సృష్టికర్తయైన బ్రహ్మనుగూడ నతిక్రమించియున్న, 6. సృష్టియొనర్చి రమించుటచేత సుత్తమమైన, భగవత్పదం = ఐశ్వర్యాది గుణసామగ్రిగల శ్రీహరిరూపమును, తత్ = సర్వత్రవ్యాప్తమైనది ఇట్టి భగవద్రూపము, ఇంద్రియార్థము ప్రకృత్యాది సంబంధము లేకుండుటచే జాగ్రదవస్థను, నానుగచ్ఛేత్ = పొందుటలేదు, స్వప్నంచ = స్వప్నావస్థను, నానుగచ్ఛేత్ సుప్తం = సుషుప్త్యవస్థను, నానుగచ్ఛేత్, మనోరథం = పదార్థమును ఆలోచించుటను, నానుగచ్ఛేత్, అందుచే, నిరోధం = మరణమును, నానుగచ్ఛేత్.

తాత్పర్యము: వానిరూప మాశ్చర్యకరమైనది, జ్ఞానాత్మకులైన చేతనులను రక్షించునది, జ్ఞానము నొసఁగునది, జ్ఞానులజ్ఞానమును విస్తరింపఁ జేయునది, గురువుల మూలమున జ్ఞానోపదేశ మొనర్చునది. సర్వదా = మనస్సునందే రతమైనది. సృష్టికర్తయైన చతుర్ముఖ బ్రహ్మకన్న నత్యుత్తమమైనది. సృష్ట్యాదుల నొనర్చి క్రీడించు స్వభావము గలది. ఐశ్వర్యాది గుణములచే నిండినది. సర్వతోవ్యాప్తమైనది. ఇట్టి భగవద్రూపమునకు, జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్తి మొదలైనవియు పదార్థముల యాలోచన యనుటయు, మరణ మనుటయు లేవు. సర్వదా ఏకాకారముగ నుండునది భగవత్స్వరూపము.

స ఏకో భగవా నగ్రే క్రీడిష్య న్నిద మాత్మనః,
సృష్ట్వా విహృత్య తజ్జగ్ధ్వ ఉదాస్తే కేవలః పునః.

అవ: కాలముచేతఁ గూడ స్వప్నాదు లేర్పడుచున్నవి. కనుక స్వప్నాదికర్తృత్వము శ్రీహరికే యెట్లు చెప్పవలెను. ఇది యాశంక.

సమస్త ప్రపంచమునకును కర్త వాసుదేవుఁడే. వాఁడే ముఖ్యక
ర్తగ నుండగా, ప్రపంచమునందలి వస్తువులలో నొకటియైన స్వప్నా
వస్థయొక్క కర్తృత్వము అతనికే యని, వేఱుగాఁ జెప్పవలసి
యవసర మేమున్నది? ఈ యభిప్రాయముతో శ్రీహరికి ప్రపం
సృష్ట్యాదికర్తృత్వమును జెప్పుచున్నాఁడు-

అగ్రే=సృష్టికి మొదలు, సః=అ, ఏకః=ఒకఁడును, ముఖ్యు
డును నైన, భగవాన్=పరమాత్ముఁడే, ఆసీత్=ఉండెను, సః పునః
అ పరమాత్ముఁడు, (సిసృక్షుః=సృష్టింపవలెనని యిచ్ఛ గలవాఁడై
క్రీడిష్యన్=అంతర్యామిగను అవతార స్వరూపములుగను క్రీడింపవ
నని కోర్కి గన్నవాఁడై, ఆత్మనః=1. తననుండి, 2. తనగర్భవ
నుండి, ఇదం=బ్రహ్మ మొదలు పరమాణు పర్యంతము ఈ జగత్తున
సృష్ట్వా=సృష్టించి, అంతర్యామిగాఁ వానియందుఁ ప్రవేశింఁ
విహృత్య=అవతార రూపములుగా విహరించి, పునశ్చ=మరల
తజ్జగ్ధ్వా=ప్రళయకాలమందా జగత్తును హరించి, కేవలః=కేవ
మొక్కఁడేయై, ఉదాస్తే=జీవుల ప్రవృత్తి విషయమై ఉదాసీనుఁడుగ
నుండును. జగ్ధ్వా ఉదాస్తే=అని విసంధిగాఁ జెప్పినాఁడు. ఎందుకు
ప్రకృతిమొదలైన సాధనములు లేకయే సృష్టి యొనర్చుటకు సమర్థు
డని సూచించుట. శ్రీహరి సృష్టి స్థితి సంహారములకు మాత్రమే
గాదు; జ్ఞానాజ్ఞాన నియమన బంధమోక్షములకును కర్తయైనవాఁడు

తాత్పర్యము: శ్రీహరియే సృష్టికి ముందు అనఁగా ప్రళయ
కాలమందుఁ దా నొక్కఁడే ముఖ్యముగ నుండెను. వాఁడు జీవుల
ప్రవృత్తికొఱకై సృష్టి యొనర్పవలెనని సంకల్పించినాఁడు. సృష్టింప
బడిన అనాదిసిద్ధములైన పదార్థములందు అంతర్యామిగను, అవతార
స్వరూపములతోను విహరింపవలెనని ఇచ్ఛించెను. అపుడు తననుండి
తన యనంతరూపములను సృష్టించినాఁడు. తన యుదరమునుండి
అందు లీనమైయున్న యనంత జీవరాసులను వానికి ప్రాకృతదేహ

ముల నొనఁగి సృష్టి యొనర్చెను. ఇట్లు బ్రహ్మదేవునుండి పరమాణు పర్యంతము సృష్టించి, వానియందు తన రూపములతోఁ బ్రవేశించి, వాని స్వభావములను బ్రేరేపించుచు విహరించుచుండును. అవతార ముల నొనర్చి క్రీడించును. ప్రళయకాలమందు వీని నన్నిటిని సంహరించి యుదాసీనుఁడై తా నొక్కఁడే యుండును. జీవప్రవృత్తియం దాతని కుదాసీనతయే. ఇట్లు సమస్త జగత్తునకును గారణమైన శ్రీహరి స్వప్నాద్యవస్థలకుఁ గారణమని వేఱ చెప్పవలసిన దే మున్నది? వాఁ డన్నిటికినిఁ గారణము. వాఁడు సృష్టికార్యమందు ప్రకృతి మొదలైన వానిని కారణములుగా నుపయోగించుకొనును. కాని వాని తోడ్పాటులేనిదే సృష్టిచేయలేఁడని యర్థము గాదు. వాఁడు సృష్టి స్థితి సంహారములకు మాత్రమే గాదు జ్ఞానము, అజ్ఞానము, బంధము, మోక్షము వీనికిని గూడ ముఖ్యకర్తయైన వాఁడు.

**పోతన్నగారు:**

వచ: ఉత్తరాభిముఖుండనై యేను వెడలి జనపదంబులుఁ బురంబులు పట్టణంబులు గ్రామంబులుఁ బల్లెలు మందలు, గిరాత పుళింద నివాసంబులు వనంబులు నుపవనంబులుఁ జిత్రధాతు విచిత్రంబులైన పర్వతంబులు సమదకరి కరవిదళిత శాఖలుగల శాఖులు, నివారిత పథికజనశ్రమాతిరేకంబులైన తటాకంబులు, బహువిధ విహంగనినద మనోహరంబులైన వికచారవిందమధుపాన పరవశ పరిభ్రమద్భ్రమర సుందరంబులైన సరోవరంబులు దాఁటి చనుచు క్షుత్పిపాసాసమేతుండనై యొక్క నదీహ్రదంబునఁ గ్రుంకు లిడి, శుచినై నీరుద్రావి విగతశ్రముండనై,

సాలావృకకపిభల్లుక
కోలేభ లులాయ శల్యఘూక శరభ శా
ర్దూల శశ గవయ ఖడ్గ
వ్యాళాజగరాది భయద వనమధ్యమునన్.

వచ: దుస్తరంబులైన నీలవేణు కీచక గుల్మలతాగహ్వరంబుల పొంతనొక్క రావిమ్రాను దగ్గఱఁ గూరుచుండి యే విన్న చందంబున నాహృదయగతుం బరమాత్మస్వరూపు హరిం జింతించితి.

అర్థములు: ఏను-నేను, ఉత్తరాభిముఖుండనై వెడలి, ఏషావై దేవమనుష్యాణాం శాంతాదిక్ అని శ్రుతి, అందుచే విఘ్నరాహిత్యముతోఁ బ్రశస్తమైన దుత్తరదిక్కు. జనపదంబులు-దేశములు. 'జనస్య లోకస్య పదం ఆశ్రయస్థానం యత్ర' లేక 'జనః పదం వస్తుయస్య' అని రెండు విధములైన వ్యుత్పత్తులు శబ్దకల్పద్రుమములోఁ జెప్పఁబడినవి. చాణక్యశతకములో నీ క్రిందిశ్లోకము గలదు.

త్యజే దేకం కులస్యార్థే గ్రామస్యార్థే కులం త్యజేత్,
గ్రామం జనపదస్యార్థే ఆత్మార్థం పృథివీం త్యజేత్.

కనుక జనపదములు గ్రామములకంటెను గొప్పవని యూహించికొనవలెను. గ్రామ మనఁగా భారతమందుఁ జెప్పఁబడినదని శబ్దకల్పద్రుమములో నీ లక్షణ మున్నది.

విప్రాది వర్ణప్రాయా ప్రాకారపరిఘాది రహితా బహుజన వసతిః.

మార్కండేయపురాణములో గ్రామశబ్దమున కీ క్రింది లక్షణము.

తథా శూద్రజనప్రాయా సుసమృద్ధ కృషీవలా,
క్షేత్రోపయోగ భూమధ్యే వసతి ర్గ్రామసంజ్ఞికా.

పురంబులు 'నృపావాసః పురీప్రోక్తా విశాంపుర మపీష్యతే' అని శ్రీధరస్వామి యుద్ధృతీకరణ. పట్టణంబులు-పతంతి గచ్ఛంతి వణిజో యత్ర-వణిజులు వ్యాపారార్థమై దీనిని గుఱించిపోదురు గాన పట్టణము; పత్తన మనియు రూపాంతరము. 'పతంతి గచ్ఛంతి జనా యస్మిన్నితి పత్తనం'-జనులు దీనిని గుఱించి పోదురు. గ్రామంబులు పల్లెలు, మందలు, గోవులు, గోపాలకులు నివసించెడు ప్రదేశములు. కిరాత పుళింద నివాసంబులు, వేటలాడి జీవించెడు జాతిభేదములు-

ఈ జాతులకు నివాసస్థానములు. వనంబులు—తమకుఁ దామై పెరిగిన గొప్ప వృక్షములతో నిండిన ప్రదేశములు, ఉపవనంబులు = పెంచిన ఫలవృక్షజాతులు గల చోటులు, చిత్రధాతువిచిత్రంబులైన పర్వతంబులు–చిత్ర – అనేక రంగులుగల, ధాతు = గైరికాది ధాతువులచేత, విచిత్ర – కనులకు నానారూపములుగా నగుపించెడు, పర్వతములు= కొండలు, 'చిత్రధాతు విచిత్రాద్రీన్' అని మూలమున సమాసము. సమద—మదముచేఁ గూడుకొన్న, కరి—ఏనుగులయొక్క, కర—తొండములచేత, విదళిత—నిర్మూలింపఁబడిన, శాఖులుగల—కొమ్మలు గలిగినట్టి, శాఖులు=వృక్షములు, 'ఇభ భగ్న భుజద్రుమాన్' అని మూలము. ఏనుగులకు సమద అను నొక విశేషణమును బోతన్న చేర్చెను. ఏనుగులు మదించినవి గనుకనే విచ్చలవిడిగాఁ గ్రీడించుచున్నవి. వ్యాసుని రచనలో నేనుగులచేత భగ్నము లొనర్పఁబడిన, భుజములవంటి కొమ్మలు గల చెట్లని యర్థము. ఈ సందర్భములో నుపమేయముఁ జెప్పక యుపమానము మాత్రమే చెప్పఁబడినది. ఇది యతిశయోక్త్యలంకారము. దీని నమాత్యులు మార్చి శాఖలు గలిగిన శాఖులు అన్నారు. మూలములో నలంకారవిశేష మున్నది. తెనుగులోఁ బాఠకున కర్థము చేసికొనుటలో సౌలభ్య మున్నది. నివారిత—పోఁగొట్టఁబడిన, పథికజన – పాంథులయొక్క, శ్రమాతిరేకము = అలసటయొక్క యతిశయముగల, తటాకములు=చెరువులు అనఁగా నా దారులందు నడచు పాంథులు ఆ చెరువుగట్టులందుఁ గొంత విశ్రమించి, జలములనుగ్రోలి మార్గశ్రమము నపనయించికొని పోవుచుందురని భావము. మూలమందు, 'జలాశయాన్ శివజలాన్' అని గలదు. మంగళకరములైన జలములుగల జలాశయములని యర్థము. నీరు మంగళకరము లెట్లైనవో పోతనామాత్యుఁడు విస్తరించి చూపినాఁడు. 'నళినీస్స్వరసేవితాః' అను వర్ణనము తెనుఁగులోఁ బోయినది. బహుశః పోతన్న ఇది యనవసరమని భావించెనేమో! బహువిధ=అనేక విధములైన, విహంగ= పక్షులయొక్క, నినద=శబ్దములచేత, మనోహరంబులై=మనస్సునాక

ర్షించుచున్నవై, వికచ=వికసించిన, అరవింద=పద్మముల యందలి మధు=తేనెలయొక్క, పాన=త్రాగుటచేత, పరవశ=శరీరములు మఱచి, పరిభ్రమత్=తిరుగుచున్న, భ్రమర=తుమ్మెదలచేత, సుందరంబులు=అందములైన, సరోవరంబులు=సరోవరములకు రెండు విశేషణములు. అనేక విధములైన పక్షులచేత, వాని ధ్వనులచేత మనోహరములైనవి. వికసించిన పద్మములయందలి మధువును గ్రోలి పరవశములై పరిభ్రమించుచున్న తుమ్మెదలచేత సుందరములైనవి. మూలమందు 'చిత్రస్వనైః పత్రరథైః విభ్రమద్భ్రమర శ్రియః' అని రెండు విశేషణములు గలవు. పరిభ్రమించుచున్న తుమ్మెదలచే నందమైన యని యర్థము. మధుపము లెందుకు భ్రమించుచున్నవి? దీనికి గారణము మనమే యూహించుకొనవలెను. పోతన్న 'వికచారవింద మధుపాన పరవశ మధుపములని' కారణమును జెప్పి మన యూహాశ్రమను దొలగించినాడు. సరోవరంబులు దాటి చనుచు=వీని నతిక్రమించి పోవుచు, క్షుత్పిపాసా పరిశ్రాంతుండనై = ఆకలిదప్పులచే బీడింపబడినవాడనై, ఒక్కనదీప్రవాదంబున=ఒకనదియొక్క మడుగునందు, క్రుంకులిడి=స్నాన మొనర్చినవాడనై, శుచినై=నిత్యకర్మలాచరించి. పవిత్రుడనై, నీరుద్రావి, విగతశ్రముండనై = పోగొట్టబడిన శ్రమగలవాడనై, బహుప్రీహి సమాసము.

నే నుత్తరదిశఁబట్టి పోతిని. కారణమేమి? ఉత్తరదిక్కు ప్రశస్తమైనది. ఆ దిశయం దారంభించిన తపస్సు మొదలగు కార్యములు నిర్విఘ్నముగ సాగును. త్రోవలో నెన్నియో జనపదములు వచ్చెను పురములు దాటితిని. పురములు పత్తనము లుత్తరించితిని. పల్లెలు మందలు గడచితిని. పుళిందనివాసములైన గిరి తటములందుగల పల్లెలును గడచిపోతిని. త్రోవలో నెన్నియో వనములు, ఉపవనములు పర్వతములు; ఆ పర్వతములు వివిధములైన గైరికాది ధాతువులతో కన్నుల నాకర్షించుచుండును. మదించిన ఏన్గుల తొండములచే బెక

లింపఁబడిన గొప్పకొమ్మలుగల వృక్షములు మార్గమధ్యమున నున్నవి. పెద్ద తటాకములు, వానియందలి జలములు, స్వచ్ఛములై పథికుల పథిశ్రమము నపనయింపఁ జాలియుండెను. త్రోవలో నెన్నియో సరోవరములు. వానిలో నానావిధములైన పక్షుల ధ్వనులు. నిండుగా వికసించిన పద్మములయందలి తేనెను ద్రావి పరవశించి తిరుగుచున్న తుమ్మెదలు ఇవన్నియుఁ గడచిపోతిని. ఆఁకలిదప్పులు నన్ను బాధింపఁ దొడఁగెను. ఒకానొక నదీహ్రదమునఁ గ్రుంకులిడి నిత్యకర్మలుదీర్చి, జలములు గ్రోలి మార్గాయాసము నపనయించుకొన్నాను.

అర్థము: సాలావృక=తోడేళ్ళు, కపి=కోఁతులు, భల్లుక=ఎలుగు గొడ్డులు, కోల+ఇభ=అడవిపందులు, ఏనుగులు, ఉలాయ=అడవి దున్నలు, శల్య=ఏదుపందులు, ఘూక=గ్రుడ్లగూబలు, శరభ=శరభము లనెడు మృగములు, శార్దూల=పెద్దపులులు, శశ=కుందేళ్ళు, గవయ =గవయములు, ఖడ్గ=ఖడ్గమృగములు, వ్యాళ=గొప్పనాగులు, అజ గర=కొండచిలువలు, ఆది=మొదలైన మృగములచేత, భయద= భయమును గల్గించునట్టి, వనమధ్యమునన్=వనముయొక్క మధ్య భాగమునందు.

తాత్పర్యము: ఆ యడవిలో భయంకరములైన తోడేళ్లు, కోఁతులు, ఎలుఁగులు, అడవిపందులు, ఏన్గులు, అడవిదున్నలు, ఏదు పందులు, భయంకరముగా ధ్వనించు గ్రుడ్లగూబలు, విచ్చలవిడిగా సంచరించు ఖడ్గమృగాదులు, పెద్దపులులు, పెనుబాములు, చెట్లను జుట్టికొనియున్న కొండచిలువలు.

అర్థము: దుస్తరంబులు=దాఁటుటకు సాధ్యము గాని, నల= గొప్పగడ్డిపొదలు, వేణు=వెదుళ్లు, కీచక=మారుతాపూర్ణ రంధ్రములైన వెదుళ్ళు, గుల్మ=తుప్పలు, లతా=అల్లుకొన్న తీవెలు, గహ్వర=పెద్ద గుహలు, వీనియొక్క, పొంతన్=సమీపమందు, ఒక్క రావిమాను దగ్గఱఁ గూర్చుండి=ఒకానొక యశ్వత్థమూలమందుఁ గూర్చున్నవాఁ

డనై, ఏ విన్నచందంబునన్=నాకా పరమహంస లుపదేశించిన ప్రకారముగ, హృదయగతున్=హృదయమధ్యస్థితుఁడైన, పరమాత్మస్వరూపుఁడైన హరిన్=వాసుదేవుని, చింతించితిన్=స్మరించితిని.

తాత్పర్యము: ఆచోట నెక్కడ జూచినను భయంకరముగా నల్లుకొన్న పొదలు, వెదుళ్ళవనములు, తుప్పలు, గుల్మములు. వీని సమీపమున నొక రావిచెట్టుక్రింద స్వస్తికాసనమునఁ గూర్చుంటిని. కూర్చుండి యా పరమహంసలు నా కుపదేశించిన తెఱంగున హృదయమధ్యస్థితుఁడైన హరిని ధ్యానించితిని.

ధ్యాయత శ్చరణాంభోజం భావనిర్జిత చేతసా,
ఔత్కంఠ్యాశ్రు కలాక్షస్య హృద్యాసీన్మే శనైర్హరిః. 17

ప్రేమాతిభర నిర్భిన్న పులకాంగో ఽతినిర్వృతః,
ఆనందసంప్లవే లీనో నాఽపశ్య ముభయం మునే. 18

రూపం భగవతో యత్తన్మనః కాంతం శుచాపహమ్,
అపశ్యన్ సహసోత్తస్థౌ వైక్లబ్యా ద్దుర్మనా ఇవ. 19

దిదృక్షుస్తదహం భూయః ప్రణిధాయ మనోహృది,
వీక్షమాణో ఽపినాపశ్య మవితృప్త ఇవా తురః. 20

ఏవం యతంతం విజనే మామాహాఽగోచరో గిరామ్,
గంభీర శ్లక్ష్ణయా వాచా శుచః ప్రశమయన్నివ. 21

భావనిర్జితచేతసా—భావ=భక్తిచేత, నిర్జిత=స్వాధీనమందుంచికొనఁబడిన, చేతసా=మనస్సుచేత, చరణాంభోజం=పాదకమలమును, ధ్యాయతః=ధ్యానించుచున్నట్టియు, ఔత్కంఠ్య=ఉత్కంఠచేత నేర్పడిన, అశ్రు=కన్నీటియొక్క, కలా=బిందువుచేఁ గూడికొన్న, అక్షస్య=నేత్రములు గలిగిన, మే=నాయొక్క, హృది=హృదయమునందు, హరి=శ్రీకృష్ణపరమాత్మ, శనైః=మెల్లమెల్లఁగా, ఆసీత్=ఆవిర్భవించెను.

విశేషార్థము : చరణాంభోజం = పాద మనెడు కమలము, ఉపమిత సమాసము, భావముచేత నిర్జింపఁబడిన చేతస్సుచేత, ధ్యాయతః అనుదానితో నన్వయము. ఔత్కంఠ్యాశ్రు కలాక్షస్య = ఉత్కంఠాభావము చేత జనించిన ఆనందబాష్పములు, తద్బిందువులచేతఁ గూడుకొన్న కన్నులు గలవాఁడు. మే - అనుట కిది విశేషము.

భక్తితో నా మనస్సు నిశ్చలమైనది. నేను తోడనే భగవంతుని పాదకమలములు స్మరించుచుంటిని. ఎప్పుడెప్పుడు పరమాత్మ నా హృదయమందు దోఁచునని యుత్కంఠ. దానికన్నను ముందే జనించిన యానందబాష్పములు. వానిచేత నిండిన నా కనులు. నా హృదయమం దా హరి మెల్లమెల్లగాఁ బ్రకాశింపఁ జొచ్చెను. 17

**ప్రేమ = ప్రేమయొక్క, అతిభర = ఎక్కువభారముచేత, నిర్భిన్న = హఠాత్తుగా నాక్రమించిన, పులకాంగః = పులకలచే నిండిన శరీరము గలవాఁడును, అతి నిర్వృతః = ఎక్కువగా నానందానుభూతి గలవాఁడును, ఆనందసంప్లవే = ఆనంద మను మహాప్రవాహమందు, లీనః = లయించిపోయినవాఁడనైన (నేను), మునే = ఓ వ్యాసమునీ!, ఉభయం = రెంటినిగూడ, న అపశ్యం = చూడలేనైతిని.**

భగవంతునియందు నా కపరిమితమైన ప్రేమ యుండెను. ఆ ప్రేమతో నా శరీరమందంతయు హఠాత్తుగాఁ బులక లారంభించినవి. సర్వావయవములును పరమసుఖానుభవము నందెను. ఆ సుఖ స్ఫూర్తితో నేర్పడిన పరమానందము, ఆ యానందమందు నేను బూర్తిగా మునిఁగిపోతిని. ఈ యలజడిలో నా హృదయమందు గోచరించిన హరి స్వరూపము తిరోహితమైనది. నన్నుఁ గూడ నేను దెలియలేదు. శరీరమే మరగిపోయినది. ప్రేమాతిభర నిర్భిన్న పులకాంగః, అతినిర్వృతః, ఆనందసంప్లవే లీనః, ఈ మూఁడును సందర్భముతో నూహించికొన్న 'అహం' అను పదమునకు విశేషణములు. ప్రేమముయొక్క అతిభరము - షష్ఠితత్పురుష. దానిచే నిర్భిన్నములైన పులకలు. ఇచ్చటి 'నిర్భిన్న' శబ్దము చాల సుందరమైనది.

హఠాదావిర్భూతి యని యర్థము. పులకాంగః = పులకలచేఁ గూడిన శరీరము గలవాఁడు. బహువ్రీహి సమాసము. అతినిర్వృతః=ఇది యును బహువ్రీహియే. ఆనందముయొక్క సంప్లవము షష్ఠీ తత్పురుషము. 18

మనఃకాంతం=మనస్సు నాకర్షించుచున్నదియు, శుచాపహం = శోకమును నశింపఁజేయునదియు నైన, భగవతః=భగవంతునియొక్క, యద్రూపం= ఏ రూపము గలదో, తత్=దానిని, అపశ్యన్=చూడనివాఁడనై, వైక్లబ్యాత్=మనో వైకల్యముతో, దుర్మనాః ఇవ=మనస్సంతోషము చెడినవాఁడనువలె, సహసా= వెంటనే, ఉత్తస్థౌ=లేచితిని.

భగవద్రూపము మనస్సు నానందపఱచును. సకలదుఃఖము లను నిశ్శేషముగ నశింపఁజేయును. అట్టి స్వరూపము హృదయ మందుఁ దిరోహితమైనంతనే వైక్లబ్య మావరించినది. మనశ్శాంతి చెడి నట్లైనది. ఆ స్వరూపమును వెదకుచున్న వానివలె హఠాత్తుగా లేచి తిని. 19

భూయః=మఱల, తత్=ఆ స్వరూపమును, దిదృక్షుః=దర్శింపవలెనన్న ఇచ్ఛచేఁ గూడుకొన్న, అహం=నేను, మనః=మనస్సును, హృది=హృదయ మందు, ప్రణిధాయ=స్థిరముగా నిల్పుకొని, వీక్షమాణః అపి=చూచుచున్నవాఁడనై నను, న అపశ్యం=చూడలేకపోయితిని, అవితృప్తః=తృప్తిలేనివాఁడనైన నేను, ఆతుర ఇవ=దుఃఖితుఁడనైన వానివలె, అసం=అయితిని.

ఆ భగవత్స్వరూపమును జూడవలెననెడు తీవ్రమైన యభిలాషతో మఱల మనస్సును హృదయమందు స్థిరముగా నెలకొల్పితిని. కాని, యా స్వరూపము నా కగుపింపలేదు. అతృప్తుఁడనైన నేను దుఃఖితునివోలె నైనాను. 20

విజనే=ఏకాంతస్థానమందు, ఏవం=ఈ ప్రకారము, యతంతం=యత్నించుచున్న, మాం=నన్నుగూర్చి, గిరాం=వాక్కులకు, అగోచరః=విషయముగాని

వాఁడైన, పరమాత్ముఁడు, గంభీరశ్లక్ష్ణయా=గంభీరమును, మృదువునైన, వాచా=వాక్కుచేత, శుచః=సంకటములను, ప్రశమయన్నివ=శమింపఁజేయువాని వలె, ఆహ=పలికెను.

విజనమైన స్థలమునందుఁ గూర్చున్న నేను, ఆ భగవత్స్వరూపమును మఱలఁ గాంచుటకుఁ దీవ్రముగ యత్నించుచుంటిని. అప్పుడు వేదవాక్కులకును విషయము గానివాఁడును, అనుభవమాత్ర స్వరూపుఁడైన పరమాత్ముఁడు గంభీరమై మృదులమైనవాక్కుతో సమస్త సంతాపమును శమింపఁజేయుచున్న వానివలె నిట్లు పలికెను. 21

హంతాఽస్మిన్ జన్మని భవాన్ మామాంద్రష్టు మిహార్హతి,
అవిపక్వ కషాయాణాం దుర్దర్శోఽహం కుయోగినామ్. 22

సకృద్యద్దర్శితం రూపం మే తత్కామాయ తే ఽనఘ,
మత్కామ శ్శనకై స్సాధు సర్వాన్ముంచతి హృచ్ఛయాన్.

సత్సేవయా ఽదీర్ఘయా తే జాతా మయి దృఢామతిః,
హిత్వా ఽవద్యమిమం లోకం గంతా మజ్జనతా మసి. 24

మతిర్మయి నిబద్ధేఽయం న విపద్యేత కర్హిచిత్,
ప్రజాసర్గ నిరోఽధేపి స్మృతిశ్చ మదనుగ్రహాత్. 25

ఏతా వదుక్త్వో పరరామ తన్మహ
ద్భూతం నభోలింగ మలింగమీశ్వరమ్,
అహంచ తస్మై మహతాం మహీయసే
శీర్ష్ణాఽవ నామం విదధే ఽనుకంపితః. 26

హంత=అయ్యో పాపము, భవాన్=నీవు, అస్మిన్ జన్మని=ఈ జన్మమందు, మా=నన్ను, ద్రష్టుం=చూచుటకు, మా అర్హతి=అర్హుఁడవు గావు, అవిపక్వ=సమూలముగా నశింపని, కషాయాణాం=మలములచేఁ గూడిన, కుయోగినాం=కుత్సితులైన యోగులకు, అహం=నేను, దుర్దర్శః=చూడ నలవిగానివాఁడను.

దయాపూర్వముగా నన్ను సంబోధించుచు, భగవంతుఁ డిట్లు పలికెను. "అహో! ఎంత శ్రమపడితివి. కాని, నాయనా! ఈ జన్మ మందు నీవు నన్నుఁ జూచుట కర్హుఁడవు గావు. కామాది దోషములు సంపూర్తిగా నశింపని కుయోగులు నన్నుఁ గన్గొనలేరు. 22

సకృత్—ఒక్కసారి, రూపం—స్వరూపము, దర్శితం—చూపింపఁబడిన దనుట, యత్—ఏది కద్దో, ఏతత్—అది, అనఘః—పాపములేనివాఁడా!, తే—నీ యొక్క, కామాయ—అగ్రహామునుంచి ఏర్పడినది, మత్కామః—నా యం దేర్పడిన తీవ్రమైన ఇచ్ఛ, శనకైః—మెల్లమెల్లగా, సాధు—సమూలముగా, సర్వాన్—సమస్తములైన, హృచ్ఛయాన్—కామములను, ముంచతి—వదలిపెట్టును.

ఒక్కసారి నా రూపము నీకుఁ జూపితిని. అదిగూడ నా రూపమును దర్శింపవలె ననెడు నీ తీవ్రేచ్ఛ ననుసరించి యేర్పడినది. ఆ దర్శనము నీ ప్రేమను దీవ్ర మొనర్చుటకే. ఓయి పాపము లేనివాఁడా! నాయందుఁగల తీవ్రేచ్ఛ క్రమముగా నేను దప్ప తక్కిన కామముల నన్నిటిని సమూలముగ నశింపఁజేయును. 23

అదీర్ఘయా—స్వల్పకాలమేయైన, సత్సేవయా—సాధుపుంగవుల సేవచేత, తే—నీకు, మయి—నాయందు, దృఢా మతిః—దృఢమైన బుద్ధి, జాతా—ఏర్పడినది, అవద్యం—నింద్యమైన, ఇమంలోకం—ఈ శరీరమును, హిత్వా—ఉపేక్ష యొనర్చినవాఁడవై, మజ్జనతాం—నాకు సంబంధించినవాఁడవు అనెడు స్థితిని, గంతాసి—పొందెదవు.

అల్పకాలము నీ వొనర్చిన సాధుసేవచేత, నాయందు దృఢమైన మతి యేర్పడినది. నింద్యమైన నీ యీ శరీరము నుపేక్షించి, నా పార్షద్యుఁడుగా నయ్యెదవు. 24

మయి—నాయందు, నిబద్ధా—నిబద్ధింపఁబడిన, ఇయం మతిః—ఈ నీ బుద్ధి, కర్హిచిత్—ఏ కాలమందును, న విపద్యేత—విపత్తునకు వశము గాదు, మదనుగ్రహాత్—నా యనుగ్రహామువలన, ప్రజాసర్గ నిరోధేఽపి—ప్రళయకాలమందుఁ గూడ, స్మృతిశ్చ—ఈ యనుభవమునకు సంబంధించిన స్మృతిగూడ నీకు నశింపదు.

నాయందు నిబద్ధమైన ఈ భావము, ఈ స్మృతి లోకము సర్వమును నశించి, మఱియొక సృష్టి యారంభమైన కాలమందును నశింపదు. నా యనుగ్రహము నీపై నట్లుగా సంపూర్ణముగా నుండును. భగవద్భజనయొక్క మహిమ ఈ శ్లోకమందు సూచింపఁబడినది. కర్మఫలము నశించును. భగవద్భజనఫలము అనశ్వరమైనది. 25

**నభోలింగం=ఆకాశమందున్న మూర్తితోఁ గూడినదియు, అలింగం=కంటితోఁ జూడ నశక్యము గానిదియు, ఐశ్వరం=ఈశ్వరునకు సంబంధించిన, తత్ మహాభూతం=ఆమహాభూతము, ఏతావత్=ఇంతమాత్రము, ఉక్త్వా=చెప్పి, ఉపరరామ=విరమించినది, అహంచ=నేనును, అనుకంపితః=ఆ పరమాత్మని కరుణకు పాత్రుఁడనై, మహతాం=గొప్పవారిలో, మహీయసే=గొప్పవాఁడైన, తస్మై=ఆ పరాత్పరుని గూర్చి, శీర్ష్ణా=తలను వంచి, అవనామం=నమస్కారమును, విదధే=చేసితిని.**

భగవత్స్వరూప మాకాశమం దభివ్యక్తమై యుండెను. కాని అది కన్నులకుఁ గానరానట్టిది. ప్రపంచమందు సమస్త పదార్థములను వాని వాని చోటులలో నుంచి, యన్నిటిని నియమించుచు రక్షించున దా మూర్తి, బ్రహ్మస్వరూపమైన ఈ సత్యవస్తువు; ఈ మాత్రము పలికి మౌనము వహించెను. మహద్వస్తువులలో మహత్తైన పదార్థమది. ఆ సత్యస్వరూపముయొక్క కారుణ్యమునకు నేను పాత్రుఁడనైతిని. నేను శిరస్సును వంచి యా స్వరూపమునకు నమస్కరించితిని.

**శ్రీధరీయము :**

భావనిర్జితచేతసా=భావ మనఁగా నిచట భక్తి. భక్తిచేత వశీకృతమైన చేతస్సు. ఔత్కంఠ్యముతో నశ్రుకలాయుక్తములైన యక్షులెవరికి గలవో వాఁడు. నారదుఁ డన్నమాట.

ఆనందములయొక్క సంప్లవము. మహాపూరము, ఉభయమును తన్నును, పరుఁడైన పరమాత్మను నారదుఁడు చూడలేదన్నమాట.

ప్రణిధాయ=స్థిరముగాఁ జేసికొన్నవాఁడనై.

గిరాం=అగోచరః_వేదవచనములకు నవిషయుఁడైన పరమాత్ముఁడు.

అవిపక్వ కషాయాణాం_అవిపక్వ=అదగ్ధములైన, కషాయాణాం_కామాది మలములు గలిగినట్టి, కుయోగినాం=అనిష్పన్నులైన యోగులకు, అహం దుర్దర్శః_నేను చూచుట కసాధ్యుఁడను.

ఏ తత్కామాయ_నాయందలి యనురాగముకొఱకు.

అదీర్ఘయా అపి సతాం సేవయా=అచిరకాలమేయైన సత్పురుషుల సేవతో, అవద్యం_నింద్యమైన, దోషసంపాదకమని తాత్పర్యము. ఇమంలౌకం దేహం=దాసీపుత్ర కళేబరమును, మజ్జనతాం=నాయొక్క పార్షదత్వమును, గంతా అసి_పొందఁబోయెదవు.

ప్రజాసర్గనిరోధేఽపి_ప్రజలయొక్క సృష్టియందును సంహారమందును లేక ప్రజాసర్గముయొక్కనిరోధము. ప్రళయకాలమందని యర్థము.

మహద్భూతం_'ఏతస్యవా అక్షరస్య మహతో భూతస్య నిశ్వసితమేత దృగ్వేదః' అని శ్రుతి. ఐశ్వరం_సర్వనియంతయైనట్టి, నభోలింగం=నభస్సునందు. లింగ మనఁగా మూర్తి దేనికిఁ గలదో అది నభోలింగం. 'ఆకాశ శరీరం బ్రహ్మ' అని శ్రుతి. అలింగం=దగ్గఱగానున్నను, జ్ఞానోదయము లేక కనుఁగొనుటకు సాధ్యము గానిది. అవనామం_ప్రణామము.

**విజయధ్వజము :**

అవ: ఉపాసనా ఫలమును జెప్పుచున్నాఁడు_

భావనిర్వృత్త చేతసః_భక్తితోఁ బరమానందమునందిన మనస్సు గల, ఔత్కంఠ్యాశ్రు కలాక్షస్య శనైః=క్రమముగా స్థిరమైనమనస్సుతో, చరణాంభోజం ధ్యాయతః=మే హృది_హరిః_ఆసీత్ _భావనిర్వృత్త చేతసః అని వీరి పాఠము. 'మే' అను దానికి విశేషణము. శనైః అను దానికి చరణాంభోజం ధ్యాయతః అను దానితో నన్వయము.

తాత్పర్యము: ఆ పరమహంస లుపదేశించిన పద్ధతితో నేను శ్రీహరి పాదారవిందములను ధ్యానించితిని. నా మనస్సు భక్తితోనిండి పరమానందమును బొందినది. నాకు వాసుదేవునియందు కుతూహల మధిక మయ్యెను. తత్ఫలముగాఁ గనులలో నీరు నిండికొన్నది. బాష్పనిబిడలోచనుఁడనైన నా హృదయమందు ఏకాగ్రచిత్తుఁడ నగుటతో శ్రీహరి యొకసారి వ్యక్తుఁ డయ్యెను.

మునే!=త్రికాలజ్ఞానియైన వ్యాసభగవానుఁడా!, ప్రేమాతిభర నిర్భిన్నపులకాంగః=అతినిర్వృతః=అత్యంతసుఖము ననుభవించుచున్న దానిచేతనే, యానందసంప్లవే=అపారమైన యానందసముద్రమందు, లీనః=మునిఁగిపోయిన నేను, అపశ్యం=వానినేచూచితిని, ఉభయం=వానికి సమమైన లేక యధికమైన వస్తువును, నాపశ్యం = చూడలేదు. శ్రీహరియే సర్వోత్తముఁడని ధ్యానించితినని భావము.

తాత్పర్యము: ఆ యప్రాకృత రూపమును జూచిన నాకు, ఆ హృషీకేశునందు మఱికొంత తీవ్రమైన భక్తి యేర్పడినది. నా శరీరము రోమాంచకంచుకిత మయ్యెను. నే నత్యంతసుఖినైతిని. ఆనంద మహాసాగరమున మునిఁగిపోయినాను. శ్రీహరియే సర్వోత్తముఁడు. వానికి సముఁడుగాని యధికుఁడు గాని మఱియొకఁడు లేఁడని నాకు జ్ఞాన మేర్పడినది.

అవ: తర్వాత నే మైనదో తెల్పుచున్నాఁడు-

భగవతః=పరమాత్మునియొక్క, యత్=ఏ, మనఃకాంతం=మనోహరమైనదియు, సుఖావహం = చూచువారలకు సుఖమును గల్గించు, తత్ రూపం = ఆ చూడఁబడిన యప్రాకృత రూపమును, సహసా అపశ్యన్=ఉన్నట్లుండి చూడనివాఁడనై, దుర్మనాః=దుఃఖము గొన్న మనస్సు గలవాఁడనై, కైవల్యా దివ=ముక్తినందినవాఁడు మోక్షమునుండి పడుటెట్లో అట్లు, ఉత్తస్థౌ=ధ్యానమునుండి లేచితిని.

తాత్పర్యము: వాసుదేవుని స్వరూపము మనోమోహకమై యుండెను. తద్దర్శన మాత్రమే పరమసుఖదాయకమై యుండెను. ఇట్టి యీ భగవద్రూపమును నేను చూచుచుండగనే యది యదృశ్యమైనది. అప్పుడు నా మనస్సునకు మహాదుఃఖ మయ్యెను. ముక్తుఁడైనవాఁడు ఆ ముక్తిసౌఖ్యమును బోఁగొట్టుకొన్నచో దుఃఖపడునట్లు నేనును, మహాదుఃఖమున కధీనుఁడ నైతిని. శుచాపహాం అని శ్రీధరుల పాఠము. సుఖావహాం అని వీరి పాఠము. వైక్లబ్యాద్దుర్మనా ఇవ అని శ్రీధరుల పాఠము. కైవల్యాద్దుర్మనా ఇవ అని విజయధ్వజులపాఠము.

భూయః=మరల, తత్=ఆ వాసుదేవుని రూపమును, దిదృక్షుః=చూడనిచ్ఛించిన, అహం=నేను, హృది=మనః, ప్రణిధాయ=మనస్సును దృఢముగా నిల్పుకొన్నవాఁడనై, హృదయగతుఁడైన శ్రీహరియందే మనస్సుంచి ఏకాగ్రభావముతో నుంటినని యర్థము. ఆతుర ఇవ=రోగివలె, అవితృప్తః=తృప్తిలేనివాఁడనై, వీక్షమాణోఽపి=శ్రీహరిరూపమునే నిరీక్షించుచున్నను, నాపశ్యం=చూడలేకపోతిని.

తాత్పర్యము: ధ్యానమునుండి యెచ్చరికగొంటిని. మఱియొకసారి యారూపమును జూడవలెనన్న యాశ హృద్గతుఁడైన శ్రీహరియందే మఱల మనస్సు నేకాగ్రతతో నిలిపినాను. రోగియైనవాఁడు తృప్తిలేక కాతరుఁడగునట్లు నేనును యా పరమాత్మరూపమును జూడవలెనని యాసగొంటిని. కాని నాకు మఱల వాసుదేవుఁడు దర్శనమీయనే లేదు.

శ్రీహరికి భక్తులపైనున్న వాత్సల్యము ఆశ్చర్యకరమైనదని చెప్పుచున్నాఁడు–

గిరాం=వేదవాక్కులకు, అగోచరః=సాకల్యముగా విషయముగా నట్టి, అదృశ్యుఁడైన వాసుదేవుఁడు, గంభీరశ్లక్ష్ణయా=అర్థగర్భితమును, గంభీరమునునైన, వాచా=వాక్కుచేత, శుచః=నా మనోదుఃఖములను, ప్రశమయన్నివ = పోఁగొట్టుచున్న వానివలె,

ఏవం=పైఁ జెప్పినట్లు, విజనే=జనసంచారములేని యరణ్యమునందు, యతంతం=ఆ పరమాత్మను జూచుటకై ప్రయత్నించుచున్న నన్నుఁ జూచి, ఆహ=పలికెను.

శ్రీహరి భక్తవాత్సల్య మాశ్చర్యకరమైనది. వేదవాక్యములనాదియైనవి. అనంతములు. కాని యవి వానిగుణములను సంపూర్తిగా వర్ణింప నేరవు. ఇట్టి మహామహిముఁడైన శ్రీహరి నిర్జనమైన యరణ్యమందుఁ గూర్చుండి తదవలోకనమునకై యత్నించుచున్న నాపై ననుగ్రహించెను. అదృశ్యుఁడుగానుండియే నన్నుగూర్చి యతి మధురములైన వాక్యములు వచించెను. వాని మాట లర్థగర్భితములైనవి. వానితో నా మనోదుఃఖము దొలఁగినది.

అవ: భగవద్వాక్యములను జెప్పుచున్నాఁడు-

హంత! భవాన్, ఇహ=ఈ భూలోకమందు, అస్మిన్ జన్మని=దాసీపుత్త్రుఁడవైన ఈ జన్మమందు, మాం ద్రష్టుం, నార్హసి=అహం=అవిపక్వకషాయాణాం=పాపఫలమును బూర్తిగా ననుభవింపని, కుయోగినాం=జన్మచేతను అజ్ఞానము చేతను ధ్యానాదుల సరిగా నభ్యసింపలేని కుయోగులకు, దుర్దర్శః=చూడరానివాఁడను.

తాత్పర్యము: పాపఫలమును సంపూర్తిగా ననుభవించి, వాని నుండి విముక్తిఁబొందినవారే సాధనసంపత్తి నందెదరు. అట్టియోగులే నన్ను సులభముగాఁ గనుఁగొనఁగలరు. ఇంకను పాపఫలము ననుభవింపవలసినవారు ఉత్తమకులమందు జన్మింపరు. వారి కుత్తమమైన జ్ఞానముగూడ నుండదు. ఇట్టివారు ధ్యానాదులను జక్కగా నభ్యసింపలేరు. ఈ కుయోగులు నన్నుఁ జూడవలసినచో నెక్కువ కష్టపడవలెను. నీవు భూలోకమున దాసిపుత్త్రుఁడవై నందున నీ పుట్టువున నన్నుఁ గాంచనేరవు. నీవు సంసార దుఃఖరహితుఁడవు.

అవ: ఐనచో మొదలు నీరూపమును నాకెందుకుఁ జూపించితివి? దీనికి సమాధానము :

అనఘ !_సాంసారిక దుఃఖరహితుఁడైన వాఁడా !, యత్ = ఏ, ఏతత్ = ఈ యప్రాకృతికమైన, రూపం సకృత్ దర్శితం, తే = కామాయ, 'నిన్నెప్పుడు చూతు'నను తీవ్రమైన యాసను, నీయందుఁ గల్గించుటకే. ఈ యాసతోఁ బ్రయోజనమేమి?, మత్కామః=నన్ను దర్శింపవలెనను కుతూహలముతోఁ గూడిన భక్తుఁడు, శనకైః= క్రమముగా, సర్వాన్=సమస్తములైన, హృచ్ఛయాన్=మనస్సునందున్న సమస్తాశలను, సాధు, ముంచతి=తొలఁగించికొనును, నా యాన తప్ప నే కోరికయు నతని కుండదని భావము.

తాత్పర్యము: నీ కొక్కసారి నా యప్రాకృత రూపమును జూపితిని, ఎందుకు? నిన్ను నా రూపమును మరలఁ జూడవలెనను కుతూహలముచే నిండిన వానినిగా నొనర్చుటకు. ఎవఁడు నా రూపమును జూడవలెనని నేఁకారునో వాఁడే నా భక్తుఁడు. వాఁడు క్రమముగా మనోగతములైన సకలాశలను దొలఁగించి కొనును. నన్నుఁ జూడవలెనను నాసదప్ప వాని కింకొక్క కోరికయే యుండదు.

అవ: పరమహంసలను సేవించిన ఫలములను జెప్పుచున్నాఁడు_

దీర్ఘయా=బహుకాలము నిర్వహించిన, సత్సేవయా, మయి, దృఢామతిః_దృఢమై మనన రూపమైన భక్తి, జాతా వై=ఏర్పడినది గదా! ఆ కారణముతో అవద్యం ఇమం లోకం, ఈ దాసిపుత్ర దేహమును, హిత్వా_వదలి_ఇఁకపైని బ్రహ్మపుత్రుఁడవై జన్మించి, నీవు, మజ్జనతాం=పరమభాగవతస్థితిని, గంతాసి=పొందఁబోయెదవు.

నీవు బహుకాలము నా భక్తులైన పరమహంసలను నిశ్చల భక్తితో సేవించితివి. తత్ఫలముగనే నీకు నాయందు దృఢమైన జ్ఞాన

మును భక్తిని యనుగ్రహించితిని. సంస్కారరహితమైన నీ దేహము దోషయుక్తమైనది. దీనిని వదలి ఇఁకపై నీవు బ్రహ్మపుత్త్రుఁడవుగా జన్మింతువు. ఆ జన్మలో నీవు పరమ భాగవతుఁడ వయ్యెదవు.

మయి నిబద్ధాం ఇయం, మతిః=జ్ఞానము, కర్హిచిత్=ఎప్పుడును, నవిపద్యేత=నాశముగాదు, ప్రజాసర్గనిరోధేఽపి=ప్రజలసృష్టికాలమందును-ప్రళయకాలమందును గూడ (ఇవే జాతిస్మరణమును బోఁగొట్టు కాలములు) స్మృతిశ్చ=జాతిస్మరణ, మదనుగ్రహాత్=నా యనుగ్రహముతో, న విపద్యేత=నాశమందదు. దీనినుండి భగవద్భక్తుల సహవాసము ఇష్టఫలము నిచ్చునని చెప్పినట్లైనది.

తాత్పర్యము: ఇప్పుడు నీకున్న మద్విషయకమైన యీ దృఢజ్ఞాన మెప్పుడును నాశము గాదు. సృష్టికాలము, ప్రళయకాలము ఈ రెండును జాతిస్మరణమును బోఁగొట్టునవి. ఐనను నేను నీయం దనుగ్రహ ముంచితిని. అగుటచే నా కాలములందును జాతిస్మరణ నిన్ను వీడదు.

ఈశ్వరం= 1. నియమన మొనర్చుటే స్వభావముగాఁగల 2. సమస్త జనులను ప్రవర్తించునట్లు చేయు సామర్థ్యముగల, అలింగం =1. జడశరీరము లేని, 2. రుద్రదేవునికంటె భిన్నమైన, నభోలింగం =ఆకాశమువలె సర్వత్రవ్యాప్తమైన, తన్మహద్భూతం=ఆ మహాభూతమైన పరబ్రహ్మరూప వస్తువు, (శ్రీహరి) ఏతావదుక్త్వా, ఉపరరామ= అనుకంపితః=వాసుదేవునిచే దనకృపకుఁబాత్రుఁడనుగాఁ జేయఁబడిన, అహం చ=నేనును, మహతాం మహీయసే=దొడ్డవారైన లక్ష్మి బ్రహ్మాదులకన్నను గొప్పవాఁడైన, తస్మై=మహాభూత మనఁబడెడు విష్ణువును గూర్చి, శీర్ష్ణా, అవనామం, విదధే.

తాత్ప: శ్రీమహావిష్ణు విట్లుపలికి మౌనము వహించెను. వాని స్వభావమే నియమించుట. అందఱను స్వప్నసాధనప్రవృత్తులనుగా

నొనర్చుటు. వానికి జడశరీరము లేదు. రుద్రాదులకంటె సత్తుడు భిన్నుఁడు. ఆకాశమువలె సర్వత్ర వ్యాపించినవాఁడు. ముఖ్యముగా మహాభూత మనెడు పేరాతనికే చెల్లును. ఈ రీతి సర్వోత్తముఁడైన శ్రీహరి నావంటి యల్పునిపై దయ గన్పఱచి యనుగ్రహించుట యతని గొప్పతనమే. నిర్వ్యాజముగ నిట్లుపకార మొనర్చిన భగవంతునకు నేనే మీయఁ గలను? సర్వోత్తముఁడైన యా శ్రీహరికి శిరము వంచి నమస్కరించితిని.

నామా న్యనంతస్య గతత్రపః పఠన్
గుహ్యాని భద్రాణి కృతాని చ స్మరన్,
గాం పర్యటం స్తుష్టమనా గతస్పృహః
కాలం ప్రతీక్షన్ విమదో విమత్సరః. 27

ఏవం కృష్ణమతే ర్బ్రహ్మన్ః అసక్తస్యామలాత్మనః,
కాలః ప్రాదురభూత్కాలే తటిత్సౌదామనీ యథా. 28

ప్రయుజ్యమానే మయి తాం శుద్ధాం భాగవతీం తనుమ్,
ప్రారబ్ధకర్మ నిర్వాణో న్యపతత్ పాంచభౌతికః. 29

కల్పాంత ఇదమాదాయ శయానేఽంభస్యు దన్వతః.
అనుప్రాణం శిశయిషోర్వి విశేఽంతరహం విభోః. 30

సహస్రయుగపర్యంత ఉత్థాయేదం సిసృక్షతః.
మరీచిమిశ్రా ఋషయః ప్రాణేభ్యోహం చ జజ్ఞిరే. 31

అంతర్బహిశ్చ లోకాంస్త్రీన్ పర్యేమ్యస్కందితవ్రతః,
అనుగ్రహా న్మహావిష్ణో రవ్యాహతగతిః క్వచిత్. 32

దేవదత్తా మిమాం వీణాం స్వరబ్రహ్మ విభూషితామ్,
మూర్ఛయిత్వా హరికథాం గాయమానశ్చ రామ్యహమ్.

గతత్రపః—సంపూర్తిగా నశించిన లజ్జగలవాఁడనై, అనంతస్య—అనంతుఁడైన భగవంతునియొక్క, గుహ్యాని—రహస్యములైన, నామాని—నామములను, పఠన్—పఠించుచున్న వాఁడుగను, భద్రాణి—సమస్త లోక మంగళకరములైన, కృతాని—కార్యములను, స్మరన్—స్మరించువాఁడుగనునై, గాం—భూమిని, పర్యటన్—తిరుగుచున్నవాఁడనై, తుష్టమనాః—నిత్యతృప్తమైన మనస్సు గలవాఁడనై; గతస్పృహః— దేనియందును నాశలేనివాఁడనై, విమదః—విగతమైన మదము గలవాఁడును, విమత్సరః—విగతమైన మత్సరభావము గలవాఁడుగనునై, కాలం—కాలమునుగూర్చి, ప్రతీక్షన్—ఎదురుచూచుచున్నవాఁడనై, జీవించుచుంటిని.

అపరిచ్ఛిన్నుఁడైన భగవంతుని యొక్కొక్కలీలను సూచించుచున్న రహస్యములైన నామములను గట్టిగా పఠించుచుంటిని. భగవంతుఁ డొక్కొక్క యవసరమం దొనర్చిన లోకభద్రములైన కర్మములను స్మరించుచుంటిని. నాకు మానవసహజమైన లజ్జ భగవద్విషయమున నెన్నఁడో నశించినది. ఒక ప్రదేశమున నిలుకడగా నేనుండుట లేదు. అనేక స్థలములు దిరుగుట, ఆ యా చోటులందు సంభవించు నవస్థలతో సంతోషమునే పొందెదువాఁడను. భగవంతునందు దప్ప మఱియొక దానియందు గోర్కె లేనే లేదు. మదమాత్సర్యము లెన్నఁడో నశించిపోయినవి. మనస్సు పరిశుద్ధమై యుండెను. ఆ దాసీపుత్ర శరీరమును విసర్జింపవలసిన కాలమును గూర్చియే యోచించుచుంటిని. **27**

బ్రహ్మన్ః = బ్రహ్మవేత్తలైన యో వ్యాసమునీ!, ఏవం — ఈ ప్రకారము, కృష్ణమతేః — కృష్ణునియందే నిమగ్నమైన మనస్సు గలిగిన, అసక్తస్య — దేనియందు నాసక్తిలేని, అమలాత్మనః—కామాది మలరహితమైన మనస్సుతోఁ గూడియున్న నాకు, కాలే—సమయమందు, కాలః—మృత్యువు, సౌదామనీ—మేఘమాలయందున్న, తటిద్యథా—మెఱుపుతీఁగవలె, ప్రాదుర్భవించినది.

బ్రహ్మవేత్తవైన యో మహామునీ! నా మనస్సు కృష్ణునియందు మాత్రమే యాసక్తమైయుండెను. తద్భిన్న విషయమందుఁ గోర్కెయే లేదు. కామాదిదోషములు నా మనస్సునుండి యెన్నఁడో

సంపూర్తిగఁ దొలఁగిపోయినవి. నా భౌతికశరీరము విడువవలసిన సమయ మాసన్నమైనప్పుడు హఠాత్తుగ మేఘమాలనుండి ప్రత్యక్షమయ్యెడు తట్టిత్తువలె మృత్యువు ప్రత్యక్షమైనది. 28

మయి=నాయందు, శుద్ధాం=పరిశుద్ధమైన, భాగవతీం=భగవంతునకు సంబంధించియున్న, తాం తనుం=ఆ శరీరమును, ప్రయుజ్యమానే=ప్రయోగింపఁబడుచున్న సమయమందు, ప్రారబ్ధకర్మ నిర్వాణః=ప్రారబ్ధమైన కర్మకుఁ బరిసమాప్తిరూపముగా, పాంచభౌతికః=పంచభూత నిర్మితమైన దేహము, న్యపతత్=కూలిపోయిన దయ్యెను.

ఈ శరీరము పతనమయ్యెడు సమయమందు నాకు పరిశుద్ధమైన పార్షదశరీరము సంభవించునని, భగవంతుఁ డనుగ్రహించియుండెను. ఆ యాజ్ఞ ననుసరించి భగవత్పార్షద శరీరము నాకొఱకై పరమాత్ముఁడు నిర్మించు సమయమందు ప్రారబ్ధకర్మావసానమైయుండినది. అందుచే పంచభూతములచే నిర్మింపఁబడిన ఈ శరీరము భూమిమీఁదఁ బడిపోయెను. దీనిచే సిద్ధించు నర్థమేమి? భగవత్పార్షద శరీరము కర్మానుకూలముగా నిర్మింపఁబడినది గాదు. అది శుద్ధమైనది. నాశరహితమైనది. 29

కల్పాంతే=కల్పాంతమందు, ఇదం=ఈ లోకమును, ఆదాయ=స్వీకరించి ఉదన్వతః=సముద్రముయొక్క, అంభసి=నీటియందు, శయానే=పండియున్నట్టి వానియందు, శిశయిషోః=చేరి నిద్రించుట కిచ్ఛించుచున్న, విభోః=బ్రహ్మదేవుని యొక్క, అనుప్రాణం=ప్రాణముతోఁ గూడ, అంతః=లోపలికి, అహం=నేను, వివిశే=ప్రవేశించితిని.

కల్పాంతసమయమందు పరాత్పరుఁడు ముల్లోకముల నుపసంహరించుచు ఏకార్ణవమం దాతఁడు శయనించును. ఆతనితోఁ బాటు శయనింపఁ గోరుచున్న బ్రహ్మయొక్క శ్వాసవాయువుతోఁ బాటు నే నతనిలోనికిఁ బ్రవేశించితిని.

తతో ఉవతీర్య విశ్వాత్మా దేహమాశ్రిత్య చక్రిణః,
అవాప వైష్ణవీం నిద్రాం ఏకీభూయాథ విష్ణునా.

అని కూర్మపురాణ వచనము. కల్పాంతకాలమందు విశ్వాత్ముడైన బ్రహ్మదేవుడు సత్యలోకమునుండి క్రిందికి దిగును. చక్రాయుధమును ధరించిన మహావిష్ణువు శరీరము నాశ్రయించి యతనితో నేకాత్ముడై వైష్ణవమైన నిద్ర ననుభవించెనని తాత్పర్యము. 30

**సహస్రయుగపర్యంతే—సహస్రయుగములు గడచిన తర్వాత, ఉత్థాయ—వైష్ణవమైన నిద్రనుండి లేచినవాడై, ఇదం—ఈ సమస్త ప్రపంచమును, సిసృక్షతః—సృష్టించుట కిచ్ఛగించుచున్న వానియొక్క, ప్రాణేభ్యః—అంగములనుండి, మరీచిమిశ్రాః—మరీచి మొదలైన, ఋషయః—మహర్షులును, అహంచ—నేనును, జజ్ఞిరే—జన్మించిరి.**

వేయి చతుర్యుగములు గడచిపోయినవి. అంతవఱకును బ్రహ్మదేవుడా నీటియందు శయనించెను. తదవసానమం దాతడు లేచి సృష్ట్యారంభమునకై యిచ్ఛించెను. అప్పుడు బ్రహ్మదేవుని యొక్కొక్క యింద్రియమునుండి మరీచి మొదలైన ఋషులు, నేనును జన్మించితిమి. 31

**మహావిష్ణోః—శ్రీమహావిష్ణువుయొక్క, అనుగ్రహాత్—అనుగ్రహమువలన క్వచిత్—ఎక్కడనుగాని, అవ్యాహతగతిః—విఘాతములేనట్టి గతితోఁ గూడినవాఁడనై, అస్కందితవ్రతః — ఎప్పుడును అల్పవిఘ్నమైనను ప్రాప్తింపని వ్రతముతోఁ గూడినవాఁడనై, త్రీన్ లోకాన్—మూఁడు లోకములను, అంతర్బహిశ్చ—లోపలను బైటను, చరేమి—సంచరింతును.**

శ్రీమహావిష్ణువు ప్రసాదము కారణముగా నా బ్రహ్మచర్యవ్రతమునకు లేశమును హాని యెప్పుడును సంభవింపలేదు. నాగమనమున కెయ్యెడను క్షతిగానము. ఒకప్రదేశమున నిలుకడలేక ముల్లోకముల లోపలను బయటను సంచరింతును. కర్మయందు శ్రద్ధగలవారు ముల్లోకముల బహిస్థ్సలములందు సంచరింపలేరు. తపోనుష్ఠానమున బ్రహ్మలోకమును బొందినవారు త్రిలోకముల యంతర్భాగముల సంచరింపరు. నారదుడు మూఁడు లోకముల లోపలను బయటను

సంచరించుచుండెను. అనఁగాఁ గర్మనిష్ఠులకంటెను తాపసులకంటెను నధికమైన స్థితియం దుండెనని యర్థము. దీనికిఁ గారణము శ్రీమహా విష్ణువు ప్రసాదమే. 32

స్వరబ్రహ్మవిభూషితాం = సప్తస్వరరూపమైన బ్రహ్మముతో నలంకరింపఁ బడిన, దేవదత్తాం—చతుర్ముఖబ్రహ్మతో ననుగ్రహింపఁబడిన, ఇమాం వీణాం—ఈ వీణను, మూర్ఛయిత్వా—మూర్ఛనలతో నాలాపింపఁజేసి, హరికథాం—శ్రీ మహా విష్ణువునకు సంబంధించిన కథను, గాయమానః—గానము చేయుచున్నవాఁడనై, అహం—నేను, చరామి—సంచరించుచుందును.

అవ: తాను సంచరించుచున్న దీశ్వరుని యాజ్ఞానుసారమే. ఆ సంచరించుట సమస్త లోకమంగళములకే. ఈ విషయమునే నాల్గు శ్లోకములతోఁ జెప్పుచున్నాఁడు—

ఈ వీణ నా కీశ్వరదత్తమైనది. సప్తస్వరస్వరూపమైన బ్రహ్మముతోఁ గూడినది. దీని యారోహణావరోహణ క్రమము ననుసరించి నేను గాన మొనర్తును. దీనినుండి బయల్వెడలు మూర్ఛనల కధీనమై నా హరికథ యుండును. 33

శ్రీధరీయము:

అవిచ్ఛిన్నుఁడైన భగవంతునియొక్క, నామానిపఠన్, గుహ్యాని =ప్రాకృతబుద్ధులచేతఁ దెలియుట కశక్యములైన, కృతాని=అవతార చేష్టితములును, స్మరన్=స్మరించుచు, గాంపర్యటన్=భగవంతుని లీలా దర్శనార్థము భూమియందంతయు సంచరించుచున్న వాఁడనై, విమత్సరః—కామక్రోధాది షడ్వర్గరహితుఁడనై, కాలం ప్రతీక్షన్—ప్రాకృత దేహ వియోగకాలమున కెదురుచూచుచున్న వాఁడనై.

కృష్ణమతేః=కృష్ణునియందు భక్తిచేఁ గూడిన బుద్ధిగల, అసక్తస్య—విషయములం దనాసక్తచిత్తవృత్తిగల, అమలాత్మనః—స్వచ్ఛమైన యంతఃకరణము గలిగిన, కాలే = తన యవసర కాలమందు, కాలః—మృత్యువు, ప్రాదురభూత్ —అవిర్భవించినది. హఠాత్తుగా నాకి

ర్శవించుటలో దృష్టాంతమును జెప్పుచున్నాఁడు. సౌదామనీ తటి ద్యథా = 'సౌదామనీ' యను విశేషము స్ఫుటత్వ దర్శనార్థము. 'సుదామ' యనఁగా మాల. తత్రభవా సౌదామనీ=దానియందు దేర్ప డినది. మాలాకారమైనదని యర్థము. లేక సుదామ యని యొకా నొక స్ఫటికపర్వత విశేషమునకుఁ బేరు. 'తేనైకదిక్' అను సూత్ర ముచే 'అణ్' ప్రత్యయము, స్ఫటికాదిమయ పర్వతప్రాంతభవమైన విద్యుత్తు చాల స్ఫుటముగా నుండును. ఆ రీతిగానని యర్థము, లేక తటిత్=సమీపమందున్న, 'తటిదిత్యంతిక వధయోః' అని నైరు క్తము. సమీపమందు హఠాత్తుగాఁ బ్రకాశించిన తటిత్తని యర్థము.

'హిత్వా ఽవద్యమిమం లోకం గంతామజ్జనతా మసి' అను శ్లోక ప్రకారము దేహావసానకాల మందని యర్థము. శుద్ధాం=పరి శుద్ధమైన, సత్త్వమయమైనట్టి, భాగవతీం=భగవత్పార్షద రూపమైన, తనుం=శరీరమును, అట్టి యా శరీరమును గూర్చి భగవంతునిచేత, మయి=నేను, ప్రయుజ్యమానే=తీసికొనిపోఁబడినవాఁడ నగుచుండఁగా ప్రారబ్ధకర్మ నిర్వాణః=ప్రారబ్ధకర్మయొక్క పరిసమాప్తి రూపమైన, పాంచభౌతికః=పంచభూతాత్మకమైన దేహము, న్యపతత్. దీనిచే పార్షదశరీరములు, అకర్మారబ్ధము లనియు శుద్ధములనియు నిత్యము లనియుఁ దేలినది.

ఇదం=ఈ త్రైలోక్యమును, ఆదాయ=ఉపసంహరించి, ఉదన్వ తః=ఏకార్ణవముయొక్క, అంభసి=నీటియందు, శయానే=పండి యున్న నారాయణునియందు, శయిషోః=పరుండుట కిచ్ఛగించు చున్న, విభోః=సమర్థుఁడైన బ్రహ్మయొక్క, అంతః=మధ్యమును, అనుప్రాణం=విశ్వాసముతోఁ బాటు, వివిశే=ప్రవేశించితిని. కూర్మ పురాణమందుఁ జెప్పినట్లు నారాయణునకు బ్రహ్మదేవునితో నభేదవివక్ష.

ప్రాణేభ్యః=ఇంద్రియములనుండి, అహం=నేనును, మరీచి మిశ్రాః=మరీచి మొదలైన ఋషులును, జజ్ఞిరే=జన్మించిరి.

కర్మమార్గానుయాయులు-త్రైలోక్య బహిర్భాగములలో సంచరింపలేరు తపస్సు మొదలైనవానితో బ్రహ్మలోకమును బొందినవారు-త్రిలోకముల లోపల సంచరింపరు. నేను, మహావిష్ణుని అనుగ్రహము వలన, అస్ఖండితవ్రతః=అఖండితమగు బ్రహ్మచర్యవ్రతము గలవాఁడనై, అంతర్బహిశ్చ=మూఁడు లోకముల బయటను లోపలను, పర్యేమి=పర్యటింతును, అవ్యాహతగతిః=అడ్డగింపఁబడరాని గమనము గలవాఁడనై-ఆ పర్యటనము ఈశ్వరాజ్ఞచే నేర్పడుచున్నది. లోకమంగళార్థ మేర్పడుచున్నది. ఈ విషయమునే నాల్గుశ్లోకములతోఁ జెప్పుచున్నాఁడు.

భగవంతుఁడైన నా తండ్రి చతుర్ముఖ బ్రహ్మచే నీయఁబడినట్టియు, స్వరాః=నిషాదాది స్వరములే, బ్రహ్మ=బ్రహ్మస్వరూపములు ఎట్లు? మోహకములైన దానివలన బ్రహ్మసాదృశ్యము. ఇమాం=ఈ నా కరమునందున్న దానిని, మూర్ఛయిత్వా=ఆరోహణావరోహణ క్రమములతో సరస్వతినిగాఁ జేసి నరించి.

వంశీధరుఁడు:

కాలం ప్రతీక్షన్=భగవత్కృపావసర కాలమును ప్రతీక్షించుచున్నవాఁడనై, "నాకుఁ గాల మెప్పుడు సమీపించును? ఎప్పుడు భగవత్పార్షదుఁడను గాఁబోదును?" అనెడు ఇదేచింతతో నున్నవాఁడని తాత్పర్యము.

కాలః=భగవత్కృపావసరమైన కాలము, కాలేకాలః ప్రాదురభూత్-కాలే=నా స్థూలదేహభంగ సమయమందు, కాలః=ఏ కాలమున కెదురుచూచుచుంటినో యట్టి భగవత్కృపారూపమైన కాలము ప్రాదురభూత్-ఏర్పడెను. ఈ రెండు కాలములును ఏకకాలమందే వచ్చినవనుట. ఒకానొక మెఱుపునందే తదేక సమయమందే హఠాత్తుగా మఱియొక మెఱ పేర్పడినట్లు, నా పాంచభౌతికదేహ పతన కాలమందే పార్షదదేహప్రాప్తి కాలముగూడ నయ్యెనని భావము.

'ప్రయుజ్యమానే' = 'గోషుదుహ్యమానాసు గతః' - ఆవులు పిదుకఁ బడుచుండఁగా పోయెను. ఈ ప్రయోగమందు గోదోహనము-గమనము రెండును ఏకకాలమందే జరిగినవని తెలియుచున్నది. అట్లే భౌతికదేహత్యాగము, చిన్మయదేహప్రాప్తి ఏకకాలమందే ఘటితము లయ్యెనని యర్థము. 'హిత్వా వద్యమిమం లోకం' అను చోటనున్న క్త్వా ప్రత్యయమునకు దేహవిసర్జన తుల్యకాలమందేయని హృదయము. భాష్యవృత్తియం దిట్లున్నది-

**"క్త్వా చిత్తుల్యకాలేపి ఉపవిశ్యభుంక్తే రుణత్క- ఘ్త్వా పతతి=చక్షుస్స మ్మిల్య హసతి-ముఖం వ్యాదాయస్వ పితి-ఇత్యాదిక ముపసంఖ్యేయం"**

ప్రారబ్ధకర్మనిర్వాణః=ఆ సమయమందే, ప్రారబ్ధనాశమైనదని యర్థము గాదు. దేహపాతమునకు ముందే ప్రారబ్ధనాశమైనది. శుద్ధ భక్తివాదుల మతములో భగవంతునియందు ప్రేమోద్భూతి ఏర్పడి నప్పుడే ప్రారబ్ధనాశమున కారంభము. సాధ్యదశయందే తన్నాశము సంపూర్ణమై పోవును. భాగవత 'ప్రియవ్రత' కథలో నీ శ్లోకము వచ్చును.

**మైవం విధః పురుషకార ఉరుక్రమస్య**
**పుంసాం తదంఘ్రిరజసా జిత షడ్గుణానామ్,**
**చిత్రం విదూరవిగతః సకృదాదదీత**
**యన్నామధేయ మధునా స జహాతితన్వమ్.**

పై శ్లోకమునకు భావ మిది. 'ఏవం విధం పౌరుషం న చిత్రం చిత్రం ఖల్వే తదేవ'-ఆ చిత్ర మేదియో చెప్పుచున్నాఁడు. విదూర విగతోఽపి=అంత్యజుఁడైనను, యన్నామధేయం=ఎవని నామమును, సకృత్ అదదీత=ఒక్కసారి యుచ్చరించుచున్నాఁడో, సః= వాఁడు, అధునా = నామగ్రహణ కాలమందే, తన్వం = శరీరమును, జహాతి= వదలుచున్నాఁడు.

ఇక్కడ తన్వారంభకమైన ప్రారబ్ధకర్మయే తనూ శబ్దముచేత లక్షితమగుచున్నదని కొందఱు. మఱికొందఱు భక్తిసంపర్కముతో, స్పర్శమణి న్యాయముచేత త్రిగుణమయమైన శరీరమును వదలుచున్నాఁడని యందురు. అనఁగా త్రిగుణాతీతుఁ డగుచున్నాఁడని భావము. కనుక పై శ్లోకమందలి తనూత్యాగమున కర్థము త్రైగుణ్యత్యాగ మనియే. రాసారంభమందలి 'జహుర్గుణమయం దేహం' అను శ్లోకమం దీ విషయ మింకను విపులీకరింపఁబడును. కొందఱు భక్తుని దేహత్యాగమునుగూడ భగవంతుఁడు ప్రత్యక్షముగఁ దిలకించునందురు. ప్రారబ్ధకర్మనిర్వాణము నారదునకు భగవత్ప్రేమ యేర్పడినప్పుడే జరగిపోయినది. రూపగోస్వామి ఈ విషయమునే యిట్లు విపులీకరించుచున్నాఁడు—

**యద్బ్రహ్మ సాక్షాత్కృతి నిష్ఠయాఽపి వినాశ మాయాతి వినా న భోగైః,**
**అపైతి నామస్మరణేన తత్తే ప్రారబ్ధకర్మేతి విరౌతి వేదః.**

బ్రహ్మానుభూతి నిష్ఠతో ప్రారబ్ధకర్మ సమూలముగ నశింపదు. భోగానంతరమే నశించును. అట్టి ప్రారబ్ధము నామస్మరణముతో సంపూర్తిగఁ బోవుచున్నది. ఈ విషయమును వేదమే యుద్ఘోషించెను. 'ప్రారబ్ధనాశమే దేహపాత'మని ఈ సందర్భమున నభిప్రాయము.

### వల్లభాచార్య కృతమైన సుబోధిని:

అవిపక్వ కషాయాణాం—కషాయము మూఁడురీతులు. సాక్షాద్రాగాదులు తామసము. తద్వాసనా రూపములు రాజసములు. అవిద్యారూపములు సాత్త్వికములు. ఈ మూఁడును క్రమముగా కర్మ భక్తి జ్ఞానములతో నశించును. వీనికి అధికారులు భిన్నభిన్నులు. ఒకదానితో మూఁటిని నిగ్రహించుటకు వీలులేదు. ఒకఁడే నిగ్రహించుటకును సాధ్యము గాదు. ఈ మూఁడును ఒకదానితో నశించు మార్గమేది? భగవత్కృప. ఆ భగవత్కృపకుఁ బ్రధాన సాధనము 'చక్రాంకి

తస్య నామాని సదా సర్వత్ర కీర్తయేత్' అనుట. అనఁగా నామస్మరణ. దీనికి దేశకాలముల యపేక్ష లేదు. ఒకతే నామమునే నిరంతరము జపింపవలె ననుటయును లేదు. అనంతరూపునియొక్క భగవద్ధర్మము లనంతములే. ఆ ధర్మములే నామములయందు స్మృతములై కను పించును. లోకమధ్యమందు భగవంతుఁడు అలౌకికకర్మల నొనర్చును. అవియు గుప్తములుగా నొనర్చును.

లజ్జ మూఁడురీతుల నేర్పడవచ్చును. దేహ, కుల, అంతఃకరణ ధర్మములచేత. ఈ మూటిని త్యజించి యని యర్థము. పఠన్=శతృ ప్రత్యయముచేత నైరంతర్యము సూచితము. చిత్తము స్వభావముతోఁ జంచలమైనది. దాని నాఁకట్టుకొనుటకు మార్గమును జెప్పుచున్నాఁడు. గుహ్యాని యాని చరిత్రాణి=గుహ్యములైన భగవంతుని చరిత్రములను స్మరించుచు లోకానురూపములైన ద్రౌపద్యర్జునాదులయందు ప్రయుక్త ములైన యాతని శయనస్థానాదులైన కృత్యములు మనోహరములు. వానిని స్మరించుచునని యర్థము. కర్మాతిగుఁడగుటచే శయనస్థానా దులైన కర్మ లాతని బంధింపవు. గాం పర్యటన్=భూమిని దిరుగు చున్నవాఁడను. ఒకమార్గము ననుసరించి తిరుగుట కాదు. ఇష్టము వచ్చినట్లు సంచరించుట. భూపర్యటన మేదైన ఫలము నుద్దేశించి యైనచో తుష్టమనస్కత్వ ముండదు. 'తుష్టమనాః' అనుచున్నాఁడు. అనఁగా నాతని పర్యటనమునకు వేఱు ప్రయోజనము లేదు. కేవల పర్యటనమే ఫలము. ఈ తిరుగుటలో ననేకములు లౌకికాలౌకికము లైన ఫలములు గల్గును. గతస్పృహః=వానియందు స్పృహలేని వాఁడై, కాలం ప్రతీక్షన్=శతృప్రత్యయముచేత మొదటినుండియు కాలమున కెదురుచూచుచున్నాఁడని చెప్పుటయైనది. కనుక శరీర రక్షాదిసాధనాఽభావమందును శరీరరక్షాబాధక సన్నివేశములందును అంతఃకరణమునకు క్లేశము లేనివాఁడని తాత్పర్యము. దైవగతితో సన్మానము ప్రాప్తించినచో గర్వము లేదు. పూజనముతో మహాత్మ్యా

ము లేదు. ప్రత్యూత బాధక మనెడు బుద్ధియే యున్నవాఁడై
ంటు. 'జనేనానుమతో యోగీ' 'యోగసిద్ధిం న విందతి' అని
ము. విషయము సిద్ధింపని యపుడు మత్సరములేదు. దాని
ారముగనే దలఁపవలెను. ఈ రీతిగా నారదుఁడు షడంగసహి
నామోచ్చారణ పూర్వకముగా భూపర్యటన మొనర్చుచు
ుడు. షడంగము లేవి? 1. గాం పర్యటన్, 2. తుష్టమనాః, 3.
ప్రృహః, 4. కాలం ప్రతీక్షన్, 5. విమదః, 6. విమత్సరః. ఈ
ం భూమిని పర్యటించినపుడు, కృష్ణునియందే మతి యేర్పడు
ది. అట్టి సాధకునకుఁ గృష్ణుఁడే రుచించును. తదన్యములు
ంపవు.

**మధ్వజవ్యాఖ్యః**

గతత్రపః, అనంతస్య – అంతములేని శ్రీహరికి సంబంధించిన,
్యాని–ఉపదేశమాత్రముచేతనే తెలిసికొనఁదగిన రహస్యములైనట్టి
ణి–మంగళకరమైన మోక్షమును గల్గించునట్టి, నామాని, పఠన్,
ాని – శ్రీహరియొక్క పరాక్రమరూపములైన కార్యములను,
ంశ్చ–స్మరింపుచు, తుష్టమనాః–ఆ యా కాలములందు, వాసు
ఁ డేది ప్రాప్తింపఁ జేయునో, దానిచేతనే పరితృప్తమైన మనస్సు
ాఁడనై, గతస్పృహః–ఇతరులకు సంబంధించిన భాగ్యాదులందు
లేనివాఁడనై, అపటః–1. హృషీకేశునకంటెను భిన్నమైన గతి
వాఁడనై, (అనన్యగతికుఁడనై,) 2. భగవద్భక్తులు గానివారితో
వాసము లేనివాఁడనై, 3. విరక్తుఁడనై, 4. ధరించుటకు చిన్ని
పేలికగూడ లేనివాఁడనై, గాం పర్యటన్, కాలం–నా మరణకాల
ం, ప్రతీక్షన్ – నిరీక్షించుచున్నవాఁడనై, విమత్సరః – మాత్సర్య
తుఁడుగా, (అభవం–ఐతిని).

తాత్పర్యము: శ్రీహరి యనంతుఁడు. వాని చరిత్రలు ననం
ులు. తచ్చరిత్రరహస్యములు ఉపదేశమాత్రముచేతనే తెలియనై

నవి. వానిని స్మరించుట మాత్రమే మోక్షకారణమగును. వాని నామములును క్రియలును ఎప్పుడును మఱవఁదగనవి గావు. లజ్జనువదలి యానిష్ఠరశ్రవుని నామములనే పఠించితిని. వాని క్రియలనే స్మరించితిని. ఈ రెంటితో నా మనస్సు పరితృప్తమైయుండెను ఇతరుల భాగ్యములకై నేనాశపడలేదు. కృష్ణపరమాత్ముఁడే దిక్కని నమ్మియుంటిని. భగవద్భక్తుల సంగతిని వదలిపోయెడు వాఁడను గాను. లౌకికవిషయములయందు విరక్తి దృఢమైనది. ధరించుటకు గుడ్డనుగూడ నే నపేక్షింపలేదు. మాత్సర్యరహితుఁడనై భూమియందుఁ దిరుగుచు నామరణకాల మెప్పు డని కాచికొని యుంటిని.

బ్రహ్మన్!—బ్రహ్మజ్ఞానియైన వ్యాసభగవానుఁడా!, ఏవం—పైఁ జెప్పినప్రకారము, కృష్ణమతేః—పరమానందము బలము ఈ రెంటి స్వరూపమైన శ్రీహరియందే మనస్సుగలవాఁడనై, అసక్తస్య—ప్రాపంచికములయం దాసక్తి లేనివాఁడ నగుటచేత, ఆ కారణముచేతనే అమలాత్మనః—నిర్మలమైన మనస్సు గలిగిన నాయొక్క, కాలః—మరణకాలము, కాలే—వర్షాకాలమందు, సౌదామనీ తటిద్యథా—సౌదామని యనెడు గొప్పకాంతి విశేషముగల మెఱుపు పుట్టినట్లుగా, ప్రాదురభూత్—సంప్రాప్తమైనది.

కురుపాండవులు అను ప్రయోగము వారియందుఁ గల స్వల్పభేదమును సూచించుటకై ప్రయోగింపఁబడినట్లు, తటిత్సౌదామనీ యని ప్రయుక్తము.

తాత్పర్యము: ఇట్లు శ్రీహరియందే హృదయమును సమర్పించి లోకసంగతినే వదలి సంచరించుచుండుటచే నా మనస్సు నిర్మలమైనది. వర్షాకాలమందు హఠాత్తుగా ప్రకాశమానమైన మెఱుపు మెఱసినట్లు, నా మరణకాలము ప్రాప్తించెను.

మయి—నేను, ఏవం—పైఁజెప్పినట్లుగా, శుద్ధాంభాగవతీంతనుం—పరిశుద్ధమైన భగవంతుని స్వరూపమును, ప్రయుంజానే సతి—ధ్యాన

మొనర్చుచున్నవాఁ డగుచుండఁగా, ప్రారబ్ధకర్మ నిర్వాణః—ఫలము నొసఁగుటకై వచ్చిన ప్రారబ్ధమును నాశమొనర్చునట్టి (ప్రారబ్ధకర్మ ఫలముగా సిద్ధించిన) పాంచభౌతికః—పంచభూతములచే నిర్మితమైన దేహము, న్యపతత్—వీడిపోయినది.

తాత్పర్యము : గురువులు నా కుపదేశించిన ప్రకారముగా దోష రహితుఁడైన శ్రీహరినే ధ్యాన మొనర్చుచుంటిని. నా మనస్సునందు అతనిరూపు వెలసియుండెను. నా ప్రారబ్ధకర్మ ముగిసినది. దాని ఫల మైన యా భౌతికదేహము గూడ, వీడిపోయినది. 'ఏవం మయి ప్రయుంజానే' అని విజయధ్వజు లంగీకరించిన పాఠము. అట్లే 27వ శ్లోకమందును 'విమదో విమత్సరః' అనుదానికి బదులు అపటో విమ త్సరః అని వీరి పాఠము.

అవ : శ్రీహరిని ధ్యానించుచు ముక్తుఁడైన నీ వే లోకమున కేగితివి? దానికి సమాధానము నిచ్చుచున్నాఁడు—

కల్పాంతే—కల్పముయొక్క కొనయందు అనఁగా ప్రళయ కాలమందు, ఇదం—తాను సృష్టించిన ఈ సమస్తజగత్తును, ఆదాయ—తన యుదరమందుఁ జేర్చికొని, ఉదన్వతః—ప్రళయసముద్రము యొక్క, అంభసి—నీటియందు, శేషపర్యంకముపై, శయానే—పండు కొని యున్న వాసుదేవునందు, శిశయిషోః—చేరికొనవలెనను నాశగల విభోః—బ్రహ్మదేవునియొక్క, అంతః—లోపలికి, అనుప్రాణం—లోపలికిఁ బోవుచున్న శ్వాసము ననుసరించి, అహం—నేను, వివేశ—ప్రవేశించితిని.

తాత్పర్యము : ఇట్లు దాసీపుత్త్ర దేహమును వదలి, నే నా కల్పాంతమందు బ్రహ్మదేహమందుఁ బ్రవేశించితిని. కల్పాంతమున శ్రీహరి తాను సృష్టించిన జగత్తును సంహరించి దన యుదరమందుఁ జేర్చికొని ప్రళయోదధిపై శేషపర్యంకమునఁ బండెను. అప్పు డాతని యుదరమందుఁ జేరవలెనని బ్రహ్మ ఇచ్ఛించెను. అతని దేహమునఁ బ్రవేశించు శ్వాసతోఁబాటు నేనును నతనిలోఁ జొచ్చితిని.

శిశయిష్ణోరనుప్రాణం—అని విజయధ్వజుల పాఠము. 'అను ప్రాణం శిశయిషోః' అని శ్రీధరులు.

సహస్రయుగ పర్యంతే=కృత త్రేతా ద్వాపర కలియుగములకు ఒక్క మహాయుగ మని పేరు. అట్టివి వేయిగడువగా వేయి మహాయుగములు బ్రహ్మకొక రాత్రి. ఆ రాత్రి కొనయందు ఉత్థాయ—శ్రీహరి యుదరమునుండి గడ్డకు వచ్చి, ఇదం=ఈ జగత్తును, సిసృక్షతః = శ్రీహరి యాజ్ఞతో సృష్టి సేయఁ గోరుచున్న బ్రహ్మదేవుని యొక్క, (అంకాత్ = తొడనుండి) అహం=నేను, జజ్ఞే=పుట్టితిని, ప్రాణేభ్యః—అ బ్రహ్మదేవుని ప్రాణములనుండి, మరీచి మిశ్రా ఋషయః =మరీచి అత్రి మొదలైన దేవర్షులు, జజ్ఞిరే=జన్మించిరి.

తాత్పర్యము: తర్వాతి బ్రహ్మకల్పమందు, చతుర్ముఖబ్రహ్మ యొక్క నిశాకాల మనిపించికొను వేయిమహాయుగములు గడచెను. అప్పుడు బ్రహ్మ శ్రీహరి యుదరమునుండి గడ్డకు వచ్చెను. వాసుదేవుని యాజ్ఞానుసారము సృష్టియొనర్ప నిచ్ఛగించినాఁడు. అప్పు డాతని తొడనుండి నేను జన్మించితిని. మరీచి, అత్రి మొదలైన ఋషిశ్రేష్ఠులు అతని ప్రాణములనుండి పుట్టిరి.

మహావిష్ణోః = సర్వోత్తముఁడైన శ్రీహరియొక్క (విష్ణువని పిలువఁబడు యజ్ఞాభిమానియైన దేవతకంటె నుత్తముఁడైన వాని యొక్క), అనుగ్రహాత్, క్వచిత్=ఎచ్చోటను, అవిఘాతగతిః=అడ్డులేని గమనము గలవాఁడనై, అస్కందితవ్రతః=బ్రహ్మచర్యాది వ్రతములందు స్ఖాలిత్యము లేక, అహం=నేను, త్రీన్ లోకాన్=ముల్లోకములను, అంతర్బహిశ్చ=లోపలను బయటను, పర్యేమి=తిరిగెదను.

తాత్పర్యము: శ్రీహరి యనుగ్రహముతో నెల్ల దిక్కులందును నేను సంచరింతును. నా కెందు నడ్డులేదు. నా బ్రహ్మచర్యాది వ్రతములలో స్వల్పమును కళంకమురాదు. ముల్లోకముల బహిరంతర్భాగము

లందు నాగతి యవ్యాహత మైనది. అవిఘాత గతిః అని విజయ ధ్వజులు, అవ్యాహత గతిః అని శ్రీధరులు.

స్వరబ్రహ్మ విభూషితాం = సప్తస్వరాత్మకమైన వేదములతో నలంకరింపఁబడిన, దేవదత్తాం=దైవముచే నొసఁగఁబడిన మహతి యను పేరు గల, 'దేవదత్త' మను మారుపేరుగల, ఇమాం వీణాం =ఈ నా చేతియందున్న వీణను, మూర్ఛయిత్వా=స్వరముల నారోహణావరోహణక్రమములఁ బొందించి, హరికథాం=శ్రీహరి చరిత్రను, గాయమానః=పాడుచున్న వాఁడనై, అహం చరామి = నేను తిరుగు చున్నాను.

తాత్పర్యము: నా చేతనున్న యీ మహతి యను వీణ దేవ దత్తమైనది. దీనికి దేవదత్త మనియు మారుపేరు. సప్తస్వరాత్మకమైన వేదముచే నలంకృతమైన దిది. దీనియందు స్వరముల యారోహణావ రోహణ క్రమముల ననుసరించి వింత నాదములను సృష్టింతును. వానిలో లయించి నా గానము సాఁగును. నేను నిరంతరమును గాన మొనర్చునది శ్రీమహావిష్ణువుయొక్క కథలనే.

ప్రగాయతస్స్వవీర్యాణి, తీర్థపాదః ప్రియశ్రవాః,
ఆహూత ఇవమే శీఘ్రం, దర్శనం యాతిచేతసి. 34

ఏత దాతురచిత్తానాం, మాత్రాస్పర్శేచ్ఛయా ముహుః,
భవసింధు ప్లవో దృష్టో, హరిచర్యాను వర్ణనమ్. 35

యమాదిభిర్యోగపథైః, కామలోభహతో ముహుః,
ముకుంద సేవయా యద్వ, త్తథాత్మాఽద్ధా న శామ్యతి. 36

సర్వం తదిదమాఖ్యాతం, యత్పృష్టోఽహం త్వయాఽనఘ,
జన్మకర్మ రహస్యం మే, భవతశ్చాత్మతోషణమ్. 37

**సూత ఉవాచ:**

ఏవం సంభాష్య భగవాన్ నారదో వాసవీసుతమ్,
ఆమంత్ర్యవీణాం రణయన్ యయౌ యాదృచ్ఛికోమునిః. 38

అహో! దేవర్షిర్ధన్యో ఽయం యః కీర్తిం శార్ఙ్గధన్వనః,
గాయన్ మాద్యద్గిరాతంత్ర్యా రమయత్యాతురం జగత్. 39

స్వవీర్యాణి=తన పరాక్రమాదులను, ప్రగాయతః=ప్రకర్షముగా గానము చేయుచున్న, మే చేతసి=నా మనస్సునందు, ప్రియశ్రవాః=ప్రియమైన కీర్తితోఁ గూడిన, తీర్థపాదః=శ్రేష్ఠములైన పాదములు గల, పరమాత్ముఁడు, అహూత ఇవ=పిలువఁబడిన వానివలె, శీఘ్రం=త్వరగా, దర్శనం=దర్శనమును, యాతి= పొందుచున్నాఁడు.

సంచారమందు తనకున్న ఫలమును చెప్పుచున్నాఁడు. భగవంతుని పరాక్రమాదులను, నిరంతరమును గానమొనర్చుచుఁ దిరుగుచుందును. ఆ గానము సేయుచున్నప్పుడు ప్రియంకరమైన కీర్తిగలవాఁడును, తీర్థభూతములైన పాదములు గలవాఁడును నైన భగవంతుఁడు పిలువఁబడినవానివలె నా మనస్సున నిలిచి దర్శనమిచ్చును. 34

ముహుః=మాటిమాటికిని, మాత్రా=ఇంద్రియములయొక్క, స్పర్శేచ్ఛయా=భోగములయందలి యాసక్తిచేత, ఆతురచిత్తానాం=వైక్లబ్యముచేఁ గూడిన, మనస్సుగలవారికి, హరిచర్యానువర్ణనం=హరికథావర్ణన మనుట, యత్=ఏదికలదో, ఏతత్=అది, భవసింధుప్లవః=సంసారమను సముద్రమును దాఁటుటకు పడవవలె, దృష్టోహి=కన్పించుచున్నది గదా!

అవ: పరమ ప్రయోజనమును దెల్పుచున్నాఁడు–

నిరంతరమును విషయభోగముల యందలి యాకాంక్ష, వాని నెంత యనుభవించినను తీరదు. మరల మరల మనస్సు నేఁకాఁరుచునే

యుండును. దీనితోఁ జిత్తమున కశాంతి. అట్టివారికి సంసారమను సముద్రమును దాఁటుటకు పడవవంటి దొక్కటే హరికథావర్ణనము. తచ్ఛ్రవణము నారదుఁ డుచ్చైస్స్వరముతో గానమొనర్చుచుఁ బోవుట సంసార దుఃఖపీడితు లైన జీవులయొక్క యాత్మశాంతికని పిండితార్థము. 35

**ముహుః—మాటిమాటికిని, కామలోభహతః—కామము మొదలైనవానిచేతఁ బీడింపఁబడుచున్న, ఆత్మా—మనస్సు, ముకుందసేవయా—మోక్షమొసఁగ నధికారియైన ముకుందుని సేవచేతనే, యద్వత్—ఏ ప్రకారమో, తథా—ఆప్రకారమే, యమాదిభిః—యమము మొదలైన, యోగపథైః—యోగమార్గములచేత, అద్ధా—సాక్షాత్తుగా, న శామ్యతి—శమింపదు.**

అవ: హరికథా ప్రస్తావనమే సంసార సంకటమును నశింపఁజేయు సిద్ధౌషధ మన్నాఁడు. దీనినే మఱియొకసారి విస్తరీకరించుచున్నాఁడు.

అడుగడుగునను కామలోభాది కాలుష్యములు మనస్సు నావరించి కొనుచున్నవి. యమ నియమాదులతోఁ జిత్తము నెంత నియమించినను అవి కరుళ్లవలె పైపై విజృంభించి యాక్రమించి కొనుచుండును. ఈ యోగమార్గము లేవియు మనశ్శాంతి నీయలేవు. ముకుందసేవయొక్కటే హృదయశాంతికిఁ బ్రధానమైన సాధనము. 36

**అనఘః—పాపరహితుఁడైన వాఁడా! త్వయా—నీచేత, అహం—నేను, యత్పృష్టః—ఏ విషయమునుగూర్చి యడుగఁబడితినో, మే—నాయొక్క, జన్మకర్మ రహస్యం—జన్మముయొక్క, కర్మముయొక్క రహస్యమును, భవతః—నీయొక్క, ఆత్మతోషణం—మనస్సంతోషమును కల్గించుదానినిగా, తత్ ఇదం సర్వం—అ యీ విషయమును బూర్తిగా, ఆఖ్యాతం—నాచేఁ జెప్పఁబడినది.**

అనఘుఁడైన వ్యాసమునీ! నీ వడిగిన నా జన్మకర్మల రహస్యమును నీ మనఃప్రసాదమునకు మార్గమును స్పష్టముగా వివరించితిని.

సూతుఁ డనెను. భగవాన్ నారదః—భగవంతుఁడైన నారదుఁడు, వాసవీ సుతం—సత్యవతీతనూజుఁడైన వ్యాసునిఁ గూర్చి, ఏవం సంభాష్య—ఈ ప్రకారముగా వివరించి, ఆమంత్ర్య—ఇఁక పోయివత్తు నని చెప్పి, వీణాం రణయన్—వీణెను మీటుచు, యాదృచ్ఛికః మునిః—భూపర్యటనమం దొక ప్రయోజనము నుద్దేశింపని మునియైన నారదుఁడు, యయౌ—వెళ్లెను.

భూభ్రమణములోఁ దన కొక్క సంకల్పమును లేదు. కేవల లోకమంగళమునకే యాత్ర. నారదుఁ డిట్లు వ్యాసునితో సంభాషించి పోయివత్తునని చెప్పి వీణెను మ్రోయించికొనుచు వెడలిపోయెను. 38

అయం దేవర్షిః—ఈ దేవర్షి, ధన్యః—ధన్యుఁడైనవాఁడు, అహో—ఆశ్చర్యము, యత్—ఎందుచేత ననఁగా. శార్ఙ్గధన్వనః—శ్రీమహావిష్ణువుయొక్క, కీర్తిం—కీర్తిని, తంత్ర్యా—తంత్రియొక్క సహాయముతో, గాయన్—గానించుచున్నవాఁడై, మాద్యన్—నిరంతరము సంతోషముతోఁ గూడినవాఁడై, ఆతురం—దుఃఖితమైన, ఇదం జగత్—ఈ లోకమును, రమయతి—సంతోషింపఁజేయును.

అవ: హరికథాగాన మొనర్చుచున్న నారదమహర్షి భాగ్యమును సూతుఁడు శ్లాఘించుచున్నాఁడు—

వీణాసహాయముతో నిరంతరమును శ్రీహరికీర్తిని గాన మొనర్చుచుఁ దాను సంతోషించుచుండును. దుఃఖితమైన జగత్తునకు సంతోషమును జేకూర్చును. ఈ రీతిగా భూభ్రమణ మొనర్చుచున్న దేవర్షి నారదుఁడు మహాభాగ్యశాలి. నామసంకీర్తనము దనకు సంతోషమిచ్చును. పరులకు సంతోషమును గలిగించును. 39

శ్రీధరీయము :

అవ: హరికథా గానముతోఁ దనకుఁ గలిగెడు ప్రయోజనమును దెలుపుచున్నాఁడు—

తీర్థపాదః—తీర్థము లనఁగా పుణ్యనదులు మొదలైనవి. సమస్త తీర్థములలో మునిగిన ఫలము వాని పాదముల సేవించినంత మాత్రమున నేర్పడునని భావము లేక, నిఖిలజగత్పావన తీర్థమైన గంగానది

కుత్పత్తిస్థానమైన పాదము గలవాఁడని యర్థము చెప్పికొనవచ్చును. ప్రియశ్రవాః=అయన చేష్టితములు నిఖిల జగన్మోహకమైనవి. అట్టి యా చేష్టితములను వినుటచేత మోక్షము గరతలామలక మగును. (ఈ శ్లోకములో సంకీర్తనము చేయవలసిన పద్ధతిని జెప్పుచున్నాఁడు) కీర్తనకాలమం దుపాసనాదైవమును హృదయమందు నిలిపికొనవలె నని యభిప్రాయము. ఆహూత ఇవ అనునది చాల రమ్యమైనమాట. దీనిని పోతన్నగారు 'చీరఁబడ్డవాని చెలువునన్' అని బహురమ్యముగా ననువదించిరి. సంకీర్తనభక్తి శ్రీమన్నారాయణునకు మహాప్రియ మైనది. అయనయే గ్రంథాంతరమందు-

నాఽహం వసామి వైకుంఠే న యోగి హృదయేష్వపి,
మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద ॥.

అని చెప్పికొన్నాఁడు.

మాత్రాస్పర్శేచ్ఛయా=మాత్రలనగాఁ విషయములు. వానిస్పర్శలు భోగములు-వానియందలి ఇచ్ఛచేత; ఆతుర చిత్తానాం=ఎవరిచిత్తము లాతురములైనవో వారు, భవసింధుప్లవః=భవమనుటయే సముద్రము. దానిని దాఁటుటకు ప్లవముతో సమానమైనది, ఏది? హరి చర్యాను వర్ణనం=హరిచర్యల నిరంతర వర్ణనము. మాత్రాస్పర్శేచ్ఛయా= యనుటకు వైష్ణవవ్యాఖ్యలో నర్థమిట్లు చెప్పఁబడినది. మాత్ర లనఁగా పృథివ్యాది పంచభూతములు, తన్మాత్రలైన గంధాది విషయములు. శబ్ద స్పర్శ రూప రస గంధములు పంచతన్మాత్రలు. ఆతురచిత్తులనఁగా వానియందు ప్రవణమైన మనస్సు గలవారు. హరిచర్యానువర్ణనము భవసింధుప్లవ మనుట కేవల శ్రుతిప్రామాణ్యముతోనే గాదు, అన్వయ వ్యతిరేక దృష్టాంతములతో లోకమందు దృష్టమే యని తాత్పర్యము.

అవః పూర్వశ్లోకమందు 'ఏతదేవ'-ఇది యొక్కటియే యని యవధారణముతోఁ జెప్పఁబడినది. దానిని యనుభవముతో ద్రఢీక రించుచున్నాఁడు-

యమాదిభిః=యమము నియమము మొదలైన వానిచేత, న శామ్యతి = శాంతింపదు, యద్వన్ముకుంద సేవయా = ముకుందసేవ యెట్లో అట్లుగా, అద్ధా = సాక్షాత్తుగా, ఆత్మా = మనస్సు, శామ్యతి= శమించుచున్నదో, ఏదో యొకరీతిగా ముకుందుని సేవించినను మనస్సు శాంతి నందుచున్నది. ఇఁక నాతని గుణానువర్ణనముతో శాంతి సిద్ధించుటలో నేమి చిత్రమని తాత్పర్యము.

అనఘ! భవతః=నీయొక్క, మనసః = మనస్సునకు పరితోష కరమైన విషయము, నా జన్మకర్మ రహస్య మనుట. అది, ఆఖ్యాతం =నప్రపంచముగా నుపపాదిత మైనది.

ఆమంత్ర్య=పోయివత్తునని తెలిపి, యాదృచ్ఛికః=స్వప్రయో జన సంకల్పశూన్యుఁడైనవాఁడు.

అవ: సూతుఁడు నారదుని శ్లాఘించుచున్నాఁడు-

మాద్యన్=పరమ సంతోషము ననుభవించుచున్నవాఁడై, తం త్ర్యా=వీణచేత (ఈ సందర్భమందే వైష్ణవవ్యాఖ్యలో నిట్లు గలదు), యాదృచ్ఛికః=యదృచ్ఛగా ప్రాప్తించినవాఁడు, మాద్యన్=ఆనందాతి శయముతో మత్తునివలె వర్తించుచున్నవాఁడై, ఆతురం=సంసారరూప మైన వ్యాధిచేఁ బీడింపఁబడిన, జగత్=జగత్తును, రమయతి=ప్రీతి యుక్తముగా నొనర్చుచున్నాఁడు.

**విజయధ్వజము :**

తీర్థపాదః వీర్యాణి ప్రగాయతశ్చ = భక్తితో గానము చేయు చున్నట్టి (శ్రీహరి యుపాసననే విడువక చేయుచున్న), మే చేతసి ప్రియశ్రవా, ఆహూత ఇవ, శీఘ్రం=తొందరగా, దర్శనం యాతి= అపరోక్షమునకు విషయుఁడుగా నగుచున్నాఁడు. (శ్రీహరి తన రూప మును నాకుఁ జూపించు నని యర్థము.)

తాత్పర్యము: శ్రీహరి పాదములయందే పవిత్రమైన గంగ జన్మించినది. వాని పవిత్రములైన పరాక్రమములను నేను నిరంతరము భక్తితో గాన మొనర్తును. నా గానముచేఁ బిల్వఁబడిన వానివలె వైకుంఠుఁడు నా మనస్సున హఠాత్తుగాఁ దోఁచును. తత్కీర్తిశ్రవణము కర్ణమనోహరమైనది. వాఁడు నా హృదయమున గోచరుఁ డగుటయే వాని పరమానుగ్రహము. కానిచో నవ్యక్తస్వభావుఁడైన వాని నెవరు వీక్షింపఁగలరు?

హరిచర్యానువర్ణనం—సమాధిభాషతో భగవచ్చరిత్రమును వర్ణించుటను తేది గలదో, ఏ తత్ ముహుః, మాత్రాస్పర్శేచ్ఛయా—విషయముల ననుభవింపవలె నను నిచ్ఛతో వానిని బొందుటకై, ఆతురచిత్తానాం—క్లేశమునకు వశులైన జనులకు, భవసింధుప్లవః దృష్టః—కేవల శ్రుతిప్రామాణ్యముతోఁ గాక అనుభవముచేతను నిరూపితమైనది. కనుక సజ్జనుల హితమునకై శ్రీహరియొక్క చరిత్రనే వర్ణింపుఁడని తాత్పర్యము.

తాత్పర్యము: విషయసుఖముల ననుభవించుటకే మాటిమాటికి జను లేఁకారెదరు. వాని మనస్సీయనుభవము కొఱకై బహుక్లేశముల ననుభవించుచుండును. ఇట్టి యధికారులు సంసారమందు మఱల మఱల పుట్టి చచ్చుచు నీ భవసాగరమును దాఁటులేక యుందురు. వారీ సముద్రమును దాఁటవలెనన్నచో హరిచరిత్రవర్ణనము పడవ నాశ్రయింపవలెను. ఇంతకన్నను వేఱు సాధనము లేదు. ఇది యనేక ప్రమాణములచే సిద్ధము.

అవ: అట్లైనచో యమ నియమాది యోగానుష్ఠానమంతయు వ్యర్థమే గదా! దానికి సమాధానము చెప్పుచున్నాఁడు—

ఆత్మా—ముక్తియోగ్యుఁడైన జీవుఁడు, యద్వత్—ఏ ప్రకారము, ముకుంద సేవయా—మోక్షప్రదుఁడైన వైకుంఠుని కథలను వినుట మొదలైన సేవచేత, అద్ధా!—యోగ్యత కనుగుణముగా, శామ్యతి—భగ

వంతునందు నిష్ఠగల మనస్సు గలవాఁడగునో, తథా—అట్లు, కామ లోభహతః—యోగమునకు శత్రువులైన విషయేచ్ఛ, విషయానుభవము -వీనియందలి లోభముచేఁ బీడితుఁడై, ముహుః—మాటి మాటికిని. యమాదిభిః యోగపథైః—యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ ధ్యాన సమాధు లనెడు యోగ మార్గముల ననుష్ఠించినను, అద్ధా—తన యోగ్యతకుఁ దగినట్లుగా, న శామ్యతి—భగవన్నిష్ఠగలవాఁడు కాలేఁడు.

తాత్పర్యము : యోగమునకు యమ నియమాద్యంగము లెనిమిది. వీని యభ్యాసముతో మనస్సును స్థిరీకరించి పరబ్రహ్మయందు నిలుపుటకై యత్నింతురు. కాని లౌకికవిషయములం దాశ యొక వైపున కీడ్చును. లోభము మఱియొక వైపున కీడ్చును. దీనితో మనస్సు చంచల మగును. శ్రీహరియం దేకాగ్రత సాధ్యము గాదు. కాని హరికథను శ్రవణ మొనర్చుచు వానిని సేవించుచు వచ్చినచోఁ గామలోభములచేత మనస్సు ముహుః పరాస్తమగుటకు వీలుండదు. ఆయా జీవుని యోగ్యతకుఁ దగినట్లుగా హృదయము పరబ్రహ్మయం దాసక్త మగును. కనుక యమ నియమాది యోగానుష్ఠానమున కంటెను హరికథాశ్రవణమే గొప్పది.

అవ: తన కథను ముగించుచున్నాఁడు-

అనఘ!—దోషరహితుఁడవైన వ్యాసమునీ!, అహం, త్వయా, యత్, మే, రహస్యం—గడచిన కల్పమునకు సంబంధించిన కథ యగుటచేత, రహస్యమైన, భవతః—నిత్యసంతుష్టుఁడవైన నీకు, ఆత్మతోషణం—మనఃప్రీతికరమైన, జన్మకర్మచ—జన్మమును, ఆ జన్మకు సంబంధించిన కార్యమును, పృష్టః—అడుగఁబడితినో, తదిదం సర్వం ఆఖ్యాతం.

తాత్పర్యము : వ్యాసమునీ! తమయం దజ్ఞానాది దోషములు లేవు. సర్వమును దమకు విదితమే. కాని నాయందలి యనుగ్రహ

ముతోఁ దమరు నా జన్మకర్మములఁ గూర్చి యడిగితిరి. ఇది రహస్య మైన విషయము. కాని నా విజ్ఞాపనము తమ మనస్సునకు సంతోష కర మగుటచేఁ దమ యనుజ్ఞను బాలించితిని.

అవ: వ్యాస నారద సంవాదము సూతుఁడు శౌనకాదుల కెఱింగించెనని తెలుపుచున్నాఁడు—

యాదృచ్ఛికః=1. అనిరీక్షితముగా వచ్చిపోవునట్టి, 2. శ్రీహరి యిచ్ఛానుసారము సంచరించునట్టి, యతిః=ఇంద్రియజయశీలియైన భగవాన్ నారదః వాసవీసుతం=వసురాజు బిడ్డయగు సత్యవతియందు, ఆవిష్కారమైన వేదవ్యాసునిగూర్చి, ఏవం, సంభాష్య=భక్తిపూర్వక ముగా మాటలాడించి, ఆమంత్ర్య=వారి యాజ్ఞను బడసి, వీణాంరణ యన్, యయౌ.

తాత్పర్యము: వసుపుత్త్రియగు సత్యవతీదేవియందు వ్యాస భగవానుఁడు తన్నుఁదా నావిష్కరించికొనెను. అతనికి నారదుఁడు దన జన్మకర్మములను విన్నవించికొన్నాఁడు. నారదుఁడు వాసుదే వుని యిచ్ఛానుసారము చరించువాఁడు. ఆయన రాక పోక లెవ్వ రికిని దెలియవు. జితేంద్రియుఁడైన నారదుఁడు వీణయందు శ్రీహరి చరిత్రమును బలికించుచు నాకాశమున కెగసెను. యయౌ యాదృ చ్ఛికో యతిః అని శ్రీధరుల పాఠము.

యః=శార్ఙ్గధన్వనః కీర్తిం సూధ్వ్యా= చెవి కింపయిన, గిరా, తంత్ర్యా = వీణనుండి, గాయన్, ఆతురం = సంసారక్లేశదుఃఖితమైన, జగత్ జీవరాసులను, రమయతి=సంతోషింపఁజేయునో, అయం=దేవ ర్షిః=దేవతయు ఋషియునైన నారదుఁడు, ధన్యః = భాగ్యశాలియైన వాఁడు, అహో!.

తాత్పర్యము : దేవర్షియైన నారదుఁడే ధన్యుఁడు. దాసీపుత్రుఁడుగా జన్మించినను ఇట్టి గొప్ప పదవినందుట పరమాశ్చర్యము. జగత్తు సంసారదుఃఖములతో నిరంతరమును బాధపడుచుండును. ఇట్టి జగత్తును మోక్షరూపమైన పురుషార్థమునకు నర్థముగ నొనర్చి యానందపఱచుటకే యీ ఋషివర్యుఁడు శార్ఙ్గధనుర్ధారియైన శ్రీహరికీర్తిని గానించును. కర్ణమోహనమైన ఈ మాటలను వీణనుండి పలికించునపు డా యందమునకు మేర యేమున్నది? అందుకే యతనికి నారదుఁ డను పేరు సార్థకమైనది. నారం=జ్ఞానమును, ద=ఇచ్చువాఁడు – ఇదియొక యర్థము. అర మనఁగా దోషము. అరదుఁ డనఁగా దోషమును గల్గించువాఁడు. నారదుఁడు దోషమును గల్గింపనివాఁడు. అర అంగా రక్రగహము. అ(గహ మాయుస్సును ఖండించును అనఁగాఁ జంపుననుట, నారదుఁ డాయుస్సును ఖండింపనివాఁడు. అనఁగా జీవితమును సార్థక మొనర్చువాఁడని భావము. 'మాధ్యాగిరా' అని వీరి పాఠము.

పోతన్నగారు ।

అనందాశ్రులు గన్నులన్ వెడల రోమాంచంబుతోఁ దత్పద
ధ్యానారూఢుఁడనైన నా తలఁపులో సద్దేవుఁడుం దోఁచె నే
నానందాబ్ధిగతుండనై] యెఱుఁగలేనైతిన్ ననున్ నీశ్వరున్
నానాశోకహమైన యత్తనువు గానన్ నేరకట్లంతటన్.

వ. లేచి నిలుచుండి క్రమ్మఱ న ద్దేవుని దివ్యాకారంబుఁ జూడ నిచ్ఛించుచు హృదయంబున నిలుపుకొని యాతురుండునుం బోలెం జూచియుం గానక, నిర్మనుష్యంబైన వనంబునం జరియించుచున్న నన్నునుద్దేశించి వాగగోచరుండైన హరిగంభీరమధురంబులైన వచనంబుల శోకం బుపశమింపంజేయు చందంబున నిట్లనియె.

ఏల కుమార! శోషిలఁగ నీ జననంబున నన్నుఁ గానఁగాఁ
జాలవు నీవు గామముఖషట్కము నిర్దళితంబుసేసి ని
ర్మూలిత కర్ముఁడైన మునిముఖ్యుడు గాని కుయోగి గానఁగాఁ
జాలఁడు నీదుకోర్కి కొనసాగుటకై నిజమూర్తిఁ జూపితిన్.

నావలని కోర్కి యూరక
పోవదు విడిపించు దోషపుంజములను మ
త్సేవం బుట్టును వైళమ
భావింపఁగ నాదుభక్తి బాలక! వింటే.

నాయందుఁ గలుగు నీ మది
పాయదు జన్మాంతరమున బాలక! నీ వీ
కాయంబు విడిచి మీఁదట
మా యనుమతిఁ బుట్టఁగలవు మద్భృత్యుఁడవై.

విను మీ సృష్టిలయంబు నొంది యుగముల్ వేయైన కాలంబు యా
మినియై పోయెడిఁ; బోవఁగాఁ గలుగుఁ జామ్మీఁద నాసృష్టి; యం
దు నిరూఢస్మృతితోడఁ బుట్టెదవు; నిర్దోషుండవై నా కృపన్
ఘనతం జెందెదు శుద్ధసాత్త్వికులలో గణ్యుండవై యర్భకా!

వచ: అని యిట్లాకాశంబున నోంకారమూర్తియై ఋగ్వేదాది కంబు నిశ్వాసంబుగా నొప్పి, సర్వనియామకంబైన మహాభూతంబు వలికి యూరకున్న, నేనును మస్తకంబువంచి మ్రొక్కి తత్కరుణకు నంత సించి, మదంబు దిగనాడి, మత్సరంబు విడిచి, కామంబు జయించి, క్రోధంబు వర్జించి, లోభ మోహంబుల వెడల నడచి, సిగ్గు విడిచి, యనంతనామంబులు పఠించుచుఁ బరమభద్రంబులైన తచ్చరితంబులం జింతించుచు నిరంతర సంతుష్టుండనై కృష్ణుని బుద్ధి నిలిపి నిర్మలాంతః కరణంబుతోడ విషయవిరక్తుండనై కాలంబున కెదురుచూచుచు భూమిం దిరుగుచు నుండు నంతం గొంతకాలంబునకు మెఱుపుమెఱసిన తెఱఁగున మృత్యువు దోఁచినం బంచభూతమయంబును గర్మస్వరూపంబైన

పూర్వదేహంబు విడిచి, హరికృపావశంబున శుద్ధసత్త్వమయంబైన భాగవత దేహంబు సొచ్చితి. అంతం ద్రైలోక్యంబు సంహరించి ప్రళయకాలపయోరాశి మధ్యంబున శయనించి నిదురఁబోవ నిచ్ఛగించు నారాయణమూర్తియందు బ్రహ్మనిశ్వాసంబు వెంట నతని లోపలం బ్రవేశించితి. అంత సహస్రయుగ పరిమితంబైన కాలంబు సనిన లేచి లోకంబులు సృజియింప నుద్యోగించు బ్రహ్మ ప్రాణంబుల వలన మరీచిముఖ్యులగు మునులును నేనును జన్మించితిమి. అందు నఖండిత బ్రహ్మచర్యుండనై యేను మూఁడు లోకంబుల బహిరంతరంబులందు మహావిష్ణుని యనుగ్రహంబున నడ్డంబులేక ఈశ్వరదత్తయై బ్రహ్మాభివ్యంజకంబులయిన సప్తస్వరంబులు దమయంతన మ్రోయుచున్న ఈ వీణాలాపనరతిం జేసి నారాయణ కథాగానంబు సేయుచు జరియింపుచుండుదు.

తీర్థపాదుఁడయిన దేవుండు విష్ణుండు
తనచరిత్ర మేను దవిలిపాడఁ
జీరఁబడ్డవాని చెలువున నేతెంచి
ఘనుఁడు నా మనమునఁ గానవచ్చు.

వినుమీ సంసారంబను
వననిధిలో మునిఁగి కర్మవాంఛలచే వే
దనఁ బొందెడు వానికి వి
ష్ణుని గుణవర్ణనము దేప సుమ్ము మునీంద్రా!

యమనియమాది యోగముల నాత్మనియంత్రితమయ్యుఁ గామరో
షములఁ బ్రచోదితంబయగు, శాంతి వహింపదు విష్ణుసేవచేఁ
గ్రమమున శాంతిఁగైకొనిన కైవడి నాదు శరీరజన్మ క
ర్మముల రహస్యమెల్ల మునిమండన! చెప్పితి, నీవు గోరినన్.

వ. అని ఇట్లు భగవంతుఁడగు నారదుండు వ్యాసమునీంద్రుని వీడ్కొని వీణ వాయించుచు యదృచ్ఛామార్గంబునం జనియెనని సూతుం డిట్లనియె.

వాయించు వీణ నెప్పుడు
మ్రోయించు ముకుందగీతములు జగములకుం
జేయించుఁ జెవులపండువు
మాయించు నఘాళినిట్టిమతి మఱిగలఁదే?

ఆనందాశ్రువులు = ఆనందబాష్పములు, కన్నులన్ = కనుల యందు, వెడలన్=ప్రవహింపఁగా, రోమాంచంబుతో=శరీరమందు నిండిన గగుర్పాటుతో, తత్పదధ్యానారూఢుఁడు-తత్ = ఆ సర్వేశ్వరుని, పద=పాదములయొక్క, ధ్యాన=ధ్యానమునందు, ఆరూఢుఁడు= పరిణతుఁడు, తత్పదధ్యానావిష్టుఁడని నేను నేర్చికొన్నపాఠము. ధ్యానముచేఁ బూర్తిగా నాక్రమింపఁబడినవాఁడని యర్థము. ఐన నా తలఁపులోన్=ఐనట్టి నా భావమునందు, అద్దేవుఁడున్ తోఁచెన్=ఆ కృష్ణపరమాత్ముఁడు దర్శన మిచ్చెను. నేను ఆనందాబ్ధిగతుండనై= ఆనంద మనెడు సముద్రపు జలమున మునిఁగినవాఁడనై, నన్నున్=నన్నును, ఈశ్వరున్=ఆ పరమాత్ముని, ఎఱుఁగ లేనైతిన్ = తెలిసికొనఁ జాలకపోతిని, అంతటన్=అటుతరువాత, అట్లు=ఆ రీతిగా, నానాశోకహామును=అనేక దుఃఖములను బోకార్చునట్టి, అ త్తనువునన్ కానన్ లేక=ఆ శరీరమున నా పరమాత్ముని స్వరూపమును జూడలేక. పై పద్యముతో నన్వయము. అ త్తనువున్, అ + తనువు, త్రికసంధి. నానాశోకహామైన అనునది తనువునకు విశేషణము. పరమాత్ముని దివ్యస్వరూపదర్శనము మాత్రమే సమస్తములగు త్రివిధతాపములను బోఁగొట్టునని భావము.

తాత్పర్యము: ఓయీ! వ్యాసముని! నాకన్నుల నానంద తుందిలములైన బాష్పపూరము లావరించినవి. శరీరము నిడువెండ్రుక వెట్టెను. నేను వాసుదేవుని ధ్యానమందు మునిఁగిపోతిని. తీవ్రధ్యానావిష్టుఁడనైన నామనసున పరమాత్ముఁడు దోఁచెను. నే నానందసముద్రమున మునిఁగి తబ్బిబ్బులైనాను. ఆ యానందములో నేను నాకుఁ దోఁచలేదు. హృదయస్థితుఁడగు భగవంతుఁడును దోఁచలేదు. హాతా

త్తుగాఁ దత్స్వరూపము మాయమై నటు లయ్యెను. నా కిక దిక్కు తోఁచలేదు. శోక మేర్పడినపుడు బాష్పోద్గమము ప్రసిద్ధము. సంతోష మేర్పడినప్పుడును బాష్పములు వచ్చును. ప్రతాపరుద్రీయమందు విద్యానాథుఁ డట్లే చెప్పెను.

అశ్రునేత్రోద్భవం వారి దుఃఖరోషప్రహర్షజమ్.

క్రోధ హర్ష భయ జృంభాది జన్యం నేత్రమార్జనాద్యను భావం నేత్రజల మశ్ర్విత్యర్థః అని వ్యాఖ్యాత సోమపీథి. ఆనందమైనపుడును అశ్రువులు గాఱు ననుటకు పెద్దగా శాస్త్రము నుదహరింప వలసిన పనిలేదు. అదియందఱి కనుభవములోనున్నదే. ఐనను కావ్య ధర్మమగుటచేఁ జూపవలసి వచ్చినదంతే. రోమాంచ మనుటకు 'సుఖాద్యతిశయాజ్జాతా రోమాంచో రోమ విక్రియా' అని విద్యానాథుఁడు. ఆనందసంప్లవే లీనః అనుటకు 'ఆనందాబ్ధి గతుఁడనై' అని తెనుఁగు. ఆనందప్రవాహ మని మూలమున కర్థము. ఆనందమును పోతన్న సముద్రముతోఁ బోల్చెను. రసోవై సః అను శ్రుతినిబట్టి 'ఆనందాద్ధేవ ఇమాని భూతాని జాయంతే' అను శ్రుతివాక్యమును బట్టియు, భగవంతుఁడు కేవలానంద స్వరూపుఁడు. వాఁడు దర్శనమిచ్చినపుడు నారదుఁ డానందమగ్నుఁడే. తన్నుఁ దాను మఱచుట సర్వమును మఱచుట యుక్తమే. కాని నారదుఁ డాశ్రయించినది ద్వైతభక్తి. అందుచేఁ దనకంటె నీశ్వరుఁడు భిన్నుఁడు గనుక వాని రూపమును గానక చకితుఁడైనాఁడు. శుచాపహం అను దానికి విస్తరణము 'నానాశోకహ'మైన అనుట.

లేచి నిలుచుండి, క్రమ్మఱన్-మఱల, అ ద్దేవుని దివ్యాకారంబున్-ఆ పరమాత్ముని యలౌకికమై స్వేచ్ఛాకృతమై, పరమ సుఖాకరమైన స్వరూపమును జూడ నిచ్ఛించినవాఁడై, హృదయంబున నిలిపికొని మఱల ధ్యానస్థితుఁడై యా స్వరూపము నిలిపికొన యత్నించె

నని భావము. ఆతురుండునుంబోలెన్—వ్యాధిగ్రస్తునివలె, చూచియున్ కానక—హృదయమున నిలిపికొనుటకు యత్నించియుఁ గృతార్థుఁడు గాలేక, ఇక్కడి యుపమానము మూలము లోనిదే. 'అవితృప్త ఇవాతురః' అని వ్యాసుఁడు. చూచియున్ కానక అనుచోట పరమాత్ముఁడు దర్శనమిచ్చినను జూడలేక అని యర్థము చేసికొనరాదు. పరమాత్ముని స్వరూపమును హృదయమున నిల్పికొనుటకై యత్నించి కృతార్థుఁడు గాలేదని భావము. నిర్మనుష్యంబైన వనంబునన్ — జనసంచారము లేని యరణ్యమందు చరియించుచున్న న న్నుద్దేశించి—తిరుగుచున్న నన్ను నన్ను గూర్చి, వాగగోచరుఁడు—వేదవాక్కుల కందనివాఁడు, 'అగోచరో గిరాం' అని మూలము. గంభీరమధురములైన వచనములు —గంభీరములై మధురములైన మాటలు, 'గంభీరశ్లక్ష్ణయా వాచా' అని మూలము. శోకం బుపశమింపఁజేయు చందంబునన్—దుఃఖమును బోఁగొట్టుచున్న వానివలె, శుచః ప్రశమయన్నివ అని మూలము. ఇక్కడ చందంబునన్ అను శబ్దమును బోతన్న చాల చమత్కారముగా నుపయోగించినాఁడు. దుఃఖోపశమనముఁ జేయుచున్నట్లుగా అనఁగా దుఃఖోపశమనము గావించుచు అని తాత్పర్యమేర్పడుచున్నది. దుఃఖితుల కుపశమన వాక్యములు పల్కుట లోకసహజమే. మూలమందలి 'శుచః ప్రశమయన్నివ' అనుచోట ఇవ—శబ్దము ఉత్ప్రేక్షావాచకముగనే యున్నది. దుఃఖమును బోఁగొట్టుచున్నవానివలె అని యర్థము. శబ్ద మర్థపుష్టముగా నన్వయించుటలేదు. శుచఇవ ప్రశమయన్—అని యన్వయించి కొన్నచో నిజముగా దుఃఖ మేర్పడలేదని పర్యవసించుచున్నది. పోతన్న రచన గొంత రమ్యముగ నున్నది. దీనికిఁ గారణము చందంబునన్ అనుదానిని జిత్రముగా వాడుట.

తాత్పర్యము: ఓయీ! వ్యాసముని! నేను ధ్యానావస్థనుండి లేచి నిలుచుంటిని. మఱల నా దేవుని స్వరూపమును హృదయస్థితముగా వీక్షింపవలెనని కోర్కి. అందుకై యత్నము. నేను సమర్థుఁడను.

గాలేకపోయినాను. నా హృదయమున గొప్పదుఃఖమేర్పడెను. నిర్జనమైన యరణ్యమునఁ బిచ్చిపట్టిన వానివలెఁ దిరుగుచుంటిని. నా స్థితిని హరి కరుణించినాఁడు. అతఁడు వాగగోచరుఁడు. గంభీర మధుర వాక్యములతో నా దుఃఖము నుపశమింపఁజేయుచు నిట్లు పలికెను.

'అతప్తతను ర్నతదామోఽశ్నుతే దివం' ఇది శ్రుతివాక్యము. ఎవఁ డతప్తతనుఁడో వాఁ డపక్వుఁడు. అట్టివాఁడు పరమానంద రసామృతసింధువైన దివం-దైవానుభూతిని, న అశ్నుతే-పొందలేఁడు. కొందఱిందలి 'అతప్తతనుః' అను శబ్దమునకు భగవంతునకు సంబంధించిన శంఖచక్రాద్యాయుధధారణము శరీరమందు లేనివాఁడని యర్థము చెప్పెదరు. తప్తతనువనఁగా వైష్ణవపరిభాషలో సమాశ్రయణమైన శరీరము గలవాఁడని యర్థము. వైష్ణవు లొకసారి సమాశ్రయణముఁ జేయించికొన్నచోఁ జాలును. ద్వైతుల కంతమాత్రముతోఁ దృప్తిలేదు. పలుమాఱు ముద్రాధారణముఁ జేసికొందురు. కొందఱు కృచ్ఛ్రము, చాంద్రాయణము, ఏకాదశి మొదలగు వాని ననుష్ఠించుట చేత కృశించిన దేహమును 'తప్తతను' వందురు. రసికులు భగవద్విప్రయోగ జన్యమైన తీవ్రతాపమునే తపస్సందురు. ఆ రీతిగాఁ దప్తతనులైన వారే భగద్దర్శనమునకుఁ బాత్రులని పై శ్రుతి వాక్యముల కర్థము. దండకారణ్య నివాసులైన పరమర్షులు రామదర్శనమునకై మహాయజ్ఞముల ననుష్ఠించి వానిద్వారా బ్రాహ్మీతనువుల నందిరి. వివిధ మంత్రానుష్ఠానములతో భూశుద్ధి వివిధన్యాసములు మొదలగు వాని ననుసరించి దివ్యాత్ములైరి. లోకాతిశయమైన యుపాసనతో రామచంద్రుని దర్శించుటలో సఫలీకృతులైనారు. ఇట్లైనను వారికిఁ బరిపూర్ణతృప్తి యేర్పడలేదు. వాఁడు దమయందుఁ జూపిన పరమప్రేమ-తత్పరమ సౌందర్య సారసర్వస్వత్వము - వీనితో సంపూర్ణ తాదాత్మ్యాపత్తి యేర్పడవలెనని యిచ్ఛించిరి. వారికి పరిరంభణేచ్ఛ జన్మించినది. రామావతారమందుఁ దత్ప్రాప్తిలేదు. కృష్ణావతారమున మీయభిలాషఁ బూరింతు నన్నాఁడు. ఆనాటినుండి వా రుత్కటమైన

యుత్కంఠతో మఱలఁ దత్స్వరూపప్రాప్తికై భావనా విశేషములలో లీనులైనారు. తత్ఫలముగా గోకులమందు గోపకాంతలుగా జన్మించిరి. భగవద్విప్రయోగ జన్యమైన తీవ్రతాపముతో సర్వదోష నివృత్తి యగును. ధ్యానప్రాప్త భగవత్స్వరూప సుఖాస్వాదనముతోఁ దత్ప్రాప్త్యుపయోగులైన దివ్యరసాత్మక దేహేంద్రియ మనోబుద్ధులు, అంతరాత్మలు వీని కాప్యాయన మేర్పడును. కాని ఈ దోషనివృత్తిరసాత్మక దేహపోషణము వీనియం దనేకములైన యవాంతర తారతమ్యము లున్నవి. పరమాత్ముఁడు పరమానంద సుధాసింధువు. జీవులు తరంగములు. వీరి సహజసంబంధ మనాదిసిద్ధము. కాని, మోహముగూడ మాయాబంధముగూడ ననాది సిద్ధమే. దానితో సర్వానర్థములకును మూలమైన భగవద్విప్రయోగ మేర్పడుచున్నది. ఇది యందఱి కనుభవములో నున్నదే. కాని భగవద్విప్రయోగ జన్యమైన తీవ్రతాపానుభూతి యే భాగ్యశాలికో యేర్పడును. పరమాత్ముఁడు అకారణకరుణా సింధువు. అట్టి తీవ్రతాపము గలవారికి వారిచిత్తములను దనవైపాకర్షించికొనుట కొక్కసారి దర్శన మిచ్చును. ఇక్కడి నారదుని స్థితి ఇట్టిదే. భగవత్స్వరూపము యొక్క సౌందర్యమాధుర్యాదుల యొక్క యనుభవ మెంతెంతగా నగుచుఁబోవునో అంతంతగా భగవద్విప్రయోగ జన్యమైన తాపముగూడఁ బెరుఁగుచుఁ బోవును. అది బెరుఁగుకొలఁది నంతఃకరణశుద్ధి ఏర్పడును. ఈ యధికాధిక మనోవిశుద్ధితో భగవత్స్వరూప సౌందర్యమాధుర్యము లధికాధికముగ హృదయమం దభివ్యక్తములగుచుఁ బోవును. దీనితో నధికాధికముగా సౌందర్యాదుల యనుభూతి ఏర్పడును. దానితో మఱల విప్రయోగజన్యతీవ్రతాపాధిక్యము. కాత్యాయనీ వ్రతమందు గోపకన్యలు భగవంతునిఁ బొందుటకుఁ దీవ్రముగ నాశించిరి. తత్ప్రాప్తికై కాత్యాయనిని గొలువఁ బూనుకొన్నారు. గోవిందుఁ డావిర్భవించెను. వారివస్త్రములు దాచినాఁడు. భగవత్సంస్పృష్టములైన దుకూలాదిధారణముతో గోపకన్యకలకు భగవత్సంపర్కము యొక్క లోకోత్తరానందానుభూతి యైనది.

అనభివ్యక్తమైన యగ్నిగల కాష్ఠమునకు, అభివ్యక్తమైన యగ్ని గల కాష్ఠముతో సంబంధ మేర్పడినప్పుడు ఆవరణభంగమై యగ్ని యభివ్యంజితమైనట్లు, నిరావరణ పరమానందఘన పరబ్రహ్మస్వరూపుడైన కృష్ణసంస్పర్శతో, నిరావరణ బ్రహ్మస్వరూప దుకూలస్పర్శతో గోపకన్యలయందు భగవత్సజాతీయమైన యప్రాకృత రసస్వరూపత యభివ్యక్త మయ్యెను. ఇట్లే కృష్ణచంద్రుని మంగళమయమైన ముఖముయొక్క అధరసుధతోఁ బరిపూరితమై వేణు వినిస్సృత వేణుగీత పీయూషసంసర్గముతోఁ బూర్తిగా గోపకన్యలయొక్క లౌకికత భౌతికత నివృత్తము లయ్యెను. అప్రాకృత రసస్వరూపత్వ మభివ్యక్తమైనది. రాసలీలావసరమందు వేణుగీతాకృష్టలై కృష్ణసమ్మిలనమునకు గోపకాంతలు సిద్ధమైనప్పుడు బంధుబాంధవులచే నడ్డగింపఁబడి యశక్తలై భగవద్ధ్యానమున మునిఁగిపోయిరి. అప్పు డీ శ్లోకమున్నది.

**అంతర్గృహగతాః కాశ్చిత్ గోప్యోలబ్ధ వినిర్గమాః,**
**కృష్ణం తద్భావనాయుక్తాః దధ్యుర్మీలిత లోచనాః.** (భా. 10.18.8)

అప్పుడు వారి యుత్సుకత, యుత్కంఠ, వ్యాకులత, మనోగతము మాత్రమేయై యుండెను. విరహజన్య తీవ్రతాపము దుస్సహమై యుండెను. కాని వారికి సమ్మేళనబాధకములైన భగవద్విజాతీయ ప్రాకృత భౌతికదేహ ఇంద్రియ మనోబుద్ధ్యహంకారాదులతో నవరోధ మేర్పడెను. ధ్యానమందే భగవంతుని మధుర మనోహర మంగళమయ స్వరూపమును సర్వతోభావముగా నాలింగన మొనర్చుకొనిరి. అచింత్యమై అప్రాకృతమైన రసోద్రేకము వారి కేర్పడెను. భగవత్సమ్మేళనోపయోగియైన అప్రాకృత దేహాదికపరిపోషణ మేర్పడినది.. తత్సాహాయ్యముతో వారు క్రమముగా సర్వబంధములను వదల్చుకొని భగవంతుని సర్వతోభావముగా నందిరి.

**దుస్సహప్రేష్ఠవిరహ తీవ్రతాపధుతా ఽశుభాః,**
**ధ్యానప్రాప్తాఽచ్యుతా శ్లేష నిర్వృత్యా ఽక్షీణమంగళాః.**(భా.10.18.10)

ఈ విధమైన తాపావస్థయే నారదమహర్షి కిపు డేర్పడినది.

కుమార=బాలకుఁడా!, శోషిలఁగన్ ఏల=ఎందుకు శరీర మనస్సులను శుష్కింపఁ జేసికొని దుఃఖించెదవు, ఈ జననంబునన్=ఈ జన్మమందు, నీవు నన్నున్ కానఁగాన్ చాలవు=ఎంత పురుషకారము చేసినను దర్శింపనేరవు, కామ ముఖషట్కమున్=కామము మొదలగు నాల్గురు శత్రువులను, నిర్దళితంబు సేసి=నాశన మొనర్చి, నిర్మూలిత కర్ముఁడు=పూర్తిగా నశింపఁ జేయఁబడిన ప్రారబ్ధకర్మము గలిగిన, మునిముఖ్యుఁడు గాని=మునిశ్రేష్ఠుఁడే తప్ప, కుయోగి=కామాదులను బూర్తిగా నిర్జింపనివాఁడు, కానఁగాన్ చాలఁడు=నన్ను దర్శించుటకుఁ శక్తుఁడు గాఁడు, నీదుకోర్కి కొనసాఁగుటకై=నీయొక్క 'దర్శింపవలె' ననెడి యాశ ఫలపర్యంతము సాఁగిపోవుటకై, నిజమూర్తిన్=నాయొక్క స్వరూపమును, చూపితిన్=చూపించితిని.

తాత్పర్యము: కుమారా! ఎందు కూరక తప్తతనుఁడవై శుష్కించెదవు. ఈ జన్మమందు నన్ను నీవు వీక్షింపనేరవు. నన్ను వీక్షించుటకుఁ గావలసిన యోగ్యతలు ముఖ్యముగా రెండు. కామాది రిపుషట్కము పూర్తిగా నశింపవలెను. ప్రారబ్ధమంతయు భోగముతో మూలముట్టముగఁ దొలఁగిపోవలెను. ఈ యోగ్యతలు గలవాఁడే యోగి. కాని వాఁడు కుయోగి. నీ వీ జన్మమునఁ గుయోగివే. నీ మనస్సును నావైపాకర్షించుటకును, నన్నుఁ జూడవలెనను కోర్కి ఫలపర్యంతము సాఁగుటకును నిజమూర్తిని జూపితి నంతే.

మూలమునందు 'హంత!' అని కలదు. దానినే 'ఏల కుమార శోషిలఁగ' నని వివరించినాఁడు. 'అవిపక్వ కషాయాణాం' దాని వ్యాఖ్యానమే 'కామముఖ్య.... ముని ముఖ్యుఁడు గాని' అంతవఱకు; 'కుయోగి' మూలమందలిదే. నీదు కోర్కి కొనసాఁగుటకై యను దానికి మూలము 'ఏతత్కామాయ' అనునది.

నావలనికోర్కి=నన్నుద్దేశించి జన్మించిన తీవ్రమైన యభిలాష, ఊరకపోవదు=వ్యర్థము గాఁబోదు, దోషపుంజములను విడిపిం

చున్=దోష సమూహములను సంపూర్తిగా నాశన మొనర్చును, మత్సే వన్=నా సేవచేత, భావింపఁగన్=తలపోయఁగా, నాదు భక్తి=నాకు సంబంధించిన భక్తి, వైశమ=శీఘ్రముగా పుట్టును, బాలక! వింటే= నామాట నీకు స్పష్టముగ నర్థమైనదా!

తాత్పర్యము: ఓయీ! నన్నుద్దేశించి జన్మించి యభిలాష వ్యర్థముగ నశింపదు. క్రమక్రమముగఁ బెరుఁగుచుఁ బోవును. అది బెరుఁగుకొలఁదియు దోషపుంజములు నశించును. నా సేవచేత శీఘ్ర ముగ నా భక్తి జనించును.

విశేషములు: నావలని కోర్కి. 'మత్కామః' మూలమునం దలి వ్యాచ్ఛయశబ్దమున కర్థము కోర్కులు అని. నాభక్తి నేను తప్ప తక్కిన యన్నికోర్కులను నశింపఁజేయునని భావము. పోతన్న దోష పుంజపరముగా నన్వయించెను. 'సత్సేవయా దీర్ఘయాతే' అని మూలము ఇక్కడ రెండురీతుల పదవిభాగము 'దీర్ఘయా అదీర్ఘయా' అని. 'స్వల్పకాలము సత్పురుషుల కొనర్చిన సేవవలన' నని యొక యర్థము. దీర్ఘకాల మొనర్చిన సత్సేవవలన నని వే అర్థము. మును లను చాతుర్మాస్యమున సేవించినాఁడు గదా! ఇక్కడ మత్సేవన్ అని యాంధ్రకవి రచన. 'నాకు నీ వొనర్చిన సేవవలన' నని యర్థము. ఇక్కడ బహుశః 'సత్సేవన్' అని యుండియుండ వచ్చును. ఎందు కనఁగా పోతన్న నిష్ప్రయోజనముగా నింతటి మూలాతిక్రమణ చేసి యుండడు. సందర్భము సత్పురుషుల సేవలను గుఱించినది గనుక 'మత్సేవయా దీర్ఘయాతే' అని యమాత్యులకు దొరకిన పాఠమై యుండునని యెంచుటంత సమంజసముగా లేదు. 'సత్సేవయా దీర్ఘయాతే జాతామయి దృఢామతిః' అని మూలము.

బాలక!, నాయందుఁ గలుగు నీ మది=నాయందు నిబద్ధమైన నీ మనస్సు, జన్మాంతరమునన్=వేఱుజన్మమందు, పాయదు=లుప్తమై

పోదు, నీ వీ కాయంబు విడచి=నీ వీ శరీరమును వదలి, మీఁదట=అటు తరువాత, మా యనుమతిన్=మా యాజ్ఞతో, మద్భక్తుఁడవై పుట్టంగలవు=నా భక్తుఁడవుగా జన్మింపఁ బోయెదవు.

తాత్పర్యము: నాయం దీ జన్మమున నిబద్ధమైన బుద్ధి వేఱు జన్మమందైనను దొలఁగిపోవదు. నీ వీ శరీరమును విడిచి మా యాజ్ఞతో మా భక్తుఁడవై జన్మింపఁ బోయెదవు.

ఈ సృష్టి లయంబు నొంది=ఈ సమస్త సృష్టియు విలుప్తమై పోయి, యుగముల్ వేయైన కాలంబు=వేయి మహాయుగముల పర్యంతకాలము, యామినియై పోయెడిన్=బ్రహ్మదేవునకు రాత్రిగాఁ గడచిపోవును, పోవఁగాన్=అట్లు రాత్రిభూతమైన కాలము గతించి పోఁగా, మీఁదన్=అటు తరువాత, నా సృష్టి కలుగుం జుమ్మీ=నా సృష్టికార్యము మొదలగును, అందున్=ఆ కాలమందు, నిరూఢస్మృతి తోడన్=గట్టిగా నెలకొన్న పూర్వజ్ఞానముతో, నిర్దోషుండవై=నిర్గతదోషములు గలవాఁడవై పుట్టెదవు. అర్భకా=ఓయీ బాలకా! నా కృపన్=నా యనుగ్రహముతో, శుద్ధసాత్త్వికులలోన్=నిష్కలంకమైన సత్త్వగుణప్రధానమైన ప్రవృత్తిగల వారిలో, గణ్యుండవై=లెక్కపెట్టఁదగిన వాఁడవై, ఘనతన్ చెందుదు=గొప్పతనమును బొందెదవు.

తాత్పర్యము: ఓ యర్భకా! ఈ సృష్టి సమస్తము లయమై పోవును. అనంతరము వేయి మహాయుగములు గడచును. తావత్కాలము బ్రహ్మదేవునకు రాత్రి. ఆ కాలము గడచిపోయిన తర్వాత నా సృష్టికార్య మారంభ మగును. అందు నీవు జన్మింతువు. ఆ జన్మమందు దోషలేశమును నిన్నంటుకొని యుండదు. నా యందు నిబద్ధమైన నీ మతి చెఱఁగిపోవదు. ఆ స్మృతు లట్లే యుండును. నా కృపతో నిర్దోషుండవైన నీవు మదనుగ్రహముతో శుద్ధసాత్త్వికులలో గణ్యుఁడవై వెలిఁగెదవు.

వచ: అని యిట్లాకాశంబునన్, ఓంకారమూర్తియై-ఓంకారమే స్వరూపముగాఁ గలవాఁడవై, ఋగ్వేదాదికంబు నిశ్వాసంబుగా నొప్పి = ఋగ్వేదము మొదలగునవి నిశ్వాసములుగాఁ గలవాఁడై, సర్వ నియామకంబైన = సమస్తమును నియమించెడి మహాభూతంబు = మహాభూతమని విష్ణుతత్త్వమునకుఁ బేరు, పలికి ఊరకున్నన్ = మహాభూతశబ్దము మూలములోనిదే, 'తన్మహద్భూతం' అని గలదు. ఆకాశంబునన్ అనుటకు మూలము 'నభోలింగ' మనునది. ఓంకారమూర్తియై' ఋగ్వేదాదికంబు నిశ్వాసంబుగా నొప్పి 'సర్వ నియామకంబైన' ఈ మూఁడును మహాభూతమునకు సమాత్మ్యఁ దొనర్చిన వివరణ. ఓంకారమును గూర్చిన వర్ణనము దాదాపుగా నన్ని యుపనిషత్తులందును గలదు. ఛాందోగ్యమందు తత్స్వరూప వివరణ మిట్లున్నది.

**ఓ మిత్యేతదక్షర ముద్గీథ ముపాసీత, ఓమితి హ్యుద్గాయతి, తస్యోపవ్యాఖ్యానం,........స ఏషరసానాగ్ం రసతమః పరమః పరార్థ్యోఽష్టమోయ ఉద్గీథః.**

**(ఛాం. 1-1-1-3)**

ఓంకారరూపమైన యక్షరమును ఉద్గీతస్వరూపమైన పరమాత్మకు వాచకముగా భావించి యుపాసింపవలెను. సామవేద గాయకుఁడైన యుద్గాత ఓంకారపూర్వకముగా సామమును గానించును. దాని వ్యాఖ్యాన మిది.

విశ్వమందుఁగల సమస్త రసములలో నుత్కృష్టస్థాన మోంకారమున కున్నది. అనఁగా విశ్వమం దుత్కృష్టతమమైన యానంద మోంకారమే. పతంజలి 'తస్యవాచకః ప్రణవః' తజ్జపస్తదర్థభావనం అన్నాఁడు. కఠోపనిషత్తులో-

**ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్యతత్.**

ఓంకారమును దెలిసిన వాఁ డేది కోరునో యది లభించును. కఠోపనిషత్తులో 'తత్తేపదం సంగ్రహేణ బ్రవీమి. ఓ మిత్యేతత్' అని

యున్నది. కనుక, సమస్తము నోంకారమే. ఇంకను ప్రణవమును గూర్చి గొప్పచర్చలు ఉపనిషత్తులనిండ నున్నవి. చాల సంగ్రహించి చెప్పుటయైనది. సమస్త వేదములకును మూలరూప మోంకారము. వేదములలో ఋగ్వేదము ప్రథమగణ్యము. అందుచే నమాత్యులు దానితో నారంభించినారు. సర్వనియామకంబు—సమస్తమును నియమించునది, మస్తకంబు శిరస్సు, తత్కారుణకున్—ఆ పరమాత్మ నాయందుంచిన యనుగ్రహమునకు, మదంబు దిగనాడి—మదమును వదలి, లోభ మోహంబుల వెడల నడచి — లోభ మోహములను పాఱదోలి, అనంతనామములు — భగవంతునకు సంబంధించిన అనేకమైన నామములు. ఏ నామము పలికినను అదియంతయు భగవంతునకు సంబంధించినదే.

శ్రీరామచంద్ర, హరి, శంభు, వరాదిశబ్దాః,
బ్రహ్మైకమేవ సకలాః ప్రతిపాదయంతి,
కుంభో, ఘటః, కలశ, ఇత్యభిశస్యమానో
నాణీయసీ మపి భిదాం భజతే పదార్థః.

ఈ యర్థమునే ఋగ్వేదము గూడ దెల్పుచున్నది.

తము స్తోతారః పూర్వ్యం యథావిద ఋతస్యగర్భం
జనుషాపి పర్తన ఆస్యజానంతోనామ చిద్వివక్తన
మహస్తే విష్ణోః సుమతిం భజామహేః (ఋ 1-155-3)

ఓ కీర్తనపరులారా! అనాదిసిద్ధుడై యజ్ఞస్వరూపుడైన విష్ణువును మీరెట్లు తెలియుదురో అట్లే, స్తోత్రాదిరూపముతో వానిని ప్రసన్న మొనర్చికొనుడు. సర్వమును విష్ణునామమునుగా దెలిసి కీర్తింపుడు. ఓ విష్ణూ! నీవు మహానుభావుడవు. నీ సుమతిని మేము సేవింతుము.

పై మంత్రమున కనేకు లనేకరీతుల నర్థములు చెప్పిరి. సాయణుడు— 'వివక్తన' అను దానికి సంకీర్తనమని యర్థము వచించెను. పరమ భద్రంబులైన—లోకమున కనంతమంగళములు గల్గించు, తచ్చ

రితము–వాని చరిత్రములను, చింతించుచు – ధ్యానము చేయుచు, నిరంతర సంతుష్టుండనై–నిరంతరమును భగవంతుఁ డిచ్చిన దానితోఁ దృప్తిపడెడు మనస్సు గలవాఁడనై, కృష్ణుని బుద్ధినిలిపి–కృష్ణస్వరూపమును బుద్ధియందు నిల్పికొని, నిర్మలాంతః కరణంబుతోడఁ– నిర్మలమైనమనస్సుతో, కాలంబున కెదురుసూచుచుఁ–మృత్యువునకు గాచియున్నవాఁడనై, భూమిం దిరుగుచుండు నంత–భూసంచారము చేయుచుండఁగా 'గాం పర్యటఁ' అనుట కిది తెనుఁగు. భూసంచారమున నాతని కేవిధమైన ఫలాపేక్షయు లేదు. కేవలము కాలము గడపుటయే యతని యుద్దేశము.

ఇంతవఱకు నడచిన వచనమునకు మూలము–

**నామా న్యనన్తస్య గతత్రపః పఠన్**
**గుహ్యాని భద్రాణి కృతాని చ స్మరన్,**
**గాం పర్యటన్ తుష్టమనాః గతస్పృహః**
**కాలం ప్రతీక్షన్ విమదో విమత్సరః.**

అనునది–

ఇందులో గతత్రపః, స్మరన్, పర్యటన్, తుష్టమనాః ఇత్యాదులన్నియు నారదునకు విశేషణములు. వాని నసమాప్త క్రియలుగాఁ దెలుఁగులో నమాత్యుఁడు వర్ణించెను. మదంబు దిగనాఁడి సిగ్గువిడచి ఇత్యాదులు. దీనితో నేమైనది? ఒక మహావీరుఁడు దన శత్రువుతోఁ బోరాడినట్లున్నది. సంస్కృతములోఁ గేవల విశేషణములుగాఁ దేలిపోయినవి. పోతన్న రచనలో వీర్యవంతములై యొక మహాసమరాంగణపుఁ గోలాహలమును సృష్టించినవి. నిర్మలాంతఃకరణము – కర్మధారయము, విషయములయందు విరక్తుఁడు సప్తమీ తత్పురుష. లోభ మోహములు ద్వంద్వము. మెఱపు మెఱసిన చందంబున మృత్యువు దోఁచినన్–హఠాత్తుగా మృత్యువుతటస్థించినదని యర్థము. మూలములో 'తటిత్సౌదామనీ యథా' యని మెఱపునకు సౌదామని

యను నొక విశేషణము. అమాత్యుఁ డిది యవసర మనుకొన్నాఁడు. పంచభూత మయంబును–పంచభూతములతో నేర్పడినదియు, కర్మ స్వరూపంబైన–ప్రారబ్ధముతోఁ దటస్థించిన, పూర్వదేహంబు విడచి, సామాన్యముగా దేహము పంచభూతములతో నేర్పడినది. దాని ప్రాప్తి ప్రారబ్ధకర్మానుభోగమునకే. హరికృపా వశంబునన్–హరి యనుగ్రహముచేత, శుద్ధసత్త్వమయంబైన భాగవతదేహంబుఁ జొచ్చితి. కేవల సత్త్వగుణముతోఁ గూడిన భాగవతదేహమును ప్రవేశించితిని. ప్రళయకాలపయోరాశిమధ్యంబునన్–ప్రళయకాల సముద్ర మధ్యమందు, బ్రహ్మనిశ్వాసంబు వెంటన్–బ్రహ్మదేవుని నిశ్వాసమార్గమున, సహస్రయుగ పర్యంతంబు–వేయి మహాయుగములు, ఉద్యోగించు–మొదలుపెట్టు, అఖండిత బ్రహ్మచర్యుండనై–బ్రహ్మచర్యవ్రతమునకు లోపము రానివాఁడనై, బహిరంతరంబులందు–లోపలను, బయటను, ఈశ్వరదత్తయై–పరమేశ్వరునిచే నీయఁబడి, బ్రహ్మాభివ్యంజకంబు–బ్రహ్మస్వరూపమును దెలియపఱచునది.

తాత్పర్యము: ఆకాశమునుండి యోంకారమూర్తియైన భగవంతుఁడు నారదునితోఁ బలికినాఁడు. "ఓంకారప్రశస్తి వేదములలో నుపనిషత్తులలో బహుధా వర్ణితము. ఓంకారమే పరబ్రహ్మ వాచకము. అ–ఉ–మ దాని యవయవములు. ఆ మూఁడింటి స్వరూపవివరణము ఉపనిషత్తులలోఁ జాలచోట్ల వచ్చును. దానినుండియే సమస్త వేదములారంభ మగును. ఋగ్వేదాదికము దాని నిశ్వాసములే. వేదములలో ఋగ్వేదము ప్రశస్తమైనది. అందుచే నమాత్యుఁడు తన్నామగ్రహణ మొనర్చెను. సమస్తమును నియమించున దోంకారస్వరూపమైన పరబ్రహ్మయే".

నారదుఁడు చెప్పుచున్నాఁడు: 'వ్యాసమునీ! ఆకాశమునుండి యిట్లు పలికిన మహాభూతమునకు శిరస్సువంచి నమస్కరించితిని. నాయందు దాతని కేర్పడిన యనుగ్రహమునకు సంతసించితిని. మదంబు

దిగనాడితిని. మత్సరము వదలితిని. కామము జయించితిని. క్రోధంబు వర్జించితిని. లోభమోహముల దరిమితిని. సిగ్గును వదలివైచితిని'. పై వర్ణమున ఏకైకవీరుఁ డొకఁడు శత్రువులతోఁ బోరాడినట్లున్నది. ఆ రచన యొక పెద్ద కోలాహలమును సృష్టించినది. మహారాష్ట్ర భాషలో తుకా రాముఁ డీ ప్రకారముగాఁ గోలాహలమును అనేక స్థలముల రేఁపును. అంతశ్శత్రువుల నిర్జించుటతోఁ బోల్చికొన్నచో బహిశ్శత్రువులతోడి యుద్ధమేమి గొప్ప యని యాతని తలఁపు. 'పరమేశ్వరుని యనంత నామములు పఠించుచుఁ దిరిగితిని. లోకమంగళకరములైన తచ్చరిత్ర ములు స్మరించుచుంటిని. ఏ సమయమున నాహారవిహారములలో నేది ప్రాప్త మగునో తావన్మాత్రముననే తృప్తి. కృష్ణపరమాత్మ స్వరూప మును బుద్ధియందు నిలిపికొన్నాను. రాఁగ రాఁగ నామనస్సు పరి శుద్ధమైనది. విషయముల పైకి నా దృష్టి నిలచుటయే లేదు. ఉద్దేశ రహితముగా భూమిని దిరుగుచుంటిని. నా తిరుగుటలో నొక ప్రయో జనము నాకాంక్షించుట లేదు. కాలమున కెదురు సూచుటయే. కొంతకాలమునకు మెఱపుమెఱసినట్లు హఠాత్తుగా మృత్యు వాసన్న మైనది. పంచభూతమయమై ప్రారబ్ధానుభూతికే యేర్పడిన పూర్వ దేహము వదలిపోయినది. భాగవతదేహమును బరమాత్ముఁడు నా కనుగ్రహించెను. తత్ప్రాప్తిలోఁ గేవలము వాసుదేవుని కృపావిశేషమే కారణము. అది కేవలము సత్త్వగుణముతోఁ గూడినది. పంచభూత మయము గాదు. ప్రారబ్ధానుభూతి కేర్పడినదియుఁ గాదు. ఇంతలో ప్రళయము వచ్చెను. స్వామి ప్రళయకాల పయోరాశిమధ్యమున శయనించి నిదురవోవ నిచ్ఛగించినాఁడు. బ్రహ్మయు నాతనితోఁ జేరి నిద్రింప నాకాంక్షించెను. వేయి మహాయుగములు గడచినవి. పర మేశ్వరుని యనుజ్ఞతోఁ జతుర్ముఖబ్రహ్మ లోకసృష్టి కారంభించినాఁడు. బ్రహ్మదేవుని యవయవములనుండి మరీచి ముఖ్యులైన మహర్షులును నేనును జన్మించితిమి. బ్రహ్మదేవుని తొడనుండి నేను బుట్టితిని. అఖండ బ్రహ్మచర్యముతో నస్కందితవ్రతుఁడనై మూఁడులోకముల లోపలను

బయటను నేను సంచరింతును. కర్మనిష్ఠులు లోకముల యంతర మందే సంచరింతురు. తపస్వులు లోకముల బహిర్భాములందే సంచ రింతురు. నేను లోపలను బయటను దిరుగుదును. ఆ శక్తి భగవత్కృ పాలబ్ధము. నాకు పరమేశ్వరుఁడు వీణను దయచేసినాఁడు. దానికి 'మహతి' యని పేరు. 'దేవదత్త' మనియు నామాంతరము. దాని కేడు తంత్రులు, సప్తస్వరములు. అవి బ్రహ్మాభివ్యంజకములు. స్వర ములు బ్రహ్మస్వరూపములే. ఆ వీణ దనయంత మ్రోఁగుచుండును. దాని మూర్ఛనలలో నా కంఠమును గలిపి హరికథాగాన మొనర్తును.

పై వచనమందు 'బ్రహ్మప్రాణంబు వలన మరీచి ముఖ్యులగు మునులును నేనును జన్మించితిమి' అని గలదు. మూలమందు 'ప్రాణే భ్యోఽహం చ జజ్ఞిరే' అని ప్రాణశబ్దమే యుపయోగింపఁబడినది. కాని, శ్రీధరుఁడు ప్రాణేభ్యః ఇంద్రియేభ్యః అని వ్యాఖ్యానించెను. దీనికిఁ గారణమేమి? 3వ స్కంధము 12వ అధ్యాయములో నార దుఁడు బ్రహ్మదేవుని యూరువులనుండి జన్మించినట్లున్నది. పోతన్న గూడ 'ఊరువులవలన నారదుండును' అని తృతీయ స్కంధమున నాంధ్రీకరించినాఁడు. మఱి శ్రీధరుని వ్యాఖ్యానము నాతఁ డెందుకు సరకు చేయలేదు? ఇది ప్రశ్నయే. పోతన్న దీని కిట్లు సమాధానము చెప్పికొన్నాఁడు. 'నారదాదులు లోనఁ బ్రవేశించినది బ్రహ్మ నిశ్వా సము వెంట. గడ్డకు వచ్చుట ఉచ్ఛ్వాసము వెంట ననుటయే సమం జసముగా నుండును'. మఱి తృతీయస్కంధ విషయము గతియేమి? తృతీయస్కంధకథలో మొదట మహామోహాదికములు సృష్టించి నట్లున్నది. ప్రథమస్కంధమందు— 'మరీచి మిశ్రా ఋషయః, ప్రాణే భ్యోఽహం చ జజ్ఞిరే' అని మరీచ్యాదులు ప్రథమ సృష్టిగాఁ జెప్పఁ బడినది. కల్పభేదముతో సమర్థించికొనుట దప్ప వేఱుమార్గము లేదు. కాకున్న ఊరువులనుండి జన్మించినను సంకల్పము లేనిది కార్య మేర్పడదు గనుక సంకల్పము ప్రాణప్రచోదకము. అందుకే ఊరువుల నుండి జన్మించినను ప్రాణములనుండి పుట్టినట్లేయని యొక క్లిష్టమైన

మార్గము. ఈ విరోధము మూలమందే యున్నది. అందుకే శ్రీధరుఁడు జాగ్రత్తపడినాఁడు. కాని, 'ప్రాణ' శబ్దమున కింద్రియములని యర్థము గల్పించుటలో సరని మార్గమేదో యూహ కందదు.

ఘనుఁడు=దేవతలలో సర్వోత్తముఁడైన వాఁడు, విష్ణుండు=సర్వపదార్థములయందును వ్యాపించియున్నవాఁడును, తీర్థపాదుఁడు=సమస్త తీర్థములతో సమానమైన పాదములు గలవాఁడును అనఁగా, శ్రీమహావిష్ణుని పాదములను సేవించినచో సమస్త తీర్థములలో స్నానమాడిన పుణ్యఫలము లభించును. లేక గంగానది కుత్పత్తి స్థానమైన పాదములు గలవాఁడను. రెండవ యర్థమందు వ్యధికరణ బహువ్రీహి. తీర్థం పాదాభ్యాం యస్య సః అని సమాసము. మొదటి యర్థమందు తీర్థాని పాదయోః యస్య సః అని విగ్రహము. దేవుండు=లోకోత్తరమై సర్వాతిశాయియైన తేజస్సుగల శ్రీవాసు దేవస్వరూపము, ఏను=నేను, తన చరిత్రము=తనకు సంబంధించిన కథాసమూహము. అనఁగా విష్ణుదేవుఁడు ధరించిన భిన్నభిన్నములైన యవతారములలోఁ జూపిన యనేక క్రీడలను, తవిలిపాడన్=నా మనస్సును లగించి పాడఁగా, చీరఁబడ్డవాని చెలువునన్=పిలువఁబడిన వానివలె, ఏతెంచి=వచ్చి, నా మనమునన్=నా హృదయమునందు, కానవచ్చున్=తనస్వరూపమును సాక్షాత్కరింపఁ జేయుచున్నాఁడు.

తాత్పర్యము: ఓ వ్యాసమునీ! అతని పాదసేవ యొనర్చుట సమస్త తీర్థములలో మున్గుటే. గంగాజనికారణమైన యాతని పాద కమలములు సర్వాతి శాయియైన యాతని తేజస్సు కన్నులకుఁ బట్టరానిది. అతఁడు సర్వవ్యాపి. ప్రతివస్తువు బహిరంతరంబుల యందును భాసించున దాస్వరూపమే. కాని, యధికారి విశేషమును బట్టి వాని స్వరూపము వ్యక్త మగుచుండును. దేవతలలో నంతటి ఘనుఁ డెవ్వఁడును లేఁడు. అతఁడు వివిధావతారములలో నొనర్చిన వివిధక్రీడలను రసపరవశముగా గానించుచుంటిని. పరమపురుషుఁడు

సంకీర్తనప్రియుఁడు. వాఁడు నా పాటలకు కరఁగి యాహూతునివలె నేతెంచి, నా హృదయమునఁ దన స్వరూపము నెలకొల్పుచుండెను. గానముతో నా కేర్పడిన స్వప్రయోజన మిది. 'తవిలిపాడన్' గాన మొనర్చునపుడు కరణముల నన్నిటిని దానియందు లగించి పాడ వలెను. సంకీర్తనకారునకు సమస్తమును స్వామిమయమై పోవలెను. ఈ పద్యమందు సంకీర్తన కారుని లక్షణము చాలఁ జక్కఁగా నిరూ పింపఁబడినది. సంకీర్తనకారుని కుండవలసిన గుణములలోఁ గొన్నిటి నభిజ్ఞు లిట్లు చెప్పెదరు.

**తృణాదపి సునీచేన, తరోరపి సహిష్ణునా,**
**అమానినా మానదేన కీర్తనీయ స్సదా హరిః.**

కీర్తన భక్తిని నమ్ముకొన్నవాఁడు తనకులము, విద్య, రూపము, జాతి, ధనము - వీనికి సంబంధించిన మదమును సదా వర్జింపవలెను. తన్నుఁ జాల గొప్పవానివలె నెంచుచు, నెదుటివారిని తుచ్ఛముగ నెంచరాదు. ఇంతమాత్రమేగాదు. తాను గడ్డిపోచకన్నను నల్పుఁడనను భావ ముండవలెను. అంతమాత్రమే కాదు. తృణము దళితమైనపుడు వంగి వెంటనే లేచును. తన్నితరులు పరాభవించిరని మానసికవ్యథ నందుటలేదు. అట్లే కీర్తనకారుఁడును తిరస్కారమును అవమానమును భగవత్కృపా మాత్రములుగనే యెంచి వానియందు ద్వేషము వహింపక సహజమైన చిత్తవృత్తినందవలెను. అత్యంతదీన భావము వాని ప్రతివిధానమందును గన్పింపవలెను. వృక్షమున కన్నను సహనశీలుఁడు గావలెను. వృక్షము శీతోష్ణాది ద్వంద్వ భావ ములను సహించుచున్నది. తన కొమ్మలను నఱకు వానికిని ఆశ్రయ మిచ్చును. రాలతోఁ గొట్టువానికిఁ దీయని ఫలముల నొసఁగును. ఇట్లే కీర్తన సాధకుఁడును ద్వంద్వముల సహింపవలెను. కటువుగ మాటలాడు వానిని దీయని మాటలతోఁ బలుకరింపవలెను. మర్మభేది వాక్యములతో క్షుబ్ధుఁడు గారాదు. తనకు గౌరవము చెల్లకున్నను

బరులను గౌరవింపవలెను. సర్వకాలములందును శ్రీహరి నామ మొక్కటినే యాధారముగాఁ గొని మెలఁగవలెను. వాఁడు ముఖ్యముగ గమనింపవలసిన కొన్ని నియమము లున్నవి. అత్యంతావశ్యకమైనది భావశుద్ధి. వానికి స్వామిపైఁ దప్ప మఱి యితరములపై నభిలాష యుండరాదు. సమస్త భావమాలిన్యములనుండి తొలఁగి యుండవలెను. కీర్తనమును జీవించుటకు సాధనముగా నొనర్చికొనరాదు. తాను భక్తుఁడ ననుభావము చాల నపకారకమైనది. ఇట్టి కీర్తన పరిశుద్ధమైనది గాదు. తన కీర్తనకు భగవంతుఁడు సంతోషించుటయే ప్రధానఫలముగా నుండవలెను. రెండవది యాచారశుద్ధి. ఇది లేనిది పరమాత్ముని నామముల నుచ్చరించుట కర్హతలేదు. స్వధర్మావహేళనము భగవంతునకు సమ్మతమైనది గాదు. ధర్మతిరస్కారము చిత్తశుద్ధికి ప్రబల బాధకము. పూర్వకాలమున కబీరు, రైదాసు, నామదేవాదులు గూడ సమాజోచితమైన యాచారమును బాటించిరే కాని తిరస్కరింప లేదు. చాలమంది భజనలపేరిట ధర్మోచ్ఛేదమును గావించుచున్నారు. వారిభజన విడంబనామాత్రమే.

**హరికో భజయి, సో హరికా హోయి**

**జాతి పాతి పూఛయి నా కోయీ.**

అని కొందఱు భక్తులు పలికిన మాట నిజమే. కాని సాధకుఁడా స్థితి నందికొనుటకు గొప్పసాధన గావలెను. ఎప్పుడో సమాధిస్థితియందుఁ గొంతకాలమే యుండు మానసికపరిస్థితి యది.

కీర్తనకారునికి శారీరకశుద్ధి ప్రధానము. నియమానుసారముగ స్నానాదు లొనర్చుట, సాత్త్వికాహారసేవనము మొదలైన వన్నియు నావశ్యకములే. ఎట్లైనను కీర్తన మొనరింప వచ్చుననుట, తన్నును లోకమును మోసగించుట. శాస్త్రములలో నీ నియమము లనేకములుగాఁ బ్రచురింపఁబడినవి. నామాపరాధములు, సేవాపరాధములు

మఱికొన్ని గలవు. సేవాపరాధములు సుమారు మూఁడు పదుఁ కున్నవి. వరాహపురాణమందు ముప్పదిరెండు సేవాపరాధములు చెప్పఁబడెను. అవి తటస్థించినపుడు పశ్చాత్తాపబుద్ధితో నామ కీర్తన మొనర్పవలెను. ఈ విషయమును భగవానుఁడే చెప్పినాఁడు-

మమ నామాని లోకేఽస్మిన్, శ్రద్ధయా యస్తు కీర్తయేత్,
తస్యాపరాధ కోటీంస్తు, క్షమా మ్యేవ న సంశయః.

నామాపరాధములు మఱికొన్ని యున్నవి. సత్పురుషనింద ప్రధానమైనది. శివవిష్ణువులయందు భేదమెంచి వారి నామములలో నెక్కువ తక్కువలు నిరూపించుట రెండవ యపరాధము. గురువు నవమానించుట వేదాది శాస్త్రములనింద ఇవి రెండును ప్రబలాపరాధ ములు. భగవంతుని నామకీర్తనమందు అర్థవాదకల్పనసేయుట మఱి యొక దోషము. భగవన్నామము సర్వపాపములఁ బోఁగొట్టును. వాని నామము జపించుచుండఁగా నఘములు మమ్మేమి యొనర్పునని నామబలమున వృజినము లొనర్చుట. ఇది పరమదోషము. ప్రమాద వశమున పాపమొనర్చి పశ్చాత్తాపముతో నామకీర్తన మొనర్చిన నట్టి కీర్తనము పాపపరిహారక మగును. అంతేకాని మనః పూర్వకముగఁ బలుమా రొనర్చు పాపములకు నిష్కృతి లేదు. యజ్ఞము, తపము దానము, వ్రతము మొదలైన శుభకర్మలను నామకీర్తనతో సమాన ముగ నెంచుట వేఱుదోషము. శ్రద్ధారహితుఁడై వినుట కిష్టములేని వానినిఁ గూర్చుండఁబెట్టికొని కీర్తనమహిమ నుపదేశించుట నామ మహిమను వినియుఁగూడఁ గీర్తనమందుఁ బ్రవృత్తుఁడుఁగాకుండుట యపరాధములు. 'నేను-నాది'యను బంధనములకుఁ జిక్కి, విషయ భోగములం దాసక్తుఁ డగుట. ఈ యపరాధములను సంపూర్తిగా వర్జింపవలెను. ఎప్పుడైన ప్రమాదవశమున నేర్పడినచో వానికి నిష్కృతి నామకీర్తనమే యనుచున్నాఁడు పరమాత్ముఁడు.

**నామాపరాధ యుక్తానాం నామాన్యేవ హరంత్యఘమ్,**
**అవిశ్రాంతప్రయుక్తాని తాన్యేవార్థ కరాణి చ.**

చిరఁబడ్డవాని చెలువునన్—ఇచట చెలు వనఁగా నందము. ఈ శబ్ద ముపమావాచకముగాఁ బర్యవసించుచున్నది. 'అహూత ఇవ మే శీఘ్రం' అని మూలము.

కొందఱు గాత్ర మెట్లున్నను సంగీతజ్ఞాన మెట్లున్నను గీర్తన యొనర్చినఁ జాలు నందురు. సంకీర్తనము స్వప్రయోజనమునే గాక పరప్రయోజనమును గూడ సాధింపవలెను. సంగీతజ్ఞానముతోఁ గేవలము గచేరి చేయకున్నను వినువారినిఁ గొంతవఱకైన నాకర్షించెడి గుణము సంకీర్తనలో నుండుట ముఖ్యము. లయజ్ఞానము స్వరజ్ఞానము గేవలము మందుకైనను లేకుండ గాన మొనర్చి యిదే సంకీర్తన మనుట పొరపాటు. సమర్థరామదాసస్వామి తన దాసబోధలో సంకీర్తన లక్షణమును విపులముగ వర్ణించినాఁడు. అనేక వాద్యములతో రాగ లయజ్ఞానముతో భగవంతునిఁ గీర్తింపవలెనను టాతని యభిమతము.

సప్తస్వరసుందరులు నాభిహృత్కంఠ రసన నాసాదులయందుఁ బ్రకాశింతు రనుట త్యాగయ్యగారి స్వీయానుభవము. అతని సంకీర్తనా పద్ధతి యిట్టిది—

**నిద్దుర నిరాకరించి, ముద్దుగా తంబూర బట్టి**
**శుద్ధమైన మనసుతో, సుస్వరముతో—**

పాడవలె నఁట! కేవలము శుద్ధమైన మనసేచాలదు. సుస్వరముగూడ నుండవలెను. త్యాగరాజు నారదుల శిష్యుఁడు. అతని యభిప్రాయములు నారదుని వనుటలో సందేహమేమి?

అవ : పరప్రయోజనమును జెప్పుచున్నాఁడు—

వినుమీ=వ్యాసమునీ! న న్ననుగ్రహించి వినుము. సంసారం బను వననిధిలోన్ మునిఁగి=సంసారమనెడు సముద్రమందు మునిఁగి వననిధి యనఁగా సముద్రము. వన మనఁగా జలము. 'జీవనం భువనం వనం' అమరము. కర్మవాంఛలచేన్=ఫలాభి సంహితములైన కర్మలయందలి కోరికచేత, వేదనఁ బొందెడువానికిన = అమితమైన మనోవైకల్యము ననుభవించెడు వానికి, విష్ణుని గుణవర్ణనము=శ్రీ మహావిష్ణుని గుణములను వర్ణించుట, తేప సుమ్ము=తెప్పవంటిది.

తాత్పర్యము: ఓ వ్యాసమునీంద్రా! వినుము. ఈ సంసారమనునదే మహాసముద్రము. సామాన్యు లందఱును దీనియందు మున్గుదురు. పృథివ్యాదితత్త్వములు వానిగుణములైన రూప రస గంధ స్పర్శాదులు వారిమనస్సును దీవ్రముగ నాకర్షించుచుండును. వానిని బొందు నాకాంక్షతో ఫలాభిసంహితములైన కర్మ లొనర్చు చుందురు ఆ కోర్కెలు వారికి సిద్ధింపవు. సిద్ధింపవలెనని తీవ్రమైన యాతురత అట్టి వారు సంసారమను సముద్రమును దాఁటుటకు మార్గమేది? హరిగుణానువర్ణనమే వారికి తెప్ప. వేఱుమార్గము లేదు. కర్మవాంఛ చేన్='మాత్రాస్పర్శేచ్ఛయా' యని మూలము.

యమనియమాది యోగములన్ = యమము నియమము మున్నగు యోగమార్గములచేత, ఆత్మ=మనస్సు, నియంత్రితమయ్యు=నియమింపఁబడిన దయ్యును, కామదోషములన్=కామము, క్రోధము మొదలగువానిచేత, ప్రచోదితంబయగున్=ప్రేరింపఁబడినదే యగును విష్ణుసేవచేన్=శ్రీమహావిష్ణువు సేవచేత, క్రమమునన్=కాలక్రమముగా శాంతిఁ గైకొనిన కైవడిన్=శాంతి నవలంబించినట్లుగా, శాంతి వహింపదు=చిత్తోపశమనము దాల్పదు, మునిముండన!=మునులకు సామ్ము వంటివాఁడా శ్రేష్ఠుఁడా యని తాత్పర్యము. నీవు కోరినన్=నీ విచ్ఛింపఁగా, నాదు శరీరజన్మకర్మముల రహస్యమెల్లన్=నా జన్మరహస్యమును కర్మరహస్యమును సమస్తమును చెప్పితిన్=నీకు వివరించితిని.

తాత్పర్యము: మునిమండనుఁడవైన వ్యాసమునీ! కొందఱు యమనియమాది యోగముల ననుసరించి మనస్సును గట్టఁజూతురు. కాని వారి యత్నము ఫలింపదు. మాటిమాటికిని గామక్రోధాదులు పుట్టలోనుండి లేచిన పాములవలె బయటికి వచ్చుచునే యుండును. పలుమారు వానిని నియమించుటకై యత్నము. ఇదే సర్వమైపోవును. చిత్తశాంతికి మార్గము విష్ణుసేవ యొక్కటే. దానితో మనస్సు క్రమ క్రమముగా శాంతిని వహించును. నా జన్మకర్మముల రహస్యము నెఱిఁగింపుమని కోరితివి. దాపరికము లేక సమస్తమును నీకు విన్న వించితిని. ప్రాచీనులు స్థూలముగా యోగసంప్రదాయములు నాలు గని నుడివిరి. 'యోగశ్చిత్తవృత్తి నిరోధః.' ఇది వాని సామాన్య లక్షణము. ఏ మార్గముతో నైనను చిత్తవృత్తిని నిరోధించుట వారి ప్రధానలక్ష్యము.

మొదటిది మంత్రయోగము. రెండవది హఠయోగము. తరు వాతివి లయయోగ రాజయోగములు. మంత్రయోగమునకు నారద పులస్త్య గర్గ వాల్మీకి భృగు బృహస్పత్యాదులాచార్యులని యందురు. వీరిసంప్రదాయ మిట్లుండును. పరమాత్మనుండి భావముదయించును. భావమునుండియే నామరూపములు. వీని వికారమే, విలాసమే యీ సంసారము. ఏ క్రమముతో సృష్టి ఏర్పడినదో తద్విపరీతమార్గమునే లయ సిద్ధించును. ఇది నియమము. పరమాత్మునినుండి భావము భావమునుండి నామరూపముల ద్వారా సృష్టి యేర్పడు నంటిమి. దీనితో సమస్తజీవులును సంసారబంధమునఁ దగుల్కొన్నారు. నామ రూప విమోహితులై యున్నమాట. దీనినుండి విడుమర? అట్టిలాభము నకు మొదట నామరూపముల నాశ్రయింపవలెను. దీనితో భావము దానినుండి భావగ్రాహియైన పరమాత్మయందు చిత్తవృత్తిలయము. దానిలో ముక్తి. కనుకనే నారదాది మహర్షులు నామరూపముల నాశ్రయించినారు. ఈ ప్రక్రియలో ననేకసాధనములు వారు వివరిం

చిరి. ఇదియే మంత్రయోగము. యోగశాస్త్రమందు దీని లక్షణ మిట్లున్నది.

నామరూపాత్మికా సృష్టి ర్యస్మా త్తదవలంబనాత్,
బంధనాన్ముచ్యమానోఽయం ముక్తిమాప్నోతి సాధకః.

తామేవ భూమి మాలంబ్య స్ఖలనం యత్ర జాయతే,
ఉత్తిష్ఠతి జనస్సర్వోఽధ్యక్షేణై తత్సమీక్షతే.

నామరూపాత్మకై ర్భావై ర్బధ్యంతే నిఖిలాజనాః,
అవిద్యాగ్రసితాశ్చైవ తాదృక్ప్రకృతి వైభవాః.

ఆత్మన స్సూక్ష్మప్రకృతిం, ప్రవృత్తించానుసృత్య వై,
నామరూపాత్మనో శ్శబ్ద భావయో రవలంబనాత్.

అర్థము: సృష్టి నామరూపాత్మకము. కనుక, నామ రూపముల నవలంబనముగాఁ గొనియే సృష్టిబంధమునుండి తప్పించికొని జీవుఁడు ముక్తినందును. ఏ భూమిపై మనుష్యుఁడు పడునో తదవలంబనముతోనే వాఁడు మఱల లేచును. ఇది ప్రత్యక్షసిద్ధము. నామరూపాత్మకములైన విషయములు జీవుని బంధించును. తత్ప్రకృతి వైభవముతో జీవుఁ డవిద్యాగ్రస్తుఁ డగును. కనుక, తన తన సూక్ష్మప్రకృతి, ప్రవృత్తి వీని ననుసరించి నామరూపమయ శబ్దము, భావమయ రూపము—వీని యవలంబనముతో నొనర్పఁబడు యోగసాధనకే మంత్రయోగ మని పేరు. దీని కనేకాంగములు.

భవంతి మంత్రయోగస్య షోడశాంగాని నిశ్చితమ్,
యథా సుధాంశో ర్జాయంతే కలాష్షోడశ శోభనాః.

భక్తి శ్శుద్ధి శ్చాసనం చ పంచాంగ స్యాపిసేవనమ్,
ఆచారధారణే దివ్య దేశసేవన మిత్యపి.

ప్రాణక్రియా తథా ముద్రా తర్పణం హవనం బలిః,
యోగో జప స్తథా ధ్యానం సమాధిశ్చేతి షోడశ.

చంద్రకళలవలె దీనికిని పదునాఱంగములు. భక్తి, శుద్ధి, ఆసనము, పంచాంగసేవనము, ఆచారము, ధారణ, దివ్యదేశసేవనము, ప్రాణక్రియ, ముద్ర, తర్పణము, హవనము, బలి, యాగ, జపధ్యాన సమాధులు-వీని వర్ణనము నానాశాస్త్రములయందుఁ బ్రపంచితము. భక్తిస్వరూపముగూడ నంతే. శుద్ధి యనేకవిధములు. దిఙ్నియమము స్థాననియమము శరీరశుద్ధి. ప్రాణాయామాది ద్వారా మనశ్శుద్ధి. ఏ యాసనముపైఁ గూర్చుండి చేయవలెననుట యాసనశుద్ధి. దర్భాసనము, మృగచర్మాసనము మొదలైనవి. ఇష్టదేవతాగీత, సహస్రనామము, స్తవము, కవచము, హృదయము ఇవి పంచాగములు. ఆచారములు అనేకపురాణములలో వర్ణింపఁబడినవి. బాహ్యమూర్తులయందు మనస్సు లగింపఁజేయుట లేక మనస్సులో మూర్తిని నిల్పుకొనుట-దీనికి ధారణ యనిపేరు. ఒకానొకస్థానమునందు పీఠము నేర్పఱచికొని దానియం దిష్టదైవమును బూజించుట దివ్యదేశహనము. మూర్ధము హృదయము నాభి ఘటపటములు పాషాణాది మూర్తులు స్థండిలములు. యంత్రములు మంత్రశాస్త్రములోని ప్రాణాయామ మొకటిదప్ప శరీరభిన్న భిన్నస్థలములందు ప్రాణములు లగింపఁజేసి, సాధనయొనర్చుపద్ధతి-దీనినే ప్రాణక్రియ యందురు. న్యాసాదు లిందులోనివే. ప్రతిదేవతకు సంబంధించిన కొన్ని ముద్రలుండును. శంఖముద్ర, యోనిముద్ర మొదలైనవి. తర్పణ హవనములు ప్రసిద్ధములు. బలి మూఁడురీతులు. ఆత్మబలి, అహంకారాదులబలి, ఇంద్రియబలి. కామ క్రోధాదుల విసర్జించుట; ఈ రెంటికి నంతర్బలి యనిపేరు. బాహ్యబలి త్రిగుణములతో మూఁడు రీతులు. సాత్త్వికబలి ఫలాదులు. రాజస తామసములు పశ్వాదులు. యాగములును రెండురీతులే. అంతర్యాగబహిర్యాగములు జపము త్రివిధము. వాచిక, ఉపాంశు, మానసికములు. ఇష్టదైవమును మనస్సుతో భావించుట ధ్యానము. తద్ధ్యానములో నొడలు మఱచు నవస్థ సమాధి. దీనికి మహాభావసమాధి యనిపేరు.

హఠయోగమందు స్థూలశరీరావలంబనముతోఁ జిత్తమును నిరోధించుటకు యత్నింతురు.

యమ, నియమాసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు. వీనిలో నుత్తరోత్తరము కష్టము. బహిరింద్రియ నియమనము యమము. నియమ మనఁగా నంతరింద్రియముల నియమించుట. యోగసాధన కనుగుణముగా శరీర ముంచికొను టాసనము. ప్రాణాపానవాయువులపై నధికారము వహించి వానిని యోగసాధనానుకూలములుగా నొనర్చికొనుట ప్రాణాయామము. బాహ్యములనుండి మనస్సు నీడ్చి యంతర్ముఖముగా నొనర్చుట ప్రత్యాహారము. అందు మనస్సును నిల్పుట ధారణ. ఇష్టరూపియైన ధ్యేయమును మనస్సున లగింపఁజేయుట ధ్యానము. దానియందు మనోలీనత సమాధి. వీనికే యష్టాంగ యోగములని పేరు వీనిలో నాల్గుబాహ్యములు, నాల్గాంతరికములు. అన్ని యోగములయందును నీ యష్టాంగములు ప్రవేశించును. కాని, యొక్కొక్క దానియం దొక్కొక్కదానికిఁ బ్రాధాన్యము. మార్కండేయ, భరద్వాజ, మరీచి జైమిని, విశ్వామిత్రాదులు దీని ప్రవక్తలు. సూక్ష్మశరీరముయొక్క తీవ్రసంస్కారముతోఁ గర్మ ముత్పన్న మగును. ఆ కర్మభోగమునకే జీవునకు స్థూలశరీరము. అనఁగా, సూక్ష్మశరీరముల భావన కనుకూలముగనే స్థూలశరీరసంఘటన మేర్పడును. స్థూలసూక్ష్మశరీరములు పరస్పర సంబంధముగలవి. మఱి స్థూలశరీరముయొక్క కర్మలద్వారా సూక్ష్మశరీరముపై నాధిపత్య మేందుకు రాదు? కనుక, వారు స్థూల శరీర ప్రధానములైన యోగప్రక్రియల నావిష్కరింపఁ జొచ్చిరి హఠయోగి స్థూలశరీరమునకు సంబంధించిన క్రియలను సాధనము చేయుచుఁ గ్రమముగా దానిపై నాధిపత్యమును సంపాదించును ఆ శక్తిని దిన్నఁగా నంతర్ముఖ మొనర్చికొని దానితో సూక్ష్మశరీ మును వశీకరించికొని చిత్తవృత్తులను నిరోధించును. అటు తరువాఁ పరమాత్మ సాక్షాత్కారసిద్ధి. ఇది స్థూలమఁగా హఠయోగప్రణాళిక

మంత్రయోగమందు భావపూర్ణమైన స్థూలప్రతీక ధ్యానముండును. హఠయోగులకు జ్యోతిర్ధ్యానము. అంతర్జగత్తునకు సంబంధించిన పవిత్రభావముల నాశ్రయముగాఁ జేసికొని నానాదేవతలను మంత్రయోగమున ధ్యానింతురు. హఠయోగులు పరమాత్మను సమస్తజ్యోతులకు జ్యోతినిగా భావింతురు. మంత్రయోగ సమాధియందు నానారూపముల సహాయముతో సమాధిలాభమునకై ప్రణాళిక ఏర్పాటుపఁ బడినది. హఠయోగులు వాయువును నిరోధించి దానితో మనస్సునడ్డి సమాధిని సాధింప నెంతురు. వారి సమాధికి 'మహాబోధ సమాధి' యని పేరు. హఠయోగమున కంగవర్ణన మిట్లున్నది.

షట్కర్మాసన ముద్రాః ప్రత్యాహారశ్చ ప్రాణ సంయామః,
ధ్యానసమాధీ సప్తైవాంగాని స్యుర్హఠస్య యోగస్య.

షట్కర్మ ఆసన ముద్రా ప్రత్యాహారములు ప్రాణాయామ ధ్యాన సమాధులు ఇవి యేడంగములు. వీని ననుసరించుటతో ఫల ప్రాప్తి యిట్లు చెప్పఁబడినది.

షట్కర్మణా శోధనం చ ఆసనేన భవేద్దృఢమ్,
ముద్రయా స్థిరతా చైవ ప్రత్యాహారేణ ధీరతా.

ప్రాణాయామా ల్లాఘవం చ ధ్యానా త్ప్రత్యక్ష మాత్మనః,
సమాధినా హ్యలిప్తత్వం ముక్తిరేవ న సంశయః.

ఇవిగాక మఱి కొన్ని షట్కర్మ లున్నవి. ధౌతి, వస్తి, నేతి, లౌలికి, త్రాటకము, కపాలభాతి; కాని, ఇవి శరీరస్వాస్థ్యమునకు సంబంధించినవి. హఠయోగమునఁ బ్రధానములైనవి ముప్పదిమూఁడాసనములు. వాని స్వరూపములు వేఱు వేఱు. ఈ యోగమందు ప్రాణాయామ మెనిమిది రీతులు, సహిత, సూర్యభేది, ఉజ్జాయి, శీతలి, భస్త్రిక, భ్రామరి, మూర్ఛ, కేవలి. ఇరువదియైదు ముద్రాభేదములును

గలవు. ఇవి వాయువును నిరోధించుటకును, హృదయమును స్థిర మొనర్చుటకును బనికివచ్చును. ప్రత్యాహారమం దీ ముద్రలు సహాయకములు. ధ్యానసిద్ధి సమాధి యేర్పడుటకు వీని వినియోగము. ధ్యానసిద్ధి సమాధులే హఠయోగ చరమఫలములు.

లయయోగము: యాజ్ఞవల్క్య కపిల పతంజలి వసిష్ఠాదులు దీని మూలపురుషులు. ప్రకృతి పురుషుల శృంగారముతో బ్రహ్మాండ ముత్పన్నమైనది. బ్రహ్మాండమును పిండమును నొక్కటియే. సమష్టి రూప బ్రహ్మాండము, వ్యష్టిపిండము. ఈ రెంటికిని సాదృశ్యమున్నది. దేవతలు, పితరులు, గ్రహనక్షత్రాదులు అన్నియును సమష్టిరూపమైన బ్రహ్మాండమం దెట్లో, పిండమందు నట్లే కలవు. పిండజ్ఞానముతో బ్రహ్మాండమును గుఱించిన జ్ఞానము లభ్యమగుట కాస్పద మున్నది. శక్తిసహిత పిండజ్ఞానము గురూపదేశముతో లభించును. తరువాతఁ గౌశలపూర్ణమైన క్రియద్వారా ప్రకృతిని పురుషునిలో లయింపఁ జేయుటకే లయయోగ మనిపేరు. పరమపురుషుని స్థానము సహస్రారము. కుండలినీశక్తి మూలాధారమందు ప్రసుప్తమై యుండును. అది సుప్తమగుటతో బహిర్ముఖమైన సృష్టిక్రియ యేర్పడుచున్నది. యోగముద్వారా దానిని జాగృత మొనర్పవలెను. సహస్రారమునకుఁ గొనిపోయి పురుషునితోఁ జేర్పవలెను. ఇది లయయోగికృతకృత్యత.

యోగశాస్త్రమందు దీనికి తొమ్మిదియంగములు చెప్పఁబడినవి.

అంగాని లయయోగస్య నవైవేతి పురావిదః,
యమశ్చ నియమశ్చైవ స్థూలసూక్ష్మక్రియే తథా.
ప్రత్యాహారో ధారణా చ ధ్యానం చాపి లయక్రియాః,
సమాధిశ్చ నవాంగాని లయయోగస్య నిశ్చితమ్.

స్థూలదేహ ప్రధానా వై క్రియాస్థూలాభిధీయతే,
వాయుప్రధానా సూక్ష్మాస్యాత్ ధ్యానం బిందుమయం భవేత్.

ధ్యానమే తద్ధి పరమం లయయోగ సహాయకమ్,
లయయోగానుకూలా హి సూక్ష్మయా లభ్యతే క్రియా.

జీవన్ముక్తోపదేశేన ప్రోక్తా సాహి లయక్రియా,
లయక్రియా సాధనేన సుప్తా సా కులకుండలీ.

ప్రబుధ్య తస్మిన్ పురుషే లీయతే నాఽత్రసంశయః,
శివత్వ మాప్నోతి సదా సాహాయ్యాదస్య సాధకః.

లయక్రియాయా స్సంసిద్ధౌ లయబోధః ప్రజాయతే,
సమాధి ర్యేన నిరతః కృతకృత్యో హి సాధకః.

తాత్పర్యము: మహర్షులు లయయోగమునకు తొమ్మిదంగము లన్నారు. యమ, నియమ, స్థూలక్రియా, సూక్ష్మక్రియలు, ప్రత్యాహార, ధారణా, ధ్యాన, లయక్రియా, సమాధులు. స్థూలశరీరప్రధాన క్రియ స్థూలక్రియ. సూక్ష్మక్రియ వాయుప్రధానము. బిందుమయ మైన ప్రకృతిపురుషాత్మక ధ్యానమునకు బిందుధ్యానమని పేరు. ఈ ధ్యానము లయయోగమునకు సహాయకము. లయయోగానుకూల మైన అతిసూక్ష్మమైన సర్వోత్తమమైన క్రియను లయక్రియయందురు. ఇది జీవన్ముక్తులైన యోగీశ్వరుల యుపదేశముచేత మాత్రమే లభ్య మగును. లయక్రియా సాధనముతోఁ బ్రసుప్తమైన కుండలినీ నామక మహాశక్తి ప్రబుద్ధమై బ్రహ్మయందు లీన మగుచున్నది. తరువాత జీవుఁడు శివత్వము నందును. లయక్రియాసిద్ధి వలన మహాలయ నామకమైన సమాధి సిద్ధించుచున్నది. యమ నియమము లనుట కర్థము మనకుఁ దెలిసినదే. హఠయోగమునందలి కొన్ని యాసన ముల కిందు వినియోగ మున్నది. కొన్నిముద్రలకును; వీనికే స్థూల క్రియ యని పేరు. హఠయోగములో నెనిమిది తెఱఁగుల ప్రాణా యామములు గలవు. వానిలోఁ గొన్నిటి నిందు వాడుదురు.

సర్వోదయ మొక్కటి. ఇవన్నియు సూక్ష్మక్రియకు సంబంధిం చినవి. సర్వోదయ సాధనతోఁ గొన్ని సిద్ధులు ప్రాప్తించును. లయ

యోగము యొక్క పంచమ సాధనము ప్రత్యాహారము. మనసుయొక్క సహాయోగముననే దీనిని సాధింపనగును. దీని ప్రారంభమందే యోగి నాదము వినుట కారంభించును. లయయోగముయొక్క అష్టమాంగ సాధనలో యోగి శరీరమందలి షట్చక్రముల గుర్తించును. వాని సాయమువలననే సాగును.

మేరు దండమునకుఁ గ్రిందినుండి మస్తకోపరిభాగము వఱకు నేడు స్థానము లున్నవని యోగు లందురు. వాని సహాయోగముతో యోగి క్రిందనుండి ప్రకృతిశక్తిని పైకిఁ దీసికొని వెడలి సహస్రార ముతోఁజేర్చును అప్పుడే ముక్తిప్రాప్తి. ఈ సాధన ధారణతో నారంభమై సమాధితో ముగియును. లయయోగము ధ్యానమునకు బిందుధ్యాన మని పేరు. యోగి సాధన చేయుచు చేయుచు ప్రకృతి సూక్ష్మ రూపమును బిందురూపముగా దర్శించును. దీని ధ్యానము పెరుఁగుచు రాఁగా దీనితో గురుముఖప్రాప్తమైన లయచేరఁగా తత్సాధనతో యోగి సమాధిని బ్రాపించును. లయయోగపుసమాధికి పేరు మహాలయము. దీనికి సంబంధించిన కొన్ని విషయములు, సర్వోదయ క్రియలు, షట్చక్రభేదనక్రియలు వ్యోమజయి, ప్రభాజయి, సురభిజయి, అజయ మొదలైన లయక్రియలను గూర్చిన వర్ణన 'లయయోగసంహిత'లో నిట్లున్నది.

సూక్ష్మయోగ క్రియాయాస్యా ర్ధ్యానసిద్ధిం ప్రసాధ్య వై,
సమాధిసిద్ధౌ సాహాయ్యం విదధాతి నిరంతరమ్.

దివ్యభావయుతా గోప్యా దుష్ప్రాప్యాసా లయక్రియా,
మహర్షిభి ర్వినిర్దిష్టా యోగమార్గప్రవర్తకైః.

లయక్రియా ప్రాణభూతా లయయోగస్య సాధనే,
సమాధిసిద్ధిదా ప్రోక్తా యోగిభి స్తత్త్వదర్శిభిః.

షట్చక్రం షోడశాధారా ద్విలక్ష్యం వ్యోమపంచకమ్,
పీఠాని చోన పంచాశత్ జ్ఞాత్వా సిద్ధి రవాప్యతే.

**సమాధి సిద్ధి ర్ధ్యానస్య సిద్ధిశ్చాప్యనయా భవేత్,**
**ఆత్మప్రత్యక్షతాం యాతి చైతయా యోగవి జ్జనః.**

తాత్పర్యము: సూక్ష్మయోగ క్రియలు ధ్యానసిద్ధిని గల్గించి సమాధిసిద్ధిలో సాధకునకు సాయ మొనర్చును. ఇవి దివ్యభావ యుతములు, గోప్యములు, మహాదుర్లభములు. వీనినే మహర్షులు లయక్రియయని వర్ణించిరి. ఈ లయక్రియయే లయయోగమునకుఁ బ్రాణము. సమాధిసిద్ధికారణము. షట్చక్రములు, వ్యోమపంచకము, నలువది తొమ్మిది పీఠములు–వీనిని దెలియుటయే లయయోగసిద్ధి. దీనితో ధ్యానసిద్ధి సమాధిసిద్ధి యేర్పడును; ఆత్మ సాక్షాత్కారమును.

మంత్రయోగమందు రూపకల్పన ద్వారా ధ్యాన మొనర్పఁబడును. హఠయోగమందు జ్యోతిఃకల్పనతో ధ్యానము. దీనిలో నట్టి కల్పనము లేదు. లయయోగసాధనతో నంతర్జగత్తునందొక బిందువును గనుగొందురు. దానిని స్థిర మొనర్చికొని దానియందుఁ బరమాత్మను ధ్యానించుటయే బిందుధ్యానము. ఇది లయయోగమందలి విశేషము. దీనియందలి మఱియొక విశేష మేమనఁగా లయయోగి యిచ్ఛించి నచో దాని శరీరమందే బ్రహ్మాండమును దర్శించును. సమష్టిరూప మైన బ్రహ్మాండమునకు వ్యష్టిరూపమైన మనుష్యపిండము పరిపూర్ణ మైన నమూనా. దీని సాయముతోడనే మహర్షులు ఉన్నచోటినుండియే సమస్త బ్రహ్మాండమును గాంచఁ గల్గుచుండిరి.

రాజయోగము: ఇది యోగములలో శ్రేష్ఠమట. అందుకే దీని కాపేరు. 'రాజత్వా త్సర్వయోగానాం రాజయోగ ఇతిస్మృతః' అని లక్షణము. శాస్త్రములం దిట్లున్నది.

**సృష్టి స్థితి వినాశానాం హేతుతా మనసి స్థితా,**
**తత్సహాయా త్సాధ్యతే యో రాజయోగ ఇతిస్మృతః.**
**అంతఃకరణ భేదాస్తు మనోబుద్ధి రహంకృతిః,**
**చిత్తం చేతి వినిర్దిష్టా శ్చత్వారో యోగపారగైః.**

తదంతః కరణం దృశ్య మాత్మా ద్రష్టా నిగద్యతే,
విశ్వమే తత్త్వయోః కార్య కారణత్వం సనాతనమ్.

దృశ్యద్రష్ట్రోశ్చ సంబంధా త్సృష్టిర్భవతి శాశ్వతీ,
చాంచల్యం చిత్తవృత్తీనాం హేతుమత్ర విదుర్బుధాః.

వృత్తీర్జిత్వా రాజయోగః స్వస్వరూపం ప్రకాశయేత్,
విచారబుద్ధేః ప్రాధాన్యం రాజయోగస్య సాధనే.

బ్రహ్మధ్యానం హి తద్ధ్యానం సమాధి ర్నిర్వికల్పకః,
తే నోపలబ్ధసిద్ధిర్హి జీవన్ముక్తః ప్రకథ్యతే.

ఉపలబ్ధ మహాభావా మహాబోధావ్విశాశ్చయే,
మహాలయం ప్రపన్నాశ్చ తత్త్వజ్ఞానావలంబితః.

యోగినో రాజయోగస్య భూమి మాసాదయంతి తే,
యోగసాధన మూర్ధన్యో రాజయోగో ఽభిధీయతే.

తాత్పర్యము : సృష్టిస్థితిలయములకుఁ గారణ మంతఃకరణమే. దాని సాయమున నొనర్చు సాధనయే రాజయోగము. మనోబుద్ధి చిత్తా ఽహంకారములు, అంతఃకరణ భేదములు. అంతఃకరణము దృశ్యము: ఆత్మ ద్రష్ట. అంతఃకరణము కారణము దృశ్యము. దీని నుండి జగద్రూపమైన కార్యముత్పన్నమగును. ఈ రెంటి సంబంధము కార్యకారణరూపము. దృశ్యముతో ద్రష్టకు సంబంధము స్థాపిత మైనప్పుడు సృష్టి యేర్పడును. చిత్తవృత్తి చాంచల్యమే దీనికిఁ గారణము. రాజయోగమునందు విచారబుద్ధికే ప్రాధాన్యము. దీని పూర్ణతతో రాజయోగ సాధనము సాగును. దీని ధ్యానమునకు 'బ్రహ్మధ్యాన' మనిపేరు. ఈ సమాధి నిర్వికల్పసమాధి. రాజయోగ సిద్ధునకు జీవన్ముక్తుఁడని పేరు. మహాభావ, మహాబోధ, మహాలయ ప్రాప్తి నందిన యోగులు తత్త్వజ్ఞాన సాహాయ్యముతో రాజయోగ భూమియందు అగ్రగసరు లగుదురు. దీనికి సాధనములు పదునాఱని శాస్త్రములలో నిర్వచనము.

కలాషోడశకోపేత రాజయోగస్య షోడశ,
సప్తచాంగాని విద్యంతే సప్తజ్ఞానాను సారతః.

విచారముఖ్యం తత్ జ్ఞేయం సాధనం బహు తస్య చ,
ధారణాంగే ద్విధా జ్ఞేయే బ్రహ్మప్రకృతి భేదతః.

ధ్యానస్య త్రీణి చాంగాని విదుః పూర్వే మహర్షయః,
బ్రహ్మధ్యానం విరాట్ధ్యానం చేశధ్యానం యథాక్రమమ్.

బ్రహ్మధ్యానే సమాప్త్యంతే ధ్యానాన్యన్యాని నిశ్చితమ్,
చత్వార్యంగాని జాయంతే సమాధేరితి యోగినః.

స విచారం ద్విధాభూతం నిర్విచారం తథా పునః,
ఇత్థం సంసాధనం రాజయోగస్యాంగాని షోడశ.

కృతకృత్యో భవత్యాశు రాజయోగపరో నరః,
మంత్రే హఠే లయే చైవ సిద్ధి మాసాద్య యత్నతః.

పూర్ణాధికార మాప్నోతి రాజయోగపరో నరః.

తాత్పర్యము: పదునాఱుకళలతో గూడిన రాజయోగమున కన్నియ యంగములు. సప్తజ్ఞానభూమికల ననుసరించి ఏడంగము లున్నవి. ఇవన్నియు విచారముఖ్యములే. వీని సాధనము లనేక ప్రకారములు. ధారణ కంగములు రెండు. ప్రకృతిధారణ, బ్రహ్మధారణ, ధ్యానమునకు మూఁడంగములు. విరాట్ధ్యానము, ఈశధ్యానము, బ్రహ్మధ్యానము వీని యన్నిటికిని బ్రహ్మధ్యానమందే పరిసమాప్తి. సమాధికి నాల్గంగములు. రెండు సవిచారములు; రెండు నిర్విచార ములు. ఇట్లు పదునాఱంగములు. మంత్ర, హఠ, లయములందు సిద్ధి నందిన తర్వాత లేక యేదైన నొకదానిలోఁ గృతకృత్యుఁడైన పిదప సాధకునకు రాజయోగమందుఁ బూర్ణాధికార ప్రాప్తి. రాజయోగ సంహితలో నిట్లు గలదు—

సాధనం రాజయోగస్య ధారణా ధ్యానభూమితః,
ఆరభ్యతే సమాధి ర్హి సాధనం తస్య ముఖ్యతః.

సమాధిభూమౌ ప్రథమం వితర్కః కిల జాయతే,
తతో విచార ఆనందానుగతా తత్పరా మతా.

అస్మితానుగతా నామ తతోఽవస్థా ప్రజాయతే.

విశేషలింగం త్వవిశేషలింగం లింగం తథా ఽలింగమితి ప్రభేదాత్,
వదంతి దృశ్యస్య సమాధిభూమి వివేచనాయాం పటవో మునీంద్రాః.

హేయా అలింగవర్యంతా బ్రహ్మాహమితి యా మతిః,
నిర్వికల్పే సమాధౌ హి న సా తిష్ఠతి నిశ్చితమ్.

ద్వైతభావాస్తు నిఖిలా వికల్పాశ్చ తథా పునః,
క్షీయంతే యత్ర సాజ్ఞేయా తురీయేతి దశాబుధైః.

సమాధిసాధనం శాస్త్రాభ్యాసతో న హి లభ్యతే,
గురోర్విజ్ఞాన తత్వాత్తు ప్రాప్తుం శక్యమితి ధ్రువమ్.

తాత్పర్యము: రాజయోగ సాధనము ధారణా ధ్యానములతో నారంభమగును. దీని సాధన భూమి ప్రధానముగ సమాధియే. సమాధియందు మొదట వితర్కముండును. పిదప విచారము ప్రాధాన్యము వహించును. దీని తరువాతియవస్థ యానందానుగతమైనది. దాని తరువాతిది అస్మితానుగతావస్థ. దృశ్యము విశేషావిశేష లింగాలింగములతో నాల్గు రీతులు. ఇవన్నియు వదలఁదగినవే. 'అహం బ్రహ్మాఽస్మి'-ఈ భావమును నిర్వికల్పసమాధిలో నుండదు. ద్వైత భావము-వికల్పమును నందున కుండవు. ఇదే తురీయావస్థ. సమాధి భూమియొక్క సాధనాక్రమము శాస్త్రములతోఁ దెలియదు. అపరోక్షానుభూతినందిన జీవన్ముక్తుఁడైన గురువే వీని భేదములను దెలియఁ గలఁడు. రాజయోగి దర్శనోక్త సప్తజ్ఞాన భూమికల నొకటి వెంట నొకటి దాఁటును. తద్రహస్యములందు నిష్ణాతుఁ డగును. ఈ రాజయోగము పదునాఱంగములలో మొదటియేడు సాధనక్రమమునకు సంబంధించినవి. తరువాత రాజయోగి సత్తు చిత్తు లనెడి ప్రకృతి

పురుషుల రాజ్యద్వయమును దర్శించును. వాని ధారణతో ననంత రూపమయమైన ప్రపంచమును విస్మరింప సమర్థుఁడగును. ఇదే రాజ యోగియొక్క అష్టమ నవమాంగ సాధనక్రమము. పిదప నా యోగి రాజు పరిణామశీలమైన ప్రకృతిస్వరూపమును సంపూర్ణముగాఁదెలిసి బ్రహ్మ, ఈశ, విరాట్ స్వరూపముగ నద్వితీయ బ్రహ్మతత్త్వమును దర్శించును. అదే జ్ఞానభూమి పరాకాష్ఠ, దశమైకాదశ ద్వాదశాంగ ముల సాధనాక్రమము. తర్వాత వితర్కానుగత విచారానుగత అనం దానుగత అస్మితానుగతము లనెడు నాలు గాత్మజ్ఞాన యుక్తములగు సమాధిదశల నతిక్రమించి స్వస్వరూపప్రాప్తి నందును. ఇతఁడే జీవ న్ముక్తుఁడు.

మంత్ర యోగాచార్యులలో నారదు నొక్కనిగాఁ జెప్పి కొన్నాము. దానియంగమే సంకీర్తనముగూడ. సంకీర్తనము మంత్ర జపము పారాయణాదులు ఇవన్నియు మంత్రయోగపు స్వరూపములే. యమ నియమాదులు ప్రతి యోగమునందును వచ్చును. ఇక్కడ నారదుఁడు సంకీర్తనా ప్రధానమైన మంత్రయోగమును జెప్పుచు యమనియమాది క్లేశములకంటెను సంకీర్తనమున నొడలు మఱచుట శ్రేష్ఠమని చెప్పుచున్నాఁడు. విష్ణుసేవచేత = సేవాప్రకారము నారద భక్తిసూత్రములలో ననేకప్రకారములుగాఁ జెప్పఁబడినది. విష్ణుసేవ నొనర్చువాఁడు గూడ ననుసరింపఁ దగిన పద్ధతులు గొన్నియున్నవి. 'ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః' 'సత్త్వశుద్ధౌ ధ్రువాస్మృతిః' 'స్మృతి లంభే సర్వగ్రంథీనాం విప్రమోక్షః' (ఛాందోగ్యము). ఆహారశుద్ధితో నంతఃకరణశుద్ధి. దానితో స్మృతి స్థాయిగా నుండును. ఆ స్మృతితో సర్వగ్రంథులనుండి విప్రమోక్షము. కేవల జ్ఞానయోగముతో ముక్తి సిద్ధింపదని భక్తియోగు లందురు. దేశికులు దీనినే 'అధికార సంగ్ర హము' లో నిట్లనుచున్నారు.

**కర్మజ్ఞాన ముపాసనం చ శరణం ప్రవేక్ష్యతి చ్వావస్థితాన్,**
**సన్మార్గా నవవర్గసాధనవిధౌ న ద్వారకాన్ ద్వారకాన్.**

కర్మము, జ్ఞానము, ఉపాసనము, శరణాగతి ఈ నాల్గును ముక్తిసాధనములు. వీనిలోఁ గర్మ, జ్ఞానము సద్వారకములు. అనఁగా భక్తిద్వారా ముక్తిహేతువులు. కనుక కర్మజ్ఞానము లంగములు. భక్తి యంగి. శరణాగతి యాఱు రీతులు.

**ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్,**
**రక్షిష్యతీతి విశ్వాసః గోప్తృత్వ వరణం తథా,**
**ఆత్మనిక్షేపకార్పణ్యే షడ్విధా శరణాగతిః.**

భగవంతుని కనుకూలముగా నుండెడి సంకల్పము, ప్రతికూల త్యాగము, వాసుదేవుఁడే రక్షించుననెడి విశ్వాసము, భగవంతునే రక్షకునిగా నెంచుట, ఆత్మసమర్పణము, నితాంత దీనత–ఇదే యాఱు విధములైన శరణాగతి. శరణాగతికంటెను ప్రపత్తి యొక రంగు హెచ్చు. 'యతీంద్ర మతదీపిక' ప్రపత్తిధర్మము నిట్లు వచించినది.

**సాధనం భగవత్ప్రాప్తౌ సయేవేతి స్థిరామతిః,**
**సాధ్యభక్తి స్తథాపైవ ప్రపత్తిరితి గీయతే.**

భగవత్ప్రాప్తిలో భగవంతుఁడే సాధనము. దీనినే సాధ్యభక్తి లేక ప్రపత్తి యందురు. ప్రపత్తి సర్వశ్రేష్ఠమైనది. కనుకనే, రామాయణములో రాముఁడు–

**సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే,**
**అభయం సర్వభూతేభ్యో దదామ్యే తద్వ్రతం మమ.**

ప్రపత్తిలో 'నేను నీవాఁడను' అను భావము ముఖ్యముగ నుండును. అందుకే దేశికులు అధికారసంగ్రహములో–

**ప్రపన్నా దన్యేషాం న దిశతి ముకుందో నిజపదమ్.**

అన్నాఁడు. వైష్ణవులు సేవను ఐదురీతులుగాఁ విఁగడించి కొనిరి. అందుకే వారికి పంచకాలజ్ఞులని పేరు. ఆ యైదుకాలములివి. 1. అభి

గమనకాలము, 2. ఉపాదానకాలము, 3. ఇజ్యాకాలము, 4. అధ్య యనకాలము, 5. యోగకాలము. అభిగమన మనఁగాఁ ద్రికరణ శుద్ధిగా జపధ్యానాదులతో భగవంతున కభిముఖుఁడగుట. ఉపాదా నము-పూజకై ఫలపుష్పాదులు సంగ్రహించుట. ఇజ్య-భగవద్విగ్రహ సేవ. అధ్యయనము-ఆగమగ్రంథముల శ్రవణమననములు. ఉపదే శము-యోగము-అష్టాంగయోగముల సాధనము. ఇట్టి విష్ణుసేవచేత శాంతి కాలక్రమమున నేర్పడును. హఠాత్తుగా నూడిపడదు.

భగవంతుండగు నారదుండు = గొప్పవాఁడైన నారదమహర్షి, వీడ్కొని=పోయివత్తునని చెప్పినవాఁడై, యదృచ్ఛా మార్గంబునన్= తనకుఁ దోఁచిన త్రోవనుబట్టి పోయెనని తాత్పర్యము.

తాత్పర్యము: నారదుఁడు వ్యాసునితో సెలవు గైకొని, తనకుఁ దోఁచిన మార్గమున వెడలిపోయెను. సూతుఁడు నారదు నభినందించుచున్నాఁడు.

వీణన్ ఎప్పుడున్ వాయించుచున్=నిరంతరము వీణనువాయిం చుచు, స్వరలయానుబద్ధముగ, ముకుందగీతములు=శ్రీమహావిష్ణువు నకు సంబంధించిన కీర్తనలు, మ్రోయించున్ = వీణయందు పలి కించుచు, జగములకున్ చెవులపండువు సేయించున్=లోకములకుఁ గర్ణోత్సవ మొనర్చును, అఘాళి మాయించున్=పాప సమూహమును బోఁగొట్టును. ఇట్టి మతి=ఇట్టి సార్థకమైన బుద్ధిగలవాఁడు, మతి గలఁడె! = వేఱొకఁ డున్నాఁడా? 'అహో దేవర్షి ర్ధన్యోఽయం' అని మూలము.

తాత్పర్యము: నారదుఁడు పరమధన్యుఁడు. ఎప్పుడును వీణను వాయించును. ముకుంద గీతములుపాడును. లోకులకు శ్రవ ణానందమొదఁ గూర్చును. తత్పాపపరిహారము సేయును.

పుట్టపర్తి నారాయణాచార్యదాసునిచే విరచింపఁబడిన
'భాగవతసుధాలహరి' యందు ప్రథమ
స్కంధమున షష్ఠాధ్యాయము
వ్యాఖ్య ముగిసినది.

36126



శ్రీవేంకటేశ్వరస్వామివారు